# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

సంపుటి : 12 సంచిక : 12 హైదరాబాద్ 161 డిసెంబర్ 2014 పేజీలు : 68 రు. 20

- తెలంగాణ బడ్జెట్‌పై రెండు వ్యాసాలు
- ఆంధ్రప్రదేశ్‌లో మెట్రో రైలు భవిష్యత్తు
- అక్రమ సంపదపై మాట మార్చిన మోడీ
- సైనిక బలగాల చట్టబద్ధ దుర్మార్గాలు
- సిక్కుల ఊచకోతకు ముప్పై ఏళ్లు
- మూడు దశాబ్దాల భోపాల్ విషవాయువు
- ఈలం లిబరేషన్ టైగర్స్‌పై కన్నబిరాన్

# ఆర్ ఎస్ రావు స్మారకోపన్యాసం, సదస్సు దృశ్యాలు

**నవంబర్ 8 - 9, 2014, హైదరాబాద్**













ISSN 2231-6892

161

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

డిసెంబర్ 2014
సంపుటి : 12
సంచిక : 12





**అసహజ మరణాల సూచి జిల్లాల కరస్పాండెంట్లు**

**తెలంగాణ :** ఆదిలాబాద్ – సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; హైదరాబాద్ – డి. విజయభాస్కర్; కరీంనగర్ – జి.యాదగిరి; నల్గొండ – జి. వెంకటేశ్వర్లు; ఖమ్మం – సి.ఎచ్. గిరిజ; మెదక్ – ఎం. రాజేందర్‌రెడ్డి; మహబూబ్‌నగర్ – మహమ్మద్ ఇక్బాల్; నిజామాబాద్ – ఎం. నర్సయ్య; రంగారెడ్డి – వి. శంకరయ్య; వరంగల్ – ఎ.కుమార్. **ఆంధ్రప్రదేశ్ :** అనంతపూర్ – కె. నాగేశ్వరాచారి; చిత్తూరు – పలమనేరు బాలాజీ; కడప – కొండ్రాయుడు; కర్నూలు – జి.వి. సుధాకర్ రెడ్డి; ప్రకాశం – కర్ణ సతీష్‌బాబు; విశాఖపట్నం – పి.వి. రమణ; శ్రీకాకుళం – ఆర్. శ్రీలత



**ప్రింటర్స్**
**డక్కన్ ప్రెస్ / చరితా ఇంప్రెషన్స్**
ఆజామాబాద్, హైదరాబాద్
ఫోన్ : 040 - 27678411

**డిస్ట్రిబ్యూటర్స్**
**ఆనంద్ ఏజెన్సీస్**
హైదరాబాద్
ఫోన్ : 98484 28516
92468 26191

**'వీక్షణం' పేరిట ఎం.ఓ.లు, చెక్కులు, డి.డి లు పంపాల్సిన చిరునామా**

**వీక్షణం**

మైత్రీ రెసిడెన్సీ, 3-6-394,
స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029.
ఫాక్స్, ఫోన్ : 040-66843495

Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com

**వీక్షణం చందా వివరాలు**

| | సంస్థలకు / లైబ్రరీలకు | వ్యక్తులకు |
|---|---|---|
| విడి ప్రతి | రు. 20 | రు. 20 |
| సంవత్సరం | రు. 240 | రు. 200 |
| మూడు సంవత్సరాలు | రు. 600 | రు. 540 |
| ఐదు సంవత్సరాలు | రు. 1000 | రు. 900 |
| పది సంవత్సరాలు | రు. 2000 | రు. 1700 |

ఆన్‌లైన్ ద్వారా డబ్బులు పంపేవారు మాత్రమే బ్యాంక్ స్లిప్‌లపై 'veekshanam' అని రాసి వీక్షణం అకౌంట్ నెంబర్ – **01391101002175** ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్ పేరు మీద వేయాలి.
ఇతర బ్యాంకులలో వేసేవారు **ANDB 000/0139** నెంబర్ రాసి వేయవచ్చు.

**వీక్షణం చేస్తున్న కృషి పదికాలాల పాటు కొనసాగాలనే ఆకాంక్షతో ఎం. గోపాలక్రిష్ణ రు. 100, టి. శివరామక్రిష్ణ (విశాఖపట్నం) రు. 200, ఎన్. రాంగోపాల్ రావు (హైదరాబాద్) రు. 2000 ఆర్థిక సహాయం అందజేశారు. వారికి కృతజ్ఞతలు. - సం.**

వీక్షణం అక్టోబర్ 2014 సంచికలో కొడవటిగంటి రోహిణీప్రసాద్ రాసిన 'చరిత్ర కూడా విజ్ఞాన శాస్త్రమా' అనే వ్యాసం గురించి చర్చిస్తూ అందులో వ్యక్తం చేసిన భావాలు సరైనవి కావని రాస్తూ సత్యం, స్టాలిన్ రాసిన 'చారిత్రక భౌతిక వాదం' నుండి సుదీర్ఘంగా ఉటంకించారు. రోహిణీప్రసాద్ రాసిన వ్యాసం 'మానవ పరిణామం' గురించిన వ్యాస పరంపరలోనిది. ఇది స్వేచ్ఛాసాహితి తరుపున పుస్తకంగా వెలువడింది. అందులో ప్రధానంగా వర్ణించింది మానవ పరిణామం గురించి – అంటే కొన్ని మొదటి నాగరికతల విషయాల ప్రస్తావన గురించి వదిలేస్తే వర్గ పూర్వ సమాజంలో జరిగిన పరిణామాలను వర్ణిస్తూ 'ఒక రకంగా చూస్తే హిస్టరీకి మూల కారణం జాగ్రఫీయే' అని రాశారు. స్టాలిన్ రాసిందంతా వర్గసమాజపు పరిణామ క్రమం గురించి, 'చారిత్రక భౌతికవాదం' అంతా వర్గసమాజ చరిత్ర గురించే. ఈ ముఖ్యమైన తేడాను గమనంలో ఉంచుకోకుండా సత్యం రాశారు.

రోహిణీప్రసాద్ రాసిన వాటిలో అక్కడక్కడా సూత్రీకరణలు కొంచెం లూజ్‌గా ఉండి, మొత్తంగానే చరిత్ర గురించి చెపుతున్నాడా అని అనుమానం రేకెత్తించే రీతిలో ఉన్నాయి. ఉదాహరణకు పైన పేర్కొన్న విషయంలో వాక్యాన్ని మొత్తం చూస్తే 'సమాజంలో వివిధ వర్గాల మధ్య జరిగిన ఆర్థిక, సామాజిక స్పర్థలను లెక్కలోకి తీసుకోవాల్సిందే కానీ ఒక రకంగా చూస్తే హిస్టరీకి మూలకారణం జాగ్రఫీయే' అని రాశారు. ఈ వాక్యం విడిగా చదివితే తప్పనిసరిగా తప్పనిపిస్తుంది. కానీ మొత్తం 'మానవ పరిణామం'లో రాసిన విషయాలను (వర్గ సమాజపు ఆవిర్భావానికి ముందు మనుషుల కదలికలు, కొన్ని ప్రాంతాల్లోనే నాగరికతలు ఎందుకు అభివృద్ధి అయ్యాయి వంటివి) పరిగణనలోనికి తీసుకొన్నప్పుడు మాత్రం 'సమాజ భౌతిక జీవన పరిస్థితులు' ప్రభావం ప్రస్ఫుటంగానే కనిపిస్తుంది. మార్క్స్, మరీ ముఖ్యంగా ఎంగెల్స్ ఈ పరిస్థితులను కూడా పరిగణనలోనికి తీసుకొంటూ చరిత్రని అధ్యయనం చేశారనేది మరచిపోవద్దు. ముఖ్యంగా సాధారణ చరిత్ర గతికి భిన్నంగా ఉన్న నిర్దిష్ట పరిణామాలను, విశిష్టతలను విశ్లేషించడంలో ఈ విషయాలను పరిగణనలోకి తీసుకొన్నారు.

నాగరికతలు ఎందుకు కొన్ని ప్రాంతాల్లోనే వికసించగలిగాయి? ఎందుకు కొన్నిచోట్ల కొన్ని రకాల పంటల వ్యవసాయం చేశారు? కొన్ని జంతువులనే మచ్చిక చేసుకొన్నారు వంటి వాటినన్ని వివరించడంలో జాగ్రఫీ పాత్రను రోహిణీప్రసాద్ వివరించారు. అది చారిత్రక భౌతికవాద పద్ధతికి భిన్నమైనదేమీ కాదు. పైగా దాన్ని పరిపుష్టం చేసేది. సత్యం స్టాలిన్‌ను ఉటంకించినప్పుడు ఈ విషయాలను పరిగణనలోనికి తీసుకోలేదనిపిస్తుంది.

– ఎన్. రవి
మావోయిస్టు రాజకీయ ఖైదీ, విశాఖ జైలు

హుదుద్ తుఫాన్‌పై రమణ రాసిన వ్యాసానికి చేర్పుగా రాస్తున్నాను. వాతావరణంలో బొగ్గుపులుసు వాయువు, కార్బన్ మోనాక్సైడ్ వంటి వాయువుల శాతం పెరిగే కొద్ది వాతావరణం వేడెక్కుతుందని కొన్ని దశాబ్దాలుగా శాస్త్రవేత్తలు హెచ్చరిస్తూనే ఉన్నారు. హుదుద్‌లో గాలులు గంటకు 200 కిలోమీటర్ల వేగంతో వీచాయని చదివాను. ఉష్ణోగ్రత పెరగడంవల్ల, సముద్రంలోని నీటి ఉపరితల ఉష్ణోగ్రత కూడా పెరుగుతుంది. దీనివల్ల, ఆ నీటిపై వీచే గాలుల వేగం కూడా పెరుగుతుంది. అంటే చిన్న పాటి తుఫానుగా వచ్చేది పెను ఉప్పెనగా మారుతుంది. గాలులు ఒకవేళ గంటకు 250 – 300 కిలోమీటర్ల వేగంతో వీస్తే జరిగే నష్టం ఇప్పటి కంటే రెండింతలు ఉంటుంది. అలాగే, వాతావరణ ఉష్ణోగ్రత పెరిగే కొద్ది, మంచు పర్వతాలలో సంవత్సరం పొడవునా ఉండే మంచు కరిగిపోతుంది. కేవలం హిమాలయ పర్వతాలలోని మంచు కొండలు కరిగి పోతే, వాటి కింద ఉన్న నదులపై ఆధారపడే సుమారు 130 కోట్ల మంది ప్రజల (ఇండియా, నేపాల్, భూటాన్, టిబెట్, చైనా, బంగ్లాదేశ్, పాకిస్థాన్ దేశాలలో) బతుకు భవిష్యత్తులో ప్రశ్నార్థకం అవుతుంది. 20వ శతాబ్దపు విప్లవాలు ప్రధానంగా జాతీయ విముక్తితో ముడిపడి జరిగితే, 21వ శతాబ్దపు విప్లవాలు పర్యావరణంతో ముడిపడి జరుగుతాయి. పెట్టుబడి పెడుతున్న సంస్థల లాభాలే గాని పర్యావరణ నష్టాన్ని గురించి పెట్టుబడిదారీ విధానం ఉన్నంత వరకు పర్యావరణ రక్షణ అసాధ్యం.

ఇండియాలో ఏ విప్లవ పార్టీ ఇప్పటికి పర్యావరణ రక్షణపై ఒక విధానం ప్రకటించిన ఆధారాలు లేవు. నిర్దిష్టంగా తలెత్తుతున్న ప్రశ్నలతో నిర్దిష్టంగా తలపడవలసిన అవసరం కనీసం వామపక్ష మేధావులైనా గుర్తించాలి.

హాంకాంగ్ ఉద్యమం గురించి రాసిన సంపాదకీయంలో విభేదించవలసిన విషయం ఏది లేదు. కాని జన చైనా పెట్టుబడిదారీ చైనాగా ఎలా మారింది అన్నదే సమస్య. దీనికి అంతిమంగా మూలాలు చైనా సమాజంలో (ఉత్పత్తి, సామాజిక సంబంధాలలో) చూడడం శాస్త్రీయ భౌతికవాద పద్ధతి. రష్యా విప్లవంలాగే చైనా విప్లవం ఎందుకు పెట్టుబడిదారీ విధానంలోకి మళ్లిందో విశ్లేషణ వ్యక్తుల కుట్రలకి, రాజకీయ రంగంలో రివిజనిజంకి పరిమితం చేస్తే అది అశాస్త్రీయంగా, ఆచరణకు దారిచూపని విధంగా ఉంటుంది. ఈ పరిశీలన జరపడం ఇప్పుడు ముఖ్యం. రాజకీయార్థిక చర్చ వేదికగా ఉన్న వీక్షణంలో ఇది జరిగితే ముందు, ముందు ఆచరణకు ఉపయోగపడుతుంది.

– నరేంద్రమోహన్
వీక్షణం బ్లాగ్‌పై

నేను గత పది సంవత్సరాలుగా వీక్షణం పత్రిక చదువుతున్నాను. ఈ మధ్య కాలంలో వీక్షణం బ్యాక్ కవర్‌పై వరుసగా వీక్షణం ఆర్థిక పరిస్థితి చాలా క్లిష్టంగా ఉందని, ఇలాగే కొనసాగితే పత్రికను కొనసాగించడం కష్టమని, పత్రిక క్రమం తప్పకుండా రావడానికి పాఠకుల, ఆలోచనాపరుల సహకారాన్ని కోరుతూ వస్తున్న విజ్ఞప్తిని చూస్తున్నాను. ఇప్పుడున్న సందర్భంలో ఒకవైపు లాభాలే ప్రధాన ధ్యేయంగా వస్తున్న విదేశీ మార్కెట్, దానిని సాదరంగా ఆహ్వానించడానికి 'దేశభక్తి'గల పార్టీ అయిన బిజెపి అధికారంలోకి రావడం వెరసి దేశాన్ని నిలువునా దోచుకోవడానికి పోటీ పడుతున్నారు. ఈ సందర్భంలో ప్రజల పక్షం వహించి వస్తున్న అతి కొద్ది పత్రికల్లో వీక్షణం ఒకటిగా నేను భావిస్తున్నాను. ఇలాంటి పత్రికలను కాపాడు కోవాల్సిన బాధ్యత దేశంలోని వనరులు దేశ ప్రజలకు చెందాలనుకునే నిజమైన దేశ భక్తులందరిపైన ఉంది. అలాగే వీక్షణంలో వస్తున్న వ్యాసాలు రోజువారిగా జరుగుతున్న పరిణామాలను తెలిపేవిగా ఉన్నాయి. దీని వల్ల సమాజంలో ఏం జరుగుతుందో, ఏం జరుగబోతుందో తెలుసుకోవాలనుకునే నాలాంటి వారికి ఉపయోగకరంగా ఉంది. వీక్షణం ప్రతి సంచికలో కొద్ది మంది రచయితలు వరుసగా రాస్తున్నారు. మంచి విషయాలే వస్తున్నాయి. ఇవే విషయాలపై ఇతరులకు కూడా అవకాశం ఇచ్చి రాయిస్తే పాఠకులకు కొత్త రచయితలను పరిచయం చేసినట్లు ఉంటుంది. అట్లాగే ఆయా రచయితల అభిమానులు పత్రిక చదవడానికి ఒక రకమైన అవకాశం ఏర్పడుతుందని నా సూచన. పత్రిక క్రమం తప్పకుండా రావడానికి నా వంతు కర్తవ్యంగా ప్రతి నెల 10 పత్రిక చందాలు కట్టించి పత్రికను నిలుపుకునే ప్రయత్నం చేస్తాను. వీక్షణం చేస్తున్న కృషికి కృతజ్ఞతలు.

– సంజీవ్
గద్వాల్

2014 నవంబర్ వీక్షణం సంచికలో వచ్చిన 'విచ్ఛిన్నమవుతున్న తెలుగు మీడియా' వ్యాసం బాగుంది. మీడియా ఎలా విచ్ఛిన్నమవుతున్నదో రచయిత వివరంగా చెప్పారు. మీడియాను రాజకీయ పార్టీలు, నాయకులు, పెట్టుబడిదారులు, ఎలా తమ స్వార్థ ప్రయోజనాల కోసం వాడుకుంటున్నారో కూడా చెప్పారు. కాని ఇక్కడ ఒక విషయాన్ని మనం గమనించాలి. ఆర్థిక శక్తులకు రాజకీయ శక్తి కావాలి, రాజకీయ శక్తులకు ఆర్థిక శక్తి కావాలి. అలాగే మన రాజకీయ నాయకులు చేసే కార్యక్రమాలు ప్రజలకు చేరాలంటే దానికి ఒక సాధనం కావాలి. అన్ని సాధనాలలో బలమైన సాధనం మీడియా. కావున మీడియాను రాజకీయ శక్తిగా, ఆర్థిక శక్తిగా ఎలా వాడుకోవాలో, దానిని ఎలా తన గుప్పిట్లోకి తీసుకోవాలో ప్రణాళిక బద్ధంగా మీడియాలోకి అంతర్జాతీయ పెట్టుబడులను ప్రవేశపెట్టారు. దీని వలన మీడియా తన దృక్పథాన్ని, వివేచనను, విలువలను కోల్పోతూ పెట్టుబడి రంగును పులుముకుంటున్నది. ప్రేమ్‌చంద్ చెప్పినట్లు ఆదాయం వస్తుందంటే ఏ ఆవాసాన్నైనా కూలుస్తుంది పెట్టుబడి లాభం కోసం. అందులో భాగమే మీడియా.

– జయంత
ఆమన్‌గల్

# జడలు విప్పుతున్న మతోన్మాదం

నిత్యజీవిత మౌలిక సమస్యలు పరిష్కరించలేనప్పుడు ప్రజల దృష్టి మళ్లించడానికి వారిని మాదకద్రవ్యాల వైపు మళ్లించడం వేలాది సంవత్సరాలుగా పాలకవర్గాలు అమలుచేస్తున్న వ్యూహమే. మతం అతి ప్రాచీనమూ అత్యాధునికమూ అయిన మహా శక్తిమంతమైన మాదకద్రవ్యం. మతాన్నీ రాజకీయాన్నీ కలిపితే ప్రమాదకరమైన విషరసాయనం తయారవుతుంది. దానికి అధికారం కూడ తోడైతే అది ప్రత్యక్షంగా ఎంత బీభత్సాన్ని సృష్టిస్తుందో, పరోక్షంగా చాపకింద నీరులా మనుషుల ఆలోచనలను ఎంత విషపూరితం చేస్తుందో ప్రపంచ చరిత్ర ఎన్నోసార్లు చూపింది. భారత రాజకీయాలలో ఇవాళ ప్రతిక్షణమూ ఆ చరిత్ర భయానకంగా వ్యక్తీకరణ పొందుతున్నది.

తాజాగా హిస్సార్‌లో రాంపాల్ అనే మతాచార్యుడి ఆశ్రమంలో జరిగిన కల్లోలం గురించి పెద్దఎత్తున వార్తలు వెలువడ్డాయి గాని, సంఘపరివార్ శక్తులు తొమ్మిది దశాబ్దాలుగా సాగిస్తున్న భౌతిక, మానసిక, సామూహిక, వ్యక్తిగత హింసాకాండకు అది ఒకానొక చిన్న వ్యక్తీకరణ మాత్రమే. ఆ హింసాకాండ గత ఐదు నెలలుగా కేంద్ర ప్రభుత్వ అధికారం అండతో దేశవ్యాప్తంగా పెచ్చరిల్లుతున్నది. అధికార స్థానాలలో నేరస్తులను, మతోన్మాదులను నింపడం, ప్రజల ఆలోచనలను ప్రభావితం చేసే వ్యవస్థలలో మతోన్మాద, మత విద్వేష ప్రచారానికి వీలు కలిగించేలా కరుడుగట్టిన మతోన్మాదులను భారత చరిత్ర పరిశోధక మండలి వంటి ప్రతిష్టాత్మక సంస్థలలో బాధ్యతాయుత స్థానాలలో నియమించడం, విద్యారంగంలో మతవిద్వేషం రెచ్చగొట్టడానికి పాఠ్య ప్రణాళికలను మార్చడం, భావాల స్వేచ్ఛా విస్తరణకు అడ్డుకట్టవేస్తూ హిందూ మతోన్మాద భావజాలానికి గుత్తాధిపత్యం ఇవ్వడం, భారతీయ సంస్కృతి పేరుతో హిందూ బ్రాహ్మణీయ ఆధిపత్య కులాహంకార సంస్కృతిని రుద్దుతూ ఈ సమాజపు బహుళత్వాన్ని దెబ్బతీయడానికి ప్రయత్నించడం, తటస్థంగా ఉండవలసిన అధికార ప్రచారసాధనాలలో సంఘ పరివార ప్రచారానికి అవకాశాలు కల్పించడం, తమ మూఢ మూర్ఖ భావజాలానికి భిన్నంగా ఉన్న చరిత్ర పుస్తకాలను తగులబెట్టాలని పిలుపు ఇవ్వడం, సంస్కృతం అధ్యయనాన్ని నిర్బంధపూరితం చేయడం, ముస్లింల మీద ద్వేషాన్ని రెచ్చగొట్టే అబద్ధ ప్రచారాలు సాగించడం, పరిణత యువతీ యువకులు ప్రేమించడానికీ, సహజీవనం గడపడానికీ తమ భాగస్వాములను తామే ఎంచుకుంటే, దానితో వర్ణ సంకరం జరుగుతుందని బాధపడిపోతూ, దానికి లవ్ జిహాదీ అని తప్పుడు పేరు పెట్టి, దుష్ప్రచారం చేస్తూ యువతీయువకుల స్వేచ్ఛాఎంపికను అడ్డుకోవడం వంటి ఎన్నెన్నో పనులు ఈ ఐదు నెలల కాలంలో జరిగిపోయాయి, జరిగిపోతున్నాయి.

ఇదంతా కేవలం భావజాల ప్రచారం, సంఘర్షణ మాత్రమే అనుకోవడానికి కూడ వీలులేదు. ఇది ఇప్పటికే చాల చోట్ల భౌతిక ఘర్షణలకు, దాడులకు, హత్యలకు, అధికారం చేతిలో ఉంది గనుక పోలీసు కేసులకు దారితీస్తున్నది. పుణెలో, వడోదరాలో, అహ్మదాబాద్‌లో సోషల్ మీడియా వ్యాఖ్యల సాకుతో ముస్లిం యువకుల మీద దాడులు, హత్యాప్రయత్నాలు, మంగళూరు వంటి చోట్ల పబ్‌లలో యువతుల మద్యపానం మీద దాడి పేరుతో, కొచ్చిలో, హైదరాబాద్‌లో నైతిక పోలీసింగ్, ఎన్నికల విజయానికి కారణమైన ముజఫర్‌పూర్ తరహా హింసాకాండల ప్రయత్నాలు దేశవ్యాప్తంగా జరుగుతున్నాయి. పొరుగు దేశాలతో మైత్రి పునరుద్ధరణ ప్రయత్నాలు సాగిస్తామని కల్లబొల్లి కబుర్లు చెపుతూనే, పాకిస్తాన్, బంగ్లాదేశ్‌ల మీద వ్యతిరేకత, ద్వేషం రెచ్చగొట్టడానికి పథకం ప్రకారం విషప్రచారాలు, జరగని ఘర్షణల వార్తల విడుదలలు జరుగుతూనే ఉన్నాయి. పాకిస్తాన్ సైనికులు సరిహద్దు దాటి జొరబడ్డారని, భారత సైనికులపై, పౌరులపై దాడి చేశారని ఇప్పటికి వచ్చిన ఒక్క వార్త కూడ స్వతంత్ర పరిశీలకులు, విలేఖరులు చూసి రాసినవి కాదు. సైనికాధికారులు, ప్రభుత్వాధికారులు విడుదల చేసిన ప్రకటనలు మాత్రమే. స్వతంత్ర విలేఖరులు వెళ్లడానికే అవకాశం లేని ఆ సైనిక శిబిరాల, మంచుకొండల నిర్జన ప్రాంతంలో ఏమి జరిగిందని సైనికాధికారులు, ప్రభుత్వాధికారులు చెప్పినా ఎదురు ప్రశ్నించకుండా చిలకపలుకుల్లా వల్లించే 'జాతీయ' ప్రచార సాధనాల సహాయంతో ప్రభుత్వ విషప్రచారం యథావిధిగా సాగిపోతున్నది.

భారతీయత గురించి, జాతీయ సంస్కృతి గురించి తామే గుత్తేదారుల మన్నట్టుగా ఇంతగా ప్రగల్భాలు పలుకుతున్న పాలకులు భారత సమాజ వనరులను కొల్లగొడుతున్న బహుళజాతి సంస్థల దాడులను అడ్డుకోవడం లేదు సరిగదా, తామే వారికి మార్గం సుగమం చేసి పెడుతున్నారు. సామ్రాజ్యవాద శక్తులు ఈ దేశ వనరులను, శ్రమను, మార్కెట్లను విచ్చలవిడిగా దోచుకోవడానికీ, ఈ దేశప్రజలను పీడించడానికీ ఇతోధికంగా అవకాశాలు కల్పించి, ఆరు దశాబ్దాలుగా పాలించిన ముఠాల కన్న తామే ఎక్కువ దళారీలమని రుజువు చేసుకుంటున్నారు. హిందుత్వ, బ్రాహ్మణ్యం కలగలిసిన భూస్వామ్యం, సామ్రాజ్యవాదంతో మిలాఖత్తు అవుతున్నదనడానికి ఇంతకన్న నిదర్శనం అవసరం లేదు. కాషాయీకరణ, కార్పొరేటీకరణ ఒకే నాణానికి రెండు ముఖాలని పాలకవర్గాల ప్రతి విధానమూ చర్యా రుజువు చేస్తున్నాయి.

నిజానికి ఇదంతా చరిత్రలో ఇదివరకు జరిగినదే. మొదటి ప్రపంచ యుద్ధం ముగిసిననాటి నుంచీ ప్రయత్నిస్తూ వచ్చి, 1929 ఆర్థిక సంక్షోభంతో బలం పుంజుకుని, 1933 ఎన్నికల విజయంతో గర్వం తలకెక్కి, ప్రపంచానికి మహమ్మారిగా మారిన నరహంతకుడు అడాల్ఫ్ హిట్లర్ చరిత్ర ఇవాళ భారత రాజకీయాలలో అక్షరాలా పునరావృత మవుతున్నది. కాకపోతే అడాల్ఫ్ హిట్లర్ కు వ్యతిరేకంగా ఆనాడు ప్రపంచవ్యాప్తంగా విశాల ఐక్యసంఘటన ఏర్పడింది. అనేక ప్రాంతాలలో, అనేక వర్గాలు వీరోచిత ప్రతిఘటన సాగించాయి. ఆ చరిత్ర నుంచి పాఠాలు నేర్చుకుని అడాల్ఫ్ మోడీకి, నరేంద్ర హిట్లర్‌కు అటువంటి ప్రతిఘటన చూపవలసిన శక్తులు ఇంకా తమ కర్తవ్యాన్ని గుర్తించక పోవడం, ఐక్యం కాకపోవడం ఇవాళ విచారకరమైన విషయం. అయితే ఈ నిరాశామయ స్థితి ఎల్లకాలమూ కొనసాగదు. పీడన పెరిగినకొద్దీ ప్రతిఘటన సంఘటితమవుతుందనేది కూడ చరిత్ర నేర్పే పాఠమే. వీ

# ఆకాశ హర్మ్యాలు సరే, అసలు ప్రశ్నల మాటేమిటి?

ఎప్పుడైనా పాలక విధానాలు పాలకవర్గ ప్రయోజనాలకు అనుగుణంగానే ఉంటాయి. పాలితులను భ్రమలలో ముంచడానికి కొన్ని చిన్న చిన్న తాయిలాలు, రాయితీలు, సంక్షోమపథకాలు, ఆకర్షణీయమైన నినాదాలు ప్రకటించినా, ప్రధాన కేంద్రీకరణ మాత్రం పాలకవర్గాల ప్రయోజనాలు సాధించిపెట్టడం మీదనే ఉంటుంది. ఈ అవగాహన నుంచి చూసినప్పుడు ప్రజాఉద్యమ ఫలితంగా రూపొందిన తెలంగాణ ప్రభుత్వం ప్రజల వైపు కన్న ఎక్కువగా, ఆ ఉద్యమ అణచివేతకు కారణమైన వారివైపు, వారి విధానాలవైపు చూడడానికి ప్రయత్నిస్తుండడం కొందరికి ఆశ్చర్యం కలిగించవచ్చు గాని అసహజమేమీ కాదు. తెలంగాణ రాష్ట్ర సమితి పాలన మొదలయిన తర్వాత రోజుకు కనీసం ముగ్గురి చొప్పున రైతులు ఆత్మహత్యలతో పిట్టల్లా రాలిపోతుంటే, ఆ ఆత్మహత్యా కారణాలు గత ప్రభుత్వాలవేనన్నమాట నిజమే అయినప్పటికీ, ఆత్యహత్యలను నివారించే, హతుల కుటుంబాలను ఓదార్చే కనీస కార్యక్రమాన్ని కూడ ప్రభుత్వం చేపట్టడంలేదు. తమ పొలాలనూ, ఇళ్లనూ, బతుకులనూ ధ్వంసం చేసేలా విష రసాయనాల, కాలుష్య కారక పరిశ్రమ రావద్దని నినదించినందుకు గత ప్రభుత్వాలలాగనే పోలీసులే జవాబు చెపుతున్నారు. స్వరాష్ట్రం వస్తే తమ నిరుద్యోగం తొలగిపోతుందని కలలు కన్నామని, ఆ కలలను భగ్నం చేయవద్దనీ కోరినందుకు విద్యార్థులు తమ విశ్వవిద్యాలయంలో బందీలై, గత ప్రభుత్వాలలో లాగనే పోలీసు రాజ్యాన్ని అనుభవిస్తున్నారు. ఇలా తెలంగాణ రాష్ట్రంకోసం పోరాడిన ప్రతి ప్రజా సమూహమూ నిరాదరణకో, నిర్లక్ష్యానికో, దమననీతికో గురి అవుతుండగా, బహుళ జాతి సంస్థలకు, దేశదేశాల సంపన్నులకు, చివరికి ఆంధ్ర పెట్టుబడిదారులకు. రియల్ ఎస్టేట్ దొరలకు, కాంట్రాక్టర్లకు అనుకూలమైన పథకాలు మాత్రం వెల్లువెత్తుతున్నాయి. ఒకవైపు చెరువుల పునరుద్ధరణ అనే ఆకర్షణీయమైన విధానం ప్రకటిస్తూనే, ఆ చెరువులు నింపడానికి సాగివచ్చే వాగులకు అడ్డంగా ఆకాశహర్మ్యాలు నిర్మిస్తామని, రియల్ ఎస్టేట్ గా మారుస్తామని అంటున్నారు. హుసేన్ సాగర్ ను కాలుష్యరహితంగా మార్చడానికి మొదట తోడివేస్తారట. ఇప్పటికే దాని ఆరగాణిలోని స్వచ్ఛ జల ప్రవాహాలన్నీ అడుగంటి, మురుగు నీటి కాలువలు మాత్రమే మిగిలాయి. ఆ కాలువలను కూడ ఆపేస్తే ఇక తోడివేసిన హుసేన్ సాగర్ గర్భంలోకి చుక్క నీరు కూడ రాదు. దాన్నిక రియల్ ఎస్టేట్‌గా మార్చి బుద్ధ విగ్రహం చౌరస్తా చుట్టూ కూడ ఆకాశహర్మ్యాలు నిర్మించవచ్చు. ఉమ్మడి రాష్ట్ర ముఖ్యమంత్రులలో కనీసం ఇద్దరు కలల బేహారులుగా ఇటువంటి భ్రమలనూ, మాయలనూ అమ్మి, వాస్తవ జగత్తులోని ప్రజల సమస్యల నుంచి మరపించడానికి, మైమరపించడానికి ప్రయత్నించి ఏమయ్యారో చరిత్రకు తెలిసిన సంగతే. ఆ విధానాలను అప్పుడు తీవ్రంగా ఖండించిన వారు ఇప్పుడు అధికారపీఠం మీద అవే విధానాలను ప్రకటించడం, అమలు చేయడానికి ప్రయత్నించడం తెలంగాణ ప్రజా చైతన్యానికీ, తెలంగాణ రాష్ట్ర సాధన ఆకాంక్షలకూ, తెలంగాణ రాష్ట్ర ఉద్యమానికీ పొసగవని ఇప్పటికైనా గుర్తించాలి. వీ

# రాజధాని పేరిట ఆశ్రితులకు నీరాజనాలు

చంద్రబాబు నాయుడు పాలనలో ఇనుమడిస్తున్న ప్రపంచీకరణ విధానాలతో ఆంధ్రప్రదేశ్ భవిష్యత్తును తలచుకుంటే ఆందోళనకరంగా ఉంది. గతంలో హెచ్చరించినట్టు చంద్రబాబు నాయుడు 1995-2004 పాలనా కాలంలో ఎటువంటి ప్రజావ్యతిరేక విధానాలు అమలు చేసి, ప్రజావ్యతిరేకత మూటకట్టుకుని 2004 ఎన్నికలలో పరాజయం పాలయ్యారో సరిగ్గా అవే విధానాలను మళ్లీ తెస్తున్నారు. నిజానికి గత పరాజయం తర్వాత తాను మారాననీ, తన విధానాలలో మానవముఖం లోపించిందని గుర్తించాననీ బహిరంగంగానే పశ్చాత్తాపపడిన ఆయన ఈసారి ఆ విధానాలను మరింత దూకుడుగా అమలు చేయడానికి పూనుకున్నట్టున్నారు. కార్పొరేట్ విద్యకు మూలస్తంభమైన వ్యక్తిని శాసనసభ్యుడుగా ఎన్నిక కాకుండానే మంత్రివర్గంలోకి తీసుకోవడం, కార్పొరేట్ అవినీతికి చిహ్నమైన వ్యక్తిని కేంద్ర మంత్రివర్గంలోకి తమ తరఫున పంపించడం, పోలవరం నిర్మాణంపై దూకుడు ప్రకటనలు చేయడం, విదేశీ పర్యటనలలో బహుళజాతి సంస్థలను, పెట్టుబడిదారులను ఆకర్షించడానికి రాష్ట్రాన్ని తాకట్టు పెట్టడానికి ప్రయత్నించడం వంటి చర్యల పరంపర ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రాధాన్యతలు ఏమిటో తెలియజేస్తున్నాయి. ఈ విధానాల పరంపర అంతటిలోకీ అత్యంత ప్రమాదకరమైనదీ, ప్రజా వ్యతిరేకమైనదీ, రియల్ ఎస్టేట్ వ్యాపారుల ప్రయోజనాల కోసమే వచ్చినదీ రాజధాని ప్రతిపాదన. కొత్త రాష్ట్రానికి రాజధాని లేకపోవడం, ఒక కొత్త రాజధానిని రూపొందించుకోవలసి రావడం నిజంగా కష్టతరమైన కర్తవ్యమే. ప్రతి జిల్లాలో, ప్రతి ప్రాంతంలో రాజధాని కావాలనే కోరికలు ఉన్నప్పుడు, ఉమ్మడి రాష్ట్రంలో రాజధాని కేంద్రీకరణ వల్ల సమస్యలు తలెత్తిన తాజా చరిత్ర అనుభవం ఉన్నప్పుడు ఏ మాత్రం సవ్యమైన ఆలోచనలు ఉన్న ప్రభుత్వమైనా ఒకటికి రెండు సార్లు ఆలోచించి నిర్ణయం తీసుకోవలసి ఉంటుంది. అన్యాయానికి గురయ్యామని రాయలసీమ వాసులలో ఉన్న ఆందోళన శ్రీబాగ్ ఒడంబడిక నాటి నుంచీ వ్యక్తమవుతూ ఉంది గనుక ఆ చరిత్రను కూడ పరిగణనలోకి తీసుకోవలసి ఉంటుంది. అది ఇంత జటిలమైన సమస్య కనుకనే ఒక పరిశీలనా కమిషన్ కూడ నియామకమై అన్ని ప్రాంతాలూ తిరిగి కొంత కసరత్తు చేసింది. కాని అవన్నీ పక్కనపెట్టి ముఖ్యమంత్రి తన ఆశ్రితులైన రియల్ ఎస్టేట్ వ్యాపారుల ప్రయోజనాలకు అనుగుణంగా మాత్రమే రాజధాని నిర్ణయం చేశారు. ప్రజలకు, ముఖ్యంగా ఆ గ్రామాలలో భూయజమానులకు కొన్ని ఆశలూ భ్రమలూ కల్పించి సమ్మతిని కూడ తయారు చేసుకున్నారు. కాలువల కింద భూములు, సంపన్నమైన పంటపొలాలు, విస్తారమైన వ్యవసాయోత్పత్తులు, సుదీర్ఘ చరిత్రగల గ్రామాలు, వేలాది మంది ప్రజలు - అన్నిటినీ ఒక్క కలం పోటుతో రద్దు చేసి రాజధాని నిర్మాణం ప్రారంభించారు. రాజధాని ప్రకటనకు రెండు మూడు వారాలకు ముందే ముఖ్యమంత్రి ఆశ్రితులు ఆ గ్రామాలలో వేలాది ఎకరాల భూమిని కొనుగోలు చేశారనీ, రాత్రికి రాత్రి రిజిస్ట్రేషన్లు జరిగిపోయాయనీ వస్తున్న వార్తలు హైదరాబాదులో పాత పథకాల చరిత్రను గుర్తు తెస్తున్నాయి. ఈ ప్రజావ్యతిరేక విధానాలకు వ్యతిరేకంగా ప్రజలు సంఘటితమై పోరాడడం తప్ప మరొక మార్గం లేదు. వీ

# నల్లజాతి ప్రాణాలకు విలువ ఉందని నినదిస్తున్న అమెరికా

**అ**మెరికన్ పాలకవర్గాల ఐదు వందల సంవత్సరాల చరిత్రలో సగభాగం స్థానిక జాతులను ఊచకోత కోసి, మానవ హననం సాగించి, తమ పాలన స్థాపించుకోవడానికే సరిపోయింది. ఆ తర్వాత ఆఫ్రికా నుంచి బంధించి తెచ్చుకున్న బానిసల సంతతిని పీడిస్తున్న చరిత్ర, వారి ప్రాణాలకు విలువనీయని చరిత్ర ఈ సగభాగంలో గడుస్తున్నది. ఆ జాతికే చెందిన వ్యక్తి అధ్యక్ష స్థానం కూడ అందుకుని పాలకవర్గాలలో భాగమైనప్పటికీ శ్వేతజాతీయులలో నల్లజాతి పట్ల చిన్నచూపు, వివక్ష, దమననీతి ఇంకా కొనసాగుతున్నాయి. వర్ణ వివక్ష అమెరికన్ పాలక వ్యవస్థలో అంతర్భాగంగా ఉంది. ప్రపంచానికంతా ప్రజాస్వామ్యం, సంస్కృతి నేర్పుతానంటున్న, ప్రపంచంలో ఎక్కడ అక్రమం జరిగినా పెద్దన్నలా, ప్రపంచపోలీసులా సవరిస్తానంటున్న మహాఘనత వహించిన అమెరికా సామ్రాజ్యంలో ఈ అత్యాధునిక యుగంలో 'బ్లాక్ లైవ్స్ మాటర్' (నల్లజాతి ప్రాణాలకు విలువ ఉంది, నల్లజాతికి బతికే హక్కు ఉంది) అని నినదించవలసిన దౌర్భాగ్యం పట్టిందంటే, మన నాగరికత గురించి మనం కాస్త పునరాలోచించుకోవలసి ఉంది. సరిగ్గా ఇది రాస్తున్న సమయాన అమెరికాలోని నగరాలన్నిటిలో చిన్నవో పెద్దవో నిరసన ప్రదర్శనలు జరుగుతున్నాయి. విపరీతమైన భద్రతాబలగాల మోహరింపుతో పాలకులు ఆ ప్రదర్శనలను అణచివేయ గలుగుతున్నా అమెరికా సమాజం వర్ణ వివక్షవల్ల ఎంతటి అగ్నిపర్వతంలా ఉన్నదో బైట పడుతున్నది. ఇంతకూ ఈ నిరసన జ్వాలలు చెలరేగడానికి కారణమైనది చిన్న సంఘటనే. ఆగస్ట్ 9న ఫెర్గూసన్ అనే నగరంలో మైకెల్ బ్రౌన్ అనే పద్దినిమిది సంవత్సరాల నిరాయుధ యువకుడిని డారెన్ విల్సన్ అనే పోలీసు అధికారి కాల్చిచంపాడు. హతుడు నల్లవాడు. హంతకుడు తెల్లవాడు. ఆ హంతకుడి మీద హత్యా నేరం మోపి విచారించవచ్చునా లేదా అని పరిశీలించిన గ్రాండ్ జ్యూరీ హత్యా నేరం మోపనక్కరలేదని నవంబర్ 24న నిర్ణయించింది. ఆ గ్రాండ్ జ్యూరీలోని పన్నెండు మందిలో నిర్ణయం తీసుకోవడానికి తొమ్మిది వోట్లు కావలసి ఉండగా తొమ్మిది మంది శ్వేత జాతీయులున్నారు. సాక్ష్యాధారాలు పరిశీలించామనీ, నిజాన్నీ అబద్ధాన్నీ వేరు చేశామనీ, పోలీసు అధికారి ఆత్మరక్షణార్థమే కాల్పులు జరిపాడు గనుక అది హత్యానేరం కాదనీ జ్యూరీ ప్రకటించింది. ఆనాటి నుంచీ అమెరికా ప్రత్యక్షంగానూ ప్రచ్ఛన్నంగానూ అట్టుడికిపోతున్నది. నిజానికి ఫెర్గూసన్ జ్యూరీ తీర్పు సరిగ్గా మన చుండూరు తీర్పు లాంటిది. అధికారం, సంపదా, ఆయుధం ఉన్నవాళ్లు ఇలా న్యాయాన్ని చెరబట్టి అక్రమమే న్యాయమని ప్రకటించ వచ్చు. కాని అది ఎల్లకాలం సాగదు. సామ్రాజ్యవాదమంటే మరణశయ్య మీద ఉన్న పెట్టుబడిదారీ విధానమే అని లెనిన్ ఒక శతాబ్దం కింద చేసిన సూత్రీకరణను సృజనాత్మకంగా అర్థం చేసుకుంటే ఆ పెట్టుబడిదారీ విధానం, సామ్రాజ్యవాదం ఎంత కుళ్లి కంపు కొడుతూ ఎంత అమానవీయంగా, దుర్మార్గంగా పాలన సాగిస్తున్నదో ఇటువంటి ఘటనలే చూపుతున్నాయి. ఈ కాలం చెల్లిన సాంఘిక ధర్మాన్ని కూలదోయడానికి సకల మానవశక్తులు, మానవీయ శక్తులు ఏకం కావలసిన అవసరాన్ని ఇటువంటి ఘటనలు వేనోళ్ల ప్రకటిస్తున్నాయి. వీ




కార్టూన్: అరుణ్ ఫెరీరా




❖ **జూకంటి జగన్నాథం కవిత్వం – మొదటి భాగం**– నయనం ప్రచురణలు సిరిసిల్ల –336 పేజీలు, 1/8 డెమీ, రు. 200




❖ **జూకంటి జగన్నాథం కవిత్వం – రెండవ భాగం**– నయనం ప్రచురణలు సిరిసిల్ల –406 పేజీలు, 1/8 డెమీ, రు. 300




❖ **జూకంటి జగన్నాథం కవిత్వం – మూడవ భాగం**– నయనం ప్రచురణలు సిరిసిల్ల –276 పేజీలు, 1/8 డెమీ, రు. 150

ప్రతులకు : ఇం.నెం. 6–5–101, విద్యానగర్, సిరిసిల్ల – 505 301, కరీంనగర్ జిల్లా, తెలంగాణ సెల్ నెం. 9441078095




❖ **జైలు లోపల కథలు** – వట్టికోట ఆళ్వారు స్వామి–ప్రచురణ : తెలంగాణ భాషా సాంస్కృతిక మండలి– 65 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు : డా. గంట జలందర్ రెడ్డి, ఇం.నెం. 1–4–19/8, ప్లాట్ నెం. 11. స్ట్రీట్ నెం. 7, హబ్సీగూడ, హైదరాబాద్–500 007, ఫోన్ : 9848292715




❖ **అమరుల యాదిలో కవిత్వం** – దిక్సూచి ప్రచురణలు – 128 పేజీలు, 1/8 డెమీ, రు. 50




❖ **అమరుల జీవితం– చరిత్ర** – దిక్సూచి ప్రచురణలు – 128 పేజీలు, 1/8 డెమీ, రు. 40

ప్రతులకు : దిక్సూచి ప్రచురణలు, జింకిభద్ర గ్రామం, శ్రీకాకుళం జిల్లా, అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలలో దొరుకుతాయి.




❖ **సంగీతం రీతులు – లోతులు** – కొడవటిగంటి రోహిణి ప్రసాద్ – హైదరాబాద్ బుక్ ట్రస్ట్ – 212 పేజీలు, 1/8 డెమీ, రు. 150,




❖ **ఇండియాలో దాగిన హిందూస్థాన్** – పెరి ఆండర్సన్ – హైదరాబాద్ బుక్ ట్రస్ట్ – 164 పేజీలు, 1/8 డెమీ, రు. 150,

ప్రతులకు: హైదరాబాద్ బుక్‌ట్రస్ట్, ఫ్లాట్ నెం. 85, బాలాజీనగర్, గుడిమల్కాపూర్, హైదరాబాద్–500006; ఫోన్: 23521849; hyderabadbooktrust.blogspot.com



❖ **6 th ఎలిమెంట్** – ముచ్వా శ్రీనివాసరావు – 160 పేజీలు, 1/8 డెమీ, రు. 150, ప్రతులకు : ముక్వా శ్రీనివాసరావు, ఫ్లాట్ నెం. 103, సృజన అపార్ట్‌మెంట్స్, స్ట్రీట్ నెం. 1, ఖమ్మం, kranthisreenu.muvva@gmail.com సెల్ : 9948099900



❖ **నవ్విన ధాన్యరాశి** – కథల సంపుటి – సి. వేణు, ప్రచురణ : స్వచ్ఛత ప్రచురణ – 155 పేజీలు, 1/8 డెమీ, రు. 116, ప్రతులకు : సి. వేణుగోపాల్ రెడ్డి, నెం. 19, 'నీకలాన్', గార్డెన్ లే అవుట్ పారాంగి పాల్య, హెచ్.ఎస్.ఆర్. లే అవుట్ II సెక్టార్, బెంగళూర్ – 560 102, ఫోన్ : 09900896123




❖ **ఎద్దు** – కవితా సంపుటి – కె. శాంతారావు (శైలి), ప్రచురణ : వనమాలి – 48 పేజీలు, 1/8 డెమీ, రు. 20, ప్రతులకు : వనమాలి 1–11–59/ఎ/3, చిన్నతోకట, న్యూ బోయిన్‌పల్లి, సికింద్రాబాద్ – 500 011, సెల్ : 9010646492, email : vanamali.ap@gmail.com



❖ **ఆహార సార్వభౌమత్వం ఎదుర్కొంటున్న సవాళ్లు** – మంచి జీవితం ప్రచురణ – 60 పేజీలు, 1/8 డెమీ, ప్రతులకు : బి – 228, సైనిక్‌పురి సికిందరాబాద్ – 500 094, ఫోన్ : 040 – 27113167 anthra.hyd@gmail.com, machijeevitam@gmail.com




❖ **అంబేద్కర్ – లోహియా** – డా. కత్తి పద్మారావు– ప్రచురణ : లోకాయత ప్రచురణలు – 120 పేజీలు, 1/8 డెమీ, రు. 100.




❖ **వ్యక్తిత్వ నిర్మాణం** – డా. కత్తి పద్మారావు– ప్రచురణ : లోకాయత ప్రచురణలు – 135 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు : కత్తి స్వర్ణకుమారి లుంబినీ వనం, అంబేద్కర్ కాలని, పొన్నూరు – 522 124, గుంటూరు జిల్లా, ఫోన్ : 9849741695,

email : padmaraokathi@yahoo.co.in




❖ **చిగురించే మనుషులు** – పలమనేరు బాలాజి – ప్రచురణ : పవిత్ర ప్రణీత ప్రచురణలు – 167 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు : కె.ఎస్. జయమ్మ, 6–219. గుడియాత్తం రోడ్డు, పలమనేరు – 517 408, చిత్తూరు జిల్లా, సెల్ : 94409 95010

email: palamanerbalaji@gmail.com




❖ **త్రిపుర ఓ జ్ఞాపకం నివాళి సంచిక** – సంపాదకులు డా. అత్తలూరి నరసింహారావు, భమిడిపాటి జగన్నాథరావు ప్రచురణ : సాహితీమిత్రులు – 400 పేజీలు, 1/8 రాయల్, రు. 150, ప్రతులకు : అన్ని పుస్తక కేంద్రాలలో దొరుకుతాయి

# ఆశ నిరాశల తొలి తెలంగాణ బడ్జెట్

***తెలంగాణ రాష్ట్రంలో ప్రవేశపెట్టిన తొలి బడ్జెట్ పూర్తి ఆర్థిక సంవత్సరాన్ని పరిగణనలోకి తీసుకోనప్పటికీ ప్రభుత్వ ప్రాధాన్యతలలో, దిశలో ఆశనూ నిరాశనూ సూచిస్తున్నదని అంటున్నారు* ఎన్. వేణుగోపాల్**

ప్రస్తుత భారత ఆర్థిక వ్యవహారాల నిర్వహణాసూత్రాల ప్రకారం కేంద్ర బడ్జెట్‌కు ఉన్నంత ప్రాధాన్యత రాష్ట్ర బడ్జెట్ కు ఉండదు. అసలు ప్రపంచీకరణ విధానాల తర్వాత, పాలకపక్షాలు బడ్జెట్‌కు బైటనే అనేక విధాన ప్రకటనలు, కేటాయింపులు, ఖర్చులు చేస్తుండడంతో కేంద్ర బడ్జెట్‌కే ప్రాధాన్యత తగ్గిపోతూ వస్తున్నది. ఇక రాష్ట్ర బడ్జెట్ల గురించి చెప్పనే అక్కరలేదు. దేశంలో 29వ రాష్ట్రంగా కొత్తగా ఏర్పడిన తెలంగాణలో నవంబర్ 5న రాష్ట్ర ఆర్థిక మంత్రి ఈటెల రాజేందర్ ప్రవేశపెట్టిన బడ్జెట్‌ను అర్థం చేసుకోవడంలో మొదట ఈ పరిమితి దగ్గర ప్రారంభించాలి.

ఈ బడ్జెట్ పూర్తి వార్షిక బడ్జెట్ కాకపోవడం, రాష్ట్ర ఏర్పాటు వల్ల ఆర్థిక సంవత్సరంలో ఏర్పడిన మార్పులు మరొక పరిమితి. సాధారణంగా రాష్ట్ర ప్రభుత్వాలు తమ బడ్జెట్లను ఫిబ్రవరి – మార్చిలలో ప్రవేశపెట్టి, ఏప్రిల్ 1 ఆర్థిక సంవత్సరం నుంచి అమలులోకి తెస్తాయి. కాని తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం ఆర్థిక సంవత్సరం ప్రారంభమైన రెండు నెలల తర్వాత జూన్ 2న ప్రమాణస్వీకారం చేసింది గనుక పూర్తి బడ్జెట్ ప్రవేశపెట్టే అవకాశం రాలేదు. అంతకుముందరి ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ఆర్థిక మంత్రి ఆనం రామనారాయణ రెడ్డి 2014 ఫిబ్రవరి 10న ప్రవేశపెట్టిన వోట్ ఆన్ అకౌంట్ బడ్జెట్ చట్టప్రకారం ఆరు నెలల పాటు, ఏప్రిల్ 1 నుంచి సెప్టెంబర్ 30 దాకా, అమలులో ఉంటుంది. దాన్ని కొనసాగిస్తూ మిగిలిన కాలానికి గాని, లేదా, తాము అధికారానికి వచ్చిన నాటి నుంచి పది నెలల కొరకు గాని తెలంగాణ రాష్ట్ర సమితి ప్రభుత్వం బడ్జెట్‌ను ప్రవేశపెట్టవలసి వచ్చింది. నవంబర్ 5న పదినెలల బడ్జెట్ ప్రవేశపెట్టాలని ప్రభుత్వం నిర్ణయించింది. ఈ ఆర్థిక సంవత్సరంలో ఐదు నెలల కన్న తక్కువ సమయం మాత్రమే మిగిలి ఉండగా పదినెలల బడ్జెట్ ప్రవేశపెట్టడంలో అదనపు సమస్యలు కూడ ఉంటాయి.

ఈ మూడు పరిమితులను దృష్టిలో ఉంచుకుని బడ్జెట్‌ను పరిశీలించబోయే ముందు, సాధారణంగా బడ్జెట్ అవకాశాలనూ పరిమితులనూ సూచించే ఎకనమిక్ సర్వే గురించి కూడ మాట్లాడుకోవాలి. కేంద్ర ప్రభుత్వంలోనైనా, రాష్ట్ర ప్రభుత్వాలలోనైనా గడిచిన సంవత్సరపు ఆర్థిక స్థితిగతుల మదింపు చేసే ఎకనమిక్ సర్వేను బడ్జెట్ ముందురోజు, లేదా బడ్జెట్ రోజు సభకు సమర్పించడం ఆనవాయితీ. ఉమ్మడి రాష్ట్రంలోనే దాని పేరు సోషియో ఎకనమిక్ సర్వే అని మార్చారు. అదే ఆనవాయితీ ప్రకారం తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం కూడ 'రి ఇన్వెంటింగ్ తెలంగాణ' అనే శీర్షికతో 2014 సోషియో ఎకనమిక్ ఔట్‌లుక్ అనే నివేదికను సమర్పించింది.

ఈ నివేదిక రి ఇన్వెంటింగ్ తెలంగాణ (తెలంగాణ పునరన్వేషణ), డెవలప్ మెంట్ ప్రొఫైల్ (అభివృద్ధి స్వరూపం), సెక్టొరల్ స్టేటస్ (వివిధ రంగాల స్థితి), స్టాటిస్టికల్ ప్రొఫైల్ (గణాంకాలు) అనే నాలుగు భాగాలతో ప్రధానంగా తెలంగాణ రాష్ట్రానికి ఉన్న వనరులను, అవకాశాలను, ప్రాధాన్యతలను తెలంగాణ ప్రజా ఆకాంక్షల కోణంలో ఆవిష్కరించడానికి ప్రయత్నించింది. ది విజన్ అనే మొదటి అధ్యాయం 2014 సెప్టెంబర్ 19న పద్నాలుగో ఆర్థిక సంఘం ముందు రాష్ట్ర ముఖ్యమంత్రి కె. చంద్రశేఖర రావు చేసిన ప్రసంగం నుంచి విస్తృతంగా ఉటంకించింది. ఆరు దశాబ్దాల తెలంగాణ ప్రజా ఆకాంక్షలు, స్పష్టంగా ముందుకు వచ్చిన వివిధ ప్రజాసమూహాల కోరికలు అలా ఉంచినా కనీసం ఈ ఉటంకించిన భాగాన్నయినా సంపూర్ణంగా అమలులోకి తేగలిగితే తెలంగాణ ప్రజానీకానికి అభివృద్ధి ఫలాలు ఎంతోకొంత అందుతాయి. 'ఆరు దశాబ్దాల నిరంతరాయ పోరాటం తర్వాత, తమ అస్తిత్వాన్ని స్థాపించుకోవాలనీ, తమ భవిష్యత్తును తామే తీర్చి దిద్దుకోవాలనీ నాలుగుకోట్ల ప్రజల ఆకాంక్షల సాఫల్యంగా నవ తెలంగాణ రాష్ట్రం 2014 జూన్ 2న ఏర్పడింది. ఇప్పటివరకూ అణచివేతకు గురైన ఆ ప్రజల ఆకాంక్షలను నెరవేర్చడమే ప్రభుత్వం ముందున్న ప్రధానమైన సవాలు' అని ముఖ్యమంత్రి ఆ ప్రసంగంలో అన్నారని ఉటంకించారు. మరి సరిగా, స్పష్టంగా గుర్తించిన ఆ సవాలును ఎంతవరకు స్వీకరించి, పరిష్కరించడానికి ప్రయత్నించారో సోషియో ఎకనమిక్ ఔట్‌లుక్ ఇతర భాగాలలో, ఆ తర్వాత ప్రవేశపెట్టిన బడ్జెట్ లో పరిశీలించవలసి ఉంది.

'స్థానిక వనరులను స్థానిక వివేకంతో అభివృద్ధి కోసం ఉపయోగించుకోవడం' జరగాలనీ, 'సమాజంలోని అనాదృత వర్గాలకు అందకపోతే అభివృద్ధికి అర్థమూ, సాధికారతా లేవనేది నా దృఢ విశ్వాసం' అనీ ముఖ్యమంత్రి అన్నారని సోషియో ఎకనమిక్ ఔట్‌లుక్ ఉటంకించింది.

'తెలంగాణను పునరన్వేషించే మార్గం సహజ, మానవ వనరులను పూర్తిగా అందుబాటులోకి తెచ్చుకోవడం మీద, ఇప్పటిదాకా సాగిన ప్రధానస్రవంతి అభివృద్ధి క్రమాలలో జొరబడిన అసమానతలను, అపసవ్యతలను సరిచేయడం మీద ఆధారపడి ఉంటుంది' అనీ, 'అవిభక్త రాష్ట్రంలో అమలయిన విధానాలనూ కార్యక్రమాలనూ మార్చి, సమ్మిళిత, సుస్థిర అభివృద్ధిని సాకారం చేసుకోవడం కోసం తెలంగాణ ఆర్థిక వ్యవస్థకూ, సమాజానికీ, రాజకీయ వ్యవస్థకూ సరిపోయే విధంగా పునర్నిర్మించడం తెలంగాణ ప్రభుత్వ ప్రధాన సవాలు' అనీ సోషియో ఎకనమిక్ ఔట్‌లుక్ ప్రకటించింది. అంతరాలు లేని ప్రాథమిక, మధ్యంతర విద్యను సార్వత్రికంగా అందించడం, కెజి నుంచి పిజి దాకా సమస్యా రహితమైన విద్యను అందించడం ప్రభుత్వ లక్ష్యమని ఒకవైపున అంటూనే, నాణ్యమైన విద్యను అందించడానికి ప్రైవేటు, కార్పొరేటు సంస్థలతో భాగస్వామ్యం నెరపుతానని కూడ సోషియో ఎకనమిక్ ఔట్‌లుక్ ప్రకటించింది.

తెలంగాణ ప్రజలకు మేలు చేయని, తెలంగాణ వ్యతిరేకులకు మేలు చేసే కొన్ని అభ్యంతరకరమైన వాదనలు ఉన్నప్పటికీ సోషియో ఎకనమిక్ ఔట్‌లుక్ ప్రధానంగా తెలంగాణ సమాజం ఏమి కోరుకుంటున్నదో వ్యక్తీకరించింది. కాని ఆ కోరికలు వాస్తవరూపం ధరించడంలో

ముఖ్యపాత్ర పోషించవలసిన బడ్జెట్ దగ్గరికి వచ్చేసరికి ఆ గంభీరమైన వాగ్దానాలు మరికొంత పలచబడ్డాయి. అప్పటికీ, ఏ మాటకు ఆ మాటే చెప్పుకోవాలంటే ఆర్థిక మంత్రి చేసిన బడ్జెట్ ఉపన్యాసం ఆకర్షణీయంగానే ఉంది. ముఖ్యంగా గత బడ్జెట్ల కన్న భిన్నంగా ఉద్యమం గురించీ, ప్రజల గురించీ, ప్రజా ఆకాంక్షల గురించీ బడ్జెట్ ప్రసంగం అవసరమైన, ఆమోదయోగ్యమైన ప్రస్తావనలు చేసింది. వాటిని ఆచరణలోకి అనువదించే పని చేసిందా లేదా అనేది వేరే చర్చ.

'సుదీర్ఘకాలంగా దారుణమైన వివక్షకు తెలంగాణ సమాజం గురైంది. ఆకాంక్షలు అణగారిపోయినయి. పోరాట సందర్భంలో ప్రజలు వ్యక్తం చేసిన డిమాండ్లు అరణ్యరోదనగానే మిగిలిపోయినయి. ఇవాళ ఆ ఆకాంక్షలను నెరవేర్చడమే మా లక్ష్యం. తెలంగాణ ప్రాంత అస్తిత్వాన్ని పరిరక్షించే విధంగా, తెలంగాణ ప్రజలకు ఉజ్వల భవిష్యత్తును అందించే విధంగా పూర్తిగా తెలంగాణ దృక్పథంతో బడ్జెట్ ను రూపొందించాం.... మా ముందు ఇప్పుడు చాలా సవాళ్లున్నాయి. విచ్ఛిన్నమైపోయిన, విధ్వంసమైపోయిన సమాజాన్ని తిరిగి నిలబెట్టుకోవడం ఆషామాషి విషయం కాదు. ఇది చాలా గంభీరమైన లక్ష్యం.... తెలంగాణ ఏయే రంగాలలో ధ్వంసం చేయబడిందో ఆ రంగాలన్నింటినీ మళ్లా చక్కదిద్ది సమాజాన్ని ప్రగతి పథంలో నడిపించడానికి ఈ బడ్జెట్‌ను రూపొందించాం. అయితే వలసవాద విలయం సృష్టించిన సమస్యలను పరిష్కరించడానికి సులభోపాయాలు పనికిరావు. నిజమైన అభివృద్ధి సాధించడానికి అడ్డదారులు, దగ్గరి దారులు ఉండవు. దీర్ఘకాలిక ప్రణాళికతో శాశ్వత పరిష్కారాల దిశగా అడుగులు వేయాలి. అందుకు చాలా పరిణతి అవసరం. గత ప్రభుత్వాలు అనుసరించిన తప్పుడు విధానాలకు విరుగుడుగా తెలంగాణకు అనుగుణమైన సరి అయిన విధానాలను నిర్వచిస్తూ ప్రజల సాంఘిక, ఆర్థిక వికాసానికి దారులు వేస్తున్నాం. విచ్ఛిన్నమైన తెలంగాణ తిరిగి తన కాళ్లమీద తాను నిలబడడానికి అవసరమైన శాశ్వత ప్రాతిపదికలను నిర్మిస్తున్నాం' అని బడ్జెట్ ఉపన్యాసంలో చెప్పారు.

ఇవన్నీ తెలంగాణ ప్రజలు, తెలంగాణ వాదులు అందరూ ఆమోదించే అంశాలే. అయితే వాటిని అమలు చేసే విధానాలు, పథకాలు, కేటాయింపులు, ఆ కేటాయింపుల వాస్తవమైన వ్యయాలు, ఫలితాలు ఉన్నప్పుడే ఈ మాటలు సార్థకమవుతాయి.

ఇంత తెలంగాణ ప్రజానుకూలమైన ప్రకటనలు చేసిన బడ్జెట్ ప్రసంగం తర్వాత, ప్రణాళికలు, పథకాలు, కార్యక్రమాలు, కేటాయింపులు, ప్రాధాన్యతల దగ్గరికి వచ్చేసరికి మళ్లీ 'గత ప్రభుత్వాలు అనుసరించిన తప్పుడు విధానాల' జాడలే పునరుక్తమయ్యాయి. అభివృద్ధి జరుగుతున్నదనే భ్రమ కల్పించడానికి పాత పాలకులు అమలు చేసిన 'అడ్డదారులు, దగ్గరి దారులు' రంగం మీదికి వచ్చాయి. కేటాయింపులలో పాత ఆనవాయితీయే తప్ప కొత్త దారులు, 'శాశ్వత ప్రాతిపదికల' నిర్మాణం కనబడలేదు. ఈ బడ్జెట్ పూర్తి బడ్జెట్ కాదనీ, ఆరు దశాబ్దాల విధ్వంసం నీడలు పరుచుకున్న బడ్జెట్ మాత్రమేననీ ఎంతగా చెప్పుకున్నప్పటికీ, కనీసం దిశలోనైనా, ప్రతీకాత్మకంగానైనా పైన చెప్పుకున్న మార్పులు కనిపించడం లేదు.

అవాస్తవికమైన భారీ అంకెలు ప్రకటించి ప్రజలను భయంలోనో, భ్రమలలోనో ముంచడం రాష్ట్ర ఆర్థిక వ్యవహారాలలో చంద్రబాబు నాయుడు ప్రారంభించిన ఒక ప్రధానమైన తప్పుడు ధోరణి. శ్వేతపత్రాలలో గాని, బడ్జెట్లలోగాని, విజన్ 2020లో గాని ఆయన విజయవంతంగా సాగించిన గారడీ విద్య అది. ఆ తర్వాతి రాజశేఖర రెడ్డి, రోశయ్య, కిరణ్ కుమార్ రెడ్డి ప్రభుత్వాలు కూడ ఆ గారడీనే కొనసాగించాయి. తెలంగాణ ప్రభుత్వం తనను తాను ప్రజా ఉద్యమం మీద ఆధారపడిన ప్రభుత్వమని అనుకుంటే ప్రజలకు నిజాలు చెప్పాలనీ, వాస్తవికమైన గణాంకాలు ప్రకటించాలనీ అనుకోవలసి ఉండింది. కాని దురదృష్టవశాత్తూ కొత్త ప్రభుత్వం కూడ పాత అంకెల గారడీనే నమ్ముకుందనడానికి ఒక ఉదాహరణ చూద్దాం: ఉమ్మడి రాష్ట్ర ఓట్ ఆన్ అకౌంట్ బడ్జెట్‌గా 2014-15 ఆర్థిక సంవత్సరానికిగాను ఆనం రామనారాయణ రెడ్డి రు. 1,83,128 కోట్ల బడ్జెట్ ప్రవేశపెట్టారు. ఆ తర్వాత రాష్ట్రం విడిపోయి రెండు రాష్ట్రాలయింది. ఆగస్ట్ 20న యనమల రామకృష్ణుడు ప్రవేశపెట్టిన ఆంధ్రప్రదేశ్ బడ్జెట్ రు. 1,11,824 కోట్లు ఉండగా, నవంబర్ 5న ఈటెల రాజేందర్ ప్రవేశపెట్టిన బడ్జెట్ రు. 1,00,637 కోట్లుగా ఉంది. అంటే ఉమ్మడి రాష్ట్రంలో రు. 1,83,128 కోట్లుగా ఉన్న సంఖ్య రెండు విడి రాష్ట్రాలను కలిపితే రు. 2,14,261 కోట్లుగా మారిందన్నమాట. అంటే నాలుగు నెలలు గడవకుండానే, అదనపు ఆదాయాలు, వ్యయాలు ఏమీ లేకుండానే రు. 31,133 కోట్లు గాలిలో సృష్టి అయ్యాయన్న మాట. పైగా రెండు రాష్ట్రాల బడ్జెట్లలోను అదనపు పన్నుల విధింపు జరగలేదు. కొన్ని అదనపు పథకాల ప్రకటన జరిగింది గాని వాటికి అవసరమైన నిధులు ఎలా సమకూర్చుకుంటారో వివరణ లేదు.

గత ప్రభుత్వాల అపసవ్య విధానాలను సవరించి రాష్ట్రంలోని అన్ని ప్రాంతాల సమతులాభివృద్ధి సాధిస్తామని వాగ్దానాలు ఉన్నంతగా వాస్తవ కేటాయింపులు, వెనుకబడిన ప్రాంతాల మీద ప్రత్యేక శ్రద్ధ కనబడడం లేదు. ఉదాహరణకు తెలంగాణ రాష్ట్ర తలసరి ఆదాయం (రు. 93,151) జాతీయ తలసరి ఆదాయం (రు. 74,920) కన్న దాదాపు ఇరవై వేలు ఎక్కువ ఉన్నట్టు కనబడుతుండగా, జిల్లాల వారీగా విభజించి చూసినప్పుడు పది జిల్లాలలో ఏడు జిల్లాల (ఆదిలాబాద్, నిజామాబాద్, కరీంనగర్, వరంగల్, ఖమ్మం, నల్లగొండ, మహబూబ్ నగర్) తలసరి ఆదాయం జాతీయ తలసరి ఆదాయం కన్న తక్కువ ఉంది. అసలు తలసరి ఆదాయం అనే అంకెనే సగటు మాయాజాలపు అంకె కాగా, అది కూడ ఏడు జిల్లాలలో దయనీయమైన స్థితిలో ఉన్నదని అర్థం. కనుక ఆ ఏడు జిల్లాల తలసరి ఆదాయాన్ని రాష్ట్ర సగటుతో సమానం చేయడానికి ఆ జిల్లాలలో వ్యవసాయ, పారిశ్రామిక, సేవారంగ అభివృద్ధి, ఉపాధికల్పన వంటి అంశాలు ప్రాధాన్యత సంతరించుకుని ఉండాలి. కాని ప్రభుత్వం కొత్తగా ప్రకటిస్తున్న పథకాలన్నీ కూడ తలసరి ఆదాయం హెచ్చుగా ఉన్న మూడు జిల్లాల (హైదరాబాద్, రంగారెడ్డి, మెదక్) పరిధిలోనే ఉన్నాయి. అసమానాభివృద్ధి వల్లనే తలెత్తిన ఉద్యమం విజయం సాధించి అధికారానికి వచ్చిన తర్వాత ఆ అసమానాభివృద్ధినే కొనసాగించడం చారిత్రక విషాదం.

నిజానికి తెలంగాణ ఉద్యమమైనా, ఉద్యమ పార్టీగా తెలంగాణ రాష్ట్ర సమితి అయినా ఆకాంక్షించినది ప్రభుత్వ పత్రాలలోనే చెప్పినట్టుగా 'విచ్ఛిన్నమైన తెలంగాణ తిరిగి తన కాళ్లమీద తాను నిలబడడానికి అవసరమైన శాశ్వత ప్రాతిపదికలను నిర్మించడం.' అంటే తెలంగాణ వ్యవసాయాన్ని పునరుద్ధరించి గ్రామీణ సంక్షోభాన్ని తగ్గించడం. తెలంగాణ వనరుల ఫలితం తెలంగాణ ప్రజలకు అందేలా తెలంగాణ పారిశ్రామిక రంగాన్ని పునర్నిర్మించడం. అదనపు జనాభాకు ఉపాధి కల్పించేలా, రాష్ట్ర ఆర్థిక వ్యవస్థను బలోపేతం చేసేలా సేవారంగాన్ని అభివృద్ధి చేయడం. ఆ మూడు రంగాల మధ్య సమతౌల్యాన్ని పాటిస్తూ సుస్థిర సామాజిక ఆర్థిక వికాసానికి అవకాశాలు కల్పించడం. ఇవన్నీ ఒక్కరోజులో మంత్ర దండంతో అయిపోయే పనులు కాదు. ఆరు దశాబ్దాల చీకటి నీడలు, ఆంధ్రప్రదేశ్ పునర్వ్యవస్థీకరణ చట్టం

లొసుగులు, పొంచికూచున్న పాత పాలకవర్గాలు ఈ పనులకు అవరోధాలుగా ఉన్నమాట కూడ నిజమే. కాని సుదీర్ఘకాలంలో జరగవలసిన ఆ శాశ్వత కర్తవ్యం దిశగా తొలి అడుగులనైనా, అంగుళాలనైనా ఈ బడ్జెట్ సాధించిందా అనేది ప్రశ్న.

తెలంగాణలో వ్యవసాయాభివృద్ధి సాధించాలంటే తక్షణ, మధ్యంతర, దీర్ఘకాలిక కర్తవ్యాలు ఎన్నో ఉన్నాయి. ఇందులో గతకాలపు అవశేషాల అవరోధాలను తొలగించడానికి అవసరమైనవీ ఉన్నాయి, కొత్త అవకాశాలు కల్పించవలసినవీ ఉన్నాయి. తెలంగాణలో వ్యవసాయపు స్థితిని గణాంకాలలో చెప్పాలంటే మొత్తం విస్తీర్ణం 2,83,77,582 ఎకరాలలో (1,14,84,000 హెక్టార్లు) ఆరు దశాబ్దాల అభివృద్ధి తర్వాత ఇవాళ్టికీ నికర సాగుభూమి 43.2 శాతం మాత్రమే. అంటే రెండు కోట్ల ఎనభై నాలుగు లక్షల ఎకరాల భూమిలో ఇవాళ్టికీ నికరంగా సాగవుతున్నది ఒక కోటీ ఇరవై రెండు లక్షల ఎకరాలు మాత్రమే. ఆదర్శప్రాయంగా 33 శాతం అడవులు ఉండాలని ఎంత చెప్పుకున్నప్పటికీ ఉన్న అడవులు 23.89 శాతం మాత్రమే (మరొక ఆధారం ప్రకారం 25.16 శాతం). వ్యవసాయేతర వినియోగంలో ఉన్న 7.8 శాతం భూములను, సాగుకు లాయకు కాని 5.36 శాతం బంజరు భూములను వదిలేసినా, తాత్కాలిక బీడు భూములు, సాగుకు లాయకైన బీడు భూములు, పచ్చిక బయళ్లు మొదలైన పేర్ల కింద ఇంకా సాగులోకి తేదగిన నికర భూమి కనీసం ఇరవై శాతం, అంటే యాభై లక్షల ఎకరాలయినా, ఉంటుంది.

అసలు ఈ నికరభూమి అనే గణాంకం ఒక పంట అనే ప్రాతిపదికపై తయారవుతుంది. రెండు లేదా మూడు పంటలకు అవకాశం ఇచ్చేలా రక్షిత నీటి పారుదల సౌకర్యం కలిగిస్తే ఈ విస్తీర్ణం రెట్టింపో, మూడు రెట్లో అవుతుంది. ఇంతకూ ఉమ్మడి రాష్ట్రంలో తెలంగాణలో నీటి పారుదల సౌకర్యం అందిన భూమి మొత్తం నికర సాగుభూమిలో సగానికన్న తక్కువ. అందులో మళ్లీ ప్రభుత్వ వ్యయంతో కాలువల ద్వారా నీరు అందినది మొత్తం నీటి పారుదల సౌకర్యాలు ఉన్న భూమిలో 12.67 శాతం. మరొక పది శాతం భూమి చెరువుల కింద ఉండగా ఆ చెరువుల పట్ల గత ప్రభుత్వాలు భయంకరమైన నిర్లక్ష్యం ప్రదర్శించాయి. నీటి సౌకర్యం కల్పించడంతో పాటు, పాత రుణాలను మాఫీ చేయడం, రుణ చెల్లింపులను వాయిదా వేయడం, విద్యుత్తు, విత్తనాలు, ఎరువులు, పురుగుల మందులు, రుణ, పరపతి, బీమా సౌకర్యాలు, మార్కెటింగ్, గిట్టుబాటు ధర, గిడ్డంగులు కల్పించడం, మధ్య దళారీలను రద్దు చేయడం, పశుగణాభివృద్ధి, వ్యవసాయాధార పరిశ్రమల కల్పన, వ్యవసాయానుబంధ రంగాల విస్తరణ, శాస్త్ర సాంకేతిక నైపుణ్యం విస్తరణ వంటి అనేక చర్యలు సమతూకంతో అమలయినప్పుడు మాత్రమే వ్యవసాయాభివృద్ధికి అవకాశం దొరుకుతుంది. వ్యవసాయరంగ సంక్షోభాన్ని, వలసలను, ఆత్మహత్యలను నిరోధించడం సాధ్యమవుతుంది. వ్యవసాయ, గ్రామీణ రంగాలలో ఉపాధిని పెంచడం, ఉన్న ఉపాధిని స్థిరీకరించడం వీలవుతుంది.

కాగా, ఈ చర్యలన్నిటితో పాటు, వీటికన్న ముఖ్యంగా, జరపవలసిన వ్యవస్థాగత భూసంస్కరణల కార్యక్రమం ఉంది. దున్నేవారికే భూమి నినాదంతో దేశంలోకెల్లా చరిత్రాత్మకమైన రైతాంగ పోరాటం జరిపిన నేల తెలంగాణ. అందుకే ఆ కాలంలో ప్రజలు తమంతట తామే చేసుకున్న భూపంపకంతో పాటు, ఆ తర్వాత సైనిక–పౌరపాలనా ప్రభుత్వాలు, చివరికి ఎన్నికల ద్వారా అధికారంలోకి వచ్చి మూడు సంవత్సరాలు మాత్రమే పాలించగలిగిన బూర్గుల రామకృష్ణారావు ప్రభుత్వమూ కూడ సర్ఫెఖాస్ రద్దు, జాగీర్దారీ రద్దు, కౌలుదారీ రక్షణ వంటి భూసంస్కరణల చట్టాలను తీసుకువచ్చాయి. ఆ తర్వాత ఇరవై సంవత్సరాలకు పివి నరసింహారావు ప్రభుత్వం గరిష్ఠ భూపరిమితి చట్టాన్ని తీసుకువచ్చింది. అయినా ఆరు దశాబ్దాల తర్వాత కూడ తెలంగాణలో భూసంస్కరణల కార్యక్రమం అసంపూర్తిగానే మిగిలిపోయింది. ఈ లోగా ఆరు దశాబ్దాల ఉమ్మడి రాష్ట్రంలో అక్రమ భూఆక్రమణలు విపరీతంగా జరిగి పెరిగిపోయాయి. ఈ నేపథ్యంలో విస్తృతమైన భూసంస్కరణలు, అంటే భూసంబంధాలలో మార్పులు తెచ్చి, అనుపస్థిత భూస్వామ్యాన్ని రద్దు చేసి, వ్యవసాయం మీద నిజంగా ఆసక్తి ఉన్నవారికే భూమి అప్పగించే మౌలిక వ్యవస్థాగత భూసంస్కరణలు, అమలయ్యేదాకా సమగ్ర, సంపూర్ణ వ్యవసాయాభివృద్ధికి అవకాశం లేదు.

ఈ విశాల కార్యక్రమంలో పంటరుణాల మాఫీ, వ్యవసాయ ఉత్పాదకాల సబ్సిడీ బకాయిల చెల్లింపు, మార్కెటింగ్ స్థిరీకరణ నిధి, సాంకేతిక పరిజ్ఞాన సహాయం, బిందు సేద్యం, కోళ్ల పెంపకం, పాడి పరిశ్రమ, చేపల పెంపకం వంటి తక్షణ, తాత్కాలిక కార్యక్రమాలు, చెరువుల పునరుద్ధరణ వంటి మధ్యంతర కార్యక్రమాలు, దళిత మహిళలకు మూడు ఎకరాల చొప్పున భూపంపిణీ, కొన్ని భారీ నీటిపారుదల పథకాల వంటి మధ్యంతర, దీర్ఘకాలిక కార్యక్రమాలు మినహా మిగిలిన అంశాలు బడ్జెట్ లో లేవు. ఆ అంశాలు పరిగణనలో ఉన్నాయనే సూచన కూడలేదు.

ప్రకటించిన కార్యక్రమాలలో కూడ చిత్తశుద్ధిని అనుమానించడానికి ఆస్కారం ఇచ్చే చర్యలు ఆ తర్వాత జరుగుతున్నాయి. ఉదాహరణకు చాల ఆహ్వానించదగిన చెరువుల పునరుద్ధరణ కార్యక్రమ ప్రకటనతో పాటే, అంతకన్న మిన్నగా ఆ చెరువులకు నీరు అందించే ఆరగాణి ప్రాంతంలో వాగులనూ వంకలనూ అడ్డుకునే నిర్మాణాలు, ఆ వాగులకూ వంకలకూ ఆధారమైన కొండలు పిండి కొట్టే పనులు, పథకాలు శరవేగంగా సాగిపోతున్నాయి. ఆ చెరువుల పునరుద్ధరణ, చెరువుల పూడికతీత పనులు కూడ మానవశ్రమతో జరపబోమని, యంత్రాలతో జరుపుతామని అంటున్నారంటే, కేటాయించిన నిధులలో అధికభాగం పొక్లెయిన్లు, జెసిబిలు వంటి తవ్వుడు యంత్రాల యజమానులకు, లేదా ఇప్పటికిప్పుడు ఆ యంత్రాలు కొనుక్కునే రాజకీయ నాయకులకు, కంట్రాక్టర్లకు అందుతాయన్నమాట. కనుక తెలంగాణ ప్రజల ఆకాంక్షలను నెరవేర్చే ప్రజానుకూల చర్యలు ఏవైనా ఉన్నాయనుకున్నా అవి ఎలా అమలులోకి వస్తాయో అనుమానమే.

ఈ ప్రభుత్వ అనాలోచిత, భ్రమాజనిత ప్రతిపాదనలకు మరొక ఉదాహరణ ఇవ్వాలంటే అటవీ విస్తీర్ణం పెంచడానికి ప్రభుత్వం చేస్తున్న సూచనను చూడాలి. పర్యావరణానికీ, వర్షపాతానికీ, భూగర్భ జలాలకూ, నదీ ప్రవాహాలకూ, వ్యవసాయానికీ అత్యవసరమైనది అడవుల విస్తీర్ణం పెరగడం. తప్పనిసరిగా అడవుల విస్తీర్ణం పెరగవలసిందే. ఉద్దేశపూర్వకంగా పెంచవలసిందే. కాని అటవీ విస్తీర్ణాన్ని ప్రస్తుతం ఉన్న 25.16 శాతం (సోషియో ఎకనమిక్ ఔట్‌లుక్ ఒకచోట ఈ అంకె ఇచ్చి, మరొకచోట 23.89 శాతం అనే అంకె కూడ ఇస్తుంది!) నుంచి 33 శాతానికి పెంచుతానని ప్రభుత్వం ప్రకటించింది. ఈ లక్ష్యం సాధించాలంటే దాదాపు 22 లక్షల ఎకరాల కొత్త అడవులు తయారు కావాలి. ఇది ఎంత అసాధ్యమో, హాస్యాస్పదమో ఎవరైనా ఊహించగలరు.

ఇక పారిశ్రామికాభివృద్ధి విషయానికి వస్తే, ప్రభుత్వం బడ్జెట్ కేటాయింపుల ద్వారా చేయవలసిందీ, చేయగలిగిందీ చాల ఉంది. ఉద్యోగ కల్పనకు అనువుగా పారిశ్రామికీకరణ జరగాలనీ, తెలంగాణ వనరులను తెలంగాణేతరులు దోచుకోవడానికి వీలుగా పారిశ్రామికీకరణ ఉండగూడదనీ డిమాండ్లు తెలంగాణ రాష్ట్ర సాధన ఉద్యమంలో

# తొలి బడ్జెట్‌లో వ్యవసాయానికి మొండి చెయ్యి

***బడ్జెట్ ప్రవేశపెట్టే విధానంలో గానీ, రూపకల్పనలో గానీ టిఆర్ఎస్ ప్రభుత్వానికీ, గత ప్రభుత్వాలకూ తేడా ఏమీ లేదనడానికి తెలంగాణలో కొనసాగుతున్న రైతుల ఆత్మహత్యలే నిదర్శనం అని అంటున్నారు** **ఆశాలత***

తెలంగాణ రాష్ట్ర ముఖ్యమంతి కె.చంద్రశేఖర రావు, వ్యవసాయ మంత్రి పోచారం శ్రీనివాస రెడ్డి 'మాది రైతు పక్షపాత ప్రభుత్వం, మేం రైతు బిడ్డలం' అని చెప్పుకోని రోజు లేదు. కాని ఆ రైతు బిడ్డలు వ్యవసాయ రంగంలో నెలకొన్న సంక్షోభాన్నీ, ఆగకుండా కొనసాగుతున్న రైతు ఆత్మహత్యలనూ గుర్తించడానికి సిద్ధంగా లేరు. తెలంగాణ రాష్ట్ర తొలి బడ్జెట్‌లో ఆ నిర్లక్ష్య వైఖరే మరోసారి వెల్లడైంది. రైతు ఆత్మహత్యల పరంపర సాగుతున్న తరుణంలో ప్రవేశపెట్టిన ఈ బడ్జెట్ రైతులలో ఎటువంటి విశ్వాసాన్ని భరోసాను కల్పించలేకపోయింది.

వ్యవసాయ రంగం, రాష్ట్ర జనాభాలో 60 శాతం ప్రజలు ఆధారపడి బతుకుతున్న ప్రాథమిక జీవనోపాధి రంగం, మొత్తం గృహ ఉత్పత్తిలో 14 శాతం వరకు అందిస్తున్న రంగం. ఈ రంగం పట్ల గత రెండు దశాబ్దాలకు పైగా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు కనబరుస్తూ వచ్చిన నిర్లక్ష్యం వెనుక నూతన ఆర్థిక సంస్కరణలు, నయ ఉదారవాద విధానాలు ఉన్నాయి. వ్యవసాయం రాష్ట్ర విషయం అయినప్పటికీ ఆయా రాష్ట్ర ప్రభుత్వాలు (కాంగ్రెస్, టిడిపి రెండూ) ఎటువంటి చొరవ చూపకుండా అదే విధానాలను కొనసాగిస్తూ రైతులను సంక్షోభంలో పడేశాయి. వ్యవసాయ రంగానికి పెట్టుబడులను తగ్గించేసి, రైతులకు అందవలసిన సబ్సిడీలు, సేవలు, మౌలిక సదుపాయాలు అందకుండా చేసి రైతులను ప్రైవేట్ కంపెనీల దయాదాక్షిణ్యానికి వదిలేశాయి. దీర్ఘకాలం పాటు ప్రత్యేక రాష్ట్రం కోసం పోరాటం సాగించి అధికారంలోకి వచ్చిన తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం కూడా వాటికి ఏమాత్రం భిన్నం కాదని ఈ తొలి బడ్జెట్‌తో తేలిపోయింది.

తెలంగాణ రాష్ట్రానికి ప్రవేశపెట్టిన లక్షకోట్ల తొలి బడ్జెట్‌లో వ్యవసాయం, ఉద్యానవన శాఖలకు కేటాయించింది రు. 7099.13 కోట్లు. అందులో ప్రణాళికేతర వ్యయం రు. 4772.95 కోట్లు. దానిలో సింహభాగం అంటే రు. 4250 కోట్లు రుణమాఫీ కోసం కేటాయించారు. ఇక వ్యవసాయానికి కేటాయించిన ప్రణాళికా వ్యయం (నేరుగా రైతులకు అందే పథకాలకు) 1828 కోట్లు మాత్రమే, అందులోనూ రు. 765.55 కోట్లు కేంద్ర ప్రభుత్వం మంజూరు చేసినదే. ఈ బడ్జెట్‌లో ఉద్యానవన శాఖకు రు. 502.75 కోట్లు కేటాయించి పెద్దపీట వేశారు. అందులో రు. 250 కోట్లు గ్రీన్ హౌస్/ పాలిహౌస్ సేద్యానికి, మరో 200 కోట్లు బిందు, తుంపర్ల సేద్యానికి ప్రకటించారు. ఇవి రెండూ కూడా ప్రస్తుత సమస్యలను తక్షణం పరిష్కరించడానికి సహాయపడేవి ఎంత మాత్రం కాదు. ప్రభుత్వ అనుబంధ సంస్థగా ఉన్న విజయ డెయిరీకి పాలు అమ్మే రైతులకు లీటరుకు 4 రూపాయల చొప్పున పెంచుతూ 16 .30 కోట్లు కేటాయించగా పౌల్ట్రీ రంగానికి ఊహించని విధంగా 20 కోట్లు కేటాయించారు. పౌల్ట్రీ రంగానికి జరిగిన కేటాయింపులు భారీ స్థాయిలో పౌల్ట్రీ ఫారాలను నిర్వహించే వేళ్ల మీద లెక్కించదగ్గ కంపెనీలకే లభిస్తాయి కాని వాటి నుండి ఉప కాంట్రాక్ట్ తీసుకుని నడిపే చిన్న పౌల్ట్రీ రైతులకు నేరుగా ప్రయోజనం చేకూర్చవు.

రుణమాఫీ వ్యవసాయ సమస్యలకు పరిష్కారం కాదనీ, దాని వల్ల లాభపడేది వాస్తవ సాగుదారులలో 30 శాతం మాత్రమేననీ గతంలో అనేక విశ్లేషణలు చేసి ఉన్నాం. ఒకవేళ రుణమాఫీ చేసినట్లయితే కౌలు రైతుల రుణాలను, ఆత్మహత్య చేసుకున్న రైతు కుటుంబాల రుణాలను

---

ప్రధానమైనవి. ఆల్విన్, ఎచ్ఎంటి, రిపబ్లిక్ ఫోర్జ్, ప్రాగా టూల్స్, నిజాం షుగర్స్, ఎపి స్కూటర్స్, స్పాంజి ఐరన్, ఆజంజాహి మిల్స్, అంతర్గాం స్పిన్నింగ్ మిల్స్, సర్ సిల్క్, డిబిఆర్ మిల్స్, నేతాజీ స్పిన్నింగ్ మిల్స్ వంటి ప్రభుత్వ, సంయుక్త, ప్రైవేట్ రంగ పారిశ్రామిక సంస్థలు మూతపడడానికి గత ప్రభుత్వాల విధానాలు కారణమనీ, తద్వారా లక్షలాది మంది కార్మిక కుటుంబాలు వీథిన పడ్డాయనీ, తెలంగాణ రాష్ట్రం ఏర్పడగానే ఈ పరిశ్రమలను పునరుద్ధరించడం జరుగుతుందనీ ఉద్యమక్రమంలో తెరాస నాయకులు కూడ వందలాది వేదికల మీద వాగ్దానాలు చేశారు. ఇవాళ సోషియో ఎకనమిక్ ఔట్‌లుక్‌లో గాని, బడ్జెట్‌లో గాని మూతబడిన పరిశ్రమల పునరుద్ధరణ మాటమాత్రంగా కూడ లేదు. బహుళ జాతి సంస్థలకు, చివరికి 'ఆంధ్ర పెట్టుబడిదారులకు' కూడ ఎర్ర తివాచీ పరుస్తానని ముఖ్యమంత్రి స్వయంగా ప్రకటించారు. దేశదేశాల పెట్టుబడిదారులకు సింగిల్ విండో సౌకర్యాలు కల్పించడం, విద్యుత్తు, నీరు, మౌలిక సాధనా సంపత్తి, పన్నుల మినహాయింపు, రాయితీలు వంటి చంద్రబాబు నాయుడు ప్రభుత్వ విధానాలలో ప్రధానమైనవన్నీ ఇవాళ అంతకన్న తీవ్రంగా ముందుకొస్తున్నాయి.

బడ్జెట్‌లో ఒక్కటంటే ఒక్క ప్రభుత్వ రంగ పారిశ్రామిక సంస్థ పునరుద్ధరణ గురించి, కొత్తగా స్థాపించడం గురించి మాట మాత్రం లేదు.

కొన్ని వర్గాలకు, బృందాలకు రాయితీలు కల్పించడం, ఆ రాయితీలకోసం కేటాయింపులు చేయడం, సామాజిక ప్రయోజనాల స్థానంలో వ్యక్తిగత ప్రయోజనాలు కల్పించడానికి కేటాయింపులు చేయడం, సాంస్కృతిక అస్తిత్వాన్ని ఎత్తిపట్టే కేటాయింపులు చేసి ప్రజాసమస్యల వైపునుంచి దృష్టి మళ్లించడం కొత్త ప్రభుత్వం చేపట్టవలసిన కొత్త విధానాలేమీ కావు, గత ప్రభుత్వాలన్నీ చేస్తూ వస్తున్న పనులు అవే. నీళ్ళు, నిధులు, నియామకాలు అనే నిర్దిష్టమైన ఆకాంక్షలతో, పరాయి పాలనలో చితికిపోయిన బతుకులు చిగురించడానికి స్వపరిపాలన ఉపయోగపడుతుందనే విశ్వాసంతో ఉద్యమంలో విస్తృతంగా పాల్గొన్న ప్రజలకు గోరంత ఆశ, కొండంత నిరాశ కల్పిస్తున్నదీ బడ్జెట్. ఆ గోరంతను కొండంతగా మాయ చేయడం ఉద్యమ జ్ఞాపకాలు ఇంకా చెరగని ప్రస్తుత సమయంలో సాధ్యం కావచ్చుగాని, ఎల్లకాలమూ సాగదు. ప్రజానుకూల పాలన మాయలతో సాధ్యం కాదు.

*(రచయిత వీక్షణం సంపాదకులు)* వీ

మాఫీ చేయాలని, వారి ప్రైవేట్ రుణాలను వ్యవస్థాగత రుణ పరిధిలోకి తీసుకురావాలని, అలా జరిగినప్పుడే వాస్తవ సాగుదారులకు, చిన్న సన్న కారు రైతులకు ఎంతో కొంత ప్రయోజనం చేకూరుతుందని కూడా సూచించారు. అంతే కాకుండా ఎన్నికల సమయంలో ఓట్లు పొందడం కోసం చేసే జనాకర్షక హామీలైన రుణమాఫీ వంటి పథకాలకు ఇచ్చే నిధులను వ్యవసాయ బడ్జెట్‌లో చేర్చకుండా మినహాయించాలని కూడా రైతుల పక్షాన పనిచేసే సంస్థలు గట్టిగా డిమాండ్ చేశాయి. కాని ఇటు వంటివేవి పరిగణనలోకి తీసుకోకుండా రుణమాఫీ కోసం బ్యాంకులకు కట్టిన మొత్తాన్ని వ్యవసాయ బడ్జెట్‌లో చేర్చి వ్యవసాయానికి ఇంతకు ముందు ఏ ప్రభుత్వం చేయనంత కేటాయింపు చేశామని ప్రభుత్వం చెప్పుకోవడం రైతాంగాన్ని మోసం చేయడమే తప్ప మరేమీ కాదు.

వ్యవసాయం గిట్టుబాటు కాక, అప్పుల ఊబిలో కూరుకుపోయి ప్రభుత్వం నుండి ఎటువంటి సహాయం అందక గత 19 ఏళ్లల్లో తెలంగాణ ప్రాంతంలో 26 వేల మంది రైతులు ఆత్మహత్య చేసుకున్నారు. ఈ నేపథ్యంలో రైతు, వ్యవసాయ కూలీ కుటుంబాలను సంక్షోభం నుండి బయటపడవేయాలంటే ప్రభుత్వం వ్యవసాయరంగంలో భారీగా పెట్టుబడులు పెట్టాలని, ఈ పెట్టుబడులు చిన్న సన్నకారు రైతు కుటుంబా లకు నికర ఆదాయాలను పెంచేవిగా, పర్యావరణాన్ని పరిరక్షించేవిగా, మొత్తం ప్రజలకు ఆహార భద్రతను చేకూర్చేవిగా ఉండాలని గత కొన్ని సంవత్సరాలుగా మేధావులు, శాస్త్రవేత్తలు, ఆర్థికవేత్తలు, రైతుల పక్షాన పనిచేసే సంస్థలు ప్రభుత్వాల దృష్టికి తీసుకురావడం జరుగుతున్నది. ఇందుకోసం వ్యవసాయ రంగానికి ప్రత్యేక బడ్జెట్‌ను ప్రవేశపెట్టాలనే డిమాండును కూడా బలంగా ముందుకు తీసుకొచ్చారు. 2013-14లలో ఉమ్మడి రాష్ట్ర ప్రభుత్వం ఈ ప్రతిపాదనకు అంగీకరించి, ముందు కొంత తప్పటడుగులు వేసినా తర్వాత ప్రత్యేక వ్యవసాయ బడ్జెట్‌ను ప్రవేశ పెట్టింది. అందులో చాలా అవకతవకలు ఉన్నప్పటికీ ఒక కొత్త సంప్రదాయం నెలకొన్నది.

ప్రత్యేక వ్యవసాయ బడ్జెట్ పేరుతో అప్పటికే సాధారణ బడ్జెట్‌లో వ్యవసాయం, దాని అనుబంధ రంగాలకు చేస్తున్న కేటాయింపులను ఒక దగ్గర చేర్చి ప్రవేశపెట్టడం ఎంత మాత్రం కాదు. ప్రస్తుత తెలంగాణ రాష్ట్ర బడ్జెట్‌లో జరిగింది అదే. వ్యవసాయ అనుబంధ రంగాలకు (పశు సవర్ధక శాఖ, మత్స్యశాఖతో కలిపి) మొత్తం వ్యయం 19,400 కోట్లుగా చూపించారు. ఇది పైకి చాలా పెద్ద మొత్తంగా (మొత్తం రాష్ట్ర బడ్జెట్‌లో 19.5 శాతంగా) కనిపిస్తుంది. నిజానికి రాష్ట్ర జనాభాలో వ్యవసాయ కుటుంబాల సంఖ్యను దృష్టిలో పెట్టుకుని, వారి అవసరాలను పరిగణన లోకి తీసుకుని బడ్జెట్ కేటాయింపులు భారీగా పెంచవలసి ఉంది. బడ్జెట్ కేటాయింపులు కొంత పెంచినా, ప్రస్తుత సంక్షుభిత వ్యవస్థను మార్చే విధంగా రైతాంగానికి నిజంగా అండగా నిలిచే కొత్త విధానం, కొత్త ఆలోచనలు చేయకుండా పాత పద్ధతిలోనే పథకాల రూపకల్పన అమలు జరిగితే పెద్ద ఫలితముండదు.

ఇది పెట్టుబడుల యుగమనీ, పెట్టుబడులను ఆకర్షించడం ద్వారానూ పారిశ్రామికీకరణ ద్వారానే అభివృద్ధి, ఉద్యోగ ఉపాధి కల్పన సాధ్యమని కెసిఆర్ ప్రభుత్వం గట్టిగా నమ్ముతున్నది. ఈ దిశలో తెలంగాణ నూతన పారిశ్రామిక బిల్లు రూపకల్పన కసరత్తు మొదలుపెట్టింది. వేలాది ఎకరాల వ్యవసాయ భూములను పరిశ్రమలకు ఇవ్వడానికి సంసిద్ధమవుతున్నది. నిజానికి గత ప్రభుత్వాలు అనుసరించిన విధానాల కారణంగా వ్యవసాయ రంగం నిర్లక్ష్యానికి గురవడం వల్లనే రైతులు, వారి పిల్లలు వ్యవసాయాన్ని వదిలి ఇతర రంగాలలో ఉపాధిని వెతుక్కుంటున్నారనీ, 60 శాతం జనాభాకు ఉపాధి కల్పిస్తున్న వ్యవసాయరంగాన్ని పటిష్ఠం చేయడానికి తెలంగాణకు ఒక ప్రత్యేక వ్యవసాయ విధానం రూపొందించాల్సిన అవసరం ఉందనీ ప్రభుత్వం గుర్తించడం లేదు.

తెలంగాణలో ప్రధానంగా సాగుతున్న వర్షాధారిత వ్యవసాయాన్ని పునరుజ్జీవింప చేయడానికి ప్రస్తుత వ్యవసాయ విధానాలు అనుకూలంగా లేవు. ఇక్కడ పండే చిరుధాన్యాలు, నూనెగింజలు, పప్పుధాన్యాలకు సరైన మద్దతు లభించకపోవడంతో రోజురోజుకూ వాటి విస్తీర్ణం తగ్గిపోతున్నది. విధిలేని పరిస్థితిలో రైతులు అనువుగాలేని భూములలో కూడా పత్తి పంట వేస్తున్నారు. పత్తిపంటలో అధిక పెట్టుబడుల వల్ల, దిగుబడి తగ్గడం వల్ల రైతులు ఆత్మహత్య చేసుకుంటున్నారు. దీనిని ఒక అత్యవసర పరిస్థితిగా గుర్తించి వర్షాధార ప్రాంతాలలో వ్యవసాయం నిలదొక్కుకోవడానికి సమగ్రమైన దూరదృష్టితో సుస్థిర వ్యవసాయ అభివృద్ధి కార్యక్రమాన్ని రూపొందించి పెద్దఎత్తున బడ్జెట్‌లో ప్రోత్సహించ వలసి ఉంది.

రైతులు చెమటోడ్చి పండిస్తున్న పంటకు కనీస గిట్టుబాటు ధర లభించడం సాగుదారు హక్కుగా గుర్తించాల్సి ఉంది. వ్యవసాయం లాభదాయకంగా ఉండాలంటే స్వామినాథన్ సిఫార్సుల మేరకు ఉత్పత్తి ఖర్చుపై 50 శాతం లాభంతో కనీస మద్దతు ధరలు ప్రకటించాలని చాలా కాలంగా రైతుల పక్షాన డిమాండు చేయడం జరుగుతున్నది. ఈ సిఫార్సులను అమలు చేస్తానని టిఆర్ఎస్ పార్టీ తన ఎన్నికల మేనిఫెస్టోలో ప్రకటించింది. కానీ అది అమలు జరగలేదు. పంటలకు కేంద్ర ప్రభుత్వం ప్రకటించిన కనీస మద్దతుధర ఉత్పత్తి ఖర్చు కంటే తక్కువగా ఉంటున్నది. రైతులు పండించిన పంటకు గిట్టుబాటు ధర అందాలంటే రాష్ట్ర ప్రభుత్వం మార్కెట్ ఇంటర్వెన్షన్ చర్యగా కనీస గిట్టుబాటు ధర చెల్లించి రైతుల నుండి కొనుగోలు చేయాలి, తద్వారా మార్కెట్లో ధరను పెంచి గిట్టుబాటు ధర లభించేటట్లు చేయాలి. రైతులకు మార్కెట్‌లో గానీ, సేకరణలో గానీ లభించే సగటు ధర, గిట్టుబాటు ధర కంటే తక్కువ ఉంటే ఆ తేడాను రాష్ట్ర ప్రభుత్వం ధర గ్యారెంటీ బోనస్ రూపంలో రైతులకు నేరుగా చెల్లించాలి. పంటల ధర ఉత్పత్తి ఖర్చు కంటే ఎంతో కొంత అధికంగా ఉన్నప్పుడే రైతులకు లాభకరంగా ఉంటుంది. కాబట్టి ఆరంభ దశగా కనీసం ఉత్పత్తి ఖర్చుపై 10 శాతం లాభానికి రాష్ట్ర ప్రభుత్వం హామీ ఇచ్చే విధంగా ధర గ్యారెంటీ బోనస్ ఇవ్వడం కోసం బడ్జెట్‌లో పెద్ద ఎత్తున కేటాయింపులు చేయవలసి ఉంది. కానీ ఈ బడ్జెట్‌లో కేవలం 400 కోట్ల రూపాయలను ధర స్థిరీకరణ నిధికి మాత్రమే కేటాయించి ప్రభుత్వం చేతులు దులుపుకుంది.

ఈ రోజున వాస్తవ సాగుదార్లుగా ఉన్న మహిళా రైతులకు, కౌలు రైతులకు, ఆదివాసి రైతులకు భూమి లేని వ్యవసాయ కూలీలకు, అత్యధిక శాతంగా ఉన్నా చిన్న సన్నకారు రైతులకు వ్యవసాయాన్ని లాభసాటిగా కొనసాగించడానికి ఈ బడ్జెట్ ఏమాత్రం హామీ కల్పించలేదు. వీరందరినీ సహకార సంఘాలుగా ఏర్పరచి విత్తనాలు తదితర ఉత్పాదకాలు, సంస్థాగత రుణాలు, సమాచారం, విస్తరణ, మార్కెటింగ్ వంటి అన్ని రకాల సేవలను ఒకే చోట అందించినట్లయితే రైతులు వ్యవసాయాన్ని తిరిగి తమ చేతులల్లోకి తెచ్చుకోవడానికి అవకాశం ఏర్పడేది. కాని ఆ వైపుగా ప్రభుత్వం ఆలోచించలేదు.

తెలంగాణ రాష్ట్రం ఏర్పడిన తర్వాత తొలి బడ్జెట్ ప్రవేశపెట్టినప్పుడు అందుకు ఒక కొత్త విధానం, ఒక కొత్త తాత్విక పునాది ఉండాల్సిన అవసరం ఉంది. మెజారిటీ రైతులను సంక్షోభం నుండి బయట పడేసే దూరదృష్టి అవసరం ఉంది. కాని ఈ ప్రభుత్వానికి, గత ప్రభుత్వాలకు విధానాలలో మౌలికమైన తేడా ఏమి లేదని స్పష్టమవుతున్నది.

*(రైతు స్వరాజ్య వేదిక కన్వీనర్)* వీ

# ఆంధ్రప్రదేశ్‌లో మెట్రో రైలు భవిష్యత్తు

*రాష్ట్ర విభజనలో భాగంగా వచ్చిన మెట్రో రైలు ప్రాజెక్టు నూతన రాజధానిలో అవసరం లేకున్నా కొంత మంది పాలక పెట్టుబడిదారులు తమ స్వార్థ ప్రయోజనాల కోసం ఈ ప్రాజెక్టుపై ఆసక్తి చూపుతున్నారని అంటున్నారు* **ముప్పాళ్ల భార్గవశ్రీ**

రెండు తెలుగు రాష్ట్రాలు ఏర్పడిన నాటి నుండీ ఆంధ్రప్రదేశ్‌లో అధికారంలోకి వచ్చిన టిడిపి ప్రభుత్వం అరచేతిలో వైకుంఠాన్ని చూపే పథకాల ప్రకటనలతో ప్రజలను మభ్యపెడుతోంది. సింగపూర్‌లా, అంతర్జాతీయ స్థాయి, సమగ్రాభివృద్ధి వీరికి ఊతపదాలుగా మారాయి. ఇలాంటిదే మెట్రో రైలు ప్రాజెక్ట్.

మెట్రో రైలంటే (ఒక నగరం లోపల ప్రజా రవాణాకు నిర్మించే రైలు) అర్థం కూడా తెలియని మంత్రులు చిలకలూరిపేట దగ్గర ఎడ్లపాడు నుండి గుంటూరు, విజయవాడల మీదుగా మచిలీపట్నం వరకు మెట్రో రైలు నిర్మిస్తామంటూ ప్రకటనలు చేశారు. ఢిల్లీ మెట్రో రైలు నిర్మాణానికి సారథ్యం వహించిన శ్రీధరన్‌కు దీనిని అప్పగించడంతో కాస్త వాస్తవాలు బయటకొచ్చాయి. మెట్రో రైలు నిర్మాణం అధిక ఖర్చుతో కూడుకున్నదనీ, నగరాల మధ్య నిర్మాణం సాధ్యం కాదనీ, కనుక విజయవాడకే పరిమితం చేశామనీ చెప్పాడు. మొదటి దశలో విజయవాడ బస్‌స్టాండ్ నుండి బందరు రోడ్డులోనూ, ఏలూరు రోడ్డులోనూ రెండు మార్గాలను నిర్మిస్తామనీ, దీనికి 5 వేల కోట్ల రూపాయలు ఖర్చు అవుతుందనీ, మొత్తం ప్రాజెక్ట్‌కు 8 వేల కోట్ల రూపాయల ఖర్చు అవుతుందని తెలిపాడు. దీని నిర్మాణానికి కిలోమీటర్‌కు రు.200 కోట్లు ఖర్చు అవుతుందని కూడా చెప్పారు.

ఇప్పుడు మెట్రో రైల్ ప్రాజెక్ట్‌ను ఏ విధంగా విజయవాడ నగరానికి మణిహారం అంటున్నారో 2007లో బిఆర్‌టిఎస్ (బస్ రాపిడ్ ట్రాన్స్‌పోర్టు సిస్టమ్)ను విజయవాడ నగరానికి వరం అని ప్రకటించారు. విజయవాడ నగర తొలి మేయర్ టి.వెంకటేశ్వరరావు ఈ ప్రాజెక్ట్‌కు తీవ్ర అభ్యంతరం తెలియజేసినా, నగర కౌన్సిల్ సమావేశం ఈ ప్రాజెక్ట్‌ను ఆపాలని ఏకగ్రీవంగా తీర్మానం చేసినా మాజీ ముఖ్యమంత్రి వై.ఎస్. జోక్యంతో జెఎన్‌యుఆర్‌ఎం పథకం కింద వచ్చే నిధులు ఆగిపోతాయన్న పేరుతో ఈ ప్రాజెక్ట్ అమలుకు పూనుకున్నారు. నాడా దొరికితే గుర్రాన్ని కొన్నట్లుగా తొలగించిన సత్యనారాయణపురం రైల్వేలైన్ మార్గం దొరికిందనే పేరుతో రు.152 కోట్ల ప్రాజెక్ట్‌ను చేపట్టారు. 15 కిలోమీటర్లు నిర్మించే ఈ ప్రాజెక్ట్‌లో కేవలం 3.5 కి.మీ. (సత్యనారాయణపురం పాత రైల్వేమార్గం) మాత్రమే డెడికేటెడ్ కారిడార్ నిర్మించడం వల్ల ఇప్పుడు నగరంలో తిరుగుతున్నవి పేరుకు బిఆర్‌టిఎస్ బస్సులే కాని నగర ప్రయాణికులకు ఏ మాత్రం ప్రయోజనకరంగా లేదన్నది నగ్న సత్యం. అంతేకాక ఏలూరు రోడ్డులో మిక్స్‌డ్ ట్రాఫిక్ వలన సెంట్రల్ డివైడర్ కూడా నిర్మించనందున గత సంవత్సరం రామవరప్పాడు రింగ్ బస్టాప్ వద్ద కారు ప్రమాదంలో నలుగురు చనిపోయారు. ఇప్పటికీ ఆ రోడ్డులో ప్రయాణం భయానకంగానే ఉంది.

ఇప్పుడు విజయవాడ నగరం రాజధాని అయిన తరువాత ప్రజా రవాణాను అభివృద్ధి పరచాలనే పేరుతో మెట్రో రైల్వేలైన్ పథకాన్ని తీసుకురావాలని రాష్ట్ర ప్రభుత్వం నిర్ణయించడంతో బిఆర్‌టిఎస్ పథకం ప్రశ్నార్థకంగా మారిపోయింది. మెట్రోరైల్ పథకంలో మొదటి దశలో నిర్ణయించిన రెండు కారిడార్లు (ఏలూరు, బందర్ రోడ్లు) కూడా బిఆర్‌టిఎస్ కారిడార్‌ల గుండా వెళ్లాల్సి రావడంతో బిఆర్‌టిఎస్ ప్రాజెక్ట్‌ను ఒదులుకోవాలని నిర్ణయించుకొన్నట్లు నవంబర్ 2న విజయవాడ కార్పొరేషన్ అధికారులు ప్రకటించారు. బిఆర్‌టిఎస్‌కు ముద్దుగా పెట్టుకొన్న సుగమ్యం చివరికి గమ్యం లేకుండా పోయింది. ప్రపంచ బ్యాంక్ రూపొందించిన పథకాలకు ఎటువంటి దుర్గతి పడుతుందో ఈ ఉదంతం అద్దం పడుతుంది.

ఇప్పుడు ఎదురయ్యే ప్రశ్న ఏమంటే ఇంత ఖర్చుతో నిర్మించే ఈ మెట్రో రైలు ప్రస్తుత ప్రజల రవాణా అవసరాలనూ, రాజధానిగా రాబోయే అవసరాలనూ తీర్చగలుగుతుందా? కి.మీ కనీసం రెండు రూపాయల ఛార్జీ లెక్కన ఇది ప్రజలకు అందుబాటులో ఉంటుందా? కనీసం నిర్వహణ ఖర్చులన్నా తిరిగి తెస్తుందా? ఇంతకన్నా మెరుగైన ప్రజారవాణా వ్యవస్థను నిర్మించలేమా? అంటే నిర్మించవచ్చుననే చెప్పవచ్చు. కేంద్ర పట్టణాభివృద్ధి శాఖ అక్టోబర్ 7న ప్రజలకు మెరుగైన సేవలు అందించేందుకు ప్రత్యేక ప్రజా రవాణా పార్కింగ్ విధానం రూపొందించాలని, ఈ విధానంతో మెట్రోరైల్ ఖర్చుతో పోలిస్తే అందులో కేవలం 5 శాతం నిధులతో వేగవంతమైన ప్రజా రవాణా (బస్సు) సౌకర్యం కల్పించవచ్చని, వ్యక్తిగత వాహనాల వినియోగాన్ని తగ్గిస్తూ నగరాల్లో ట్రాఫిక్ సమస్యను అరికట్టేందుకు ఈ విధానాన్ని అమలు చేయాలని, దీనికి అనుగుణంగా నగర అభివృద్ధి ప్రణాళికల్లో మార్పులు చేయాలని తెలంగాణ, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాల పురపాలక శాఖలకు కేంద్ర పట్టణాభివృద్ధిశాఖ లేఖలు కూడా పంపింది.

ట్రాఫిక్, ఇరుకైన రోడ్లతో వ్యక్తిగత వాహనాల వినియోగం నానాటికీ పెరుగుతోంది. మరోవైపు ప్రజలు నగర బస్సుల కన్నా వేగంగా ప్రయాణించే మెట్రోరైల్ సౌకర్యం కోసం ఎదురుచూసే పరిస్థితులు కల్పిస్తున్నారు. ప్రజారవాణా కోసం నగరాలు, మున్సిపాలిటీల్లో వ్యక్తిగత వాహనాల పార్కింగ్ విధానానికి అనుగుణంగా ప్రజా రవాణా పార్కింగ్ విధానం ఉండేలా ప్రత్యేక బస్సు బేలు, పార్కింగ్ స్థలాలు, తగినన్ని బస్సుస్టేషన్ల నిర్మాణాలు, చేపట్టేలా చర్యలు తీసుకోవాలి. షాపింగ్ మాల్స్, పాఠశాలలు, కళాశాలల దగ్గర, నివాస కాలనీలు, టౌన్‌షిప్‌ల దగ్గరలో బస్ బేలు ఏర్పాటు చేయడం ద్వారా ప్రజారవాణాను మరింతగా అభివృద్ధి చేయవచ్చు. ఈ విధంగా చేసినప్పుడు ప్రయాణికులు మెట్రోరైల్ కోసం ఎదురుచూడరు.

అలానే విజయవాడ చుట్టుపక్కల నగరాలను, పట్టణాలను కలుపుతూ (విజయవాడ-గుంటూరు-తెనాలి) ప్రజారవాణాను అభివృద్ధి చేసే విధంగా సర్క్యులర్ రైళ్లు నడపాలన్న డిమాండ్ చాలా కాలంగా ఈ

ప్రాంత ప్రజల నుండి వస్తున్నది. పట్టణాభివృద్ధి సంస్థలు ప్రజా రవాణా వ్యవస్థను అభివృద్ధి పరిచే ఈ ప్రతిపాదనను అమలు చేయడానికి నిర్దిష్ట చర్యలు తీసుకోవడం అవసరం.

మొదటగా ఒక ప్రత్యామ్నాయాన్ని ప్రతిపాదించి, మెట్రో రైలుతో దానిని పోల్చి చూద్దాం. విజయవాడ-గుంటూరు-తెనాలి పట్టణాల మధ్య సర్క్యులర్ రైలు నడపాలన్న డిమాండు చాలాకాలంగా ప్రజలనుండి వస్తోంది. దీని ఆధారంగానే ప్రతిపాదనను పరిశీలించడం అవసరం.

విజయవాడ-గుంటూరు, గుంటూరు-తెనాలి, తెనాలి-విజయవాడ మధ్యనున్న ప్రస్తుత రైల్వేమార్గానికి అదనంగా మరో రెండు రైల్వేలైన్‌లు నిర్మాణం చేయాలి. గుంటూరులో ఈ రైల్వేమార్గం రెడ్డిపాలెం స్టేషన్ నుండి జెకెసి కాలేజీ వెనుకగా, కొత్త పతాభిపురం లోంచి గుంటూరు రైల్వేస్టేషన్‌కు చేరుతుంది. ఇక్కడి నుండి మామూలు మార్గంలో తెనాలి వెళుతుంది. తెనాలి రైల్వేస్టేషన్ నుండి రేపల్లె వెళ్లే మార్గంలో వెళ్లి చినరావూరు నుండి తెనాలిని వెలుపల నుండి చుట్టివచ్చి తెనాలి బస్ స్టాండు మీదుగా విజయవాడ వెళ్లే రైల్వేలైన్‌తో కలుస్తుంది. విజయవాడ రైల్వేస్టేషన్ నుండి గతంలోని సత్యనారాయణపురం రైల్వేలైన్ మీదుగా రామవరప్పాడు రింగు, బెంజి సర్కిల్, స్క్రూల్ బ్రిడ్జి నుండి ప్రస్తుత జాతీయ రహదారి పక్కగా బస్‌స్టాండు వద్ద రైల్వేలైన్‌లో కలుస్తుంది.

ఈ ప్రతిపాదన ప్రకారం ఈ రైల్వేలైన్ పొడవు దాదాపు 150 కి.మీ. ఉంటుంది. ప్రస్తుత రైల్వేభూమిలోనే నిర్మాణం జరుగుతుంది. విజయవాడ నగరంలో ప్రభుత్వ శాఖల భూమే వాడుకోవచ్చు. గుంటూరులో రెడ్డిపాలెం నుండి కొత్త పట్టాభిపురం వరకూ, తెనాలిలో కొంత భూమి, మొత్తం 30-35 కి.మీ పొడవునా సేకరించాల్సి వస్తుంది. ఇది అసాధ్యం కాదు. చెన్నై, కలకత్తా జాతీయ రహదారిని విజయవాడ బయటగా నిర్మాణం చేపట్టారు. కనుక రైల్వేలైన్ నిర్మించినా రింగురోడ్డులో నగర రోడ్డు రవాణాకు ఆటంకం ఉండదు. కొన్ని రోడ్డు ఓవర్ బ్రిడ్జిల నిర్మాణం చేయాల్సి ఉంటుంది. ఇక రాజధానిగా ఔటర్ రింగురోడ్డు నిర్మాణం జరుగుతుంది గనుక 9వ నంబరు జాతీయ రహదారి కూడా నగరం బయట నుండి వెళుతుంది.

150 కి.మీ. పొడవున రెండు లైన్ల నిర్మాణమంటే మొత్తం 300 కి.మీ రైల్వేలైన్ నిర్మించాలి. దీనికి కిలో మీటరుకు రు.10 కోట్ల చొప్పున రు. 3000 కోట్లు అవుతుంది. భూసేకరణ, ఓవర్ బ్రిడ్జిల నిర్మాణానికి మరో కి.మీకు ఐదు కోట్లు కలిపినా రు. 4,500 కోట్లు అవుతుంది. అంటే విజయవాడ మెట్రో మొదటి దశ కంటే 500 కోట్లు తక్కువ.

రైల్వేశాఖ తానే ఈ లైన్ల నిర్మాణానికి పూనుకోదు. రాష్ట్రాలు అడిగిన కొత్త రైల్వేలైన్‌ల నిర్మాణ ఖర్చులో సగం రాష్ట్రాలు భరిస్తే నిర్మించడానికీ, నిర్వహించడానికీ సిద్ధమవుతున్నది. మెట్రో ప్రాజెక్టకయ్యే ఖర్చునంతా కేంద్రం భరిస్తుందని చెపుతున్నారు కనుక దానిని రైల్వేశాఖకే అందజేస్తే అది నిర్మించి నిర్వహిస్తుందనడంలో సందేహం లేదు. నిధులున్నాయి గనుక నిర్మాణం త్వరితంగానే సాగుతుంది. అవసరమైన సాంకేతిక పరిజ్ఞానమంతా మన రైల్వేలకు ఉంది. మెట్రోలాగా విదేశీ పరిజ్ఞానమూ, దిగుమతులూ అవసరముండదు.

25-35 రూపాయల రేటుతో ఈ మూడు నగరాల మధ్య ఆర్‌టిసి నాన్‌స్టాప్ బస్సులను నడుపుతోంది. గుంటూరు-విజయవాడల మధ్య 5 నిమిషాలకొకటి చొప్పున, గుంటూరు-తెనాలి, తెనాలి-విజయవాడ మధ్య పావు గంటకొకటి చొప్పున ఈ బస్‌లు నడుస్తున్నాయి. ప్రతిపాదిత రైల్వేలైన్ నిర్మాణం జరిగితే ఈ ప్రయాణ ఖర్చు రు. 10 తగ్గడమే కాక, నగరాలలోకి కూడా ప్రయాణించవచ్చు. కనుక నిర్మాణం పూర్తయిన మరునాటి నుండే ఈ మార్గానికి తగినంత ప్రయాణీకులుంటారు. ఇది ఆర్థికంగా లాభదాయకంగా ఉండడమే కాకుండా, దీర్ఘకాలంలో జరిగే డీజిల్ ఆదా, వాయు కాలుష్యం తగ్గి లాభాలు చాలా ఎక్కువగా ఉంటాయి.

ఇక రాజధాని నిర్మాణం జరిగితే, పెరిగే జనాభా రాజధాని చుట్టూనే కేంద్రీకరింపబడకుండా 150 కి.మీ రైల్వేలైన్ చుట్టూ నివాస ప్రాంతాలు విస్తరిస్తాయి. అందువల్ల పౌరసేవలకు అవసరమైన మౌలిక నిర్మాణాలు సాధ్యమవుతాయి. దీనికి తగిన మాస్టర్‌ప్లాన్‌ను ముందుగా రూపొందించు కుంటే, రాజధాని నిర్మాణానికయ్యే ఖర్చు కూడా తగ్గుతుంది.

ఇక మెట్రో ప్రాజెక్టుకు అనేది విజయవాడకే పరిమితం. రాజధానికి ప్రజా రవాణా అవసరాలను ఇది తీర్చదు. రైల్వేస్టేషన్, బస్‌స్టాండ్‌లలో దిగిన వారికి, నివాస ప్రాంతాలకు వెళ్లే అవసరాన్నే తీరుస్తుంది అదీ పాక్షికంగానే మెట్రో స్టేషన్‌లో దిగి, నివాస ప్రాంతం చేరేందుకు మళ్లీ ఆటో వెతుక్కోవాలి. అలాగే అధిక జనసాంద్రతగల వన్‌టౌన్, సత్యన్నారాయణపురం, అజిత్‌సింగ్‌నగర్, ప్రసాదంపాడు పై ప్రాంతాల ప్రజల అవసరాలను తీర్చదు. అంతేకాక మెట్రో నడిచే రెండు ప్రధాన రోడ్లలో ఉండేది ప్రధానంగా వాణిజ్య సముదాయాలే. ఇక్కడ రాకపోకలు సాగించేది కొనుగోలుదారులు, వీటిలో పనిచేసే చిరుద్యోగులే. ఎనిమిది రూపాయలకు సిటీ బస్సు, అదే ధరకు షేర్ ఆటోలు ప్రయాణీకులను చేరవేస్తుంటే రు.20 పెట్టి మెట్రోరైలు ఎక్కడానికి సామాన్యులు సిద్ధపడరు. కాబట్టి ఆచరణలో మెట్రో రైల్ పథకం ప్రయాణీకుల పాలిట శాపంగా మారిపోవడం ఖాయం. ఢిల్లీ మెట్రోకు కేంద్రం కొంత సబ్సిడీ ఇస్తుంది. విజయవాడ మెట్రో ఏ రకంగా చూసినా ఆర్థికంగా లాభసాటి కాదు. రాష్ట్ర ప్రభుత్వానికి గుదిబండగా మారిపోతుంది.

ఢిల్లీ మెట్రో నిర్మాణంలో విదేశీ కంపెనీలకు పెద్దపీట వేశాడన్న విమర్శ శ్రీధరన్ మీద ఉంది. ఇది చాలావరకూ నిజమే. మన పరిశ్రమలు ఉత్పత్తి చేయడానికి వీలుగా మీటరుగేజ్‌ని కాదని విదేశీ కంపెనీలు తయారుచేసే గేజ్‌కి ఆమోదం తెలిపాడు. దీనితో పట్టాలు, పట్టాకు బిగించే మేకుల నుండి మెట్రో రైలు పెట్టెల వరకు విదేశీ కంపెనీలు తయారు చేసి ఇక్కడకు పంపుతున్నాయి. ఈ రైళ్లు నడిచినంతకాలమూ ఈ పరాధీనత కొనసాగుతుంది. పూర్తిగా తయారైన మెట్రో రైలు పెట్టెలు జపాను నుండి హైదరాబాదు మెట్రోకు దిగుమతికావడం చూశాం కదా! కిలోమీటరుకు ఒక స్టేషన్ ఉండి, గంటకు 25 కి.మీ వేగాన్ని మించి ప్రయాణించనీ, తక్కువ బరువుండే ఈ రైలు పెట్టెలను భారత పరిశ్రమలు, ప్రత్యేకించి రైల్వేకోచ్ ఫ్యాక్టరీలు తయారు చేయగలవు. అయినా గేజ్ మార్పిడి నిర్ణయంతో విదేశీ కంపెనీల పరమైంది. అదే భారత పరిశ్రమలకిచ్చి ఉంటే, కొన్ని కొత్త కోచ్ ఫ్యాక్టరీల నిర్మాణం జరిగి, కొన్ని వేలమంది కార్మికులకు శాశ్వత ఉపాధి లభించేది. భారత ద్రవ్య వనరులు భారత ప్రగతికి మదుపుగా సంచయం జరిగి ఉండేవి.

మోడీ నుండి బాబు వరకూ ఉత్పాదకరంగాన్ని పెంచుతా మంటున్నారు. కాని దానికి విరుద్ధమైన విదేశీ, బహుళజాతి కంపెనీల ప్రయోజనాలను కాపాడే చర్యలే తీసుకుంటున్నారు. ఈ వాస్తవాన్ని కప్పిపుచ్చుకునేందుకు గాలిలో మేడలు కట్టే ఈ పథకాలతో ప్రజలను మభ్యపరుస్తున్నారు. హైదరాబాద్‌లో ఎప్పటి నుంచో నిర్మాణంలో ఉన్న మెట్రో పథకం గురించి ప్రజల కలలు ఏ విధంగా కరిగి పోతున్నాయో చూస్తూనే ఉన్నాం. ఇప్పటికైనా ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర విభజన సందర్భంగా వచ్చిన అవకాశాన్ని వినియోగించుకుని ప్రజల అవసరాలు తీర్చే రవాణా వ్యవస్థ నిర్మాణానికి పూనుకోవడం మంచిది.

*(రచయిత సిపిఐ (ఎం.ఎల్) రాష్ట్ర కమిటీ సభ్యులు)* వీ

# అక్రమ సంపదపై మాటమార్చిన మోడీ

***పాలకవర్గాలే అవినీతిని పెంచి పోషిస్తున్నాయనీ, అవినీతి, అక్రమాలకు అవకాశంలేని ప్రత్యామ్నాయ రాజకీయార్థిక విధానాల అమలు కోసం ప్రజలు సంఘటితంగా ఉద్యమించడం తప్ప వేరే మార్గం లేదనీ అంటున్నారు ఎ. నర్సింహా రెడ్డి***

సర్కారు కళ్లుగప్పి విదేశాలకు తరలిన లక్షల కోట్ల నల్లడబ్బునంతా వెనక్కు తీసుకురావడంతోపాటు, నల్ల కుబేరులందరినీ చట్టం ముందు నిలబెట్టి శిక్షింపజేస్తామని మొన్నటి సార్వత్రిక ఎన్నికల్లో బిజెపి వాగ్దానం చేసింది. ఆ వాగ్దానాలన్నీ ఉత్త బోలుమాటలని, డంబాచార ప్రకటనలని, ఎన్‌డిఎ ప్రభుత్వం నిరూపించుకుంది. నల్లధనాన్ని వెనక్కి తెప్పించే ప్రయత్నాలు ఫలిస్తే ప్రతి పౌరునికి రు. 15 లక్షల మొత్తం అందుతుందన్న ప్రచారం ఎన్నికల ముందు జరిగింది. ఇప్పుడేమో విదేశీ బ్యాంకుల్లో నల్లధనాన్ని దాచుకున్న ఖాతాదారుల పేర్లు వెల్లడించలేమని, అలా చేస్తే అది ఇతర దేశాలతో కుదుర్చుకున్న ద్వంద్వ పన్నుల నిరోధన ఒప్పందం (డిటిఎఎ) ఉల్లంఘించినట్లు అవుతుందని నరేంద్రమోడీ ప్రభుత్వం అక్టోబర్ 24న సుప్రీంకోర్టుకు విన్నవించింది. ప్రణబ్‌ముఖర్జీ ఆర్థిక మంత్రిగా పార్లమెంట్‌లో ఏమి వాదనలు వినిపించారో అవే అభిప్రాయాలను ప్రభుత్వం తరపున అటార్నీ జనరల్ ముకుల్ రోహత్‌గి సుప్రీంకోర్టు ముందుంచారు. విదేశాల్లో నల్లధనం దాచుకున్న ఎనిమిది మంది జాబితాతో సర్వోన్నత న్యాయస్థానం ముందు అక్టోబర్ 27న కేంద్ర ఆర్థిక మంత్రిత్వశాఖ దాఖలు చేసిన అఫిడవిట్ దేశ ప్రజలనే కాదు... బిజెపి సీనియర్ నేతలను కూడా దిగ్భ్రమపరిచింది. వాస్తవానికి అఫిడవిట్‌లో ఉన్నవి మూడు పేర్లే. వీరిలో ఒకరు డాబర్ సంస్థకు చెందిన మాజీ డైరెక్టర్ ప్రదీప్ బర్మన్‌కాగా, మరొకరు బులియన్ వ్యాపారి పంకజ్ లోధియా, మూడో వ్యక్తి గోవాకు చెందిన వ్యాపారవేత్త రాధా టింబ్లూ, ఆమె సంస్థలోని మరో ఐదుగురు డైరెక్టర్లు. మొత్తానికి ఈ నల్లడబ్బు వ్యవహారమంతా 'గజం మిథ్య... పలాయనం మిథ్య' తరహాలో సాగుతున్నట్లు కనబడుతున్నది.

విదేశాల్లో నల్లధనం అంశంపై రాజకీయంగా ధ్వజమెత్తి యుపిఎ ప్రభుత్వాన్ని అసమర్థురాలిగా నిలబెట్టి తమకు అధికారమిస్తే 100 రోజుల్లో వెనక్కు తెస్తామన్న బిజెపి నేతలకు ఇప్పుడు ఊపిరాడడం లేదు. నల్లకుబేరుల పేర్లు వెల్లడిస్తే కాంగ్రెస్ పార్టీ ఇబ్బందుల్లో పడుతుందని ఆర్థికమంత్రి అరుణ్‌జైట్లీ ఇంకా రాజకీయ చమత్కారాలు వేస్తున్నారేగాని పేర్లు వెల్లడించడానికి ముందుకురావడం లేదు. అన్ని పేర్లు వెల్లడించడానికి ఇబ్బందిలేదని బిజెపి నేత సుబ్రమణ్యస్వామి అన్నారు. జర్మనీ బ్యాంకుల్లో నల్లధనాన్ని దాచిన భారతీయుల పేర్లు వెల్లడించాలని కోరుతూ ప్రసిద్ధ న్యాయవాది రాంజెఠ్మలానీ ఏప్రిల్‌లో సుప్రీంకోర్టులో వ్యాజ్యం దాఖలు చేయగా, 'వారిపై దర్యాప్తు పూర్తి అయినందున ఆ పత్రాలను, సమాచారాన్ని పిటిషనర్‌కు ఇవ్వాలని' సుప్రీంకోర్టు మే 1న ఉత్తర్వు జారీచేసింది. నల్లకుబేరు లను ప్రభుత్వం ఉద్దేశపూర్వకంగా రక్షిస్తోందని నల్లధనంపై సుప్రీంకోర్టులో ప్రభుత్వంపై కేసు వేసి ఆ పార్టీ నుండి బహిష్కృతుడైన సుప్రసిద్ధ లాయర్ రాం జెఠ్మలానీ విమర్శిస్తున్నారు. మోడీ ప్రభుత్వం తరపున లీచ్‌టన్ బ్యాంకులో భారతీయ ఖాతాదారులకు సంబంధించి జర్మనీ అధికారులిచ్చిన సమాచారాన్ని బహిరంగపరచడం డిటిఎఎ ఒప్పందం ప్రకారం సాధ్యం కాదని, దాన్ని పన్ను అవసరాలకు మాత్రమే ఉపయోగించాలని, అందువల్ల సుప్రీంకోర్టు తన 2014 మే 1వ తేదీ ఉత్తర్వును సవరించాలని అటార్నీ జనరల్ ధర్మాసనాన్ని కోరారు. ఇది నేరస్తుల పిటిషన్‌లాగా ఉందని వ్యాఖ్యానించిన రాంజెఠ్మలానీ, దాన్ని తిరస్కరించాలని కోరారు. మూడు పేర్లు మాత్రమే వెల్లడించడం కొండను తవ్వి ఎలుకను పట్టిన చందంగా ఉందని ఎద్దేవా చేశారు.

విదేశాల్లో నల్లధనం దాచిన భారతీయుల పేర్లలో మూడు మాత్రమే వెల్లడించి, అన్ని పేర్లు వెల్లడించాలన్న గత ఉత్తర్వును పాటించకుండా దాన్ని సవరించాలని కోరుతున్న కేంద్ర ప్రభుత్వంపై సుప్రీంకోర్టు ఆగ్రహం వ్యక్తం చేసింది. వెంటనే అన్ని పేర్లను సీల్డు కవర్‌లో కోర్టుకు సమర్పించాలని ప్రధాన న్యాయమూర్తి ఎచ్.ఎల్. దత్తు అధ్యక్షత వహించిన త్రిసభ్య ధర్మాసనం ప్రభుత్వాన్ని ఆదేశించింది. 'అన్ని పేర్లు వెల్లడించడానికి గతంలో యు.పి.ఎ. ప్రభుత్వం అంగీకరించింది. ఇప్పుడు మీరెందుకు (మే 1న ఉత్తర్వుకు) సవరణలు కోరుతున్నారు? మీరు దర్యాప్తుచేస్తే అది నా జీవిత కాలంలో పూర్తికాదు. దర్యాప్తు ఇబ్బంది మీకు అవసరం లేదు. నల్లధనం వెనక్కు తీసుకురావడానికి మేము సిట్ ఏర్పాటు చేశాం. ప్రభుత్వం దానికి సహకరించాలి. (విదేశాలతో ఒప్పందాలకు సంబంధించి) అటువంటి సమస్యలు వచ్చినప్పుడు మేము చూసుకుంటాం' అని ప్రధాన న్యాయమూర్తి కటువుగా చెప్పారు. సుప్రీంకోర్టు ఆదేశానుసారం విదేశీ బ్యాంకుల్లో ఖాతాలున్న 627 మంది భారతీయుల జాబితాను కేంద్ర ప్రభుత్వం అక్టోబర్ 29న అందజేసింది. ఖాతాదారుల వివరాలు మాత్రం బహిర్గతం కావడం లేదు. సీల్డ్ కవర్లో అందిన ఆ వివరాలు ప్రత్యేక దర్యాప్తు బృందం (సిట్) వద్ద మాత్రమే ఉంటాయి. సిట్ నిర్ణయం మేరకు ఎన్‌ఫోర్స్‌మెంట్ డైరెక్టరేట్, సెంట్రల్ బ్యూరో ఆఫ్ ఇన్వెస్టిగేషన్ (సిబిఐ) లకు ఈ వివరాలు అందుబాటు లోకి వస్తాయి. ఈ జాబితాలో కొత్త విషయమంటూ ఏమీ లేదనీ, ఆ పేర్లన్నీ తమ వద్ద ఉన్నాయని సిట్ అధినేత జస్టిస్ ఎం.బి. షా వ్యాఖ్యానించడం మరొక పరిణామం.

ప్రపంచంలోని అన్ని దేశాల్లోని అక్రమ సంపాదనను రహస్యంగా భద్రంగాదాచి ఉంచి, దాని ద్వారా వచ్చే ఆదాయంతో బతికే దేశం స్విట్జర్లాండ్. స్విట్జర్లాండ్ ప్రభుత్వానికి కూడా తెలియకుండా మెయింటెనెన్స్ చేస్తాయి. కాబట్టే ప్రపంచ వ్యాప్తంగా అక్రమార్కులు తమ సొమ్ముని స్విస్ బ్యాంకుల్లో దాచుకొంటారు. ఇటువంటి బ్యాంకులు స్విట్జర్లాండ్‌లో ఇంచు మించు 400కి పైగా ఉన్నాయి. జెనీవా, స్విట్జర్లాండ్ బ్యాంకుల్లో ఉన్న ఈ ఖాతాల వివరాలను భారత ప్రభుత్వం 2011లోనే ఫ్రాన్స్, స్విస్ ప్రభుత్వాల నుంచి అందుకుంది. ఖాతాదారుల్లో సగం మంది భారతీయులు, మిగతావారు భారత్‌లో పన్నులు చెల్లించని ప్రవాస భారతీయులు. ఈ ఖాతాల్లో నలుపెంతో తెలుపెంతో వివరంగా తెలిసేది కూడా విచారణ పూర్తిగా జరిగిన తరువాతే. మరోవైపు నల్లధనం వ్యవహారం ఇప్పటికే ప్రాథమిక స్థాయిలోనే ఉందని సాక్షాత్తు మోడీనే ఇటీవలి రేడియో ప్రసంగంలో స్పష్టం చేశారు. మూడు పేర్ల వెల్లడికే ఇంత సమయం

తీసుకుంటే, ఈ తరహా చర్యలకు ఇంకెంత కాలం పడుతుందో ఊహకందని విషయం. ఇప్పటికైనా ఎన్‌డిఏ సర్కారు దేశ ప్రజలకు వాస్తవాలేమిటో వివరించాలి. సార్వత్రిక ఎన్నికల్లో ఇచ్చిన హామీని నిలబెట్టుకోవాలి.

దేశంలో ప్రభుత్వం కళ్లుగప్పి, పన్నులు ఎగవేసే నిమిత్తం భారత నల్ల కుబేరులు విదేశాల్లో దాచిన సొమ్ము ఎంత? సరైన అంచనాలు లేవు. విదేశీ ఖాతాల్లో దాగిన భారతీయ నల్లధనం గురించి రకరకాల అంచనాలు వినిపిస్తున్నాయి. భారతదేశ జిడిపిలో నల్లధనం వాటా నలభై శాతమని 'వికీలీక్స్' జూలియన్ అసాంజే లెక్కగట్టారు. ఐఐఎం ఆచార్యుడు ఆర్.వైద్యనాథన్ అంచనా ప్రకారం విదేశీ బ్యాంకుల్లో రు. 72,80,000 కోట్ల నల్లధనం ఉంది. అక్రమ ధన ప్రవాహంపై పరిశోధన చేసే వాషింగ్టన్ సంస్థ గ్లోబల్ ఫైనాన్షియల్ ఇంటిగ్రిటీ అంచనా ప్రకారం (2011) విదేశాల్లో భారతీయుల నల్లధనం సుమారు 455 బిలియన్ డాలర్లు (రు. 28 లక్షల కోట్లు). బిజెపి నేత అద్వానీ ఆ సంఖ్యను బహుళ ప్రచారంలోకి తెచ్చారు. ఆ ఖాతాల సంఖ్య 782, కాని పేర్లు వెల్లడించలేదు. కాగా, నల్లధనం 500 బిలియన్ డాలర్ల నుండి 1.4 ట్రిలియన్ డాలర్ల వరకు ఉంటుందని అదే సంవత్సరం బిజెపి అంచనా వేసింది. 2012లో ప్రభుత్వం పార్లమెంట్‌కు సమర్పించిన శ్వేతపత్రం ప్రకారం స్విస్ బ్యాంకుల్లో భారతీయుల డిపాజిట్లు 2.1 బిలియన్ డాలర్లు. ఒక్క స్విస్ బ్యాంకులే కాదు – పన్నులు లేని నల్లధనం 'స్వర్గధామాలు' చాలా ఉన్నాయి.

గత ఆరు, ఏడు దశాబ్దాల కాలంలో రాజకీయ నాయకుల చిత్తశుద్ధిలేమీ, కార్పొరేట్ రంగం దురాశ, అధికారగణం అవినీతి వలన లక్షల కోట్ల రూపాయల ప్రజాధనం ప్రజలకు చెందకుండా దొంగఖాతాలుగా విదేశీ బ్యాంకులలోకి తరలిపోయింది. విదేశాల్లో అక్రమంగా ధనం దాచడమంటే దేశసంపదను కొల్లగొట్టడంతో సమానం, అటువంటి వ్యక్తులు వారెవరైనా – ఆర్థిక నేరస్తులు అవుతారు. కాని వారు దేశంలో పెద్ద మనుషులుగా చలామణీ అవుతున్నారు. అటువంటి వారు ప్రధాన రాజకీయ పార్టీలైన బిజెపి, కాంగ్రెస్‌లకు మిత్రులు, భారీగా విరాళాల ప్రదాతలు కూడా అయి ఉంటారు. నల్లధనం ఓట్ల కొరకు ఉద్దేశించిన రాజకీయ అస్త్రంగా మారడం దురదృష్టకరం. నల్లధనం ఖాతాదారుగా ప్రభుత్వం వెల్లడించిన గోవా మైనింగ్ వటవృక్షం టింబ్లో ఎంటర్‌ప్రైజెస్ మేనేజింగ్ డైరెక్టర్ రాధ ఎస్ టింబ్లో 2004–11 మధ్య బిజెపికి రు. 1.18 కోట్లు, కాంగ్రెస్‌కు రు. 65 లక్షలు విరాళాలిచ్చినట్లు (ఇది తెల్లధనమే) ఏడిఆర్ వెల్లడించడం గమనార్హం. అందువల్ల ప్రధాన న్యాయమూర్తి వ్యాఖ్యానించినట్లు దీనిపై సిబిఐ లేదా మరో ప్రభుత్వ ఏజెన్సీ దర్యాప్తుచేస్తే పుష్కరాలు గడిచినా వాస్తవాలు వెలుగులోకి రావు. సుప్రీంకోర్టు పర్యవేక్షణలో సిట్ దర్యాప్తు ఉత్తమం.

గుప్తధనంపై మొదటి నుంచి పాలకుల వైఖరి ఒకలాగే ఉన్నది. విపక్షంలో ఉన్నప్పుడు ఏంచెప్పినా అధికార పీఠం ఎక్కేసరికి అందరూ ఒకేలా మాట్లాడుతున్నారు. ప్రతిపక్షంలో ఉండగా నల్లడబ్బు గురించి ఉపన్యాసా లిచ్చిన బిజెపి ఇప్పుడు అచ్చం కాంగ్రెస్ భాషను పుణికి పుచ్చుకుని మాట్లాడు తున్నది. కొన్ని దేశాలతో మనకున్న ద్వంద్వ పన్నుల ఎగవేత నిరోధక ఒప్పందం (డిటిఎఎ) కారణంగా ఆయా దేశాల్లో నల్ల డబ్బు దాచుకున్నవారి పేర్లు వెల్లడించలేని నిస్సహాయ స్థితిలో ఉన్నామని ఎన్‌డిఏ ప్రభుత్వం సుప్రీంకోర్టుకు విన్నవించుకుంది. ఇదేమీ కొత్త వాదన కాదు. రెండేళ్లక్రితం అప్పటి కేంద్ర ఆర్థికమంత్రి ప్రణబ్ ముఖర్జీ నల్ల డబ్బుపై శ్వేతపత్రం విడుదల చేస్తూ ఈ మాటే పార్లమెంట్‌లో చెప్పారు. 81 దేశాలతో కుదుర్చుకున్న ద్వంద్వ పన్నుల నివారణ ఒప్పందం ద్వారా, నాలుగు బ్యాంకులతో కుదుర్చుకున్న పన్ను సమాచార బదిలీ ఒప్పందం ద్వారా ఎంతో సమాచారాన్ని రాబట్టామని, అయితే ఒప్పందాల కారణంగా సమాచారంలోని పేర్లను వెల్లడించడం సాధ్యపడడంలేదని తెలిపారు. నల్లడబ్బు కూడబెట్టడాన్ని కేవలం పన్ను ఎగవేతగా మాత్రమే పరిగణించవద్దని సుప్రీంకోర్టు ఆ కాలంలోనే చెప్పింది. అయినా పాలకులు పదే పదే ఆ దోవనే ఎంచుకుంటున్నారు.

నల్లధనం ఖాతాదారుల విషయంలో స్విస్ బ్యాంక్ అధికారులతో చర్చల్లో ఎంతో పురోగతి ఉందని ఆర్థిక మంత్రి అరుణ్‌జైట్లీ చెబుతున్నారు. భారత పన్నుల అధికారులు స్వతంత్ర దర్యాప్తులో నిర్ధారించుకున్న వ్యక్తుల పేర్లను తమకు తెలియజేస్తే అవి అవునో, కాదో చెపుతామని స్విస్ అధికారులు అంగీకరించారు. విదేశీ బ్యాంకుల్లో అక్రమంగా డబ్బు దాచడమంటే దేశ సంపదను కొల్లగొట్టడంతో సమానం. అటువంటి సొమ్మును మొత్తంగా ప్రభుత్వం స్వాధీనం చేసుకుంటుందని యుపిఏ ప్రభుత్వం అనలేదు. ఎన్‌డిఏ ప్రభుత్వం అనదు. మరి ఎలా దేశ ఖజానాకు నల్లధనం వచ్చి చేరుతుంది? తీరా ఇప్పుడు వెల్లడించిన పేర్లు గమనిస్తే అవన్నీ మూడేళ్ల క్రితం హెచ్‌ఎస్‌బిసి ఉద్యోగి ఒకరు ప్రపంచానికి వెల్లడించిన 782 ఖాతాల్లోనివే. తమ వద్ద ఉన్న జాబితాలో యుపిఏ హయాంలో మంత్రిగా ఉన్నా నేతతో పాటు పలువురు కాంగ్రెస్ ముఖ్యులున్నారని అరుణ్‌జైట్లీ ఇటీవలే ఒక ఇంటర్వ్యూలో చెప్పిన మాటలకు ఇప్పుడు సమర్పించిన అఫిడవిట్ దరిదాపుల్లో కూడా లేదు. కేంద్ర మాజీమంత్రి ప్రణీత్‌కౌర్‌కు విదేశీ ఖాతా గురించి ఆరా తీస్తూ ఆదాయం పన్ను విభాగం నుంచి నోటీసు వెళ్లిందని మాత్రం చెపుతున్నారు.

నల్లధనం వెలికితీతలో గోప్యత, గుట్టు అనే పదాల విన్యాసంతో నల్లధనంపై కఠిన చర్యలను తీసుకోలేక పోతున్నామని ప్రభుత్వం చెపుతోంది. అయితే ఇందుకు విరుద్ధంగా అమెరికాలో న్యాయస్థానాలు విజయవంతంగా నల్లధనాన్ని వెలికితీయగలిగాయి. మన ప్రభుత్వాలు నల్ల డబ్బు విషయంలో ప్రదర్శిస్తున్న సాచివేత వైఖరివల్ల ఇప్పటికే విదేశీ బ్యాంకుల్లోని 60 శాతం నల్ల డబ్బు రంగు మార్చుకుని ఎటో వెళ్లిపోయింది. ఖాతాదార్లందరికీ మారిన నిబంధనలను వివరించి డబ్బు ఉంచుకుంటారో, పట్టుకెళ్తారో మీ ఇష్టమని స్విస్ బ్యాంకులు తమ ధర్మంగా వర్తమానం పంపించాయి. అంటే మిగిలిన 40 శాతం డబ్బు కూడా అక్కడి నుంచి తరలిపోయే ప్రమాదం ఉంటుంది. స్విస్ బ్యాంకుల్లో 2006 నాటికి మొత్తం రు. 23,373 కోట్ల నల్లధనం ఉందనీ, అది 2010 నాటికి రు. 9,295 కోట్లకు తగ్గిపోయిందనీ ప్రణబ్ శ్వేతపత్రం ప్రకటించారు. విదేశీ బ్యాంకుల్లో నిరుడు మొత్తం మీద రు. 14,000 కోట్లు ఉందని తేలిందని ఈ మధ్యే ఓ పత్రిక వెల్లడించింది. ఇలా ఇంత సమయమిచ్చి, ఇంత హడావుడి చేసి ఎక్కడివారక్కడ సర్దుకున్నాక మొక్కుబడిగా ప్రకటించిన పేర్లవల్ల ఫలితం ఉంటుందని కేంద్ర ప్రభుత్వమైనా నమ్ముతున్నదా అనే అనుమానం కలుగుతుంది. విదేశీ బ్యాంకుల్లో నల్లడబ్బు దాచుకున్న ప్రముఖుల్లో కీలక పారిశ్రామికవేత్తలు, రాజకీయ నాయకులు ఉన్నారని ఒకపక్క వదంతులు షికార్లు చేస్తుండగా దానిపై స్పష్టతనీయకుండా చేసే ఎలాంటి విన్యాసమైనా ఎవరినీ ఆకట్టుకోదు. 'పేర్లు వెల్లడిస్తాం... కానీ, దర్యాప్తు పూర్తి కావాలి, చార్జిషీట్లు దాఖలు చేయాలి. అందుకు ఇంకా వ్యవధి కావాలి' అని బిజెపి నేతలు చెపుతున్నారు.

నల్లడబ్బు యజమానులు ఇపాటికే తమ సొమ్మును ఇతరేతర మార్గాల లోకి తరలించేసి ఉండే అవకాశాలే అధికం. అదే కాకుండా వివిధ విదేశీ బ్యాంకులు ఉన్న దేశాల తాలుకు దేశీయ చట్టాలు, అంతర్జాతీయ చట్టాలు కూడా ఈ విషయంలో ఆటంకాలు కల్పించేవే. మన పాలకులు స్వయంగా ఆయా దేశాలతో చేసుకున్న డిటిఎఎ వంటి ఒప్పందాలు ఉండనే ఉన్నాయి. జెనీవాలోని హెచ్‌ఎస్‌బిసి బ్యాంక్ ఇచ్చిన జాబితాలోని 628 మందిలో 300 మందిపై విచారణ చేపట్టేందుకు ఆదాయ పన్ను శాఖ మల్లగుల్లాలు పడుతోందని అధికార వర్గాలు తెలిపాయి. ఇటీవలనే ఈ జాబితాను సుప్రీం

కోర్టుకు అందజేశారు. ఎచ్ఎస్‌బిసి బ్యాంక్ ఖాతాదారుల జాబితాలోని 600 మందిలో దాదాపు సగంమంది ఖాతాల్లో అసలు డబ్బేలేదని నల్లధనంపై ఏర్పాటు చేసిన ప్రత్యేక దర్యాప్తు బృందం (సిట్) నిర్ధారించింది. వందకు పైగా పేర్లు పునరావృతమయ్యాయని దీంతో వారిపై ఏ చర్య తీసుకోవాలన్నా అనేక అవరోధాలు ఏర్పడుతున్నాయని పేర్కొంది. 289 మంది ఖాతాల్లో అసలు డబ్బులే లేవని సిట్ కనుగొంది. ఈ జాబితాలోని వారిపై చర్యలు తీసుకోవడానికి ఎదురవుతున్న ప్రధాన అడ్డంకి ఏమిటంటే ఆ ఖాతాల నిర్వహణకు సంబంధించిన వివరాలేమి లేకపోవడమని సిట్ పేర్కొంది.

డబ్బు, నల్లదైనా, తెల్లదైనా.. ఎవరూ వృథాగా దాన్ని రహస్య ఖాతాల్లో మగ్గబెట్టరు! ఆ డబ్బును వారు మారిషస్ లేదా సింగపూర్ వంటి మార్గాల ద్వారా దేశంలోకి తిరిగి తీసుకువచ్చి అధిక లాభాలందించే ఈక్విటీ, స్థిరాస్తి లేదా ఇతర వ్యాపారాల్లో పెట్టుబడులుగా పెడతారు. డబ్బు అసలుదారుల గుట్టుమట్లను దాచిపెట్టే 'పార్టిసిపేటరీ నోట్స్' (పిఎన్) రూపంలో మారిషస్ ద్వారా పెట్టుబడులు విరివిగా దేశంలోకి తరలుతుండడంతో 'సెన్సెక్స్' పైపైకి ఎగబాకుతోంది. ఇందులో సందేహం లేదు. ఈ విధంగా విదేశాలకు తరలి పోయిన నల్లడబ్బు, తిరిగి తెల్లడబ్బుగా దేశంలోకి ప్రవేశించడాన్ని 'రౌండ్ ట్రిఫింగ్' అంటారు. దీనికి కారణం ఆ చిన్న దేశంలో మనకున్న డిటిఎఎ ఒప్పందమే. 'పీఎస్'ల వివరాలను ప్రభుత్వం బహిర్గతం చేస్తుందన్న వార్తలు గుప్పుమన్న ప్రతిసారీ ఏకమొత్తంగా భారత స్టాక్ మార్కెట్ల నుంచి తమ పెట్టుబడులను ఉపసంహరించుకుంటామని విదేశీ సంస్థాగత మదుపు దారులు (ఎఫ్ఐఐలు) బెదిరించడాన్ని ఈ కోణంలోనే అర్థం చేసుకోవాల్సి ఉంది. ఒకవేళ ఎఫ్ఐఐలు ఎలాంటి మకిలీ అంటని డబ్బును దేశీయ స్టాక్ మార్కెట్లలో పెట్టుబడులుగా పెట్టి ఉన్నట్లయితే పీఎన్‌ల సమాచారం బయట పెడతారన్న మాట వినబడితేనే ఎందుకు అంతగా వణికిపోతున్నట్లు? దీనికి జవాబు చాలా సులభం. ఎఫ్ఐఐల రూపంలో స్టాక్‌మార్కెట్లలోకి ప్రవహిస్తున్న దంతా భారతీయుల డబ్బే! మారిషస్ లేదా సింగపూర్ మార్గాల ద్వారా ఈ డబ్బు దేశంలోకి తిరిగి చేరుతోంది. 'హవాలా' కూడా ఈ మార్గాల్లో ఒకటి. దిగుమతులకు అధిక ఇన్వాయిస్ (ఓవర్ ఇన్వాయిస్) చూపించడం, ఎగుమతులకు తక్కువ ఇన్వాయిస్ (అండర్ ఇన్వాయిస్) రాయడం దేశంలోకి అక్రమ సొత్తును ప్రవేశపెట్టేందుకు అనుసరిస్తున్న మరో మార్గం!

విదేశాలకు తరలివెళ్లిన నల్లడబ్బు ఎఫ్‌డిఐల రూపంలో తిరిగి దేశంలోనికి ప్రవేశిస్తున్నదని రియల్‌ఎస్టేట్, బంగారం క్రయవిక్రయాల్లో నల్లధనం మూలాలున్నాయని ప్రణబ్ ముఖర్జీ శ్వేతపత్రం చెప్పింది. దానికి సంబంధించి ఇప్పటి వరకూ తీసుకున్న నిర్దిష్ట చర్యలేమిటో అరుణ్‌జైట్లీ కూడా చెప్పలేదు. ఇంతకూ దేశంలో నల్లధన కుబేరులు మొత్తం ఎంతమంది ఉన్నారు, వారి పేర్లతో ఎన్ని జాబితాలు వెలువడ్డాయి, వాటిలో దేన్ని ప్రభుత్వం సుప్రీంకోర్టు ధర్మాసనానికి అందజేసిందన్న ప్రశ్నలు ప్రజల మనసుల్లో తిరుగుతున్నాయి. ప్రస్తుతం నల్లకుబేరులకు సంబంధించిన రెండు జాబితాలు ప్రభుత్వం చేతిలో ఉన్నాయి. మొదటిది, ఎచ్ఎస్‌బిసి బ్యాంకులో ఖాతాలున్నవారి జాబితా, రెండోది, లిక్‌టెన్‌స్టెయిన్ (స్విట్జర్లాండ్, ఆస్ట్రియాల మధ్యగల చిన్నదేశం)లోని ఎల్‌జిటి బ్యాంకు జాబితా, ఈ రెండు జాబితాలను ఆ బ్యాంకుల ఉద్యోగులు తస్కరించి, లోకానికి వెల్లడిచేశారు. ఇవి కాకుండా మూడో జాబితా ఒకటుంది. అది వివిధ దేశాలతో భారత్ కుదుర్చుకున్న 72 ద్వంద్వ పన్నుల ఒప్పందాల కింద అందిన ఖాతాదారుల జాబితా. సుప్రీంకోర్టులో కథ ప్రస్తుతానికి ఎచ్ఎస్‌బిసి జెనీవా శాఖలోని ఖాతాదారుల జాబితా చుట్టూ తిరుగుతోంది. 2006లో ఒక ఉద్యోగి దీన్ని అపహరించి, ఫ్రెంచి అధికారు లకు విక్రయించాడు. ఎల్‌జిటి బ్యాంకు ఖాతాదారుల జాబితాను జర్మన్ ప్రభుత్వం 2008లో భారత ప్రభుత్వానికి అందజేసింది. వారి పేర్లను బయట పెట్టాలని సుప్రీంకోర్టు ఈ ఏడాది ఏప్రిల్‌లో భారత ప్రభుత్వాన్ని ఒత్తిడి చేయగా, మే నెలలో ఆ జాబితాను ప్రభుత్వం వెల్లడించింది. ఇది రెండు దేశాల మధ్య కుదిరిన పన్ను ఒప్పందాన్ని ఉల్లంఘించడమేనని జర్మనీ నిరసన తెలిపింది. అన్నట్టు, దుబాయ్, సింగపూర్, హాంకాంగ్, వర్జిన్ దీవుల్లోనూ భారతీయులకు నల్లధన ఖాతాలున్నాయి. మరోవైపు ఫ్రాన్స్ 628 మంది ఎచ్ఎస్‌బిసి ఖాతాదారుల జాబితాను 2011లో భారత్‌కు అంద జేసింది. ప్రభుత్వం దీన్ని సుప్రీంకోర్టు నియమించిన సిట్‌కు ఈ ఏడాది జూన్‌లో సమర్పించింది. ఆ జాబితాలో 613 మంది వ్యక్తులు, 15 కంపెనీలు, ట్రస్టుల వివరాలు ఉన్నాయి. వారిలో 289 మంది వ్యక్తుల ఖాతాల్లో ఎంతెంత డబ్బు ఉందన్న వివరాలు లేవు. చివరకు 120 మందిపై మాత్రమే దర్యాప్తు చేపట్టే వీలుంది.

1950లో భారత్‌లో నల్లధనం వృద్ధి 3 శాతం. కాగా ప్రస్తుతం అది 50 శాతానికి పెరిగింది. గ్లోబల్ ఫైనాన్షియల్ ఇంటిగ్రిటీ 2001–10 ప్రకారం నల్లధనం కలిగియున్న 150 దేశాల జాబితాలో భారత్ ఎనిమిదో స్థానంలో ఉంది. 2002–11 మధ్యలో భారత్ నుంచి బయటి దేశాలకు తరలిన మొత్తం నల్లధనం 343 బిలియన్ డాలర్లు అంటే రు. 21 లక్షల కోట్లు. 2011లో 84.93 బిలియన్ డాలర్లు అంటే రు. 5 లక్షల కోట్లని లెక్క తేల్చింది. స్విస్ బ్యాంక్ ఉద్యోగుల సంఘం విడుదల చేసిన గణాంకాల ప్రకారం భారతీయుల ఖాతాలలో డెబ్బైరెండు లక్షల కోట్ల రూపాయలు న్నాయని తేల్చి చెప్పింది. నాలుగు సంవత్సరాల క్రితం సిబిఐ వెల్లడించిన వివరాల ప్రకారం నల్లధనం 500 బిలియన్ డాలర్లు. చట్టబద్ధం కాని ద్రవ్యం ఎగుమతిలో భారత్‌ను ఐదో అతిపెద్ద ఎగుమతిదారుగా పేర్కొంది. గత ఐదేళ్ల కాలంలో సుమారు రు. 50 లక్షల కోట్లు దేశ సరిహద్దులు దాటిందని అంచనా. విదేశాలలో దాచుకున్న నల్లధనం పదిశాతం కాగా దేశంలో తొంబై శాతం ఉన్నట్లు ఒక అంచనా. దేశ ఆర్థిక వ్యవస్థలో ఉన్న లొసుగుల వలన బ్యూరోక్రాట్స్, బడా కాంట్రాక్టర్లు, క్రీడాకారులు, సినిమా నటులు, వృత్తి నిపుణులు, వ్యాపార వాణిజ్య వేత్తలు తమ సంపాదనలో అత్యధిక భాగాన్ని నిజాయితిగా ప్రకటించకపోవడం వలన పన్ను ఎగవేసి అక్రమంగా సంపదలు పోగు చేసుకుంటున్నారు. తమ సంపదలను భద్రత కొరకు పన్నులు విధించని స్వర్గధామాలకు తరలిస్తున్నారు. ఈ మొత్తంలో రాజకీయ నాయకులు, వ్యాపార వేత్తలు, ఇతర ప్రజా ప్రతినిధులదే అగ్రభాగం. గత రెండేళ్లలో దేశం నుంచి బయటికి వెళ్లిన నల్లధనం మనకున్న అప్పు కంటే 13 రెట్లు ఎక్కువని విశ్లేషకుల అభిప్రాయం.

సంపద కొద్దిమంది చేతుల్లో పేరుకుపోవడానికి నల్లధనమే ప్రధాన కారణం. ఈ అక్రమ పద్ధతిని అరికట్టకుండా దేశ ఆర్థిక వ్యవస్థను సక్రమంగా నిర్వహించుకోలేం. పాలకులు, అక్రమ సంపాదనాపరుల మధ్య విడదీయరాని అనుబంధం ఉంది. ఈ నేపథ్యంలో పాలకులు విదేశాలలో దాచుకున్న నల్లడబ్బు ఖాతాదారుల పేర్లు దేశ ప్రజల ముందు వెల్లడిస్తారనీ, నల్లధనాన్ని వెనుకకు తెస్తారనీ, ఒకవేళ తెచ్చినా దానిని జనహితం కోసమే వినియోగిస్తారనీ అనుకోవడం వట్టి భ్రమే. పాలకవర్గాలకు నల్లడబ్బు ఖాతాదారులకు మధ్య గల అనుబంధానికి ప్రస్తుత రాజకీయ ఆర్థిక విధానాలే ప్రధాన కారణం. అందువలన అవినీతికి, అక్రమార్జనకు అవకాశం లేని ప్రత్యామ్నాయ రాజకీయార్థిక విధానాల రూపకల్పనకు, దాని అమలుకు ప్రజలు సంఘటితంగా ఉద్యమించడం తప్ప మరో దగ్గరి మార్గం లేదు.

*(రచయిత ఉపాధ్యాయ నాయకులు, రాజనీతి శాస్త్ర విద్యార్థి)* వీ

# కుంభకోణాల చిట్టా

*అధికారంలోకి ఏ పార్టీ వచ్చినా కుంభకోణాలు కొనసాగుతూనే ఉన్నాయనీ, అవి స్వాతంత్ర్యం వచ్చినప్పటి నుంచే ప్రారంభమయ్యాయనీ అంటూ కొన్ని భారీ కుంభకోణాల వివరాలు అందిస్తున్నారు* **వి.హనుమంతరావు**

నరేంద్రమోడీ అధికారంలోకి వచ్చి ఆరు నెలలు అయింది. అసలే మనది స్కాముల భారతం. నెహ్రూ హయాంలో జీపుల కుంభకోణంతో ప్రారంభమై (ఈ కుంభకోణానికి కారణమైన కృష్ణమీననన్ను నెహ్రూ క్షమించేశారు) సోనియాగాంధీ హయాంలో పదుల కొద్ది స్కాములతో తన పార్టీకి తానే గొయ్యి తవ్వుకోగా ప్రధాని మోడీ అధికారం చేపట్టిన తర్వాత ఒక్క స్కాము కూడా చోటుచేసుకో లేదని బిజెపి జబ్బలు చరుచుకుంటుండగానే స్కాముల చిట్టాలను తయారు చేసే సిబిఐ డైరెక్టర్ రంజిత్ సిన్హాయే ఒక స్కామ్‌లో దొరికిపోయారు. ఈ అధికారి గురించిన అనుమానాలను వ్యక్తం చేస్తూ కొద్దికాలంగా పత్రికల్లో వార్తలు వస్తూనే ఉన్నాయి. అధికారంలో ఉన్న మోడీ స్పందించలేదు. ఇది సుప్రీం కోర్టు పరిధిలో ఉంది కాబట్టి మోడీ స్పందించకూడదు కదా అని ఆయన అనుయాయిలు మోడీని వెనకేసుకొని రావచ్చు. స్పందించాలనే ఆలోచన ఉంటే నేరుగా కాకుండా పరోక్షంగా స్పందించడానికి అనేక మార్గాలు ఉన్నాయి. ఆయన స్పందిస్తే తేనెతుట్టెను కదిలించనట్లవుతుంది.

మోడీని భుజాన వేసుకొని కోట్లు కుమ్మరించి గెలిపించిన ఎన్నో కార్పొరేట్ సంస్థల గుట్టు బజారున పడుతుంది. వాళ్లను వెన్నుపోటు (చంద్రబాబులా) పొడిచినట్లవుతుంది. కనీసం 'చట్టం తన పని తాను చేసుకొని పోతుంది' అనైనా అనలేదు. మొన్ననే మేక్ ఇన్ ఇండియా అంటూ అమెరికాలో బహుళజాతి సంస్థలను ఆహ్వానించి వచ్చారు. స్కాములను విచారించే 'స్వామి'యే స్కామ్‌లో ఇరుక్కుపోవడానికి ఎలా స్పందిస్తారో తెలియదు. దేశంలో స్కాముల్లో ఇరుక్కొన్న రాజకీయ నాయకులు, కార్పొరేట్లకు ఇదొక మహాదావకాశం. తామేమీ తప్పుచేయలేదు, సిబిఐ డైరెక్టరే మమ్మల్ని ఇరికించాడని సుప్రీంకోర్టుకు వెళ్లే అవకాశం వారికి లభిస్తుంది. వాళ్లు మోడీ మీద ఒత్తిడి తీసుకొని వచ్చి తమ మీద ఉన్న స్కాముల నుంచి బయటపడడానికి ప్రయత్నిస్తారు. ప్రభుత్వం ఏమి చేయనుందో వేచిచూద్దాం.

స్కాముల గురించి చర్చిస్తున్నాం కాబట్టి కాస్త వెనక్కుపోయి చూడబోతే, స్కాములే స్కాములు. 1948 నుంచి కాంగ్రెస్‌తో ప్రారంభించి, వివిధ పార్టీల పాలనలో జరిగిన స్కాముల చిట్టా చూడండి.

**అవినీతి చిట్టా**

1948లో జీప్స్; 1951 సైకిళ్ల దిగుమతి; 1956లో బిఎచ్‌యు నిధుల దుర్వినియోగం రు. 50 లక్షలు; 1958లో ముంద్రా రు. 1.5 కోట్లు; 1960లో తేజా రుణం; 1964లో ప్రతాప్‌సింగ్ బైరాన్; 1965లో కళింగ ట్యూబ్స్ రు. 22 కోట్లు; 1971 నగర్వాలా రు. 60 లక్షలు; 1974లో మారుతి; 1976లో క్యూవో ఆయిల్ రు. 2.2 కోట్లు; 1981లో ఎ.ఆర్. అంతులే సిమెంట్; 1987 భోఫోర్స్; 1989లో సెంట్ కిట్స్ ఫోర్జరీ.

1990లో ఎయిర్‌బస్; 1992లో హర్షద్ మెహతా సెక్యూరిటీస్ రు. 5000 కోట్లు, పామాయిల్ దిగుమతి, కేరళ ఇండియన్ బ్యాంక్ రు. 1300 కోట్లు; 1994లో పంచదార దిగుమతి;

1995లో పురులియా ఆయుధాల జారవిడువడం, మేఘాలయ అడవి రు. 300 కోట్లు, ప్రిఫరెన్షియల్ కేటాయింపు రు. 5000 కోట్లు, యుగోస్లావ్ దినార్ రు. 400 కోట్లు;

1996లో బీహార్ ఫొడర్ రు. 950 కోట్లు, సుఖరాం టెలికాం ఎక్విప్‌మెంట్; సి.ఆర్. భన్‌సాలీ రు. 1100 కోట్లు, ఎరువుల దిగుమతి రు. 133 కోట్లు; 1997లో కోబ్లర్, హవాలా, బీహార్ భూమి రు. 400 కోట్లు, షేర్‌గార్; ఎస్ఎన్‌సి లవాలిన్ విద్యుత్ కేంద్రం రు. 374 కోట్లు.

2000: ఇండియా – దక్షిణాఫ్రికా మ్యాచ్ ఫిక్సింగ్, యుటిఐ రు. 32 కోట్లు; 2001: కేతన్ ఫరేఖ్ సెక్యూరిటీస్; 2002: స్టాంప్ పేపర్ రు. 20,000 కోట్లు, ప్రావిడెంట్ ఫండ్, కార్గిల్ శవ పేటికలు; 2003: తాజ్ కారిడార్, హడ్కో;

2004: తాజ్ కొ ఆపరేటివ్ గ్రూప్ హౌసింగ్ రు. 4000 కోట్లు, ఐపిఒ, ఆయిల్ ఫర్ ఫుడ్, బీహార్‌లో ఫ్లడ్ రిలీఫ్ రు. 17 కోట్లు; 2006: కేరళ ఐస్‌క్రీమ్ పార్లర్ సెక్స్ స్కాండల్, స్కోర్ పీస్ డీల్, పంజాబ్ సిటీ సెంటర్ ప్రాజెక్ట్, రు. 1500 కోట్లు, నేవీ వార్ రూమ్ స్పై. 2008: క్యాష్ ఫర్ ఓటు, హసన్ అలీ బ్లాక్ మనీ వివాదం, సత్యం, స్టేట్ బ్యాంక్ ఆఫ్ సౌరాష్ట్ర రు. 95 కోట్లు, ఆర్మీ రేషన్ ఫిల్ఫరేజ్, రు. 5000 కోట్లు, జార్ఖండ్ మెడికల్ ఎక్విప్‌మెంట్ రు. 130 కోట్లు, హర్యానా ఉపాధ్యాయుల నియామకం, ఫాజీ ఫొరెక్స్ రు. 800 కోట్లు;

2009: మధుకోడా మైనింగ్, గోవా స్పెషల్ ఎకనామిక్ జోన్ (సెజ్), బియ్యం ఎగుమతి రు. 2500 కోట్లు, ఒడిశా మైనింగ్ రు. 7000 కోట్లు, ఒడిశా ధాన్యం, సుఖ్నాలాండ్–డార్జింగ్ వసుంధర రాజే లాండ్ ఆస్ట్రల్ కోక్ రు. 1000 కోట్లు, గుజరాత్ విడిఎస్‌జిసియు చెరువు రు. 18.7 కోట్లు.

2010: ఆదర్శ హౌసింగ్ సొసైటీ, అస్సాం నార్త్ సచార్ హల్స్, అరుణాచల్ ప్రదేశ్ పిడిఎస్ రు. 1000 కోట్లు, ఎల్ఐసి హౌసింగ్, కామన్‌వెల్త్ గేమ్స్ రు. 28054 కోట్లు – అంచనా కన్నా 100 రెట్లు బెలెకెరి పోర్ట్, ఆంధ్రప్రదేశ్ ఎం.ఆర్. రు. 2500 కోట్లు, మధ్యప్రదేశ్ ఎంజిఎన్ఆర్ఇజిఎ రు. 9 కోట్లు, జార్ఖండ్ ఎంజిఎన్ఆర్ఇజిఎ, ఇండియన్ ప్రీమియర్ లీగ్, ఉత్తరాఖండ్ సిటూర్గియా భూమి, ఎసిఐ లంచగొండితనం, చండీఘర్ బూల్.

## విఎచ్ కాలమ్

- ప్రపంచంలో ఆత్మహత్యలకు రాజధాని ఇండియా (2012 లెక్క) ఈ ఆత్మహత్యల్లో మూడోవంతు 15–29 వ వయసుగల వారే.
- 2015–2030 మధ్యకాలంలో 6700 లక్షలు కొత్తగా ఉపాధి కల్పించాల్సి ఉంటుంది.
- మీరు మీ ఉత్పత్తులను చౌకగా తయారు చేసుకోవాలంటే కార్మికులు కావాలంటే మా దేశంలో పెట్టుబడులు పెట్టండి – అమెరికా మాడిసన్ స్క్వేర్‌లో మోడీ.
- దేశంలో బొగ్గు గనులలో నిల్వలు 18 బిలియన్ టన్నులు అంటే 17 సంవత్సరాల్లో బొగ్గు గనులు అంతరించిపోతాయి.
- వ్యవసాయం మన సాంప్రదాయం; మనదేశ అవసరం కాని పాశ్చాత్యులకు అదొక వ్యాపార వస్తువు కాగా లాభాలే ముఖ్యం.
- మానవ సంబంధాలన్ని ఆర్థిక సంబంధాలుగా మారుతున్నాయి– మార్క్స్
- ఇండియాలో రు.600 కోట్ల విలువగల చాకోలేట్లు అమ్ముడు పోతున్నాయి.
- వందరోజుల్లో అద్భుతాలు జరగవు – వెంకయ్యానాయుడు మొన్నటి ఉప ఎన్నికల్లో (హర్యానా, మహారాష్ట్ర ఎన్నికలకు ముందు) బిజెపి 24 సిట్టింగ్ స్థానాల్లో 14 సీట్లలో ఓటమి అద్భుతం కాదా?
- రాజస్థాన్ ముఖ్యమంత్రి వసుంధర రాజే 58 మంత్రిత్వశాఖల్లో 47 శాఖలు తన వద్దనే ఉంచుకున్నారు.
- నిజాం చరిత్రను పాఠ్యాంశంగా చేర్చాలి – అసదుద్దిన్ ఒవైసీ. వేల మందిని రజాకార్ల సాయంతో కాల్చిచంపిన విషయాన్ని కూడా ఆ పాఠ్యాంశంగా చేరిస్తే ఒవైసీ ఒప్పుకుంటారా?
- ఆంధ్రప్రదేశ్ కొత్త రాజధాని నిర్మాణం కోసం నాలుగు లక్షల కోట్లు కావాలని చంద్రబాబు, కాని ఫైనాన్స్ కమిషన్ అడిగింది లక్ష కోట్లు. మిగతా మూడు లక్షల కోట్లు ఎక్కడి నుంచి తెస్తారు?
- విప్లవం, నేరాలు అనేవి పేదరికం నుంచి పుడుతాయి– అరిస్టాటిల్
- ఇవాళ (ఆగస్టు 14, 2014) మన తయారీ రంగం వాటా జిడిపిలో 17 శాతం; అదే చైనాలో 50 శాతం; మలేషియాలో 40 శాతం (లారెన్స్ అండ్ టోబ్రో సంస్థ)
- కేంద్ర మంత్రుల్లో ఉమా భారతి బాబ్రీ మసీదు కూల్చివేతలో నిందితురాలు. సంజీవ్ బలయాన్ ముజఫర్‌నగర్ మతఘర్షణల్లో 17 రోజుల పాటు పోలీసు కస్టడీ.
- దేశ తయారీరంగం మాంద్యం; ఎగుమతుల్లో తగ్గుదల అయినా జిడిపి 5.4 శాతానికి పెరిగిందట.
- ప్రపంచంలో ఆకలితో 80.5 కోట్లు అల్లలాడుతుండగా వారిలో భారతీయులు 19 కోట్లు – అజిత్ సేథ్, కాబినెట్ సెక్రటరీ
- మనుషులను అణచివేయగలం కాని భావాలను అంతమొందించలేం – భగత్‌సింగ్
- మోడీ నినాదం మేక్ ఇన్ ఇండియా
- చైనా నినాదం మేడిన్ చైనా. వీ

2011: ఇస్రో ఎస్ – బాండ్ (ఇస్రో దేవాస్ డీల్ అంటారు. అయితే డీల్ ఉపసంహరించబడింది) రు. 2,00,000 కోట్లు, ఎన్‌టిఆర్‌ఒ రు. 800 కోట్లు. కెజి బేసిన్ అయిల్స్, గోవా మైనింగ్, బళ్లారి మైనింగ్, బృహత్ బెంగళూర్ మహానగర్ పాలిక్, హిమాచల్ ప్రదేశ్, ఎచ్ఎంయుడిఏ హౌసింగ్, పూణే హౌసింగ్, పూణే భూమి, ఒడిశా పల్స్ రు. 700 కోట్లు, కేరళ ఇన్వెస్ట్‌మెంట్ రు. 1000 కోట్లు, ముంబై అమ్మకం పన్ను రు. 1000 కోట్లు, మహారాష్ట్ర విద్య రు. 1000 కోట్లు, మహారాష్ట్ర పిడిఎస్, ఉత్తరప్రదేశ్ టెట్, ఉత్తరప్రదేశ్ ఎంజిఎన్‌ఆర్‌ఇజిఎ, ఒరిస్సా ఎంజిఎన్‌ఆర్‌ఇజిఎ, ఇండియన్ ఎయిర్ ఫోర్స్ భూమి, టట్రా (రు. 750 కోట్లు), బీహార్ సోలర్ లాంప్ రు. 40 కోట్లు, బిఎల్ కాశ్యప్ – ఇపిఎఫ్ఒ రు. 169 కోట్లు, అస్సాం విద్య, స్టాంప్ పేపర్ రు. 2.34 కోట్లు, పూణే యుఎల్‌సి.

2012: ఇండియన్ కోల్ మైనింగ్ వివాదం రు. 1,85,591.34 కోట్లు, కర్నాటక వక్ఫ్‌బోర్డ్ లాండ్ రు. 2,00,000 కోట్లు, ఉత్తరప్రదేశ్ ఎన్ఆర్‌హెచ్ఎం 2012 రు. 10,000 కోట్లు, 2జి స్పెక్ట్రమ్ 2010 రు. 1,76,000 కోట్లు, ఉత్తరప్రదేశ్ ఫుడ్ గ్రైన్ 2003 రు. 35,000 కోట్లు – పేదల కోసం ప్రభుత్వం సేకరించి మార్కెట్‌లో అమ్మేసింది. మహారాష్ట్ర ఇరిగేషన్ నష్టం రు. 72,000 కోట్లు (విచారణలో ఉంది), కినెటిక్ ఫైనాన్స్ లిమిటెడ్ రు. 200 కోట్ల మేరకు బ్యాంకులు నష్టపోయాయి (విచారణలో ఉంది), అల్ట్రా మెగా పవర్ ప్రాజెక్టుల – అనిల్ అంబానీ రిలయన్స్ పవర్‌కు కేంద్ర ప్రభుత్వం అనుకూల నిర్ణయం వల్ల నష్టం రు. 29033 కోట్లు, ఇందిరాగాంధీ ఇంటర్నేషనల్ విమానాశ్రయం జిఎంఆర్‌కు అనుకూల నిర్ణయం వల్ల కేంద్ర ప్రభుత్వానికి నష్టం రు. 1,66,972.35 కోట్లు.

ఆంధ్రప్రదేశ్ భూమి రు. 1,00,000 కోట్లు, ఫారెక్స్ డిరైవేటివ్స్ రు. 32,000 కోట్లు, తమిళనాడులో గ్రనైట్, సర్వీస్ టాక్స్, సెంట్రల్ ఎక్సయిజ్ డ్యూటీ రు. 19,159 కోట్లు, గుజరాత్ ద్రవ్య ఇర్రెగ్యులారిటీస్ రు. 17,000 కోట్లు, మహారాష్ట్ర స్టాంప్ డ్యూటీ రు. 600 కోట్లు, మహారాష్ట్ర లాండ్, ఎంఎచ్ఎడిఎ రిపేరు రు. 100 కోట్లు, హైవే రు. 70 కోట్లు.

విదేశాంగ వ్యవహారాల మంత్రి వర్గం గిఫ్ట్, హిమచల్‌ప్రదేశ్ పల్స్, ఫ్లైయింగ్ క్లబ్ ఫ్రాడ్ రు. 190 కోట్లు, ఆంధ్రప్రదేశ్ లిక్కర్, జమ్మూ–కశ్మీర్ క్రికెట్ అసోసియేషన్ రు. 50 కోట్లు, జమ్మూ–కశ్మీర్ పిఎచ్ఇ, జమ్మూ–కశ్మీర్ రిక్రూట్‌మెంట్, జమ్మూ–కశ్మీర్ ఎగ్జామ్ గేట్, జమ్మూ–కశ్మీర్ డెంటల్, పంజాబ్ ధాన్యం రు. 18 కోట్లు, ఎన్ఎచ్‌పిసి సిమెంట్, హర్యానా అటవీ, గిరివన్ (పూణే) భూమి, టాయిలెట్, ఉత్తరప్రదేశ్ హార్టీ కల్చర్ రు. 70 కోట్లు, ఉత్తరప్రదేశ్ పామ్ ట్రీ ప్లాన్‌టేషన్ రు. 55 కోట్లు, ఉత్తరప్రదేశ్ సీడ్, ఉత్తరప్రదేశ్ ఏనుగు స్టాట్యూ, పాటియాలా లాండ్ రు. 250 కోట్లు, బెంగళూరు మేయర్ ఫండ్, రాంచి రియల్ ఎస్టేట్, ఢిల్లీ సర్జికల్ గ్లోవ్స్ సేకరణ, ఆధార్, బిఇఎంఎల్ హౌసింగ్ సొసైటీ, ఎంఎస్‌టిసి బంగారం ఎగుమతి రు. 464 కోట్లు, టిన్, నయాగా (పంజాబ్) భూమి.

*(2013 మనోరమ ఇయర్ బుక్ ఆధారంగా)*

*(రచయిత వీక్షణం వ్యవస్థాపక సంపాదకులు)* వీ

# సైనిక బలగాల చట్టబద్ధ దుర్మార్గాలు

***సాయుధ దళాల ప్రత్యేక అధికారాల చట్టం కింద కశ్మీర్‌లోను, ఈశాన్య రాష్ట్రాలలోను ఎన్నెన్ని దుర్మార్గాలు జరుగుతున్నాయో పది ఉదాహరణల ద్వారా వివరిస్తున్నారు* రవి నితేష్**

మాచిల్ బూటకపు ఎన్‌కౌంటర్ కేసులో జరిగిన సైనిక న్యాయ విచారణ (కోర్ట్ మార్షల్) ఇటీవల ఏడుగురు సైనికులకు యావజ్జీవ కారాగార శిక్ష విధించింది. నిజానికి అది ఒక్కటే బూటకపు ఎన్‌కౌంటర్ కేసు కాదు. సాయుధ దళాల ప్రత్యేక అధికారాల చట్టం (ఆర్మ్‌డ్ ఫోర్సెస్ స్పెషల్ పవర్స్ యాక్ట్ 1958) అనే దుర్మార్గమైన చట్టం అమలులో ఉన్న ప్రాంతాలలో సైనిక బలగాలు ఎటువంటి హంతకనేరాలకు పాల్పడినా ఏ పౌర న్యాయస్థానంలోనూ సవాలు చేసే అవకాశం లేకపోవడంతో, ఆ ప్రాంతాలన్నీ మానవహక్కుల ఉల్లంఘనా కేంద్రాలుగా మారిపోయాయి. మాచిల్ వంటి బూటకపు ఎన్‌కౌంటర్ హత్యలు జరిగిన ప్రాంతాలు బైటపడినవీ, బైట పడనివీ ఎన్నో ఉన్నాయి. సైనిక బలగాలు జరిపిన అత్యాచారాల గురించి పూర్తి వివరాలు బయటపడాలంటే వాటన్నిటినీ వెలుగులోకి తేవాలి.

ఇక్కడ ప్రతి ఒక్కరూ తెలుసుకోవలసిన అత్యంత దుర్మార్గమైన పది ఘటనల జాబితా చూద్దాం. సాయుధ దళాల ప్రత్యేక అధికారాల చట్టం సహాయంతో సైనిక బలగాలు ఎంత దారుణమైన అత్యాచారాలకు పాల్పడ్డాయో, ఆ నేరాల మీద విచారణ జరపడం, నేరస్తులను శిక్షించడం ఎంత కష్టమో ప్రతి ఒక్కరూ తెలుసుకోవాలి. అంతేకాదు, ఈ నేరాలు ఎప్పుడో గతంలో జరిగిపోయినవి కాదు, ఈ క్షణాన కూడ ఇవి జరగడానికి సాయుధ దళాల ప్రత్యేక అధికారాల చట్టం సైనిక బలగాలకు అధికారం ఇస్తున్నది. ఇక్కడి జాబితాలో పది ఘటనలే ఉన్నప్పటికీ ఈ చట్టం అమలులో ఉన్న ఈశాన్య రాష్ట్రాలలోను, జమ్ము-కశ్మీర్‌లోను ఇటువంటి ఘటనలు వందలూ వేలూ ఉన్నాయి.

**ఆపరేషన్ బ్లూబర్డ్ (ఒయినమ్, బిష్ణుపూర్ జిల్లా, మణిపూర్):** మణిపూర్‌లోని ఒయినమ్‌లో 1987 జులై 11న మొదలైన సైనిక దళాల చర్య పేరు ఆపరేషన్ బ్లూబర్డ్. ఈ చర్యలో 30 నాగా గ్రామాల మీద సైనికదళాలు దాడి చేసి లైంగిక అత్యాచారాలు, దొంగతనాలు, లూటీలు, చిత్రహింసలు, హత్యలతో సహా దారుణమైన మానవహక్కుల ఉల్లంఘనలెన్నో సాగించాయి. నాగా పీపుల్స్ మూవ్‌మెంట్ ఫర్ హ్యూమన్ రైట్స్ దాఖలు చేసిన దరఖాస్తు ప్రకారం ఈ గ్రామాలలో సైనికులు ఇళ్లు తగులబెట్టారు, కూలగొట్టారు. ఎంతో మంది స్త్రీలను చిత్రహింసలు పెట్టారు. ఎంతో మందిని బూటకపు ఎన్‌కౌంటర్లలో కాల్చి చంపారు. ఎన్నో రోజుల పాటు జరిగిన ఈ చర్యలో గ్రామాలను దిగ్బంధనం చేసి బైటి ప్రపంచంతో సంబంధం లేకుండా చేశారు. చివరికి పౌర పాలనాధికారులను కూడ గ్రామాల్లోకి రానివ్వలేదు. ఈ అత్యాచారాల మీద న్యాయస్థానాలలో ఫిర్యాదులు నమోదైనప్పటికీ, సైనికులు హైకోర్టు రిజిస్ట్రార్‌ను కూడ గ్రామస్తుల వాంగ్మూలాలు తీసుకోకుండా నిర్బంధించారు. ఇప్పటివరకూ ఎటువంటి చర్యలూ జరగలేదు.

**కునన్ పోష్పోరా (కుప్వారా జిల్లా, జమ్ము-కశ్మీర్):** కుప్వారా జిల్లాలోని కునన్ పోష్పోరా గ్రామంలో 1991 ఫిబ్రవరి 23న భారత సైనికులు సోదా చేపట్టారు. ఈ సోదాలో గ్రామస్తులందరినీ కుప్పవేసి, అందరి ముందూ గర్భిణులతో సహా 100 మంది స్త్రీలపై సైనికులు అత్యాచారం జరిపారని ఆరోపణలు వచ్చాయి. ప్రభుత్వం ఎటువంటి విచారణా జరపలేదు. ఈ ఘటనను నమోదు చేయడానికి గ్రామానికి వెళ్లిన మొట్టమొదటి పోలీసు అధికారి, తన నివేదికను వెల్లడించవద్దని తనమీద ఎన్నోసార్లు ఒత్తిడి వచ్చిందని 2014లో ప్రకటించాడు. అత్యాచార ఆరోపణలు 'నిరాధారం' అని చెప్పడానికి ప్రభుత్వం తీవ్రంగా ప్రయత్నించింది. కనీస సాధారణ పరిశోధనా ప్రయత్నాలు కూడ జరగని ఇటువంటి ఘటన మరొకటి తాను చూడలేదని జమ్ము-కశ్మీర్ హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి అన్నారు. ఈ అత్యాచారాల గురించి నమోదైన కేసు ఒకటి సుప్రీం కోర్టులో ఇంకా నడుస్తూనే ఉంది.

**బిజ్ బెహారా కాల్పులు (అనంత్ నాగ్ జిల్లా, జమ్ము-కశ్మీర్):** బిజ్ బెహారా గ్రామంలో ఒక నిరసనకారుల బృందంపై 1993 అక్టోబర్ 22న బిఎస్ఎఫ్ బలగాలు జరిపిన కాల్పుల్లో దాదాపు 35 మంది పౌరులు చనిపోయారు. ఆ కాల్పులు ఒక శాంతియుత ప్రదర్శనపై ఎటువంటి రెచ్చగొట్టే చర్యలు లేకుండానే, అనవసరంగా జరిగాయని ఆరోపణలు వచ్చాయి. కాల్పులు అనవసరంగా, అవతలివైపు నుంచి ఎటువంటి కవ్వింపు లేకుండానే జరిగాయని మెజస్టీరియల్ విచారణ, జాతీయ మానవహక్కుల సంఘం విచారణ కూడ నిర్ధారించాయి. ఈ రెండు నివేదికలను, నిర్ధారణలను అంగీకరించిన జమ్ము-కశ్మీర్ హైకోర్టు బాధితులకు, బాధిత కుటుంబాలకు నష్టపరిహారం చెల్లించాలని ఆదేశించింది. కాని కాల్పులు జరిపిన బిఎస్ఎఫ్ బలగాల మీద విచారణ జరిపేందుకు అవసరమైన అనుమతి లభించలేదు. విచారణా జరగలేదు.

**మాలమ్ (ఇంఫాల్ జిల్లా, మణిపూర్):** ఇంఫాల్ సమీపంలోని మాలం బస్ స్టాండ్ దగ్గర 2000 నవంబర్ 2న అస్సాం రైఫిల్స్ బలగాలు జరిపిన కాల్పులలో పది మంది చనిపోయారు. మృతులలో అరవై సంవత్సరాల వృద్ధురాలు, సాహస బాలుడి పతకం పొందిన 18 సంవత్సరాల బాలుడు కూడ ఉన్నారు. ఈ కాల్పులతో మణిపూర్‌లో ఆగ్రహజ్వాలలు రగిలాయి. నిరసన ప్రదర్శనలు జరిగాయి. సాయుధ దళాల ప్రత్యేక అధికారాల చట్టాన్ని రద్దు చేయాలనే డిమాండ్‌తో ఇరోమ్ షర్మిలా ఈ కాల్పుల తర్వాతనే నిరాహారదీక్ష ప్రారంభించారు. అయితే ఇప్పటికీ ఎటువంటి చర్యలూ జరగలేదు.

**పత్రిబాల్ (అనంతనాగ్ జిల్లా, జమ్ము-కశ్మీర్):** రాష్ట్రీయ రైఫిల్స్ బలగాలు 2000 మార్చి 25న పత్రిబాల్ గ్రామంలో ఐదుగురు పౌరులను పట్టుకుపోయి, వారిని 'విదేశీ మిలిటెంట్లు'గా, చత్తీసింగ్ పురా కేసులో

నిందితులుగా చిత్రించి కాల్చిచంపాయి. ఆ ఐదుగురూ గ్రామస్తులని, ఎటువంటి తీవ్రవాద చర్యలలోనూ పాల్గొన్న వారు కాదని వాదిస్తూ స్థానిక ప్రజలు ఈ ఘటనను ఖండించారు. సాయుధ దళాల ప్రత్యేక అధికారాల చట్టం ఇచ్చే అధికారాలతో ఇటువంటి పనులు చేయవచ్చు గనుక ఈ ఐదుగురి హత్యలపై ఎటువంటి కేసూ నమోదు కాలేదు. కాని గ్రామస్తుల నిరసన జ్వాలలు ఎగియడంతో, ఈ ఘటనపై విచారణ జరపమని సిబిఐని ఆదేశించారు. మృతులను గ్రామం నుంచి పట్టుకుపోయి, బూటకపు ఎన్‌కౌంటర్‌లో కాల్చి చంపారని సిబిఐ పరిశోధనా నివేదిక నిర్ధారించింది. రాష్ట్రీయ రైఫిల్స్ 7 బలగాలకు చెందిన ఒక బ్రిగేడియర్, ఒక లెఫ్టినెంట్ కర్నల్, ఇద్దరు మేజర్లు, ఒక సుబేదార్ ఈ హత్యలకు బాధ్యులని సిబిఐ ప్రకటించింది. ఈ ఎన్‌కౌంటర్‌లు 'ఉద్దేశపూర్వక హత్యలు' అని సిబిఐ నిర్ధారించింది. సిబిఐ నివేదికను అనుసరించి, భారత సైనికుల మీద కోర్ట్ మార్షల్ జరపాలని 2011లో సుప్రీంకోర్టు ఆదేశించింది. సాయుధ దళాల ప్రత్యేక అధికారాల చట్టం ప్రకారం ఇటువంటి హంతకుల మీద సాధారణ పౌరన్యాయస్థానంలో హత్యా నేరం కింద విచారణ జరపడానికి వీలు లేదు. కాని, రెండు సంవత్సరాల తర్వాత ఎవరి మీదా ఎటువంటి చర్య లేకుండానే సైన్యం ఈ కేసును మూసివేసింది.

**మనోరమ హత్య (ఇంఫాల్ జిల్లా, మణిపూర్):** 2004 జూలై 10 రాత్రి మణిపూర్ ఇంఫాల్‌లో మనోరమ ఇంట్లోకి అస్సాం రైఫిల్స్ సైనికులు జొరబడ్డారు. ఆమె తల్లి, తమ్ముడు చూస్తుండగానే మనోరమను చిత్రహింసలకు గురిచేశారు. చివరికి తమతోపాటు ఈడ్చుకుపోయారు. మర్నాడు ఉదయం ఎంగారియన్ యైరిపోక్ రహదారి మీద మర్మావయవాల మీద తుపాకి కాల్పుల గాయాలతో మనోరమ మృతదేహం దొరికింది. ఈ ఘటన మీద ప్రజల నుంచి పెద్దఎత్తున నిరసన పెల్లుబికింది. సుప్రసిద్ధమైన నగ్న ప్రదర్శన కూడ ఈ ఘటనకు నిరసనగా జరిగినదే. కాని పౌర చట్టంలోని హంతక నేరాల కింద కేసు నమోదు చేయడానికి వీలు లేదు. స్థానికంగా ఒక న్యాయవిచారణ జరిగింది గాని దాని నివేదిక ఇంతవరకు వెల్లడి కాలేదు. సుప్రీం కోర్టులో ఈ విషయమై వేసిన ఒక ప్రజా ప్రయోజన వ్యాజ్యం ఇంకా సాగుతూనే ఉంది. ఇప్పటివరకూ తీర్పు వెలువడలేదు.

**షోపియాన్ హత్యలు (షోపియాన్ జిల్లా, జమ్ము-కశ్మీర్):** దాదాపు పదిహేడేళ్ల వయసున్న ఆసియా, ఇరవై రెండేళ్ల వయసున్న నీలోఫర్ అనే యువతులిద్దరు తమ పళ్లతోట నుంచి ఇంటికి తిరిగి వస్తుండగా 2009 మే 29న అదృశ్యమయ్యారు. మర్నాడు ఉదయం వారి మృతదేహాలు దొరికాయి. దగ్గరలో ఉన్న క్యాంపుకు చెందిన భద్రతా బలగాల సైనికులే ఆ ఇద్దరు యువతులపై అత్యాచారం చేసి చంపేశారని ప్రజలు ఆరోపించారు. మొదట ఎటువంటి ప్రాథమిక నేర సమాచార నివేదిక (ఎఫ్ఐఆర్) నమోదు కాలేదు. ఆ యువతుల మర్మావయవాలపై ఎటువంటి గాయాలు లేవని శవపరీక్షలో తేలిందని పోలీసులు అన్నారు. కాని ఆ శవపరీక్ష నివేదిక బూటకమంటూ ప్రజలు తమ నిరసన ప్రకటించడం ప్రారంభించారు. చివరికి జమ్ము-కశ్మీర్ ప్రభుత్వం ఒక న్యాయవిచారణకు ఆదేశించవలసి వచ్చింది. ఆ ఇద్దరు యువతులమీద సామూహిక అత్యాచారం జరిగిందని న్యాయవిచారణ క్రమంలో ఫోరెన్సిక్ లాబ్ నివేదిక చాల స్పష్టంగా ప్రకటించింది. పోలీసు శాఖలో కొద్ది మందిని తాత్కాలికంగా ఉద్యోగాల నుంచి తొలగించడం, బదిలీ చేయడం మినహా ఎవరి మీదా ఎటువంటి శిక్షా అమలు జరగలేదు.

**జమ్ము-కశ్మీర్‌లో సామూహిక ఖననాలు:** బండీపొరా, బారాముల్లా, కుప్వారా తదితర జిల్లాలలో గుర్తుతెలియని 3000 మంది సామూహిక ఖనన స్థలాలు 2008-09లో బయట పడ్డాయి. ఈ మృతదేహాలలో ఎక్కువ భాగం సాయుధ దళాల ప్రత్యేక అధికారాల చట్టం వల్ల జవాబుదారీతనం లేకుండా పోయిన భద్రతా బలగాలు చంపి, పాతిపెట్టిన వారివే అయి ఉంటాయని అందరూ అనుకున్నారు. వేలాది మంది అదృశ్యమయ్యారు గనుక ఇవి అటువంటి 'మాయమైపోయిన' వారి మృతదేహాలు కావచ్చునని అనుకున్నారు. ఈ గుర్తు తెలియని సమాధులలో వేలాది మృతదేహాలకు తుపాకి తూటాల గుర్తులున్నాయని రాష్ట్ర మానవ హక్కుల సంఘం నిర్ధారించింది. కనీసం 500 మృతదేహాలు స్థానికులవేనని, సైనిక బలగాలు చెప్పినట్టుగా 'విదేశీ మిలిటెంట్లవి' కావని గుర్తించారు. మానవహక్కుల సంఘాలు, స్థానిక ప్రజలు పెద్ద ఎత్తున ఆందోళన చేసినప్పటికీ ప్రభుత్వం వైపు నుంచి ఎటువంటి నిర్దిష్టమైన చర్యలూ జరగలేదు.

**మాచిల్ ఎన్‌కౌంటర్ (కుప్వారా జిల్లా, జమ్ము-కశ్మీర్):** 2010 ఏప్రిల్ 30న బారాముల్లాకు చెందిన ముగ్గురు పౌరులను భారత సైనికులు కుప్వారా జిల్లా మాచిల్ సెక్టర్ లో కాల్చిచంపి, వారిని 'విదేశీ మిలిటెంట్లు'గా ప్రకటించారు. అయితే, ఆ తర్వాత జరిగిన ప్రజాందోళనతో, నిరసనతో విచారణ జరిపించవలసి వచ్చింది. ఆ ముగ్గురు వ్యక్తులు స్థానిక పౌరులని, వారికి హమాలీ పని ఇప్పిస్తామనే ఆశచూపి సైనికులు ఇళ్లలోంచి తీసుకుపోయారని, ఆ తర్వాత చంపి పడేసి ఎన్‌కౌంటర్ కథ అల్లారని విచారణలో వెల్లడయింది. జమ్ము-కశ్మీర్ రాష్ట్రవ్యాప్తంగా పెద్ద ఎత్తున నిరసన జ్వాలలు ఎగిశాయి. నిరసనలను అరికట్టడానికి సైనికబలగాలు మరింత దమనకాండకు పాల్పడ్డాయి. మొత్తం మీద 2010 వేసవి కాలమంతా జరిగిన ఆ నిరసన ప్రదర్శనల్లో 110 మంది బలి అయిపోయారు. చివరికి, స్వయంగా భారత సైన్యం జరిపిన విచారణలో ఈ ఎన్‌కౌంటర్ బూటకమని నిర్ధారణ అయి, 2014 నవంబర్ లో ఇద్దరు అధికారులకు, ఐదుగురు సైనికులకు యావజ్జీవ శిక్ష విధించారు. ఈ సైనికాధికారులు సాధారణ పౌరులను హత్య చేశారని, ఆ తర్వాత మృతదేహాల ముఖాలకు నల్లరంగు పూసి, మృతదేహాల చేతుల్లో తుపాకులు పెట్టి, వారిని 'విదేశీ మిలిటెంట్లు' గా చిత్రించి 'మిలిటెన్సీ వ్యతిరేక చర్య'ల వీరత్వానికి గాను బహుమానాలు కూడ పొందారని నిర్ధారణలో వెల్లడయింది.

**చట్టవ్యతిరేక హత్యాకాండలో మృతులైన 1528 మంది:** భారత సుప్రీం కోర్టులో దాఖలయిన ఒక రిట్ పిటిషన్ ప్రకారం 1979 మే నుంచి 2012 మే వరకు, దాదాపు 1528 సందర్భాలలో భారత సైనిక బలగాలు చట్టవ్యతిరేక హత్యలకు పాల్పడ్డాయి. వాటి నుంచి సుప్రీం కోర్టు ఆరు సంఘటనలను మాత్రం తీసుకుని, వాటిని విచారించడానికి మాజీ న్యాయమూర్తి సంతోష్ హెగ్డే అధ్యక్షుడిగా, మరొక ఇద్దరు సభ్యులతో అత్యున్నతాధికార న్యాయవిచారణ సంఘాన్ని నియమించింది. ఆ ఆరు సంఘటనలూ కూడ బూటకపు ఎన్ కౌంటర్లేనని, ఏ ఒక్క సందర్భంలోనూ మృతులకు అంతకుముందు ఎటువంటి నేరాలకు పాల్పడిన చరిత్ర లేదని ఆ విచారణ సంఘం నివేదిక ఇచ్చింది. సుప్రీం కోర్టులో ఈ కేసు ఇంకా నడుస్తోంది.

*(రచయిత పెట్రోలియం ఇంజనీర్. 'మిషన్ భారతీయం' సంస్థ వ్యవస్థాపకులు, 'సేవ్ షర్మిలా సాలిడారిటీ క్యాంపెయిన్' సభ్యులు. ఈ వ్యాసం www.countercurrents.org మీద అచ్చయింది.)* వీ

విధానవిమర్శ

# స్వచ్ఛతలేని మోడీ రాజకీయ ప్రయాణం

***ఇప్పటి వరకు అధికారంలో ఉన్న కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు అనేక సార్లు సంక్షేమ పథకాల పేరుతో చీపుర్లు పట్టినవేననీ, ముందుగా శుద్ధ గంగా, స్వచ్ఛ భారత్ వీధుల్లో కాదు రాజకీయ రంగంలో జరగాలనీ అంటున్నారు* వై.ఎచ్.కె. మోహన్‌రావు**

రెండు దశాబ్దాలకు పైగా భారతీయ కేంద్ర రాజకీయాలను శాసించిన సంకీర్ణ తత్వాన్ని సవాలు చేసి సంపూర్ణ బలగంతో భారతీయ జనతా పార్టీ అధికారంలోకి వచ్చింది. మూడు పర్యాయాలు గుజరాత్ రాష్ట్రంలో బిజెపిని ఒంటి చేత్తో అధికారంలోకి తీసుకు వచ్చిన మోడీ చరిష్మా ఆ పార్టీ కేంద్ర ప్రభుత్వాన్ని కైవసం చేసుకునేందుకు పూర్తిగా ఉపకరించిందనడంలో ఎట్టి సందేహం లేదు. క్రమం తప్పకుండా గుజరాత్‌లో అధికారం చేపట్టిన మోడీ వద్ద 'ఏదో' మంత్రదండం ఉండే ఉంటుందని భారత ప్రజలు విశ్వసించారు. మోడీ ఆకర్షణే బిజెపి కేంద్రంలో అధికారంలోకి వచ్చేందుకు ఉపకరించింది. దేశవ్యాప్తంగా రాష్ట్రాలలో ఏ పార్టీకి బద్ధులైనప్పటికీ మోడీ దేశానికి ఏదో చేస్తాడనే నమ్మకాన్ని వెల్లడిచేస్తూ కేంద్రంలో అధికారంలోకి తెచ్చేందుకు బిజెపి వైపుకు ప్రజలు మొగ్గుతూ ఆ పార్టీ పార్లమెంట్ అభ్యర్థులకు ఓట్లు వేశారు.

సునాయాసంగా అధికారంలోకి వచ్చిన బిజెపి పార్టీ ప్రతినిధిగా అధికారాన్ని చేపట్టిన నరేంద్రమోడీ ప్రధానమంత్రిగా ఇప్పటి వరకూ దేశ ప్రజలకు చేసిన మేలేమిటో చెప్పమంటే మాత్రం ఎవరైనా తలగోక్కోవల్సిందే! ప్రయోజనం ఒక్కటి లేకపోగా అధికారంలోకి రాగానే ఏదో ఆకాశం విరిగి పడుతున్నట్లు ఏమాత్రం ఆలస్యం, ఆలోచన చేయకుండా దేశంలోని ప్రతి వ్యక్తికి జేబు భారమయ్యే విధంగా 14 శాతం రైలు చార్జీలను పెంచి పడేశారు. మోడీపైనా, బిజెపి ప్రభుత్వం పైనా అప్పటి వరకూ పూర్తి విశ్వాసంతో ఉన్న దేశం రైల్వే చార్జీల మోతతో ఒక్కసారిగా ఉలిక్కిపడింది. అయితే ఈ పెంపు ఇబ్బందికరమైనా ఈ భారీ పెరుగుదల వల్ల ముందు ముందు ప్రజలు మంచి ప్రయోజనాలు పొందుతారని ఆ పార్టీ ప్రతినిధులు, నాయకులు మీడియా ముందుకొచ్చి ప్రజలను బుజ్జగించే యత్నం చేశారు. రుగ్మత తగ్గి ఆరోగ్యంగా ఉండాలంటే చేమగుళికలు మింగడం తప్పదన్నారు. ఈ విషయంపై దేశ ప్రజలు కొంతమేర ఆగ్రహం వెలిబుచ్చినా పెద్ద ఎత్తున ఆందోళనల వరకూ వెళ్లలేదు.

నరేంద్రమోడీ పాలన నూరు రోజుల పండుగ దాటి ఐదో మాసానికి అడుగుపెట్టింది. నూరు రోజులు ఉత్సవాలు జరిపి హంగామా చేశారు. అయితే ప్రజల్లో మాత్రం అంత సంతోషం గానీ, సంతృప్తి గానీ నిండుకున్నట్లుగా కనిపించదు. ఆగస్టు 15 స్వాతంత్ర్య దినోత్సవ ప్రసంగంలో జన్‌ధన్ ఖాతాలంటూ పేద వారికి పెద్ద ఎత్తున ఉపయోగాలంటూ ఘనంగా ప్రకటించారు. ఈ బ్యాంకు ఖాతాలను ప్రారంభించినవారు ఆరు నెలల పాటు నడిపిన లావాదేవీల ప్రాతిపదికన 5 వేలు బ్యాంకు నుండి హామీలేని అప్పు పొందే వీలుందని, ఖాతా దారులకి 30 వేల జీవిత భీమా, లక్ష వరకూ ప్రమాద భీమా సౌకర్యం ఉంటుందని వెల్లడించారు. ఇప్పటి వరకూ ఖాతాలు ప్రారంభించిన పేద ప్రజలు ఈ ఖాతాలలో 15 వందల కోట్లు జమ చేశారని ప్రధాని మోడీ మనదేశ వేదికలపైననూ, పర్యటనలో అమెరికాలోనూ గొప్పగా చెపుతూ దేశాభివృద్ధికి సంపన్నులే కాదు! తాము కూడా భాగస్వాములం కాగలమని పేదలు సైతం రుజువు చేశారని ప్రధాని వెల్లడిస్తున్నారు. అయితే ఈ ఖాతాల ఉద్దేశానికి, ప్రధాని మోడీ చెపుతున్న అంశానికి పొంతన కుదరడం లేదు. ప్రభుత్వం పేదలకు ప్రయోజనం చేకూర్చడానికో, పేదలు ప్రభుత్వానికి సహాయ పడడానికో తెలియని ఒక సందిగ్ధ పరిస్థితిని ఈ జన్‌ధన్ ఖాతాల అంశం సృష్టించింది. బహుశా ఈ జన్‌ధన్ ఖాతాల సంఖ్య 5 కోట్లకు చేరి ముదుపు కూడా మరింత పెరిగి ఉంటుంది. కాగా జన్‌ధన్ ఖాతాలను ప్రారంభించేందుకు బ్యాంకు శాఖలు సహకరిండం లేదని ప్రజలు చెపుతున్నారు.

ఎన్నికల సరంభం ప్రారంభమైనప్పటి నుండి నేటి వరకూ దేశ ప్రజలు దేశాభివృద్ధి, నీతివంతమైన రాజకీయాల గురించి మోడీపైన ఎన్నో ఆశలు పెట్టుకున్నారు. ఆయనపై చాలానే నమ్మకం ఏర్పరచుకున్నారు. అయితే ఇప్పటి వరకూ ఆ దిశగా అడుగు పడినట్లు ధృవీకరించలేం. ఈనాటి వరకూ ఆయన ప్రసంగాలన్నీ ప్రతిభావంతమైన, ప్రభావవంతమైన ప్రణాళికలతో ఆశాజనకంగా ఉంటున్నాయి. ఆచరణలో, అమలులో అంకురార్పణ జరిగిందా? అంటే చెప్పడం కష్టమే.

నరేంద్రమోడీ ప్రధానమంత్రిగా తీసుకున్న బృహత్ నిర్ణయాలలో గంగానది ప్రక్షాళన ఒక ప్రధాన పథకం. గంగానది ప్రక్షాళన వలన 40 శాతం మంది భారత ప్రజలు లబ్ధి చెందుతారని మోడీ దృక్పథం. అదే విధంగా గాంధీ జయంతి నుండి ప్రారంభించి శుభ్ర భారత్‌ను స్థాపించే మరో ఆశయంతో మోడీ సాగుతున్నారు. దేశంలోని అపరిశుభ్రతను తొలగించాలనే దీక్షతో ఉన్నారు. దీనికి ప్రజలంతా సహకరించాలని, ఈ ఉద్యమంలో భాగస్వాములై మహాత్ముడు కళలు కన్న గ్రామ్యభారత్ నిర్మించాలనే పట్టుదలతో ఆయన ప్రయాణిస్తున్నారు.

అయితే మరికొన్ని లక్ష్యాలను కూడా భారతీయులు మోడీ నుండి పెద్ద ఎత్తున ఆశిస్తున్నారు. ఇంకొన్ని రంగాలలో కూడా శుద్ధత, శుభ్రతను వారు కోరుకుంటున్నారు. ఆయా రంగాలలో పేరుకు పోయిన మురుగును, కాలుష్యాన్ని మోడీ కడిగి పారెయ్యాలని ప్రజలు గట్టిగా కోరుతున్నారు. ప్రజలు పవిత్రంగా ఉండాలని ఆశిస్తున్న రంగాలలో

రాజకీయ రంగం, పాలనా రంగం ముఖ్యమైనవి. దేశంలో రాజకీయాలు, పరిపాలన ఎంత మేర భ్రష్టుపట్టాయో మాటలలో చెప్పడానికి, పదాలలో వివరించడానికి అలవికాదు. రాజకీయాలు అన్ని వైపులా మురికి బట్టి నైతికత మచ్చుకైనా కనిపించడం లేదు. అవినీతి పాలనలోని అన్నిమూలల్లో ఇక విస్తరించడానికి ఏమీ లేదన్నంతగా పాషాణ భరితమైందని చెప్పడానికి ఏమాత్రం తడుముకోవలసిన అవసరం లేదు.

రాజకీయాల ప్రక్షాళన, పాలనలో స్వచ్ఛత తీసుకురాకుండా వీథులు ఊడ్చి ప్రయోజనం లేదన్నది అందరూ ఎరిగిన సత్యమే. పౌరుడు ధైర్యంగా ఏ ప్రభుత్వ కార్యాలయాలకైనా వెళ్లగలిగే వాతావరణం ఏర్పరచకుండా శుద్ధ భారత్‌ను ఆశించలేం. వర్తమాన కాలంలో ప్రజలు ప్రభుత్వ కార్యాలయాలతో అవసరం రావడాన్ని తమ దురదృష్టంగా భావిస్తున్నారు. రక్షణాలయాల దరి చేరడం మరింత దౌర్భాగ్యంగా విశ్వసిస్తున్నారు. నిజం చెప్పుకోవాలంటే ఏ ప్రభుత్వ కార్యాలయంలోనూ పౌరుడు ఇచ్చే అర్జీకి రశీదు ఇస్తున్నారని చెప్పడం కష్టం. మామూళ్లు, ఆమ్యామ్యాలు లేకుండా ఏ ప్రభుత్వ వ్యవస్థలో పౌరుడికి సేవలు అందుతున్నాయో చెప్పాలంటే చూపుడు వేలు శూన్యం వైపు చూపడం కంటే చేయగలిగింది లేదు. కేవలం ఒక్క పాలకుడు నిజాయితీగా ఉన్నంత మాత్రాన దేశానికి ఉపయోగం ఏమీ ఒరగదని మాజీ ప్రధాని మన్మోహన్ సింగ్ ఉదాహరణగా మిగిలి వెళ్లారు. ఆయన 10 సంవత్సరాల పాలన ఏ ఒక్క రంగం కూడా నిజాయితీతో నిండుకోకపోగా, కుంభకోణాలతో కునారిల్లింది.

కామన్ వెల్త్, టుజి, కోల్‌గేట్ కుంభకోణాలు దేశ రాజకీయాలను అతలాకుతలం చేశాయి. ఈ కుంభకోణాలే ఇటీవల జరిగిన పార్లమెంట్ సాధారణ ఎన్నికలలో కాంగ్రెస్ పార్టీ పుట్టి ముంచాయి. కనీసం ఆ పార్టీ ప్రతిపక్ష హోదా దక్కించుకోలేక పోయింది. ఈ విధమైన విచ్చలవిడి కుంభకోణాలు, అవినీతిని ప్రధానిగా మన్మోహన్ పేరు ప్రజల ముందుకు వచ్చినప్పుడు ఏ ఒక్కరు కూడా అనుకోని ఉండరు. పాలనలో భారీ అవకతవకలు మన్మోహన్ వ్యక్తిత్వాన్ని మసకపరిచాయి. పాలనలో అవకతవకలు, అవినీతి ఈ విధంగా ఉంటే అణు ఒప్పందం బిల్లును పార్లమెంట్‌లో గట్టెక్కించేందుకు పాలక పార్టీ అనుసరించిన అనైతిక విధానం దేశ ప్రజలను ఖంగు తినిపించింది. ఆ సందర్భంలో ఇతర పార్టీల ఎంపిలను, ఆయా పార్టీల విప్‌లను దారి తప్పించిన తీరు మన్మోహన్‌ను బయట పడేసిందేమో కానీ! రాజకీయాలను మాత్రం మరింత పతనానికి చేర్చింది.

వాస్తవానికి రాజకీయ రంగంలో మార్పు రాకుండా దేశంలోని ఏ వ్యవస్థలోనూ కాలుష్యాన్ని నివారించడం సాధ్యమయ్యే పనికాదు. శుద్ధ గంగా, స్వచ్ఛ భారత్‌ను ముందుగా రాజకీయ రంగం నుండి ప్రారంభించాల్సిన అవసరం ఉంది. ప్రస్తుతం ప్రధాని నరేంద్రమోడీ గాంధీ జయంతి నాటి నుండి ప్రారంభించిన స్వచ్ఛ భారత్‌పై దేశ ప్రజలకు అంత నమ్మకం నాటుకోలేదు. ఎందుకంటే ఇప్పటి వరకూ అధికారంలో కొనసాగిన కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు అనేక సందర్భాలలో వివిధ పర్యాయాలు పలు పథకాల నీడలతో చీపుర్లు పట్టినవే. అప్పటి కప్పుడు ఫొటోలు దిగడం, మీడియా ముందుకొచ్చి పెద్దఎత్తున ప్రచారం చేయడం, ప్రకటనార్భాటాలతో పథకాలు అటకెక్కడం ఈ దేశ ప్రజలు ఎరుగని విషయమేమి కాదు. ముఖ్యంగా ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వాలైతే గతంలో చంద్రబాబు ముఖ్యమంత్రిగా జన్మభూమి, నీరు-మీరు పథకాలతో ప్రజల ముందుకు తెచ్చిన కార్యక్రమాలు చీపుర్లు పట్టించినవే.

రాజకీయాలే ఎందుకు ప్రక్షాళన కావాలంటే? ఏ దేశంలోనైనా ప్రజలకు పాలకులే ఆదర్శం. పాలకులు శుద్ధంగా, స్వచ్ఛంగా ఉంటే ప్రజలు కూడా ఆ నడవడినే అలవరచుకునే వీలుంటుంది. నరేంద్రమోడీ రాజకీయాలను ఆ మేరకు పరిశుద్ధంగా మార్చగలడా? శుద్ధ, స్వచ్ఛ కార్యక్రమాలతో పాటు రాజకీయ ప్రక్షాళన కూడా ప్రారంభిస్తాడా? ఆ దిశగా ఆలోచిస్తున్నట్లుగా కనిపించడం లేదు. ఎట్లాగంటే భారతీయ జనతా పార్టీకి పార్లమెంట్‌లో సంపూర్ణ ఆధిక్యత ఉంది. ఇదివరలో మాదిరిగా ప్రధానిగా కొనసాగాలంటే నరేంద్రమోడీకి ఇతర పార్టీల సహకారం అవసరం లేదు. ఏ ఇతర పార్టీ చెప్పినట్లుగా ఆయన నడుచుకోవలసిన అగత్యం కూడా లేదు. అదే విధంగా ఇతర పార్టీల తప్పిదాలు, అక్రమాలను నరేంద్రమోడీ గానీ, బిజెపి గానీ నెత్తికెత్తు కోవాల్సిన పనిలేదు. అయితే ఇక్కడ నరేంద్రమోడీ విషయంలోనూ, బిజెపి విషయంలోనూ స్పష్టత రావడం లేదు. ఎన్నికల్లో విజయం సాధించడానికి పార్టీలతో పొత్తులు సాధారణమే. ఆ మేరకే ఆంధ్రప్రదేశ్‌లో బిజెపి తెలుగుదేశం పార్టీతో పొత్తు పెట్టుకుంది. అయితే టిడిపి సహకారం అవసరం లేకుండానే బిజెపి కేంద్రంలో అధికారంలోకి వచ్చింది. అయితే పొత్తు పుణ్యమా అని టిడిపికి కూడా మంత్రి వర్గంలో చోటు కల్పించి నరేంద్రమోడీ పొత్తు ధర్మాన్ని పాటించారు. అయినంత మాత్రాన టిడిపి అనైతిక అక్రమాలన్నింటిని ఆమోదించవలసిన అవసరం నరేంద్రమోడీకి గానీ, బిజెపికి గానీ ఉండదు. ఎందుకో ఏమో నరేంద్రమోడీ, బిజెపి అట్లా భావిస్తున్నట్లుగా అనిపించడం లేదు. టిడిడి తప్పిదాలను వ్యతిరేకించేందుకు మోడీ, బిజెపి సిద్ధంగా లేదనిపిస్తుంది. ఈ క్రమంలో టిడిపి పాపాలలో తాము కూడా భాగస్వాములయ్యే ప్రమాదముంది.

లోక్‌సభ ఫలితాలనంతరం ప్రమాణ స్వీకారానికి ముందే నంద్యాల ఎం.పి. ఎస్‌పివైరెడ్డి, అరకు ఎం.పి. కొత్తపల్లి గీత పార్టీలను ఫిరాయించారు. వీరిద్దరూ ఆంధ్రప్రదేశ్ నుండి వైఎస్‌ఆర్‌సిపి అభ్యర్థులుగా గెలిచి పార్టీని ఫిరాయించారు. వీరిద్దరు కూడా టిడిపి తీర్థం పుచ్చుకున్నారు. అమలులో ఉన్న పార్టీ ఫిరాయింపుల చట్టం వీరిని ఏమాత్రం నిలువరించలేక పోయింది. కారణం వీరిరువురికి టిడిపి మద్దతు, ఆశీస్సులు మెండుగా ఉండడమే. టిడిపి. కేంద్ర పాలక పార్టీ బిజెపితో కలిసి పనిచేస్తున్నందునే వీరి పదవులకు ఎలాంటి డోకా రాలేదు. నిజానికి ఈ సంఘటనలు రాష్ట్ర శాసనసభకు సంబంధించినవి కావు.

శాసనసభ పరిధిలోని సమస్య అయితే శాసన సభ స్పీకరును తెలుగుదేశం పార్టీ ప్రభుత్వం ప్రభావితం చేసి వారి పదవులను కాపాడుతుందని అనుకోవడానికి వీలుంది. కాగా ఈ వివాదానికి పరిష్కారం లోక్‌సభ కేంద్రంగా జరగాలి. మరి వీరి ధైర్యం ఏమిటి? కేంద్రంలోని బిజెపి మద్దతు లభించడం వల్లనే వీరిరువురు ముందుకు సాగుతున్నారు. రాష్ట్ర, కేంద్ర రాజకీయాలలో బిజెపి, టిడిపి పార్టీలు సమ్మిళతమై ఉండడమే దీనికి ప్రధాన హేతువు. కేంద్రంలో టిడిపి భాగస్వామ్య పక్షంగా ఉండి ఒకరికొకరు సహకారంగా ఉన్నందున టిడిపి వైపుకు జరిగిన వైఎస్‌ఆర్‌సిపి ఎంపిలకు గుండె దిటవుగా ఉంది. ఇప్పటికే

# అంతర్జాతీయ మానవ హక్కుల దినోత్సవం

*ప్రపంచ వ్యాప్తంగా ప్రజా పోరాటాల ఫలితంగా వచ్చిన మానవ హక్కులను పాలకవర్గాలు సామ్రాజ్యవాద సంస్కృతిలో భాగంగా అడుగడుగునా ఉల్లంఘిస్తున్నాయని అంటున్నారు* **చిమ్మె జాన్ బర్నబాస్**

**1948** డిసెంబర్ 10న ఏర్పడిన ఐక్యరాజ్య సమితి సర్వసభ్య సమావేశంలో భాగంగానే అంతర్జాతీయ మానవహక్కుల ఒప్పంద తీర్మానం రూపొందించింది. ఇందులో 30 ఆర్టికల్స్, ప్రవేశిక ఉన్నది. దాదాపుగా భారత రాజ్యాంగంలోని ప్రాథమిక హక్కులన్నీ కూడా దీని నుంచి రూపొందించినవే. అవి 1950 జనవరి 26 నుంచి అమలులోకి వచ్చాయి. ఈ ప్రపంచంలో నివసించే ప్రజలందరికీ ఈ అంతర్జాతీయ మానవహక్కుల ప్రకటన వర్తిస్తుంది.

అంతర్జాతీయ (సార్వత్రిక) మానవ హక్కుల ప్రకటన సారాంశంలో రెండు భాగాలుగా విభజించవచ్చును. 1) పౌర, రాజకీయ హక్కులు. 2) సాంఘిక, ఆర్థిక, సాంస్కృతిక హక్కులు.

ఈ అంతర్జాతీయ మానవ హక్కుల స్ఫూర్తితోనే ప్రపంచ వ్యాప్తంగా వివిధ దేశాలలో (రాజ్యులలో) మానవ హక్కుల కమిషన్‌లు ఏర్పడ్డాయి. అవి పౌరులకు ఆయా రాజ్యాలలో జరుగుతున్న అణచివేత (అది రాజ్యం లేదా వ్యక్తుల చేత అణచివేత జరిగినప్పుడు) ను ప్రశ్నించి, శిక్షించే అధికారముంటుంది. మానవ హక్కుల కమిషన్‌లు ఇచ్చే తీర్పులు, ఆయా ప్రభుత్వాలు తప్పనిసరిగా పాటించవలసి ఉంటుంది. ప్రస్తుత పరిస్థితులలో అవి అమలు కావడం లేదన్నది అందరికీ తెలిసిందే. అంతే కాకుండా, విధిగా పాటించాల్సిన వ్యవస్థలూ, వ్యక్తులే, దానిని తృణీకరించడం, పాటించకపోవడం, వ్యతిరేకించడం శోచనీయం – ప్రజాస్వామ్య స్ఫూర్తికి విరుద్ధం. ప్రజా పోరాటాల వల్లనే వీటి అమలు సాధ్యమవుతుంది తప్ప, కేవలం పరిపాలనాధికారులు – రాజ్యంలోని శక్తులు ఎప్పుడూ హక్కుల ఉల్లంఘనను ఏదో ఒక మేరకు పాల్పడు తుండడం మనం చూస్తూ ఉన్నాం.

**చరిత్ర**

క్రీ.శ 1215లో ఇంగ్లండ్ అప్పటి రాజు జాన్ విడుదల చేసిన మాగ్నా కార్టా మొట్టమొదటి మానవ హక్కుల ప్రకటనగా భావించవచ్చు. న్యాయ బద్ధమైన తీర్పు ద్వారా తప్ప, మరే విధమైన పద్ధతులలోనూ, పౌరుని స్వేచ్ఛను బాదీ చేయడం – బహిష్కరించడం నిషిద్ధం అంటూ మాగ్నా కార్టా స్పష్టం చేసింది. ప్రపంచ దేశాలలో జరిగిన విప్లవాలకు ఇది నాంది ప్రస్థావనగా భావించవచ్చు. 1776లో అమెరికా స్వాతంత్ర్య ప్రకటన, 1789 ఫ్రెంచ్ విప్లవానికీ, ఈ మాగ్నా కార్టా ఒక పునాదిగా భావించవచ్చును. స్వేచ్ఛ, సమానత్వం, స్వాతంత్ర్యం భావనలకు మాగ్నా కార్టా పునాది వేసింది. రాజ్య వ్యవస్థకు వ్యతిరేకంగా ఏ విధంగా పోరాడాలో, ప్రతి వ్యక్తికీ చైతన్యం చేయడానికి, తమకు తాముగా చైతన్యం కావడానికి ఇదొక చారిత్రక నేపథ్యం.

భారతదేశం లాంటి అసమానత్వ వ్యవస్థల, సంక్లిష్ట సమాజపు దొంతరల సామాజిక వ్యవస్థలలో మానవ హక్కుల కొరకు పోరాడడం చాలా అవసరం, ఏ రాజకీయ నేపథ్యం అయినప్పటికినీ, ఇది అత్యంత ఆవశ్యకం. 1966 అంతర్జాతీయ సాంఘిక, ఆర్థిక, సాంస్కృతిక హక్కుల ప్రకటన ప్రపంచ వ్యాప్తంగా పాటించవలసిన హక్కుల నియమ –

వైఎస్ఆర్‌సిపి తమ పార్టీ నుండి ఫిరాయించి టిడిపితో చెలిమికట్టిన ఇరువురు ఎంపిలపై లోక్‌సభ స్పీకర్ సుమిత్రా మహాజన్‌కు అనర్హులుగా ప్రకటించాలని ఫిర్యాదు చేసింది. అయితే ఇంతవరకు స్పీకర్ సదరు ఫిర్యాదుపై దృష్టి సారించినట్లుగానూ, చర్యలు ప్రారంభించినట్లుగానూ సంకేతాలైతే లేవు. ఈ పరిణామాలను అంచనా కట్టినప్పుడు తమకు సఖ్యతగా ఉన్న టిడిపి పార్టీకి ఫిరాయించిన వైఎస్ఆర్‌సిపి ఎంపిల పట్ల లోక్‌సభ స్పీకర్ మెతకగా ఉన్నట్లు భావించవలసి వస్తుంది. బహుశా ఇందుకు బిజెపి పార్టీ సానుకూల వైఖరి కచ్చితంగా కారణమై ఉంటుంది. స్పీకర్ విధులతో ఎవరూ జోక్యం చేసుకునే అవకాశం లేకపోయినా ఆయా పార్టీల ప్రభావం మాత్రం తప్పకుండా ఉంటుందనేది జగమెరిగిన సత్యమే. ఈ పూర్వ రంగమే ఫిరాయింపు దారుల పదవులను కాపాడుతుందనడంలో ఎట్టి సందేహం అవసరం లేదు. పరిస్థితులను మూల్యాంకనం చేస్తే గత ప్రభుత్వాల రాజకీయ వైఖరులకూ, గత పాలకుల నడవడికీ బిజెపి, నరేంద్రమోడీ భిన్నంగా లేరనిపిస్తుంది. కొందరు తెలివైనవారు ఈ సమస్య లోక్‌సభ స్పీకర్ పరిధిలోనిదని వాదించవచ్చు. నిజమే! అయినా నూతన భారతదేశాన్ని నిర్మిస్తానంటున్న నరేంద్రమోడీ ఇటువంటి అనైతిక రాజకీయాలపై స్పందించాలి కదా? అట్లా స్పందిస్తేనే కదా! లోక్‌సభ స్పీకర్‌లో కదలిక వచ్చేది. చర్యలు వేగవంతమయ్యేది. ఇలాంటి నీతిమాలిన రాజకీయాలపై కొరడా ఝులిపించడకుండా నరేంద్రమోడీ చేసే శుద్ధి, స్వచ్ఛ ప్రకటనల వలన ప్రయోజనాన్ని, ఫలితాన్ని ఆశించలేం. వైఎస్ఆర్‌సిపి ఎంపిలపై అనర్హత వేటు వేయకుండా బిజెపి, లోక్‌సభ స్పీకర్ సుమిత్రా మహాజన్, ప్రధాని నరేంద్రమోడీ చిత్తశుద్ధిని నమ్మమంటే ప్రజలకు సాధ్యంకాదు. వైఎస్ఆర్‌సిపి పార్టీ ఫిరాయించిన ఎస్‌పివై రెడ్డి, కొత్తపల్లి గీతలపై అనర్హతవేటు వేయించడం ద్వారానే ఎన్నో ఆశలతో ఉన్న దేశ ప్రజలలో నీతివంతమైన రాజకీయ ఒరవడిని ప్రధాని నరేంద్రమోడీ పాదుకొనగలరు.

*(రచయిత అధ్యక్షులు, పల్నాడు రచయితల సంఘం)* వీ

నిబంధనావళిని, వివిధ అంశాలతో 53 ప్రకారం (ఆర్టికల్స్)లతో తెలియజేసింది. దీనిని ఐక్యరాజ్య సమితిలోని సభ్య దేశాలన్నీ పాటించ వలసి ఉంది. 1948లో చేసిన ఐక్యరాజ్య సమితి మానవ హక్కుల ప్రకటన (పత్రం)నకు 1966లో వచ్చిన సాంఘిక, ఆర్థిక, సాంస్కృతిక ప్రకటనకు కొద్దిగా తేడా ఉంది. ఇది మరికొంత విపులంగా, అంశాల వారిగా, జాతి, మత, లింగ, పని భేదం లేకుండా అందరికీ, ఈ ప్రకరణలు వర్తించే విధంగా 1966 ప్రకటన విపులీకరించింది. 1966 డిసెంబర్ 16 నుంచి అమలులోకి వచ్చింది.

ఆ తర్వాత 1984లో జరిగిన అంతర్జాతీయ అమానవీయ హింసకు, అణిచివేతకు, శిక్షలకూ వ్యతిరేకంగా జరిగిన సదస్సు తీర్మానాలు కూడా 33 ప్రకరణల (ఆర్టికల్స్) రూపంలో వివిధ దేశాల అధిపతులకూ, ప్రతినిధులకూ కూడా వివరించాయి - వాటిని పాటించాలనీ సూచించాయి. ఇది పూర్తిగా వివిధ రాజ్యాలు ప్రపంచ వ్యాప్తంగా వేస్తున్న అమానవీయ శిక్షలకూ, హింసలకూ విరుద్ధంగా, వ్యక్తులనూ, పౌరులనూ శిక్షించే ముందు మానవీయ కోణంలో ఆలోచించాలనీ, వ్యక్తులు జీవించే హక్కుకు భంగం కలగరాదని కూడా సూచించింది. ఇది 1987 జూన్ 26 నుంచి అమలులోకి వచ్చింది.

మనదేశానికి సంబంధించినంత వరకూ 1993లో వచ్చిన మానవ హక్కుల పరిరక్షణ చట్టం: 1994 జనవరి 8 నుండే అమలులోకి వచ్చింది. ఈ చట్టంలో మొత్తం 43 సెక్షన్లు ఉన్నాయి. అందులో 2వ సెక్షన్ జాతీయ మానవహక్కుల కమిషన్ ఏర్పాటు గురించి స్పష్టం చేసింది, మానవ హక్కులు సెక్షన్ 2 (డి) అనే అంశాన్ని వివరించింది. మానవహక్కుల కోర్టు ఏర్పాటును కూడా ప్రస్తావించింది. వీటితో పాటుగా మైనారిటీల, మహిళల, ఎస్‌సి, ఎస్‌టిల కమిషన్‌లకు సంబంధించి కూడా ఈ మానవహక్కుల పరిరక్షణ చట్టంలో వివరించాయి. ఈ చట్టం అంతా అంతర్జాతీయ పౌర, రాజకీయ, సాంఘిక, ఆర్థిక, సాంస్కృతిక హక్కుల ఒడంబడిక లేదా ప్రకటన ఆధారంగా, భూమికగా ఏర్పడిందిగా చట్టంలోనే ప్రకటించాయి కానీ ఇది అమలు కాకపోవడం, ఈ దేశంలో ఉన్న రాజ్యాంగ వ్యవస్థల పనితీరుకు నిదర్శనంగా భావించవచ్చును. మానవహక్కుల పరిరక్షణ చట్టం 1993లోని సెక్షన్ 21 ప్రకారం, రాష్ట్ర స్థాయిలలో కూడా మానవ హక్కుల కమిషన్‌లను ఏర్పాటు చేయాలని సూచించింది. కానీ ఇప్పటికినీ భారతదేశంలోని కొన్ని రాష్ట్రాలకు మానవ హక్కుల కమిషన్‌లు లేవు.

మనదేశంలో మానవ హక్కుల కమిషన్‌ల పనితీరు చాలా విచారకరంగా ఉన్నది. వచ్చిన ఫిర్యాదుపై స్పందించడం, వాటి వివరణ కోరడం తప్ప, చాలా సందర్భాలలో విచారణ సంస్థల పనితీరు ప్రశ్నార్థకంగా మారింది. జాతీయ మానవ హక్కుల కమిషన్‌లే స్వయంగా విచారణ జరిపించే వ్యవస్థ ఉండాలి తప్ప, ఇప్పటికే ఉన్న విచారణ అధికారుల మీద ఆధారపడడం, బాధితులకు న్యాయం జరగడం లేదు. ఉదాహరణకు కింది స్థాయిలో పోలీస్ అధికారులు ప్రవర్తిస్తున్న తీరు ఎంత అమానవీయంగా ఉందో మనం చూస్తూ ఉన్నాం. కానీ వారిపై ఫిర్యాదు చేస్తే, మళ్లీ వారి పై అధికారినే విచారణాధికారిగా మానవ హక్కుల కమిషన్ నియమించడం మూలంగా, విచారణ లోప భూయిష్ఠంగా ఉన్నది, నిందితులను రక్షించే తీరుగా విచారణ సాగుతున్నది. పోలీస్ అధికారులను ప్రశ్నించడమే నేరమైపోయిన సమాజంలో మనం జీవిస్తున్నాం. భారతదేశంలో పోలీస్ అధికారులు ప్రజలతో (పౌరులతో) వ్యవహరిస్తున్న తీరు చాలా శోచనీయంగా, విచారకరంగా ఉన్నది. ఇది భారత రాజ్యాంగ హక్కులనూ, అంతర్జాతీయ సూత్రాలనూ ఉల్లంఘిస్తున్నది. కేవలం పాలకులను రక్షించడానికే తామున్నట్లు ప్రవర్తిస్తున్నారు తప్ప, ఒక రాజ్యాంగ హక్కుల పరిధిలో తాము (ప్రవర్తిస్తున్న తీరు) పని చేస్తున్నామనే భావన లోపించింది.

అన్నింటి కన్నా ముఖ్యంగా, వివిధ సంఘాలలో పనిచేస్తున్న వారిపట్ల పోలీసుల ప్రవర్తన చాలా శోచనీయంగా ఉంది. ఇది సామాన్య పౌరుల విషయంలో కూడా ఇదే విధంగా ఉంది. రోజు రోజుకూ హింసా ప్రవృత్తి పెరిగిపోతున్నది తప్ప, మార్పు రావడం లేదు. అనవసర అరెస్టులూ, విచారణ పేరు మీద పోలీస్‌స్టేషన్‌లలో రోజుల తరబడి ఉంచుకోవడం - తద్వారా కొంత మంది ప్రజలు ఆత్మహత్యలకు పాల్పడడం కూడా జరుగుతున్నది. ఇది పూర్తిగా పోలీసుల హత్యలుగానే భావించాలి. వారిపట్ల ఉదాసీన వైఖరి మంచిది కాదు. పోలీస్ అధికారుల హింసా ప్రవృత్తిని పూర్తిగా ఎండగట్టే విధంగా ప్రజా పోరాటాలు జరిపితే తప్ప మానవ హక్కుల పరిరక్షణ సాధ్యం కాదు.

పోలీస్ కస్టడీలో జరుగుతన్న మరణాల పట్ల జాతీయ మానవ హక్కుల కమిషన్ చేసిన మార్గదర్శక సూత్రాలను పోలీస్ అధికారులు ఏమాత్రం పాటించడం లేదు. అంతే కాకుండా అక్రమ కేసులలో నిర్బంధించడం, అక్రమ కేసులు బనాయించడం మానవ హక్కుల ఉల్లంఘనలో భాగంగానే చూడాలి. అంతే కాకుండా, జైళ్లలో నెలకొన్న స్థితిగతులు మెరుగుపరచాలనీ, జైలు అధికారులు కూడా హోంశాఖ పరిధిలోకే వస్తారు కాబట్టి, మానవ హక్కులు జైలులో ఉన్న విచారణ ఖైదీలందరికీ, శిక్ష పడిన ఖైదీలందరికీ కూడా వర్తిస్తాయని కూడా మానవ హక్కుల కమిషన్‌లు చెపుతున్నప్పటికినీ, పోలీస్ - జైలు అధికారులు ఏమాత్రం పాటించడం లేదు.

అధికారంలో ఉన్న పార్టీల నాయకుల పట్ల, అధికారుల, పోలీసుల వైఖరి ఉదాసీనంగా ఉండడం, సామాన్య పౌరుల పట్ల కఠినంగా ఉంటూ వివక్షత చూపిస్తూ, తమ స్వామి భక్తి చూపించడం కూడా మానవ హక్కుల ఉల్లంఘనలో భాగమే అవుతుంది. చట్టం ముందు అందరూ సమానులే, అందరికీ సమన్యాయం అందాలి అనే పాలకుల మాటలు నీటి మూటలని తేట తెల్లమైంది. కేవలం ప్రజా పోరాటాల ద్వారానే, చరిత్రలో హక్కులు సంక్రమించబడ్డాయి తప్ప అవి పాలకుల బిక్ష కాదు. కానీ ప్రస్తుత సామ్రాజ్యవాద విష సంస్కృతిలో హక్కుల ఉల్లంఘన అడుగడుగునా జరుగుతన్నది. దీనిని ఎదుర్కోవాలి. అందుకు సంఘటిత పోరాటమే ఏకైక మార్గం. దీనిని నిరంతర ప్రక్రియగా కొనసాగించాలి. ఇది మనందరి కర్తవ్యం. అంతర్జాతీయ స్థాయిలో ఎన్ని చట్టాలు వచ్చినప్పటికినీ, వాటిని పాటించాల్సిన అధికారులు, పాలక వ్యవస్థ - వర్గ దృక్పథంతో వ్యవహరించినంత వరకూ, వారిలో ప్రవర్తన రాదు. కావున నిరంతర అప్రమత్తతతో, పాలక వర్గ వ్యవస్థకు వ్యతిరేకంగా పోరాడుతూ మానవ హక్కుల పరిరక్షణ కోసం పోరాడాలి. అప్పుడే 66 సంవత్సరాల మానవ హక్కుల ప్రకటన లక్ష్యం నెరవేరినట్లవుతుంది.

*(రచయిత ఒపిడిఆర్ రాష్ట్ర కమిటీ సభ్యులు)* వీ

# జైళ్లా, మృత్యు కుహరాలా?

***అవినీతిపరులు పార్లమెంట్‌కు వెళుతుంటే ఆ అవినీతిని ప్రశ్నిస్తూ, ప్రజాస్వామిక హక్కులు అడుగుతున్న వాళ్లను జైళ్లలో నిర్బంధిస్తున్న పాలన ప్రజాస్వామ్యం ఎలా అవుతుందని ప్రశ్నిస్తున్నారు* బి.ఎస్. రాజు**

ఇంట శవాల గుట్టలు. మహిళల మానభంగాలు, దేశం నలు దిశలా ఎడతెగని రైతుల ఆత్మహత్యలు. బందిఖానాల్లో మగ్గి, క్రుంగి కృశించి పోతున్న నిస్సహాయ, పేద, దళిత, గిరిజన ప్రజల ఆర్తనాదాలు. ప్రత్యామ్నాయ రాజకీయ ఆలోచనాపరుల నిత్య చిత్రహింసల కొలుములు. ఉగ్రవాద ముద్రవేసి అమానుషంగా చీకటి కొట్లలోనికి తరలించబడుతున్న ముస్లిం యువత ఆక్రందనలు. కశ్మీర్, ఈశాన్య భారత ప్రజల అణిచివేతల, ఊచకోతల హాహాకారాలు. వెరసి, విషకోరలు తెరుచుకున్న నరక కూపాలు, జైళ్లు. సాధారణ శ్రామిక ప్రజలకు, ప్రత్యామ్నాయ ఆలోచనాపరులకు, మైనారిటీ, స్వతంత్ర జనజాతులకు ఈ దేశమే ఓపెన్ కారాగారంగా మారిపోతున్న సందర్భం. ఇదో మంచిరోజుల ముసుగు నాగుల కాలం.

దేశ వ్యవహారాల మంత్రిత్వ శాఖకు చెందిన 'నేరాల గ్రంథస్థ జాతీయ సంస్థ' (నేషనల్ క్రైం రికార్డ్స్ బ్యూరో ) 'కారాగారాల లెక్కలు-2013 (ప్రిజన్ స్టాటిస్టిక్స్ -2013)' అనే సమాచార పత్రాన్ని ఈ సంవత్సరం ప్రచురించింది. 2013 డిసెంబర్ నెలాఖరు వరకు దేశంలో ఉన్న కారాగారాల, ఖైదీల లెక్కలు ఇందులో పొందుపరిచింది. దీని ప్రకారం దేశంలోని కారాగారాల మొత్తం సంఖ్య 1,391. వివరాల్లోకి వెళితే- ఇందులో కేంద్ర కారాగారాలు 130, జిల్లా జైళ్లు 346, సబ్ జైళ్లు 780, మహిళా జైళ్లు 19, బహిరంగ జైళ్లు 53, బాల ఖైదీల (బోర్స్టల్) జైళ్లు 21, స్పెషల్ జైళ్లు 38, ఇతరాలు 4.

**వివిధ కారాగారాల్లో బందీలు పట్టే వివరాలు(మంది సంఖ్య)**

| | | |
|---|---|---|
| కేంద్ర కారాగారాలు | 1,51,421 | (43 శాతం) |
| జిల్లా కారాగారాలు | 1,26,909 | (36 శాతం) |
| ఉప కారాగారాలు | 46,993 | (13 శాతం) |
| మహిళా కారాగారాలు | 4,827 | (1 శాతం) |
| బహిరంగ కారాగారాలు | 4,316 | (1 శాతం) |
| బాలల కారాగారాలు | 2,438 | (0 శాతం) |
| ప్రత్యేక కారాగారాలు | 10,490 | (3 శాతం) |
| ఇతర కారాగారాలు | 465 | (0.1శాతం) |
| మొత్తం బందీల సంఖ్య | 3,47,859 | |

అయితే 2013 డిసెంబర్ 31 నాటికి 3,47,859 మందిని ఉంచాల్సిన ఈ కారాగారాల్లో 4,11,992 మందిని కుక్కారు. ఇందులో పురుష ఖైదీలు 3,93,804 (95.6 శాతం), మహిళా ఖైదీలు 18,188 (4.4 శాతం). అంటే అరెస్టులు పెరిగినై కాని, వారిని ఉంచేందుకు కావలసిన స్థలం (కెపాసిటీ) పెరగ లేదు. ఉన్న స్థలంలోనే ఎక్కువ మందిని కుక్కుతున్నారు. 2011లో 112.1శాతం, 2012లో 112.2 శాతం, 2013లో 118.4 శాతం అంటే 2013 నాటికి 100 మంది ఖైదీలను ఉంచాల్సిన స్థలంలో 119 మందిని ఉంచుతున్నట్లు ప్రభుత్వమే చెపుతోందంటే, నిజానికి అసలు పరిస్థితులు ఇంకెంత దుర్భరంగా ఉంటాయో ఊహించుకోవచ్చు.

ఇక ఈ దేశంలో పోలీస్, జైళ్లు, న్యాయవ్యవస్థ ఖైదీల పట్ల అవలంబిస్తున్న అమానుష వివక్ష, దుర్భర హింస గురించి ఈ రోజు కొత్తగా రాయాల్సిన పని లేదు. ఈ దేశ అత్యున్నత న్యాయస్థానం కూడా ఈ విషయం పై చాలానే మాట్లాడింది. ఈ పరిస్థితులు మారాలని చెపుతూనే ఉంది. ప్రభుత్వం ప్రకటించిన లెక్కలే ఏమి చెపుతున్నాయో చూడండి - నేరం రుజువై జైలు శిక్ష అనుభవిస్తున్న వారి సంఖ్య 1,29,608 (మొత్తం ఖైదీలలో 31.5 శాతం) ఐతే, నేరం రుజువు కాకుండా జైళ్లలో మగ్గుతున్న వారి సంఖ్య 2,78,503 (మొత్తం ఖైదీలలో 67.6 శాతం). వీరిలో ఐదు సంవత్సరాల పైబడిన కూడా ఇంకా న్యాయస్థానాలు ఎటూ తేల్చక పోవడం మూలంగా జైళ్లలో మగ్గుతున్న ఖైదీల సంఖ్య 3,047 మందేనని ప్రభుత్వ లెక్కలు చెపుతున్నాయి. కానీ ఈ సంఖ్య నమ్మదగ్గదిగా లేదు.

ఇక నక్సలైట్ / మావోయిస్ట్‌లుగా ముద్ర వేయబడి, కేసులపై కేసులతో మగ్గుతున్న వారు, ముస్లిం ఉగ్రవాద ముద్రతో జైళ్లలో మగ్గుతున్న ఖైదీల సంఖ్య చిన్నదేమీ కాదు. వీటి వివరాలు కేంద్ర హోంశాఖ ఈ పత్రంలో పొందుపరచలేదు . వీరి కథ, వ్యథ అంతులేనిది. జీవిత ఖైదు కాలాన్ని పూర్తి చేసుకుని కూడా రెండు దశాబ్దాల బందిఖానా జీవితం నుండి విముక్తి దొరకని బాలగణేష్ లెంతమందో ఈ మహోన్నత ప్రజాస్వామ్య దేశంలో ? ఎంత కర్కశ మైనదీ రాజ్య వ్యవస్థ?

60-70 సంవత్సరాలు పైబడిన వృద్ధ మావోయిస్ట్ పార్టీ నాయకులపై కక్షకట్టి, సరైన వైద్యం సమయానికి అందించకుండా, న్యాయ స్థానాల్లో బెయిళ్లు మంజూరు కాకుండా అడ్డుకుంటూ, దుర్భర శారీరక, మానసిక హింసను వారిపై ప్రయోగిస్తూ, వారిని జైళ్లలోనే అంతం చేసే కుట్రను ఈ రాజ్యం అమలు చేస్తున్నది. అంతేగాక ఆదివాసి ప్రజలను, పలు హక్కుల సంఘాల, స్వతంత్ర స్వచ్ఛంద సామాజిక కార్యకర్తల, ప్రజా ఉద్యమ, ఉద్యోగ, విద్యార్థి, సాంస్కృతిక సంఘాల కార్యకర్తలను మావోయిస్ట్‌లతో సంబంధముందనో, వారికి సహకరిస్తున్నారనో, వారి భావజాలాన్ని ప్రచారం చేస్తున్నారనో, పాటలు పాడుతున్నారనో, సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహిస్తున్నారనో దొంగ కేసులు బనాయించి

దుర్మార్గపు చట్టాలలో ఇరికించి చిత్ర హింసలకు గురిచేస్తున్నవి ఈ రాజ్య పోలీసు, న్యాయ వ్యవస్థలు.

పోలియో బాధితుడైన, రెండుకాళ్లు సహకరించని ఢిల్లీ విశ్వ విద్యాలయ ప్రొ.జి.ఎన్. సాయిబాబా అమానుష అరెస్టు, అతని అమానవీయ అండాసెల్ జైలు నిర్బంధం ఈ రాజ్యపు అత్యంత క్రూరత్వాన్ని తెలియచేస్తోంది. ఢిల్లీలోని జవహర్‌లాల్ నెహ్రూ విశ్వ విద్యాలయంలో చైనా భాషను అభ్యసిస్తున్న బి.ఎ. విద్యార్థి, హేమ్ మిశ్రాను గడ్చిరోలీ పోలీసులు దొంగచాటుగా మాటు కాసి, దాడి చేసి, కళ్లకు గంతలు కట్టి, ఈడ్చుకెళ్లి, నెలల తరబడి చిత్ర హింసలకు గురిచేసి అండా సెల్లో కుక్కిన వైనం, ఒక సంవత్సరం గడిచిపోయినా బెయిలు మంజూరు చేయని కోర్టు, మొత్తంగా కారాగారాల్లో అమాయక నిస్సహాయ గిరిజనులను, దళితులను సంవత్సరాలు తరబడి కోర్టులో హాజరు పర్చకుండానే వారిని జైళ్లల్లో మగ్గపెట్టే అప్రజాస్వామిక, అటవిక తీరును హేమ్ మిశ్రా ఈ మధ్యనే పత్రికలకు విడుదల చేసిన తన జైలు లేఖలో సోదాహరణంగా వివరించాడు. ఇతను రచయిత, గాయకుడు, సాంస్కృతిక కార్యకర్త. ఉత్తరాఖండ్ ముద్దుబిడ్డ. ఉత్తరాఖండ్ ప్రత్యేక రాష్ట్ర ఉద్యమంలో మొగ్గ తొడిగి సామాజిక చైతన్యాన్ని సంతరించుకున్న నీతివంతుడైన భారత పౌరుడు. అతనిపై రాజ్యం దొంగచాటుగా దాడి చేసి, అపహరించి, చిత్రహింసలకు గురి చేయడమంటే ఇక ఈ రాజ్యాంగానికి, అందులో పొందుపరచిన ప్రాథమిక హక్కులకు ఉన్న గౌరవమేపాటిది? ఇక ఎన్‌కౌంటర్ల పర్వం గురించి రాయాలంటే గుండెలను పిండు కోవాల్సిందే.

ప్రపంచంలో అతిపెద్ద ప్రజాస్వామ్యమని ఊదర గొట్టుకుంటున్న ఈ దేశ సరికొత్త ప్రథమ బిచ్చగానికి ఇవేమీ కనిపించవు, ఇవేమీ వినిపించవు. వాగాడంబర విన్యాసాలతో అతను పొద్దెరగక, అలుపెరగక, నిదురించక కీర్తి సముపార్జనలో తలమునకలై ఉన్నాడు. ఇంట శవాల యాత్రలు జరిపిస్తూ, బయట పల్లకి మోతల మత్తులో జోగుతున్నాడు. ఇంటా బయటా భారత దేశ మహిమాన్వత గురించి, తను చేయబోయే అద్భుతాల గురించి డాంబిక ప్రచారం దంచుతున్నాడు. భారతావనిలో ప్రజాస్వామ్యం ఎలా ఉరకలెత్తుతోందో, ప్రపంచ ప్రజలకు ఓ కరదీపికగా, మార్గదర్శకంగా భారత్ ఇప్పుడు ఎలా వెలిగిపోతోందో, ఇకముందు తను దానిని మరింత దేదీప్యమానంగా ఎలా ప్రకాశింప చేయబోతున్నాడో అంతర్జాతీయ వేదికలపై ఊదర కొడుతున్నాడు. జి-7, జి-20, బ్రిక్స్ వగైరా దేశాల తలరాతలు కూడా మార్చివేసే వేద మంత్రాలు తన వద్ద ఉన్నాయంటున్నాడు. ఊపిరాడక, నోరెల్లబెడుతున్న సంస్కరణల మూల విరాట్టులకు, పరబ్రహ్మలకు అరిగిపోయి, ఒరిగిపోతున్న వ్యవస్థలకు కొత్త సంస్కరణల జీవజలం తన కమండలంలో ఉందని చెపుతున్నాడు. ఏమిటి ఈ జీవజలం ? ఇక్కడి వనరులను పెట్టుబడి పాదాక్రాంతం చేయడమే ఈ జీవజలం.

ఇక్కడ రాజ్యాంగం ఓ పూజా గ్రంథం. ఆచరణలో అది పెట్టుబడి పెద్దల పాదదాసి. ఇక్కడ గజదొంగలకు, లూటీకోర్లకు నవరత్న కిరీటాలు. తాంబూల ఆహ్వాన హారతులు. భూపన్నేరాల జాతరలు. పూటగడవని వారికి నిలువెత్తు పాతరలు. తెల్లని వన్నీ పాలు, నల్లని వన్నీ నీళ్లూ కానట్లే- ప్రపంచంలో అతి పెద్ద ప్రజాస్వామ్యంగా డబ్బా కొట్టుకుంటున్న బూర్జువా పార్లమెంటరీ భారతం, ఓ స్వతంత్ర ప్రజాస్వామ్య దేశమూ కాదు, శ్రామికుల, ఆలోచనాపరుల, బుద్ధిజీవుల, బహుళ జాతుల స్వేచ్ఛా జీవన, వికాస వనమంత కన్నా కాదు.

ఈ దేశ పాలక వర్గం ఎన్నో శతాబ్దాలుగా కష్టించి పనిచేసే వారిని, ఉత్పత్తిలో పాల్గొని సంపదను సృష్టించే వారిని అంటరాని వారుగా, బానిసలుగా, తమ బద్ధ శత్రువులుగా పరిగణిస్తూనే ఉంది. ఉత్పత్తిలో పాల్గొంటూ సంపదను సృష్టించే వారికి సంపదలో గానీ, ఉత్పత్తి సాధనాలపై గానీ అధికారం లేదు. భాగస్వామ్య హక్కు లేదు. సంపదను సృష్టించే వారు అటువంటి హక్కు కోసమై నోరు తెరిస్తే, గొంతు విప్పితే, వారిని చిత్ర హింసల కొలిమి లోనికి, అధః పాతాళానికీ తొక్కుతున్నదీ దేశ పాలక వర్గం.

సమభావం, శాస్త్రీయ దృక్పథం, సామాజిక న్యాయం కాంక్షించే వారికి; దోపిడీ, పీడన, అణచివేత, బానిసత్వ భావజాలం, అంటరానితనం, అవిద్య, అజ్ఞానం, కుల, మత మౌఢ్యం- ఇత్యాది సామాజిక రుగ్మతలపై నినదించి పిడికిలెత్తే వారికి; మార్పు కోసం పోరాడే వారికి ఈ దేశం ఓ బడా బంధిఖానా. ఓ నరక కూపం. భూస్వామ్య, పెట్టుబడి దోపిడీదారులకు, బడా వ్యాపారులకు, దగాకోరు దళారులకు, గుత్తేదార్లకు, కపట సాదువులకు, బాబాలకు, ఊక దంపుడు బోధకులకు, గురువులకు, అభూతకల్పనా పరులకు, అశాస్త్రీయ ప్రచారకులకు ఈ దేశం ఓ ఉద్యానవనం. అలనాటి నుండి, ఈ నాటి వరకు భారత దేశ హిందూ బ్రాహ్మణీయ మూల స్వభావ (కోర్ ఫిలాసఫీ) సారం మట్టుకు ఏమాత్రం మారకపోగా, ఇప్పుడది ఫాసిస్టు విషకోరలను, జ్వాలా నాలుకలను సంతరించుకుంది.

ఇది బూర్జువాల రాజ్య వ్యవస్థ. ఇది ఇలాకాక ఇంకొకలా ఉంటుంది అనుకుంటే పొరబాటే! ఇక దేశంలోని ప్రజా ఉద్యమాల స్థితిని హక్కుల కోణం నుండి చూస్తే - కండల్లేని అస్తికల పంజరమే గోచరిస్తుంది. సవాలక్ష సమస్యల వలయంలో మనమంతా చిక్కుకుని ఉన్నాం. హక్కుల ఉద్యమాలు, ఐక్య ప్రజా పోరాటాలు ఎంతగా జవసత్వాలు నింపుకోవాలో, కండలు పెంచుకోవాలో ప్రస్తుత ప్రజాహక్కుల, ఐక్య ప్రజా ఉద్యమాల స్థితి చెప్పకనే చెపుతోంది. ఈ స్థితిని అధిగమించి ఈ ఉద్యమాలను మరింత ఉన్నత స్థితికి కలసికట్టుగా నడిపించుకు వెళ్లడం మినహా వేరే మార్గం లేదు.

*(రచయిత శ్రామిక నేస్తం సంపాదకులు)*

వీ

***రచయితలకు సూచన :*** *తక్షణ, సమకాలీన అంశాలపై రచనలు చేసి ఆ సంచికలోనే రావాలనుకొనే రచయితలు 20వ తేదీ లోగా పంపగలిగితేనే మరుసటి నెల సంచిక కోసం పరిశీలించడం సాధ్యమవుతుంది. ఆ తరువాత వచ్చిన రచన, అంశం ఎంత ముఖ్యమైనదైనా పరిశీలించడం, ముద్రణకు సిద్ధం చేయడం అసాధ్యమవుతుంది. రచయితలు గుర్తించగలరు. - సం.*

# సిక్కుల ఊచకోతకు ముప్పై ఏళ్లు

***సిక్కుల ఊచకోత నుంచి గుజరాత్ మారణకాండ వరకు జరిగిన అన్ని సంఘటనలు రాజకీయ ఉద్దేశపూర్వకంగానే జరిగాయని అంటున్నారు* రాజేంద్రబాబు అర్విణి**

ప్రపంచంలోనే అతి పెద్ద ప్రజాస్వామ్య దేశంగా చెపుతున్న భారతావని రాజధాని ఢిల్లీ నగరంలో దారుణ మారణకాండ జరిగి ముప్పై ఏళ్లు గడిచి పోయాయి. చల్లారిన సంసారాలు, అసహాయుల హాహాకారాలు చరిత్రలో ఇంకా మూలుగుతూనే ఉన్నాయి. ప్రతిభావంతురాలైన ప్రధానమంత్రిగా పార్లమెంటరీ ప్రక్రియలో నమ్మకమున్న మేధావి వర్గం ప్రస్తుతించే ఇందిరాగాంధీ హత్యకు గురైన సందర్భంలో సిక్కు మైనారిటీ ప్రజల మీద జరిగిన హేయమైన దాడిలో వికోట్టహాసం చేసిన రాబందుల రెక్కల చప్పుడు ఇంకా వినిపిస్తూనే ఉంది. సిక్కు మతాన్ని ఆచరించే అంగరక్షకులే ఆమె మరణానికి కారకులైతే, ఢిల్లీలో, దేశంలోని పలు ప్రాంతాలలో నివసిస్తున్న సిక్కుల నందరినీ లక్ష్యంగా చేసుకుని మానవ హననానికి పూనుకున్న వైనం రక్త తర్పణంతో చరిత్ర నిర్మించాలనుకునే ఉన్మాది మనస్తత్వానికి ప్రతీక.

స్వతంత్ర భారత చరిత్రలో అదొక మాయని గాయం. కేవలం మూడు రోజుల్లోనే 2,733 మంది సిక్కులు (అధికారిక లెక్కల ప్రకారం) ఊచకోత కోయబడ్డారు. గవర్నమెంట్ వారు ప్రకటించిన సంఖ్య అలా ఉండగా, రంగనాథ మిశ్రా కమిషన్ ముందు సిటిజన్స్ జస్టిస్ కమిటీ వెల్లడించిన సమాచారం ప్రకారం ఒక్క ఢిల్లీ నగరంలోనే 3,870 మంది సిక్కు యువకులు దారుణంగా హత్య చేయబడ్డారు. ఆనాడు ఇండియన్ ఎక్స్‌ప్రెస్ దిన పత్రికలో వచ్చిన ఒక రిపోర్టులో ఢిల్లీలో సిక్కులు ఎక్కువగా నివసించే ప్రాంతాలలో ప్రతి 50 అడుగుల దూరానికి ఒక వాహనం తగలబడి పోతూ కనిపించిందని పేర్కొన్నారు.

ఢిల్లీలోని త్రిలోక్‌పురి బ్లాక్-2లో నివసిస్తున్న సిక్కు పురుషులందరినీ చంపేశారని జస్టిస్ నానావతి కమిషన్ పేర్కొంది. 1971 జనాభా లెక్కలలో నమోదైన సిక్కు జనాభా ఢిల్లీలో ఐదు లక్షలు. అందులో 25 సంవత్సరాల నుండి 50 సంవత్సరాల వయస్సు ఉన్న పురుషులు లక్ష మంది. ఇందిరాగాంధీ హత్యకు ప్రతీకార చర్యగా ఈ వయసు సిక్కు పురుషులనే ఏరిఏరి చంపేశారు. ఇందిరాగాంధీ హత్య వల్ల రగిలిపోయిన జనం యాదృచ్ఛికంగా హింసాత్మక ఘటనలకు పాల్పడితే, హత్యచారాలు, మానభంగాలు ఎందుకు చోటు చేసుకుంటాయి? ఒక వయసు పురుషులనే ఎందుకు లక్ష్యంగా పెట్టుకుంటారు? 'విషాదం, బాధ వల్ల అలుముకున్న కోపంతో ఈ మారణకాండ జరగలేదు. పకడ్బందీగా తయారు చేసిన ప్రణాళికా బద్ధంగా సిక్కుల ఊచకోత జరిగింది. ఈ ప్రణాళిక సిద్ధం చేసింది, అమలు పరిచింది ఆనాడు ప్రభుత్వంలో ఉన్న కాంగ్రెస్ నాయకులే' అని పియుసిఎల్, పియుడిఆర్ సంస్థలు సంయుక్తంగా చేసిన నిజనిర్ధారణ పరిశోధనలో వెల్లడైంది. 'ఇది బహు నైపుణ్యంతో చేయబడిన దహనకాండ' అని సీనియర్ మిలటరీ అధికారి ఒకరు వ్యాఖ్యానించారు.

మనదేశంలో 1920ల నుండి మతపరమైన హింసా రాజకీయాలు చోటు చేసుకున్నా, రాజధానిలో రాజ్యాపేరిత మతపరమైన హింస, అదీ జతీయోద్యమంలో ముఖ్యపాత్ర వహించిన అధికార పార్టీ ఆధ్వర్యంలో అన్ని సహజ న్యాయ సూత్రాలకు విరుద్ధంగా జరగడం విషాదకరం. ఆ తర్వాత, ప్రజల, ప్రజాస్వామ్యవాదుల ఒత్తిడి ఫలితంగా న్యాయ విచారణ జరపడం కోసం సుప్రీంకోర్టు న్యాయమూర్తి రంగనాథ మిశ్రాను ప్రభుత్వం నియమించింది. కొన్ని సంవత్సరాల పాటు న్యాయ విచారణ జరిపినా దోషులెవరో తేల్చలేకపోయింది మిశ్రా కమిషన్. ప్రజలలో పలుచనై పోతామన్న భయంతో నానావతి అనే మరో సుప్రీంకోర్టు జడ్జి ఆధ్వర్యంలో మరొక విచారణ సంఘం ఏర్పాటు చేశారు. మారణహోమం జరిగిన ఇరవై ఒక్క సంవత్సరాల తర్వాత 2005లో జస్టిస్ నానావతి కమిషన్ తన రిపోర్టును ప్రభుత్వానికి సమర్పించింది. అప్పుడు కూడా కేంద్రంలో అధికారంలో ఉన్నది కాంగ్రెస్ పార్టీయే! ఆ రిపోర్టును పార్లమెంట్‌లో ప్రవేశపెడుతూ అప్పటి ప్రధానమంత్రి మన్మోహన్‌సింగ్ '1984లో జరిగింది జాతి యావత్తు సిగ్గుతో తలవంచుకోవలసిన సంఘటన. ఒక తీవ్రమైన జాతీయ విషాదం' అని చెపుతూ 'ఒక సిక్కు సమూహానికి మాత్రమే కాదు భారత జాతి మొత్తానికి క్షమాపణలు చెప్పడానికి నేనేమీ సంకోచించను' అని ప్రకటించారు.

జస్టిస్ నానావతి కమిషన్ కూడా జస్టిస్ రంగనాథమిశ్రా మార్గంలోనే సిక్కు బాధితులకు న్యాయం చేయలేక పోయింది. ఆ విషయాన్ని దేశ ప్రధానమంత్రి అంగీకరిస్తూ 'వాస్తవమేమిటో ఇంకా బయటకు రాలేదన్న విషయం మనందరికీ తెలుసు' అని లోక్‌సభలో ఉన్న విషయాన్ని వెల్లడించారు. జరిగిన దుర్ఘటనపై జస్టిస్ రంగనాథమిశ్రా కమిషన్ పరిశోధన చేసింది. జస్టిస్ నానావతి కమిషన్ కొన్నేళ్లు పరిశీలించింది. ఈ ఘటనలో పోలీసుల అపరాధ ప్రవృత్తిపై కుసుంలాల్ మిట్టా కమిటీ రిపోర్ట్ ఇచ్చింది. రక్తపాతానికి సంబంధించిన కేసుల నమోదు, విచారణ, కోర్టులలో ఫిర్యాదు చేయడంలో పోలీసుల అలసత్వం తదితర విషయాలను జైన్-అగర్వాల్ కమిటీ విచారించింది. మారణహోమంలో ప్రాణాలు కోల్పోయిన వారి సంఖ్య గురించి ఎ.కె. అహుజీ కమిటీ నివేదిక ఇచ్చింది. ఢిల్లీ పోలీసులు ఏర్పాటు చేసిన వేద్ మార్వా కమిటీ తన విచారణలో బయటపడ్డ విషయాలను ప్రభుత్వానికి తెలియపరిచింది. అయినా 'వాస్తవాలు బయటకు రాలేద'ని ప్రధానమంత్రి లోక్‌సభలోనే ప్రకటించడం అంటే మనదేశంలోని న్యాయవ్యవస్థ, అధికార

యంత్రాంగంలోని డొల్లతనం ఎంతో బయటపడుతుంది. నానావతి కమిషన్ రిపోర్టులో వేలెత్తి చూపబడ్డ జగదీష్ టైట్లర్ 2005లో తన కేంద్రమంత్రి పదవికి రాజీనామా చేయడం ఇంకొక కాంగ్రెస్ కార్యకర్త సజన్ కుమార్ ఢిల్లీ రాష్ట్ర ప్రభుత్వంలో తన పదవి కోల్పోవడం మినహా మూడు వేల నుండి ఐదు వేల మంది సిక్కుల ఊచకోతలో ప్రత్యక్షంగా పాలు పంచుకున్న ఏ ఒక్క నరహంతకుడు శిక్షకు గురికాలేదు. అరెస్టు లేవు. జైలు శిక్షలు అసలే లేవు.

పౌరులను రక్షించే బాధ్యత నాగరిక సమాజంలో ప్రభుత్వాలది. ప్రభుత్వంలోని అన్ని రంగాలు కుమ్మక్కై ప్రజలను హతమారుస్తే సుప్రీంకోర్టు జడ్జీలు కూడా దోష నిర్ధారణ చేయలేకపోతే ఈ వ్యవస్థ గమ్యం ఎటువైపు అని ప్రశ్నించుకోక తప్పదు. సామాన్య పౌరుడు నిర్ఘాంతపోయే సంగతి ఒకటి నిజనిర్ధారణ సందర్భంలో బయట పడింది. అదేమంటే పెట్రోల్ పోసి కాల్చివేయబడ్డ ఒక్కొక్క సిక్కు శవానికి రు. 500 చొప్పున నిర్వాహకులు చెల్లించారట.

సిక్కుల ఊచకోత ప్రారంభమైన నవంబర్ ఒకటి నాటికి ఢిల్లీ నగరంలో 5000 మంది సైనికులు, సైనికాధికారులు అందుబాటులో ఉన్నారు. ఏ మాత్రం ఆలస్యం చేయకుండా ఆ సైనిక పటాలాన్ని రంగంలోకి దింపి ఉంటే రంగనాథ కమిషన్ ప్రకటించినట్లుగా రెండు వేల మంది సిక్కు యువకుల ప్రాణాలు రక్షింపబడి ఉండేవి. అంటే అధికారికంగా ప్రకటించిన హత్యల్లో రెండొంతుల మరణాలు ఆగిపోయి ఉండేవి. అప్పుడు కేంద్ర హోంశాఖ మంత్రి పి.వి. నరసింహారావు, ఆనాటి కాంగ్రెస్ ప్రభుత్వంలో మరో కీలకమైన వ్యక్తి అప్పటి న్యాయశాఖ మంత్రి ఒకప్పుడు సుప్రీంకోర్టు జడ్జిగా పని చేసి రిటైరైన తెలుగువాడు శివశంకర్. ప్రముఖ న్యాయవాది రాంజెత్మలాని అల్లర్ల గురించి మాట్లాడడానికి పి.వి. నరసింహారావును కలిస్తే ఆయన ఉదాసీనంగా స్పందించాడని నానావతి కమిషన్ ముందు వాగ్మూలం ఇచ్చాడు.

తన నాయకత్వంలో రాజకీయ నాయకులు మేధావులు హోంశాఖ మంత్రిని, న్యాయశాఖ మంత్రిని కలిస్తే వారు నిరాసక్తంగా వ్యవహరించారని ఐ.కె. గుజ్రాల్ (కొంత కాలం తర్వాత ఈయన దేశ ప్రధాని అయ్యాడు) నానావతి కమిషన్‌కు ఇచ్చిన అఫిడవిట్‌లో పేర్కొన్నాడు. ఆనాటి నాయకుల, మంత్రుల ఉదాసీనత, నిరాసక్తత లకు పరాకాష్ఠ అప్పటి ప్రధానమంత్రి ప్రకటన. తన తల్లి ఇందిరాగాంధీ పుట్టినరోజు (ఆమె చనిపోయిన తర్వాత వచ్చిన మొదటి పుట్టినరోజు) సందర్భంగా ఏర్పాటు చేసిన ర్యాలీలో ప్రసంగిస్తూ రాజకీయగాంధీ 'ఒక మహావృక్షం కూలిపోయినప్పుడు, దాని చుట్టూ భూమి కంపించడం సహజం' అని అల్లర్లను దహనకాండను, మారణకాండను లోపాయకారిగా సమర్థించాడు.

రాజకీయ మద్దతుతో మతావేశాన్ని రగిలించిన ఈ రాజ్య ప్రేరేపిత దారుణం ఒక పద్ధతి ప్రకారం జరిగింది. అది మూడు దశలుగా దేశ వ్యాప్తంగా అమలు జరిగిందని పియుసిఎల్ రిపోర్టులో వివరించారు. మొదటిది ప్రచార యుద్ధం, మూడు అబద్ధాలను మొదట ప్రచారం చేశారు – 1) ఇందిరాగాంధీ హత్యను స్వాగతిస్తూ సిక్కులు స్వీట్లు పంచుకొని, దీపాలు వెలిగించి తమ సంతోషాన్ని వ్యక్తపరిచారని ప్రచారం చేశారు; 2) పంజాబ్‌లో హిందువులను ఊచకోత కోసి రైళ్లలో శవాలను ఢిల్లీకి రవాణా చేశారని; 3) సిక్కులు ఢిల్లీ నగరంలో తాగునీటి ట్యాంకర్లలో విషం కలిపారని – ఈ మూడు అబద్ధాలను ఆందోళనకారులు ప్రచారం చేసి సిక్కు జాతి పట్ల కోపం, కసి రగిలించి, తాము చేయబోయే హత్యకాండకు ప్రజావ్యతిరేకత రాకుండా చూసుకున్నారు. ఆందోళనకారులు మాత్రమే కాదు సాక్షాత్తు పోలీసులే తమ వాహనాలలో లౌడ్ స్పీకర్ల ద్వారా రైళ్లలో పంజాబ్ నుండి హిందువుల శవాలు వస్తున్నాయని, సిక్కులు విషం కలిపారని, కాబట్టి ట్యాంకర్లలో నీరు తాగొద్దని హెచ్చరిస్తూ ప్రచారం చేయడం పియుసిఎల్ సభ్యులు ప్రత్యక్షంగా చూశారు.

**రెండవ దశ**

సాయుధులైన యువకులు ట్రక్కులు, లారీలు, మోటరు సైకిళ్లు, స్కూటర్లపై ఢిల్లీలోని వివిధ ప్రాంతాలకు చేరుకున్నారు. వారు తమతో తెచ్చుకున్న పెట్రోల్ క్యాన్లతో సిక్కు మతస్తుల ఇళ్లు, షాపులను తగల బెట్టడం ప్రారంభించారు. వారి ఇళ్లను, షాపులను స్థానిక కాంగ్రెస్ కార్యకర్తలు గుర్తించి అల్లరిమూకలకు ఉప్పందించారని నిజ నిర్ధారణ కమిటీ ముందు బాధితులు తెలియ చెప్పారు. నగరంలో ఒక చోటు నుండి ఇంకో చోటుకు వెళ్లడానికి దుండగులు ఢిల్లీ రవాణా సంస్థ బస్సులను ఉపయోగించారు.

**మూడవ దశ**

ఇది మరీ దారుణం. ఇళ్లను, ఆస్తులను తగుల బెట్టిన తర్వాత దొరికిన సిక్కు యువకులను పట్టుకుని చిత్రహింసలు పెట్టి పెట్రోల్ పోసి నడి రోడ్డునే కాల్చివేశారు. స్త్రీలను మానభంగం చేశారు. జరిగిన దారుణంలో పోలీసుల పాత్ర పియుసిఎల్ నివేదికలో మూడు రకాలుగా నిర్వచించబడ్డది. 1) అల్లర్లు జరుగుతున్న ప్రాంతాల్లో అసలు కన్పించక పోవడం; 2) ఉన్నా, నిశ్శబ్ద సాక్ష్యులు మిగిలిపోవడం; 3) కొన్నిచోట్ల దహనకాండలో ప్రత్యక్షంగా పాల్గొనడం లేదా ప్రోత్సాహించడం. ఒక ప్రత్యక్ష సాక్షి జ్యుడిషియల్ కమిషన్ ముందు ఇచ్చిన వాగ్మూలం ప్రకారం త్రిలోక్‌పురిలో పోలీసులే తమ జీపులోని డీజిల్‌ను సిక్కుల ఆస్తులను తగలబెట్టడానికి ఆందోళనకారులకు అందజేశారు. సుల్తాన్‌పురిలో భట్టి అనే పోలీస్‌స్టేషన్ హౌజ్ ఆఫీసర్లు ఇద్దరు సిక్కులను చంపేశారు. తమ దగ్గర ఉన్న లైసెన్స్‌డ్ తుపాకులతో అల్లరి మూకలను ఎదుర్కొంటున్న కొంతమంది సిక్కు యువకులకు తాము రక్షణ ఇస్తాం, కాబట్టి తుపాకులను స్వాధీనం చేయండని మాయమాటలు చెప్పి వారిని నిరాయుధులను చేసి మారణహోమానికి తోడ్పడ్డ పోలీసులకు ఆ తర్వాత పెద్ద ఎత్తున ప్రమోషన్లు లభించాయి. పత్రికలలో, దూరదర్శన్‌లో కర్ఫ్యూ విధించబడ్డట్లు, సైన్యం పహారాలో ఢిల్లీ నగరం ఉంచబడ్డట్టు ప్రకటించారు. కాని ఆచరణలో అది అమలు కాలేదు. కాంగ్రెస్ నాయకుడు ఎచ్‌కెఎల్ భగత్ ప్రాతినిధ్యం వహిస్తున్న పార్లమెంటరీ నియోజకవర్గం పరిధిలో అతి నికృష్టమైన దారుణాలు జరిగాయని కమిషన్లే తేల్చి చెప్పాయి.

ప్రభుత్వాధికారులు, పోలీసులు, రాజకీయ నాయకులు, మీడియా, న్యాయాధికారులు – ఈ మారణహోమంలో అందరు సూత్రధారులే. అందురు పాత్రదారులే! ఈ అపవిత్ర కలయిక దేశ రాజకీయాల్లో మైనారిటీలకు వ్యతిరేకంగా మళ్లీ మళ్లీ పునరావృతమవుతున్నది. 1984

# మూడు దశాబ్దాల భోపాల్ విషవాయువు

***భోపాల్ దుర్ఘటన జరిగి ముప్పై ఏళ్లు అయినా నేటికీ బాధితులకు న్యాయం జరగలేదనీ, పాలకులు తమ స్వార్థ రాజకీయ ప్రయోజనాల కోసం దేశ సార్వభౌమాధికారాన్ని అంతర్జాతీయ విపణిలో తాకట్టుపెట్టారనీ అంటున్నారు* బి. రామకృష్ణ**

**భో**పాల్‌లో జరిగిన మానవ హననానికి 2014 డిసెంబర్ 3 నాటికి 30 ఏళ్లు పూర్తవుతాయి. 2003 అక్టోబర్ 23 నాటికి 15,248 మృతులకు, గాయాలపాలై, వికలాంగులై విషవాయు ప్రభావానికి లోనైన 5,54,895 మందికి నష్ట పరిహారం చెల్లించినట్లు మధ్యప్రదేశ్ గ్యాస్ రిలీఫ్, రిహాబిలిటేషన్ శాఖ ప్రకటించి ఉన్నది. 3 డిసెంబర్ 1984 2/3ల మధ్యరాత్రి భోపాల్‌లో అమెరికా బహుళజాతి కంపెనీ యూనియన్ కార్బైడ్ కార్పొరేషన్ (యుసిసి) భారత విభాగం అయిన పురుగు మందుల ఫ్యాక్టరీ నుండి విడుదలైన మిథైల్ ఐసో సైనైడ్ (ఎంఐసి) 24 గంటల్లోనే 8 వేల మందిని బలితీసుకున్నది. ఆ తర్వాత ప్రతిరోజు దీని ప్రభావానికి లోనైనవారు చనిపోతూనే ఉన్నారు. మొత్తంగా 30 వేల వరకు మృతి చెందారు. 8 లక్షల మందిని రకరకాల వైకల్యాలు, అనారోగ్య సమస్యలు వెంటాడుతున్నాయి. బతికున్నవారి అవస్థలు చూసినప్పుడు చనిపోయినవారే మేలని అక్కడి ప్రజలు అనుకోవడం దుర్ఘటన తీవ్రతను తెలుపుతున్న విషాదం. విషవాయువు ప్రభావంతో వేలాది పశువులు, పక్షులు, జంతువులు మృతి చెందాయి. గాయాలపాలై అనేక రోగాలతో నిత్యం తీవ్రమైన హింసకు గురికావడం, జన్యులోపాలతో, మానసిక లోపాలతో పిల్లలు పుట్టడం మామూలై పోయింది. ఈ దుర్ఘటన ప్రపంచంలో అతిపెద్ద పారిశ్రామిక విలయంగా నిలిచిపోయింది.

భోపాల్ విష విలయానికి కారణమైన అమెరికా కంపెనీ యూనియన్ కార్బైడ్ కార్పొరేషన్ (యుసిసి)కు మొదటి నుండి కూడా అనుకూలంగానే కేంద్ర, మధ్యప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వాలు ప్రవర్తిస్తూ వచ్చాయి. ప్రమాదం జరిగిన నాలుగవ రోజు అమెరికా నుండి భోపాల్ వచ్చిన ఆ కంపెనీ సిఇఒ వారక అండర్సన్‌ను పట్టుమని నాలుగు గంటలు కూడా లెరెస్ట్‌లో ఉంచలేదు. భోపాల్ నుండి ఢిల్లీకి ప్రభుత్వ విమానంలో ఢిల్లీకి వెళ్లే ఏర్పాటును మధ్యప్రదేశ్ రాష్ట్ర కాంగ్రెస్ ముఖ్యమంత్రి అర్జున్‌సింగ్ చేశాడు. అక్కడి నుండి వెనువెంటనే అదేరోజు తన దేశమైన అమెరికాకు విమానంలో వెళ్లేలా కేంద్ర ప్రభుత్వం చర్యలు తీసుకున్నది. అప్పటి ప్రధానమంత్రి రాజీవ్‌గాంధీ విదేశీ వ్యవహారాల మంత్రి పి.వి. నరసింహరావులకు తెలియకుండా, వారి అంగీకారం లేకుండా ఇది జరిగిందని అనుకోలేం. అప్పటి నుండి ఈ నేరస్థుడు భారత్‌కు తిరిగి రాలేదు, నేర విచారణ ఎదుర్కోనేలేదు. భారతీయ కోర్టులు, మధ్యప్రదేశ్ రాష్ట్ర, భారత ప్రభుత్వాలు అండర్సన్‌ను అప్పగించమని అమెరికాపై ఒత్తిడి తేవడం గాని, అంతర్జాతీయ న్యాయ యంత్రంగాన్ని సంప్రదించింది గాని లేదు. గత 30 ఏళ్లుగా కేంద్ర, రాష్ట్రాల్లో కాంగ్రెస్ పోయి బిజెపి, బిజెపి పోయి కాంగ్రెస్, తిరిగి కాంగ్రెస్ పోయి బిజెపి ఏ ప్రభుత్వాలు వచ్చినా ఈ స్థితిలో మార్పు లేదు.

భోపాల్‌లోని యూనియన్ కార్బైడ్ కార్పొరేషన్ (యుసిసి) పురుగు మందుల కంపెనీకి పరీక్షించబడని సాంకేతికతను లోపభూయిష్ఠమైన డిజైన్‌ను పంపుతున్నామని 1973లోనే అమెరికాలోని దాని మాతృ సంస్థ తన అంతర్గత పత్రికల్లో చెప్పింది. మొత్తంగానే భారత్‌లోని యుసిసి ప్లాంట్ పూర్తి స్థాయిలో పరీక్షించబడి దృవీకరించబడలేదని యుసిసి అవగాహనలో ఉన్న విషయమే. ఆ తర్వాత కంపెనీలోని రక్షణ వ్యవస్థలపై నిర్వహించబడిన పర్యవేక్షణలో 30 ప్రమాద సూచికలు గుర్తించబడ్డాయి. విషవిలయ ఘటనకు ముందే కంపెనీలో జరిగిన అనేక ప్రమాదాలు

---

అల్లర్లు జరిగిన సమయంలో కేంద్ర హోంమంత్రిగా నిరాసక్తంగా పట్టించుకోకుండా ఉన్న పి.వి. నరసింహరావు తర్వాత ప్రధానమంత్రి అయి బాబ్రీ మసీదు విధ్వంసం జరుగుతున్నప్పుడు కూడా అంతే ఉదాసీనంగా వ్యవహరించి విధ్వంసకారులకు సహకరించారు. ఇందిరాగాంధీ జీవించి ఉన్న కాలంలో అస్సాంలోని నెల్లీలో మూడు వేల మంది ముస్లింలను ఊచకోత కోశారు. అందులో కూడా రాజకీయ కోణం తొంగిచూసింది. ఏ పద్ధతి ప్రకారం సిక్కుల ఊచకోత పకడ్బందీగా జరిగిందో అదే రీతిలో గుజరాత్‌లో గోద్రా అల్లర్లు జరిగాయి. ఆ సమయంలో గుజరాత్ ముఖ్యమంత్రిగా ఉన్న మోడీ నేడు దేశానికే ప్రధానమంత్రి.

దేశ విభజన జరిగిన కాలంలో పెచ్చరిల్లిన హింసలో భర్తలను పోగొట్టుకున్న స్త్రీల నివాసంగా పశ్చిమ ఢిల్లీలోని తిలక్‌విహార్ ప్రాంతంలో ఒక కాలనీ ఏర్పాటు చేశారు. ఆ కాలనీపేరు 'వితంతువుల సముదాయం'. దేశ విభజన సమయంలోని విషాద జ్ఞాపకాల గుర్తుగా 'వితంతువుల కాలనీ'ని ఆనాడు భారత ప్రభుత్వం ఏర్పాటు చేసింది. ఆ కాలనీ ఆనాటి జ్ఞాపకాల గుర్తు మాత్రమే. కాని ఈనాడు మూడు దశాబ్దాల క్రితం స్వతంత్ర దేశ రాజధానిలో జరిగిన హింసకు సజీవ జ్ఞాపకాలుగా కొన్ని వేల మంది సిక్కు వితంతువులు తమకు దక్కాల్సిన న్యాయం కోసం ఇంకా వేచిచూస్తూనే ఉన్నారు. దిలీప్ సైమియన్ అనే ప్రముఖ చరిత్రకారుడు వ్యాఖ్యానించినట్లుగా గాంధీని చంపిన గాడ్సేకు శిక్ష విధించారు. కాని గాంధీ హత్యకు ముఖ్యకారకుడు, పథకాన్ని సిద్ధం చేసిన వి.డి. సావర్కర్‌ను ఏ కోర్టు శిక్షించలేదు. పైగా ఆయన చిత్రపటాన్ని లోక్‌సభలో ఆవిష్కరించారు కూడా. జాతిపితగా కీర్తించబడే గాంధీకే దక్కని న్యాయం ఈ దేశంలో సిక్కు వితంతువులకు దొరుకుతుందా? ఆలోచించవలసిందే!

*(రచయిత రిటైర్డ్ ఇంగ్లిష్ అధ్యాపకులు)* వీ

మీడియాలో కూడా రిపోర్ట్ అయ్యాయి. అప్పటితోనైనా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు, యుసిసి అధినేత అండర్సన్ స్పందించి ఉంటే ఇంత పెద్ద మానవ హననం జరిగుండేది కాదు. గుర్తించబడిన రక్షణా పరమైన లోపాలను సరిచేయకపోతే జరిగే తీవ్ర ప్రమాదం తెలిసి కూడా వాటిని నివారించలేకపోయింది. ప్రమాదం జరిగిన సమయంలో ఆరింటిలోని ఏ ఒక్క రక్షణ వ్యవస్థ పనిచేయలేదు. ప్రమాదం జరిగితే ఎలా స్పందించాలో కంపెనీ ఉద్యోగులకు, కార్మికులకు, స్థానిక ప్రజలకు గాని తెలియ పరచలేదు. ఎంఐసి విష వాయువు విస్తరించే అత్యవసర సమయంలో కనీసం తడిగుడ్డను మొహంపై కప్పుకున్నా ఎన్నో ప్రాణాలు నిలబడేవి. మేజర్ గాయాలు నివారించబడేవన్న చిన్న విషయం కూడా ఎవరికీ చెప్పలేదు. ఖర్చును తగ్గించడంలో భాగంగా నిపుణత కలిగిన కార్మికులను సగం తగ్గించారు. భద్రతలో భాగంగా తప్పనిసరిగా ఎంఐసి ట్యాంక్‌లను చల్లబరిచి ఉంచే రిఫ్రిజిరేషన్ వ్యవస్థను రోజు 40 డాలర్ల విద్యుత్ ఆదాకోసం నిలిపివేశారు. ఎలాంటి సురక్షిత వ్యవస్థల ఏర్పాటు లేకుండానే అతి ప్రమాదకారి విషం ఎంఐసిని 41 టన్నుల అధిక మొత్తంలో ఎంతోకాలం నుండి నిలువ చేయడం, అదీ కూడా దాని చుట్టుపక్కల లక్షలాది మంది ప్రజలు నివసిస్తున్న ప్రాంతంలో అనేది ఎంతో తీవ్రమైన నేరం. ఇదే కంపెనీ మాతృ సంస్థ అమెరికాలోని వెస్ట్ వర్జీనియాలో ఉంది. అక్కడ ఆ ప్లాంట్‌లో తీసుకోబడిన ఏ ఒక్క రక్షణ/భద్రతా వ్యవస్థల నిర్వాహణ భోపాల్‌లో చేపట్టలేదు.

అండర్సన్‌ను అప్పగించే విషయంలో గాని, యూనియన్ కార్బైడ్ మాతృ సంస్థ అమెరికాలోని వెస్ట్ వర్జీనియాలో ఉన్న ప్లాంట్‌లో పాటించే భద్రతా చర్యల్లో ఏ ఒక్కటి కూడా భారత్‌లో చేపట్టకపోవడంపై గాని, పరిహారం, పునరావాసం విషయంలో భారత ప్రజలకు జరిగిన ఘోర అవమానం, అన్యాయం, (1984లోనే అమెరికాలో జరిగిన ఆయిల్ ప్రమాదంలో అమెరికా బాధితులకు ఒక్కొక్కరికి 40 వేల డాలర్లు, భారత్‌లోని భోపాల్ బాధితులకు కేవలం అయిదారు వందల డాలర్లు చెల్లించే విషయంలో) పై అమెరికా వైఖరిని నిరసించడం, ఖండించే విషయంలో గాని, అంతర్జాతీయ వేదికలపై గాని, ద్వైపాక్షిక ఒప్పందాలప్పుడు గాని దీనిపై పట్టుబట్టే విషయంలో ఏమాత్రం స్పందించకుండా మిన్నకుండి పోవడం 30 ఏళ్లుగా జరుగుతూనే ఉన్నది. అండర్సన్ అమెరికాలోనే పబ్లిక్‌గా తిరుగుతుండడం, అప్పుడప్పుడు మీడియాలో కనిపించడం జరుగుతూనే ఉన్నది. అయినా సరే అమెరికా ప్రభుత్వం అతని జాడ తెలియలేదని, కొన్నిసార్లు అతన్ని అప్పగించడం కుదరదని చెప్పింది. భారత పాలకులు మొక్కుబడిగా అండర్సన్‌ను అప్పగించమని అడగడం, అమెరికా స్పందించకపోవడం అనేది నేను గెలిచినట్లుగా చేస్తాను, నీవు ఏడ్చినట్లుగా చేయి అన్నట్లుగా భారత, అమెరికా పాలక వర్గాలు ప్రవర్తించాయి. దేశంగాని దేశంలో లాడెన్‌ను, సద్దాం హుస్సేన్‌ను పట్టుకుని చంపగలిగే సత్త ఉన్న అమెరికా అండర్సన్‌ను పట్టుకోలేకపోవడం దాని మోసపూరిత, రౌడీ చర్యను తెలుపుతుంది. 30 ఏళ్ల కాలంలో ఇండియా, అమెరికాల మధ్య ఎన్నో వాణిజ్య, వ్యాపార ఒప్పందాలు జరిగాయి. ఇరు దేశాల ఉన్నతాధికారులు, అధినేతలు ఎన్నోసార్లు ఎన్నో విషయాలపై మాట్లాడుకుంటూనే ఉన్నారు. అంగీకారాలకు, అవగాహనలకు వస్తూనే ఉన్నారు. మన్మోహన్ సింగ్ అయితే భోపాల్ ఘటనను ప్రస్తావించకుండానే మరో విలయానికి కారణం కాబోయే 123 అణు ఒప్పందంపై సంతకం పెట్టాడు. అణు విలయాలు, ప్రళయాలు ప్రపంచంలో లక్షలాది మంది ప్రజల ప్రాణాలను తీశాయి. పర్యావరణానికే విపరీత నష్టాన్ని మిగిల్చాయి. జపాన్‌లోని హిరోషిమా నాగసాకిలపై అమెరికా వేసిన అణుబాంబులు, రష్యాలోని చెర్నోబిల్‌లో అణు రియాక్టర్ పేలడం, జపాన్‌లో ఫుకుషిమాలో అణు రియాక్టర్ పేలడం ఇలా ఎన్నో చరిత్రలో జరిగాయి. అయినా సరే భారత పార్లమెంట్‌లో మన్మోహన్ సింగ్ 2013లో చట్టం కూడా చేశాడు. అండర్సన్ అంత సునాయసంగా ఎలా వెళ్లగలిగాడో చెప్పమని నోరువిప్పమని మధ్యప్రదేశ్‌లో మాట్లాడుతూ సోనియాగాంధీని డిమాండ్ చేస్తూ నరేంద్రమోడీ భోపాల్ ప్రజలపై ప్రేమను ఒలకబోశాడు. అయితే ప్రధాన మంత్రి అయ్యాక 2014 సెప్టెంబర్ 26 నుండి 30 వరకు అమెరికాలో పర్యటించిన సందర్భంలో, అక్కడి భారతీయులనుద్దేశించి ప్రసంగించిన సందర్భంలో అమెరికా అధ్యక్షుడు ఒబామాను కలుసుకున్న సందర్భంలో నరేంద్రమోడీ భోపాల్ విషయం ప్రస్తావించనే లేదు. నరేంద్రమోడీ అమెరికాలో పర్యటిస్తున్న నాలుగవ రోజే సెప్టెంబర్ 29న ఆండర్సన్ అమెరికాలోని ఫ్లోరిడాలో 92 ఏళ్ల వయస్సులో సహజ మరణం చెందాడు.

ఆండర్సన్‌ను విచారించకపోవడం అనేది భారత సార్వభౌమాధికారాన్ని అమెరికా కాళ్ల చెంతన పెట్టడమేనని అనుకోకతప్పదు. భారత్‌లో నేర విచారణను ఎదుర్కోకుండా తన దేశంలో సహజ మరణం పొందడం నిజంగా భోపాల్ బాధితులు ప్రాణాలు కోల్పోయిన వారిని తీవ్రంగా అవమానించి, మరింతగా గాయపరిచినట్లే. వారిపట్ల ఇది దుర్ఘటన జరగడం కంటే కూడా అతన్ని అలా వదిలివేయడం, అతనికి రక్షణగా నిలిచిన అమెరికా దుర్మార్గ వైఖరి, అలాగే ఆ వైఖరిని కనీసంగానైనా నిరసించకపోవడం అనేది ఎంతగానో కలిచివేసే చర్యగా మిగిలిపోక తప్పదు.

1989లో భారత ప్రభుత్వానికి యూనియన్ కార్బైడ్ కార్పొరేషన్ (యుసిసి) మధ్య 470 మిలియన్ (47 కోట్లు) డాలర్ల పరిహారం ఇవ్వడానికి ఒప్పందం కుదిరింది. ఈ సెటిల్‌మెంట్ ఎంతో వివాదస్పదమైనది. అన్యాయమైనది. లక్షల్లో బాధితులు, వేలల్లో మృతులు తీవ్రమైన రోగాలతో నిత్యం హింసింపబడుతూ ఆర్థికంగా, సామాజికంగా చితికిపోయిన ప్రజలకు సంబంధించి యుసిసి చేత మొక్కుబడిగా అతి తక్కువ నష్ట పరిహారం సగటున ఒక్కొక్కరికి ఐదారు వందల డాలర్లు వచ్చేటట్లుగా చెల్లించేటట్లు చేయడానికి కుదిరిన కుట్రపూరిత ఒప్పందం ఇది. ఈ ఒప్పందాన్ని 1991లో సుప్రీంకోర్టు రూఢీ చేసింది. ఈ ఒప్పందంతో ఇంకేమాత్రం బాధ్యతపడకుండా, తీవ్రంగా కలుషితం అయిన భోపాల్ కంపెనీ పరిసరాలు, దాని చుట్టు భూగర్భ జలాలు, నేలను, పర్యావరణాన్ని సహజ స్థితికి తీసుకురావడాన్ని తప్పించుకుని, చేతులు దులిపేసుకోవడానికి యుసిసికి భారత ప్రభుత్వం వీలుకల్పించింది. ఈ పరిహారం కూడా సక్రమంగా అందజేయబడలేదు. ఏళ్లకేళ్లు బ్యాంకుల్లో ఈ డబ్బు మురిగిపోతూ వచ్చింది. బాధితుల ఎంపికలో అక్రమాలు, అవినీతి, లంచాలు విచ్చలవిడిగా జరిగాయని ఏ బాధితుడైనా చెప్పే విషయమే. దుర్ఘటన జరిగి 20 ఏళ్లు గడిచినప్పటికి నామమాత్రపు పరిహారమైనా చెల్లింపబడలేదనడానికి 2004 అక్టోబర్ 26 నాటి సుప్రీంకోర్టు ఆదేశమే సాక్ష్యం. ఈ ఆదేశంలో 2004 నవంబర్ 15లోపు తప్పని సరిగా భోపాల్ బాధితులకు చెల్లించివేయాలని పేర్కొన్నది.

2010 జూన్ 27న భోపాల్‌లోని ట్రయల్ కోర్టు చీఫ్ జుడిషియల్ మెజిస్ట్రేట్ ప్రపంచంలోనే హీనమైన పారిశ్రామిక దుశ్చర్య అయిన భోపాల్ విషవాయువు సంఘటనలో 8 మంది అప్పటి యూనియన్ కార్బైడ్ ఇండియా లిమిటెడ్ (యుసిఐఎల్) అధికారులకు రెండేళ్ల జైలు శిక్షను, 1,01,750 రూపాయల జరిమానాను విధించింది. ఇందులో ఒకరు ముందే చనిపోయారు. సిఐసిసి, సిఇఒ అండర్సన్ తప్పించుకు తిరుగుతున్నాడు. శిక్ష పడిన 7 మంది అదేరోజు 25 వేల రూపాయల పూచికత్తుపై బెయిల్ పొందారు, స్వేచ్ఛగా తిరుగుతున్నారు. యుసిఐఎల్ (ప్రస్తుత ఎవిరిడే ఇండస్ట్రీస్ లిమిటెడ్) కు 5 లక్షల జరిమానా విధించింది. ఐపిసి 304 – ఎ ప్రకారం ఈ శిక్ష ఖరారు అయింది.

నిర్లక్ష్యం, అలసత్వం, ఏమరపాటు కారణంగా మరణం సంభవిస్తే ఈ సెక్షన్‌ను వినియోగిస్తారు. ట్రాఫిక్ ఆక్సిడెంట్‌లలో 304 – ఎను ఉపయోగిస్తారు. యూనియన్ కార్బైడ్ కార్పొరేషన్‌లో రక్షణ భద్రతాచర్యలేవి తీసుకోక పోవడం, ప్రమాదం జరిగేకంటే ముందే ఎన్నోసార్లు ఈ విషయాలు బయటపడడం, ఒకవేళ ప్రమాదం జరిగితే కలిగే విపరీత ప్రాణనష్టం, పర్యావరణ నష్టం గురించి ఆ కంపెనీకి పూర్తిగా తెలిసిన విషయమే తప్ప ఏదో ప్రమాదవశాత్తు, లేక తెలియని నిర్లక్ష్యం వల్లనో జరిగిన దుర్ఘటన కానేకాదు.

ఇంకా చెప్పాలంటే కంపెనీ ప్రారంభించిన నాటి నుండే ఈ అవకాశం పొంచి ఉందని యూనియన్ కార్బైడ్‌కు తెలుసు. దీని గురించి 1973 నాటికే అమెరికా యూనియన్ కార్బైడ్ అంతర్గత పత్రాలలో చర్చింపబడిన విషయమనేది బయటకు తెలిసివచ్చింది. ఇంత తెలిసినా కూడా తగు జాగ్రత్తలు తీసుకోకపోవడం అనేది క్రూరమైన నేరం. ఈ నేరానికి గాను ఐపిసి 304 (2)ను అనుసరించి విచారణ జరపాలి, శిక్షలు విధించాలి. మొత్తంగా ఈ కేసు కుదించబడి, దిగజార్చబడి రోడ్డు ప్రమాదాల్లో వేసే శిక్షా స్థాయికి కుదించబడి భారత ప్రజలను ప్రత్యేకించి భోపాల్ బాధితులను తీవ్రంగా అవమానించి నేరస్థులకు బాసటగా నిలిచినట్లేనని అనుకోవల్సి వస్తున్నది.

ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆండ్ టెక్నొలజీ రిసర్చ్, లక్నోవ్ రిపోర్ట్ 2013 జనవరి ప్రకారం యుసిసి ఫ్యాక్టరీ చుట్టూ 3.5 కిలోమీటర్ల పరిధిలో గల నేల, భూగర్భ జలాలు కాన్సర్, జనన లోపకారక రసాయనాలతో కలుషితం అయ్యాయి. 68 ఎకరాల యూనియన్ కార్బైడ్ ఫ్యాక్టరీ పరిధిలో అనేక చోట్ల భూమిలో గోతులు తవ్వి అందులో విషపూరిత వ్యర్థ రసాయనాలను వదిలిన ఫలితమే ఇది. దీన్ని శుద్ధి చేయాల్సింది యూనియన్ కార్బైడ్ కంపెనీయే. 2001లో ఈ కంపెనీని అమెరికాకు చెందిన డౌకెమికల్స్ అనే మరో బహుళజాతి సంస్థ కొనేసింది. దానివలన యూనియన్ కార్బైడ్‌కు చెందిన అన్ని రకాల ఆస్తులు, లాభాలు, నష్టాలు, అది చెల్లించవలసిన బాకీలకు పూచి పడాల్సి ఉంటుంది. అమెరికాలో ఉన్న యూనియన్ కార్బైడ్ బాకీపడ్డ చెల్లింపుల విషయంలో ముందుగానే రెండు బిలియన్లు (రెండు వందల కోట్లు) పక్కకు పెట్టిన డౌకెమికల్స్ భారత్‌లోని భోపాల్ విషయంలో యూనియన్ కార్బైడ్ బాకీపడ్డ దానికి బాధ్యత పడలేనని అంటున్నది. డౌకెమికల్స్‌కు భారత్‌లో ఎన్నో పరిశ్రమలున్నాయి. లక్షల కోట్ల వ్యాపారం చేసుకుంటున్నది. ఈ వ్యాపారాలకు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు సహాయ సహకారాలు అందిస్తూనే ఉన్నాయి. కాని భోపాల్ ప్రజల పరిహార విషయంలో నిలదీసి రాబట్టుకోలేక పోతున్నాయి.

వియత్నాంపై అమెరికా చేసిన అనైతిక రసాయనిక దాడులలో ఉపయోగించిన ఏజెంట్ ఆరెంజ్ అనే విషాన్ని తయారు చేసి సరఫరా చేసింది ఈ డౌకెమికల్స్ కంపెనీయే. డౌకెమికల్స్ తయారు చేసిన విష రసాయనాలను అమెరికా సైన్యం విమానాల్లో నుండి వియత్నాం భూ భాగాలపై చల్లింది. తద్వారా ఎంతో మంది ప్రజలు, చెట్లు, అడవులు, పర్యావరణం నాశనం అయ్యాయి. డౌకెమికల్స్ గాని, ఒకప్పటి యూనియన్ కార్బైడ్ గాని అమెరికా పెంటగాన్‌కు చాలా దగ్గరి సంబంధాల్లో ఉంటాయి. వాటిని ముట్టుకుంటే అమెరికాను ముట్టుకున్నట్లే అంటే అమెరికాను తాకడమంటే హై ఓల్టేజీ కరెంట్ షాక్ తగిలినట్లేనన్నమాట. వెన్నెముకలేని భారత రాజకీయ వ్యవస్థలని ఈ నేపథ్యంలో అనుకోకుండా ఉండలేం. ప్రజాస్వామిక హక్కులకోసం నినదించే, పోరాడే ప్రజలపై విరుచుకుపడి ఈ వ్యవస్థలు బహుళజాతి సంస్థల, అమెరికా కాళ్ల ముందు సాగిలపడి తోకలు ఊపుతూ ప్రేమతో, భయంతో కుయ్, కుయ్ మంటూ కాళ్లునాకే పెంపుడు కుక్కలా అనిపిస్తుంటే తప్పేవరిది.

1960లో హరిత విప్లవానికి పితామహుడుగా చెప్పబడే అమెరికా వ్యవసాయ శాస్త్రవేత్త నార్మన్ ఇ బోర్లాగ్ 1963లో అధిక దిగుబడినిచ్చే గోధుమ వంగడాలను భారత్‌లో ప్రవేశపెట్టాడు. ఇది భారత హరిత విప్లవ పితామహుడుగా పిలువబడే ఎం.ఎస్. స్వామినాథన్ నాయకత్వం లో వేగవంతం అయింది. అధిక దిగుబడులు సాధించడంలో కొంత మేరకు కొంతకాలం విజయవంతం అయింది. వరి, గోదుమల దిగుబడులు పెంచడానికి అధిక మొత్తాలలో రసాయనిక ఎరువులు, పురుగు మందులు, ఆధునిక నీటి పారుదల వ్యవస్థలను ఉపయోగించడం మొదలైంది.

దీర్ఘ కాలంగా ప్రమాదకర రసాయన ఎరువులు, పురుగు మందులు వాడడం మూలంగా భూమి సహజమైన సారాన్ని కోల్పోయి నిర్జీవమైంది. ఇక రసాయన ఎరువులు వాడితేనే పంటలు పండే స్థితి వచ్చింది. రసాయన ఎరువులు, పురుగు మందులపై ఆధారపడే తప్పనిసరి పరిస్థితి దాపురించింది. ఒకే రకమైన పంటలు ఏళ్ల తరబడి వేయడం వల్ల ఆహార స్థిరత్వాన్ని ఇచ్చే అధికపోషక విలువలున్న అనేక రకాల ఆహార పంటలైన పప్పు ధాన్యాలు, జొన్నలు, తైదలు, సజ్జలు, కొర్రలు, అదిసెలు వంటి వందల కొద్ది వంగడాలు కనుమరుగవుతూ వచ్చాయి. వీటికి నీటి అవసరం కూడా తక్కువగా ఉంటుంది. మన వాతావరణ పరిస్థితులకు తట్టుకునే సహజమైన శక్తిని ఇవి కలిగి ఉన్నాయి. వేల రకాల వరి వంగడాలు మాయమయి కొన్ని పరిమిత హైబ్రిడ్ రకాలు వచ్చాయి. రసాయనిక ఎరువులు, పురుగు మందుల వాడకం వల్ల ఎన్నోరకాల జీవ వైవిధ్య పురుగులు, జాతులు నాశనం అయ్యాయి. చాలా వరకు చీడపీడలు వ్యాధి నిరోధక శక్తిని పెంపొందించుకుని మరింత శక్తివంతమయి మరింతగా పురుగు మందులపై ఆధారపడే పరిస్థితి వచ్చింది. దీని వలన తెలిసీ కొంత, తెలియక కొంత భూ, జల వాతావరణ కాలుష్యం పెరిగిపోయింది. ఎన్నో రకాల కొత్తరకం వ్యాధులు, మొక్కలకు, పంటలకు, జంతువులకు, మనుషులకు వస్తున్నాయి. జీవ వైవిధ్యాన్ని ధ్వంసం చేసే రసాయనిక వ్యవసాయ పద్ధతులను, వాటిని ప్రోత్సహిస్తున్నా రసాయనిక బహుళజాతి కంపెనీలను కట్టడి చేయకుండా జీవ వైవిధ్య సదస్సుల పేరుతో అవే కంపెనీల ఫండింగ్‌లతో ప్రపంచ వ్యాప్తంగా సమావేశాలు నిర్వహించడం జరుగుతున్నది. 2012లో

హైదరాబాద్‌లో అలాంటిదే ఒక సదస్సు జరిగింది. ప్రపంచ వ్యాప్తంగా బహుళజాతి కంపెనీల లాభాల గ్రాఫ్ పైకి పెరగడం కోసంగా రసాయనిక ఎరువుల, పురుగు మందుల వాడకంతో కూడిన వ్యవసాయ మార్పులు తెస్తూ ప్రవేశ పెట్టబడింది హరిత విప్లవం. అందులో భాగంగానే భారతదేశంలో భోపాల్‌లో యూనియన్ కార్బైడ్ పురుగు మందుల కంపెనీ తెరవబడింది. దానికి భారత ప్రభుత్వం 1970లో లైసెన్స్ ఇచ్చింది. ప్రపంచ వ్యాప్తంగానైనా, భారతదేశంలోనైనా పెట్టుబడిదారుల ధన దాహానికి పుట్టిన వికృత బిడ్డే హరిత విప్లవం. యూనియన్ కార్బైడ్ తయారు చేసే పురుగు మందైన సెవిన్ (రసాయనికంగా కార్బరైల్) ఉత్పత్తిలో అతి ప్రమాదకరమైన మిథైల్ ఐసో సైనైడ్ (ఎంఐసి) ను వాడతారు. అదెంత ప్రమాదకారో 1984లో భోపాల్‌లో జరిగిన భయంకర ఘటన తెలుపుతూనే ఉన్నది.

హరిత విప్లవ వైఫల్యం, దాని దుష్ఫరితాలను గత ఎన్నో దశాబ్దాల అనుభవాలు చెప్పకనే చెపుతున్నాయి. దేశ వ్యాప్తంగా జరిగిన, జరుగుతున్న లక్షలాది రైతుల ఆత్మహత్యలు, 40 శాతం పైగా పిల్లలు పోషకాహార లోపంతో బాధపడుతుండడం ఇందుకు నిదర్శనం. అయితే పెట్టుబడిదారులు, బహుళజాతి సంస్థల బొక్కసాలు నింపడానికి మాత్రం పనికి వచ్చాయనేది కాదనలేని సత్యం. కార్గిల్, మోన్‌శాంటో, డుపాంట్, డౌకెమికల్స్ వంటి బహుళజాతి సంస్థలు ప్రపంచ వ్యాప్తంగా వ్యవసాయంపై నియంత్రణను కలిగి ఉన్నాయి. విత్తనాలు, రసాయనిక ఎరువులు, పురుగు మందులు, బిటి విత్తనాలు, జిఎంఒ పంటలు మొదలగు రూపాల్లో ఈ దుర్మార్గపు నియంత్రణ కొనసాగుతున్నది. రైతులకు విత్తనాలపై స్వయం నిర్ణయాధికారం లేకుండా పోయింది. వేల ఏళ్లుగా వస్తున్న ప్రకృతి, పర్యావరణ నేస్తాలుగా ఉన్న అనేక స్థానిక ఆహారం పంటల విత్తనాలు లభ్యం కాకుండా పోయాయి. కేవలం బహుళజాతి సంస్థలు, వాటి అనుంగు స్థానిక సంస్థలు తయారు చేసిన విత్తనాలే రైతులకు దిక్కుగా మారిపోయాయి. వాటికోసం వాడే రసాయనిక ఎరువులు, పురుగు మందుల కోసం మళ్లీ అవే కంపెనీలపై ఆధారపడే అసహాయ, నిర్బంధ పరిస్థితుల్లో రైతులు, స్థానిక వ్యవసాయం ఒక విషవలయంలో చిక్కుకుపోయారు. హరిత విప్లవ కాలంలోనే 1970ల ప్రాంతంలో జపాన్‌లో ఫుకోకా వ్యవసాయంలో అనేక ప్రయోగాలు చేసి సహజ పద్ధతుల్లో వరి పండించి అధిక ఉత్పత్తిని సాధించి నిరూపించాడు. భారత్‌లో కూడా ఇటువంటి అనేక ప్రయోగాలు జరిగాయి. జరుగుతున్నాయి. వాటికి ప్రోత్సాహం కావల్సి ఉన్నది. ఇప్పటికైనా వ్యవసాయ స్వావలంబన దిశగా, సహజ, ప్రకృతి వ్యవసాయ విధానాలను ఎన్నో ఏళ్లుగా దేశీయంగా వస్తున్న విత్తనాలను పరిరక్షిస్తూ, వాటి ఉత్పత్తిని పెంచేలా, వైవిధ్య భరితమైన పంటలను, రసాయనిక ఎరువులు, పురుగుల మందులు వాడకం లేకుండా అధిక దిగుబడులు సాధించేలా, రైతులు ఆత్మగౌరవంతో జీవించేలా చర్యలు చేపట్టాల్సి ఉన్నది.

1970లలో భారత్‌లోకి విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులు పెరుగుతూ వచ్చాయి. స్వేచ్ఛా వాణిజ్యం పెరగడం మూలంగా అనేక విదేశీ కంపెనీలు ఇష్టా రాజ్యంగా దేశంలోకి ప్రవేశించాయి. 1991ల నుండి వేగవంతమైన మత సరళీకృత ఆర్థిక విధానాల వల్ల మరింతగా విదేశీ పెట్టుబడులు పెరిగాయి. మరింతగా దేశంలో వనరులపై బహుళజాతి సంస్థల పట్టు పెరుగుతూ వస్తున్నది. ఇది పంటలపై పడి పీల్చి పిప్పి చేసి తెగబలిసి పారిపోయే మిడతల దండులు. వీటికి భారతదేశంతో పాటు మూడవ ప్రపంచ దేశాలెన్నో కాలనీలుగా మారిపోతున్నాయి. ఇక్కడ లభ్యమయ్యే చౌకశ్రమ, సహజ వనరులు, బహుళజాతి సంస్థలు చేసే అరాచకాలను అరికట్టగలిగే సంకల్పం లేని రాజకీయ, న్యాయ వ్యవస్థలు, అవి వేసే ఎంగిలి మెతుకులకు ఆశపడే నీచమైన బ్యూరోక్రసీ, అవినీతి పాలక వ్యవస్థలు విద్రోహ పూరిత బహుళజాతి సంస్థలకు రాచబాటలు వేస్తున్నాయి. ఫలితంగా వాటి దుర్మార్గాలకు ప్రజలు, పర్యావరణం బలియై పోతున్నాయి.

భోపాల్ వంటి మానవ హననాలు భవిష్యత్‌లో జరిగే అవకాశాలున్న ఫ్యాక్టరీలు, ప్లాంట్‌లను ఎన్నింటినో బహుళజాతి సంస్థలు వ్యూహ రచన చేయడమే కాకుండా ప్రస్తుతం ప్రపంచ వ్యాప్తంగా పలుచోట్ల నడిపిస్తున్నాయి. మనదేశంలో ప్రమాదకరమైన అణు విద్యుత్ కేంద్రాలు, థర్మల్ పవర్ ప్లాంట్‌లు, రసాయనిక మందుల కంపెనీలు, మొదలైనవి నడుస్తున్నాయి. మహారాష్ట్రలోని జైతాపూర్, తమిళనాడులోని కూడంకుళం, ఆంధ్రప్రదేశ్‌లోని కొవ్వాడల్లో న్యూక్లియర్ పవర్ ప్లాంట్లకు అనుమతులు ఇచ్చారు. సముద్ర తీరం వెంబడి ఆంధ్రప్రదేశ్‌లో పదుల కొద్ది థర్మల్ పవర్ ప్లాంట్లకు అనుమతులు ఇచ్చారు. పర్యావరణానికి, సముద్ర కాలుష్యానికి, అక్కడి ప్రజల ఆరోగ్యాలకు, జీవితాలకు తీవ్రమైన విఘాతం కలిగించే ఇలాంటి వాటిని నడిపించే బడా పెట్టుబడిదారులకు లాభాలు పండించడం కోసం కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు పని చేసుకుంటూ పోతున్నాయి. ఇవి వద్దని నిరసిస్తే ఆంధ్రప్రదేశ్‌లో శ్రీకాకుళంలోని కాకరపల్లిలో ముగ్గురిని కాల్చి చంపారు. జైతాపూర్ నిరసన ప్రదర్శనలో ప్రజలను పోలీసులు కాల్చారు. కూడంకుళంలో నిరసనకారులపై అనేక అక్రమ కేసులు పెట్టారు. వీటిని వ్యతిరేకించే ప్రజా సమూహాలపై నిర్బంధాలు, బెదిరింపులు, కాల్పులు, జైళ్లు చూపుతున్న ప్రభుత్వాలు బహుళజాతి సంస్థలకు, బడా పెట్టుబడిదారీ సంస్థలకు, సామ్రాజ్య వాదులకు దాసోహం అంటూ తన సొంతగడ్డపై ప్రజలను గడ్డిపోచల్లా చూస్తున్నాయి. మన్మోహన్ సింగ్ ప్రధాన మంత్రిగా ఉన్నప్పుడు చేసుకున్న 123 అణు ఒప్పందం ప్రకారం భారత్‌లో నెలకొల్పబడే విదేశీ న్యూక్లియర్ పవర్ ప్లాంట్‌లో జరిగే ప్రమాదాలకు ఎంత పెద్ద మొత్తంలో జరిగినాసరే గరిష్ఠంగా 2,140 కోట్లు చెల్లించేలా నిబంధనను పెట్టారు. ఫలితంగా భోపాల్ వంటి అనుభవాలే పునరావృతం అయ్యే పరిస్థితి కొనితెచ్చారు. ఇదంతా వద్దంటే అభివృద్ధి జరగాలి కదా అంటారు. ఈ అభివృద్ధి ఎవరి కోసం? భోపాల్ వంటి దుర్ఘటనలో 30 వేల మంది మృతులు, 8 లక్షల మంది బాధితులు అనేక రకాల రోగాలు, వైకల్యాలతో 3 తరాల సంతతులు ప్రతినిత్యం నానా హింసలను భరిస్తున్నారు. అలాంటి కంపెనీలు, అలాంటి అభివృద్ధి అవసరమా? అది అసలు అభివృద్ధి ఎందుకవుతుంది? కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు పోటా పోటీగా విదేశీ, స్వదేశీ, బహుళజాతి సంస్థల బడా పెట్టుబడిదారులను ప్రోత్సహిస్తున్నాయి. ఏ ప్రభుత్వమైనా సరే ఒకే విధానాన్ని పాటిస్తున్నాయి. పెట్టుబడులు ఎందుకు పెడతారు, వారు లాభాలు ఆర్జించడం కోసమే తప్పిస్తే ఇక్కడి ప్రజల అభివృద్ధి కొరకు కాదు. అలా అయితే వారు పెట్టుబడిదారులు ఎందుకవుతారు. సంక్షేమదారులవుతారు గాని. ఈ అభివృద్ధి పాలనా నమూనాను తిరస్కరించే ప్రజా చైతన్యం నేడెంతో అవసరం. అవశ్యం.

*(రచయిత ఉపాధ్యాయులు)*

# లౌకికత్వానికి చీకటిరోజు డిసెంబర్ 6

*మత ప్రోత్సాహంలేని లౌకిక భారత రాజ్యాంగాన్ని మత ఛాందస శక్తులు బహిరంగంగా తమ స్వార్థ రాజకీయ ప్రయోజనాల కోసం మలచుకొని విధ్వంసాలకు పాల్పడుతున్నాయని అంటున్నారు* **దాసరి సంజయ్‌కుమార్**

'కర్ర ఎవడి చేతిలో ఉంటే బర్రె వాడిదే' అనే సామెత మైనారిటీ ముస్లింల హక్కుల హరణకు సాక్ష్యం. 1992 డిసెంబర్ 6 మత ఛాందసవాదుల ఆగడాలకు భారత లౌకికవాదం మసకబారింది. ప్రజాస్వామ్యం తలదించుకుంది. సుదీర్ఘకాలంగా హిందూ, ముస్లింల వైరికి ప్రధాన కారణంగా మారిన ప్రదేశం అయోధ్య. ఇది రాముడి జన్మస్థలంగా హిందువుల విశ్వాసం. 1528లో బాబర్ చక్రవర్తి పాలనకాలంలో మీర్‌బకి ఆ ప్రాంతంలో మసీదు కట్టించాడని అందుకే దానిని బాబ్రీ మసీదుగా గుర్తింపుకు విశ్వాసం. 1859లో ప్రార్థనా స్థలాలను విభజిస్తూ బ్రిటిష్ ప్రభుత్వం కంచెను నిర్మించింది. లోపలి భాగం ముస్లింలది, బయటి భాగం హిందువులది.

బాబ్రీ మసీదు నిర్మాణంలో రాముడి విగ్రహాలు ధ్వంసమయ్యాయని భావించి 1949 డిసెంబర్ 23న కొందరు వ్యక్తులు రాముడి విగ్రహాన్ని ప్రతిష్ఠించారు. అక్రమంగా ప్రవేశించిన ఆ సన్నివేశం ముస్లిం, హిందువులకు వైరం పెంచింది. సెక్షన్ 145 కింద మెజిస్ట్రేట్ ఉత్తర్వుల ప్రకారం ఆ కట్టడానికి తాళమేశారు. ప్రతిష్ఠించిన విగ్రహాలు వెలిశాయనే వార్త దావనలంలా వ్యాప్తి చెందడం, ప్రజలంతా తండోప తండాలుగా దర్శనానికి రావడం కొన్ని హిందూ మత సంస్థలకు ముఖ్యంగా విశ్వ హిందూ పరిషత్ (విఎచ్‌పి) లాంటి సంస్థలు అవకాశంగా మార్చుకుని ప్రతి సందర్భాన్ని మతాల మధ్యన విద్వేశాలకు వాడుకుంది. మొదట మెజిస్ట్రేట్ ఆదేశాలతో దర్శనానికి అవకాశం లేకుండా మూసివేసిన తాళలు తొలగించి దర్శనానికి ఆవకాశం కల్పించాలని ప్రారంభించిన వారి ఆందోళనలు చివరికి బాబ్రీ మసీదును కూల్చే వరకు వివిధ పద్ధతుల్లో కొనసాగింది. ఆనాటి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు, సుప్రీంకోర్టు, పురాతత్వ శాస్త్రవేత్తలు, మేధావులు ఎవరు కూడా ఆయోధ్యలో వాస్తవ రూపమేంటో చెప్పలేక, ఎవరి అభిప్రాయాలు వారు కలిగి, ప్రజల మధ్యన మత విద్వేషాలను చూస్తుండి పోయాయి. దీనికి అందరూ బాధ్యత వహించాల్సిందే. విఎచ్‌పి, ఆర్‌ఎస్‌ఎస్, భజరంగ్‌దళ్ లాంటి సంఘ్ పరివార్ శక్తులకు బిజెపి కూడా తోడై బాబ్రీ మసీదు విధ్వంసంలో ముందున్నాయి. ఆనాటి సంఘటన మత ప్రాతిపదికన దేశాన్ని రెండుగా చీల్చాయి. ఒకపక్క హిందూ, ముస్లింల ఐక్యతా, ఏకాభిప్రాయ చర్చలు, కోర్టులలో ప్రత్యేక విచారణలు, ప్రభుత్వం ప్రత్యేక భద్రత వలయాలు ఇన్ని జరిగినా మసీదు కూల్చే మత ఛాందసవాదులను ఆనాటి ప్రభుత్వాలు ఆపలేకపోయాయి. ఆనాటి ప్రధాని పి.వి. నర్సింహారావు కేంద్ర బలగాలను వినియోగించుకోకుండా రాష్ట్ర ప్రభుత్వమే చోద్యం చూస్తుండి పోయిందని దీనికంతటికి కారణం కేంద్ర ప్రభుత్వాన్ని, కోర్టులను మోసం చేసిన ఉత్తరప్రదేశ్ ముఖ్యమంత్రి బిజెపికి చెందిన కళ్యాన్ సింగ్‌గా ప్రకటిస్తూ ఆ రాష్ట్రంలో రాష్ట్రపతి పాలన కొనసాగించారు. అంతా విధ్వంసం జరిగాక, సంఘ్‌పరివార్ లక్ష్యం నెరవేరాక, ఒక వర్గ ప్రజల మనోభావాలను గాయపర్చాక ఏ చర్య తీసుకున్న నిష్ఫలమే. ఆనాటి విధ్వంసాలకు సాక్షి భూతులు ఎల్.కె. అద్వానీ, మురళీ మనోహర్ జోషి, ఉమాదేవి మొదలగువారు, నేడు వారి పార్టీ ప్రభుత్వమే కేంద్రంలో కొనసాగుతున్నది. నాటి గోధ్రా అల్లర్ల హత్యాకాండకు సాక్షి భూతులు ప్రస్తుత ప్రధాని మోడీ. వీరంత నేడు సంఘ్‌పరివార్ ఒడిలో కూర్చుని లౌకిక, ప్రజాస్వామ్య రాగాలు పలుకుతున్నారు. ఆనాటి బాబ్రీ మసీదు విధ్వంసం ద్వారా రాజ్యాంగానికి ద్రోహం తలపెట్టిన కళ్యాన్‌సింగ్ గవర్నర్‌గా, గోధ్రా హత్యాకాండకు రాజధర్మం చేయని నరేంద్రమోడీ దేశ ప్రధానిగా తిరిగి ద్రోహం చేసిన రాజ్యాంగంపై ప్రమాణం చేసి కూర్చున్నారు. వీరిలాంటి మత ఛాందస్తులను గద్దెనెక్కించిన భారత సమాజం రేపు మరో అయోధ్య, గోధ్రా లాంటి సంఘటనలు జరగవని భావించగలదా? వీరంతా ఆర్‌ఎస్‌ఎస్ ముసుగులో అన్ని సున్నిత ప్రాంతాలలో మత విద్వేషాలను రెచ్చగొడుతూ ఈ దేశాన్ని 'హిందూ' దేశంగా మార్చడానికి కంకణబద్ధులయ్యారు

1992 డిసెంబర్ 6 జరిగిన సంఘటన ఇంకా ముస్లిం ప్రజలలో మెదులుతూనే ఉంది. ఈ దేశంలో వారి మైనారిటీని గుర్తు చేస్తూనే ఉంది. అహింసా సిద్ధాంతాన్ని వల్లించే దేశంలో మెజారిటీ ప్రజల హింసకు ప్రతికారంగా మైనారిటీలూ విధ్వంసక ఆలోచనలు ఏర్పర్చుకుంటున్నారు. ముస్లిం మత ఛాందస సంస్థలు, హిందూ మత వ్యతిరేకతను ముస్లిం రాజ్యాన్ని ఏర్పర్చే ఆలోచనలు కల్పిస్తున్నారు. అంతర్జాతీయ ఉగ్రవాద సంస్థలతో సంబంధాలు ఏర్పర్చుకుంటూ విధ్వంసాలు జరుపుతున్నారు. హిందూ మత ఛాందస సంస్థలు కషాయ ఉగ్రవాదాన్ని కొనసాగించడం మక్కా మసీదు, ఆజ్మీర్ దర్గాలో జరిగిన విధ్వంసం తెలుపుతున్నది. ఇలా ఒక మతం మరో మతంపై ఆధిపత్యాన్ని దక్కించుకొనుటకు జరిపే విధ్వంసాలకు బాధ్యులెవ్వరు? వారు పవిత్రంగా చదివే భగవద్గీత, ఖురాన్‌లా? వారాదరించే రాముడు, ప్రవక్తన? మరెవరో దీనికి కారణం? సూక్ష్మ బుద్ధిగల పార్టీల నాయకులు, హ్రస్వ దృష్టిగల మత ఛాందస సంస్థలు దీనంతటికి కారణం కావా? ప్రధాని మోడీ గెలిచిన పార్టీలోని ఎజెండాలో ఇప్పటికి పెద్ద అక్షరాలతో లిఖించబడ్డ పదమే అయోధ్య నిర్మాణం. మత ప్రోత్సాహకంలేని లౌకిక రాజ్యాంగం భారత రాజ్యాంగం. మరి ఒక పార్టీ అయోధ్య నిర్మాణంను బహిరంగంగా మేనిఫెస్టోలో పెడుతుంటే రాజ్యాంగ హక్కుల రక్షకులెటుపోయారు ఈ దేశంలో? మరో అయోధ్య, గోధ్రా లాంటి దుర్ఘటనలు జరగకుండా చూసేదెవ్వరు ఈ దేశంలో? ప్రజలా? కోర్టులా? మత సంస్థలా? గుజరాత్ ముఖ్యమంత్రిగా ఉన్న ప్రస్తుత దేశ ప్రధాని నరేంద్రమోడీ నాడు గోధ్రా హత్యాకాండకు కారణభూతుడు. నేడు ఉత్తరప్రదేశ్ నుండి ఎంపిగా పార్లమెంట్‌కు ప్రాతినిధ్యం వహిస్తున్నాడంటే బిజెపి మేనిఫెస్టోలోని అయోధ్య నిర్మాణం తిరిగి జరగదందామా? మరో

# కార్పొరేట్ కంపెనీల సేవలో బ్యాంకులు

*బ్యాంకుల ప్రైవేటీకరణ, మొండి బకాయిల మాఫీ, నూతన ఆర్థిక విధానాలు మొత్తంగా ప్రభుత్వరంగ బ్యాంకుల వ్యవస్థను దెబ్బతీసే విధంగా పనిచేస్తున్నాయని అంటున్నారు* **డా. శ్రీనివాసరావు చొప్పర**

నేడు దేశంలోని బ్యాంకింగ్ రంగం ప్రైవేటీకరణతో పాటు మొండి బకాయిలు (నిరర్థక ఆస్తులు, ఎన్‌పిఎలు) సమస్యను ఎదుర్కొంటుంది. మొండి బకాయిల కొన్ని బ్యాంకుల లాభాలను మొండిగా మింగేస్తుంటే, మరికొన్ని బ్యాంకులను దివాలా అంచున నిలబెడుతున్నాయి. 26 ప్రభుత్వరంగ బ్యాంకులు, 32 ప్రైవేట్ రంగ బ్యాంకులు ఈ సమస్యను ఎదుర్కొంటుండగా ప్రభుత్వరంగ బ్యాంకుల (పిఎస్‌బిలు) లో ఈ సమస్య తీవ్రత చాలా ఎక్కువగా ఉంది. ప్రభుత్వ రంగ బ్యాంకులలో ఈ సమస్య తీవ్రత పెరగడమంటే ప్రజా ధనానికి ముప్పు వాటిల్లినట్లే. మరో దొడ్డిదారిన ప్రజాధనం లూటీ అవుతున్నట్లే.

ప్రభుత్వ పథకాల కింద కూడా సామాన్యులకు అప్పులు నిరాకరించే బ్యాంకులు కోటీశ్వరులకు మాత్రం పిలిచి అప్పులిస్తున్నాయి. ఆ అప్పులు వసూలు కాకపోతే రుణగ్రహితల చుట్టూ ప్రదక్షిణలు చేస్తాయి. ఇలా వసూలు కాని మొండి బాకీల విలువ 2,43,014 కోట్ల రూపాయలకు చేరిందని రేటింగ్ ఏజెన్సీ ఇక్రా తెలిపింది. గత సంవత్సరం ఈ మొత్తం 1,71,853 కోట్ల రూపాయలు. గత సంవత్సరంతో పోల్చినప్పుడు 39 శాతం పెరిగినట్లుగా ఇక్రా తెలిపింది. స్థూల నిరర్థక ఆస్తులు 2013 మార్చ్‌లో 3.6 శాతం ఉండగా 2014 మార్చ్ నాటికి 4.4 శాతం పెరిగాయని, 2015 మార్చ్ నాటికి అది 4.7 శాతం కావచ్చునని ఇక్రా అంచనా వేసింది. ఇది ఆందోళన చెందాల్సిన విషయమని అది ప్రకటించింది. మరోవైపు ఈ ఆర్థిక సంవత్సరానికి గాను 3.25 లక్షల కోట్ల రూపాయల మొండి బకాయిలను కార్పొరేట్ డెట్ రీస్ట్రక్చర్ కింద పునర్వ్యవస్థీకరించి మంచి బకాయిలుగా చూపించడమైనది. అయితే ఈ పునర్వ్యవస్థీకరించిన మొండి బకాయిలు ఇంకా చాలా ఎక్కువగానే ఉంటాయని బ్యాంకు వర్గాలు ప్రకటిస్తున్నాయి. ఇలా తాజాగా తేల్చిన మొండి బకాయిలు, పునర్ వ్యవస్థీకరించి మంచివిగా చూపిన ఆ మొండి బకాయిలను కలుపుకుంటే అవి దాదాపు 5 లక్షల కోట్ల రూపాయల పైమాటే. మొండి బకాయిలు పెద్ద మొత్తంలో పేరుకుపోవడం దానికదే పెద్ద కుంభకోణం. 1947 తర్వాత ఇప్పటి వరకు జరిగిన కుంభకోణాల్లో అతిపెద్దదిగా చెప్పుకుంటున్న బొగ్గు కుంభకోణం విలువ 1.8 లక్షల కోట్ల రూపాయలు, 2జి స్పెక్ట్రమ్ కుంభకోణం విలువ 1.7 లక్షల కోట్ల రూపాయలు కాగా మొండి బకాయిల కుంభకోణం వీటికి రెండు, మూడు రెట్ల పైమాటే.

బ్యాంకు నుండి తీసుకున్న రుణం, దానిపై వడ్డీ మొత్తాల వాయిదా సొమ్మును 90 రోజుల లోపు చెల్లించకపోతే ఆ బకాయిని మొండి బకాయిగా జమకడతారు. ఆ బకాయినే నిరర్థక ఆస్తి (నాన్‌పెర్ ఫార్మింగ్ అసెట్, ఎన్‌పిఎ) అని పిలుస్తారు. ఈ బకాయిలు పేరుకుపోయే కొద్ది బ్యాంకుల లాభాలు తగ్గిపోవడమో లేదా నష్టాలు రావడమో జరుగుతుంది. అంతే కాకుండా ప్రజాధనం కొల్లగొట్టినట్లు. ఎందుకంటే

---

హత్యాకాండకు అవకాశం లేకపోలేదు. అన్ని మతాలు పరమత సహనాన్ని, మానవత్వాన్ని కోరుతున్నాయి. మనుషుల మధ్య విషబీజాలు నాటే ఈ మతాన్ని ఏమి అందాం? మతమా? ఉగ్రవాదమా? విషబీజాలు నాటే ఏ మతాన్నైనా పౌర సమాజం వ్యతిరేకించాల్సిందే. మతం పేరిట హిందూ తాలిబికరణం జరగపోనున్నదా? శవాలపై నాట్యానికి మత విధ్వంసక శక్తులు కుయుక్తులు పన్నుతున్నాయి. మనుషుల ఆలోచనల విధ్వంసం జరుగుతూ మనువాద మూఢత్వానికి దారులు పరుస్తున్నాయి. విద్య కాషాయికరణ చేస్తూ, ఒక వర్గాన్ని అవమానపరుస్తూ, విద్యకు దూరం చేసే ప్రయత్నం జరుగుతున్నది. విద్యార్థుల శాస్త్రీయ ఆలోచనలపై దాడి చేయడానికే ప్రధాని టివి, రేడియోలలో ఉపన్యాసాలు, సంఘ్ సేవకుల ఆలోచనలను కార్పొరేట్ శక్తుల సహకారంతో, మీడియా మాయజాలం చేస్తూ, ప్రజల ఆలోచనలను మోడీ ఆలోచనలుగా కాకుండా, మోడీ ఆలోచనలే ప్రజలు ఆలోచించేలా మారుస్తున్నాయి. ఈ దేశ మూలవాసులను తరుముతూ వన సంపదను, ఖనిజ సంపదలను కార్పొరేట్ శక్తులకు అందిస్తూ స్వదేశీ మంత్రంతో విదేశీ ఆలోచనలు చేసే ఈ ప్రభుత్వాన్ని ఏమందాం? వారి మాటలకి, చేతలకి సంబంధం లేదు. ఆనాటి ఉత్తరప్రదేశ్ ముఖ్యమంత్రి కళ్యాన్‌సింగ్ కూడా అనేక సార్లు సుప్రీం కోర్టుకిచ్చిన వాంగ్మూలంలో బాబ్రీ మసీద్‌ను పరిరక్షిస్తామనే అన్నారు. కానీ అంతిమంగా 1992 డిసెంబర్ 6న జరిగిన విధ్వంసాన్ని కనీసం స్థానిక పోలీసులు కూడా అడ్డుకునే ప్రయత్నం చేయలేదంటే వీరి పార్టీ మనస్సులోని ఆలోచనలకు, బయటికి చెప్పే మాటలకు సంబంధం లేదు. అందుకే మైనారిటీ సమాజంలో అభద్రత మొదలైంది. ఈ దేశంలో మా స్థానం ఎక్కడని? మైనారిటీ పదమే దేశంలో ద్వితీయ శ్రేణి పౌరులుగా గుర్తింపిస్తున్నది. ఒకదేశ పౌరులంతా ఒకే పౌరసత్వాన్ని కలిగి ఉన్నప్పుడు మతపరమైన మైనారిటీ విభజనలెందుకు? ప్రభుత్వాలు మారుతున్నాయి కానీ ఏ ప్రభుత్వం కూడా వెలుగులోకి రాని పేద, దళిత బడుగు బలహీన ప్రజల ఆర్థిక, సామాజిక, రాజకీయాభివృద్ధికి తోడ్పడడం లేదు. సమాజంలో ఒక ముఖ్యమంత్రి స్థాయివ్యక్తి దళితుడుగా అవమానానికి గురవుతుంటుంటే మత ఛాందసవాదులు ఏర్పర్చిన కుల వర్గాలనేమందాం? ఇలాంటి అసమానతలు లేని సౌభ్రాతృత్వ సమాజానికి దారులు పరిచే ఆలోచనలు ఏర్పర్చే వ్యవస్థలు కావాలి తప్ప మనుషులను మత, కులపరంగా వేరు చేసుకుంటూ వెళితే మనుషులు లేని దేశానికి 'అభద్రత' ఒక్కటే మిగులుతుంది. మతపరంగా విభజించే పాలకుల, మతవాదుల కుట్రలను అడ్డుకుంటూ మరో చీకటి రోజులకు పదాలి అంతం.

*(రచయిత ఉపాధ్యాయులు)* వీ

మొండి బకాయిలలో సింహభాగం ప్రభుత్వ రంగ బ్యాంకుల వాటానే.

ప్రభుత్వ రంగ బ్యాంకుల్లో మొండి బకాయిలు సంవత్సరానికి పెరిగిపోతున్నాయి. 2008 మార్చ్ నాటికి 39 వేల కోట్లుగా ఉన్న మొండి బకాయిలు, 2013 మార్చ్ నాటికి 1.71 లక్షల కోట్లకు చేరుకోగా 2014 మార్చ్ నాటికి 2.43 లక్షల కోట్ల రూపాయలకు పెరిగిపోయాయి. అంటే ఐదు సంవత్సరాల వ్యవధిలో 1,32,000 కోట్లు పెరిగితే ఒకే ఒక సంవత్సరంలో 2014 ఆర్థిక సంవత్సరంలో 72 వేలకోట్లు పెరిగాయి. వీటికి తోడు కార్పొరేట్ డెట్ రీస్ట్రక్చర్ ఉండనే ఉంది. ఈ కాలంలో చెడ్డ రుణాలను మంచివిగా చూపినవి 3.5 లక్షల కోట్ల రూపాయలు. నిజానికి ఈ రీస్ట్రక్చర్ చేసినవి తిరిగి మొండి బకాయిలుగా మారిపోతాయి. ఎందుకంటే వాటిమీద ఎలాంటి వసూలు జరగవు కాబట్టి. అయితే నూతన ఆర్థిక విధానాల అమలు తర్వాత ఈ డెట్ రీస్ట్రక్చర్ నిరంతర కార్యక్రమంగా మారింది.

**ప్రభుత్వ రంగ బ్యాంకుల్లో మొండి బకాయిల లెక్కలివి (కోట్లలో)**

| | |
|---|---|
| మార్చ్ 2008 నాటికి ప్రభుత్వరంగ బ్యాంకుల్లో మొండి బకాయిలు | రు. 39,000 |
| మార్చ్ 2013 నాటికి ప్రభుత్వరంగ బ్యాంకుల్లో మొండి బకాయిలు | రు. 1,71,853 |
| మార్చ్ 2014 నాటికి ప్రభుత్వరంగ బ్యాంకుల్లో మొండి బకాయిలు | రు. 2,43,014 |
| మొండి బకాయిలను రీస్ట్రక్చర్ చేసి మంచి రుణాలుగా చూపిస్తున్నవి | రు. 3,25,000 |
| గత ఏడేళ్లలో మొండి బకాయిలు | రు. 4,95,000 |
| మొండి బకాయిలకు సర్దుబాటు చేసిన బ్యాంకు లాభం మొత్తం (2013-14) | రు. 1,40,000 |
| గత పదమూడేళ్లలో రద్దుచేసిన మొండి బకాయిలు | రు. 2,04,000 |

ఈ మొండి బకాయిదారులు ఏ పరిశ్రమ కోసం, వ్యాపారం కోసం రుణం తీసుకున్నారో అది నష్టాల బారిన పడిందని, మూసివేశామని చూపుతూ బాకీలు ఎగ్గొట్టి, అదే సమయంలో ఆ నిధులను తమ సొంత ఆస్తులకు మళ్లిస్తారు. అధికారంలో ఉన్న ప్రభుత్వాలను, రాజకీయ నాయకులను పట్టుకుని వడ్డీ మాఫీ, రుణమాఫీ, రుణ పునర్వ్యవస్థీకరణ, వన్‌టైమ్ సెటిల్‌మెంట్ వంటి అనేక పేర్లతో ఆ బాకీలు మాఫీ చేయించుకుంటారు. గత 13 సంవత్సరాలలో అలా రద్దు చేసిన మొండి బకాయిల మొత్తం 2,04,000 కోట్ల రూపాయలు. ఇలా ప్రతి సంవత్సరం వేలకోట్ల రూపాయల ప్రజాధనం ప్రభుత్వ, ప్రైవేట్ బ్యాంకుల నుంచి సంపన్నుల సొంత బొక్కసాలకు బదిలీ అయి వారి సొంత ఆస్తిగా మారుతున్నది. తీసుకున్న రుణాన్ని తిరిగి చెల్లించగలిగిన స్తోమత ఉండి బ్యాంకును మోసం చేయాలనే ఉద్దేశంతో ఎగ్గొట్టేవారిని ఉద్దేశపూర్వక ఎగవేతదారు (విల్‌ఫుల్ డిఫాల్టర్)గా పేర్కొనడం జరుగుతుంది. ఒక్కసారి విల్‌ఫుల్ డిఫాల్టర్‌గా ముద్ర పడిన తర్వాత బ్యాంకులు అన్నీ కూడా ఆ వ్యక్తి లేదా సంస్థ ఖాతాలన్నింటినీ బ్లాక్ చేయడం, కేసు నమోదు చేయడం, కోర్టుకీడ్చడం జరుగుతుంది. నిజానికి మొండి బకాయి దారులందరూ విల్‌ఫుల్ డిఫాల్టర్లే. అందరి మీద కేసులు నమోదు చేయాల్సిందే. కానీ ఇప్పటి వరకు విల్‌ఫుల్ డిఫాల్టర్‌గా ప్రకటించిన ఏకైక లేదా మొట్టమొదటి పారిశ్రామిక వేత్త కింగ్ ఫిషర్ ఎయిర్‌లైన్స్, యునైటెడ్ బ్రూవరీస్ తదితర కంపెనీల అధినేత విజయ్ మాల్యా ఒక్కడే. ఇతను భారతీయ స్టేట్ బ్యాంకు నేతృత్వంలోని 17 బ్యాంకుల కన్సార్టియంకు 7 వేల నుంచి 7.5 వేల కోట్ల రూపాయల రుణాన్ని తిరిగి చెల్లించకుండా వాయిదా వేస్తున్నాడు. ఈ కన్సార్టియంలోని యునైటెడ్ బ్యాంక్ ఆఫ్ ఇండియా (యుబిఐ) విజయ్‌మాల్యాను విల్‌ఫుల్ డిఫాల్టర్‌గా ప్రకటించింది. ఇలాంటి వారిలో మన్మోహన్‌సింగ్ ప్రభుత్వంలో ఆంధ్ర నుండి ప్రతినిధ్యం వహించిన కేంద్రమంత్రి ప్రస్తుత ఆంధ్రప్రదేశ్ అధికార పార్టీ ఎంపి, ఇద్దరు పద్మశ్రీ అవార్డు గ్రహీతలతో పాటు మనకు నిత్యం పత్రికల్లో కనిపించే చాలా పెద్దపెద్ద వారి పేర్లు ఉన్నాయి. ఇటీవల బ్యాంకర్స్ ఎంప్లాయిస్ యూనియన్ 406 పేర్లతో పదికోట్లు పైబడి ఎగ్గొట్టిన వారి జాబితాను ప్రకటించింది. 100 కోట్లు ఆపైన ఎగ్గొట్టిన కార్పొరేట్ కంపెనీలు 172 కాగా వాటి మొత్తం 37 వేలకోట్లు. 24 బ్యాంకుల్లోని అతిపెద్ద 30 మొండి పద్దుల మొత్తం (400 కంపెనీలు) 70 వేలకోట్ల రూపాయలు. కాబట్టే మాజీ కంప్ట్రోలర్ అండ్ ఆడిటర్ జనరల్ వినోద్‌రాయ్ 'విజయ్ మాల్యా బ్యాంకులకు ఎగవేసిన రుణాల మొత్తం కేవలం సముద్రంలోని నీటిబొట్టు మాత్రమే' అని తాను రాసిన 'జాతి ఆత్మ చేతన కాపలా దారు డైరీ ఒక అకౌంటెంట్ మాత్రమే కాదు' అనే పుస్తకంలో వాఖ్యానించారు. బ్యాంకు రుణ ఎగవేత దారులలో విజయ్ మాల్యాకంటే పెద్ద పెద్ద పారిశ్రామిక, వ్యాపార వేత్తలు, రాజకీయ నాయకులు, వారి ఆశ్రితులు చాలా మంది ఉన్నారనే విషయాన్ని వినోద్‌రాయ్ వ్యాఖ్య స్పష్టం చేస్తుంది.

బ్యాంకుల లాభాలను మొండి బకాయిలు మింగేస్తున్నాయి. గత ఆర్థిక సంవత్సరంలో బ్యాంకుల లాభాలను పరిశీలిస్తే ఈ విషయం స్పష్టమవుతుంది. ఎస్‌బిఐ మొండి బకాయిలను పెరగకుండా కొంత ప్రయత్నం చేసినప్పటికీ మిగిలిన ప్రభుత్వ రంగ బ్యాంకులు ఈ విషయంలో చాలా వెనకబడి ఉన్నాయి. 2014 ఆర్థిక సంవత్సర నాలుగో త్రైమాసపు ఆర్థిక ఫలితాలలో పంజాబ్ నేషనల్ బ్యాంక్ (పిఎన్‌బి) నికర లాభం 28.7 శాతం తగ్గిపోయింది. దాని లాభ నష్టాల ఖాతాలో మొండి బకాయిల కొరకు ఏర్పాటుకు ఎక్కువ మొత్తం కేటాయించడమే దీనికి కారణం. ఈ సంవత్సర కాలంలో దీని స్థూల ఎన్‌పిఎలు 4.27 శాతం నుండి 5.25 శాతం పెరిగాయి. అదే కాలానికి యూనియన్ బ్యాంక్ ఆఫ్ ఇండియా (యుబిఐ) నికర లాభం 26.61 శాతంకు పడిపోయి 579 కోట్లకు పరిమితమైంది. దీనికి కారణం ఎన్‌పిఎలకు లాభ నష్టాల ఖాతాలో పెద్ద మొత్తంలో ఏర్పాటు చేయడమే. మరొక ప్రభుత్వరంగ బ్యాంక్ అయిన బ్యాంక్ ఆఫ్ ఇండియా (బిఒఐ) నికర లాభం ఈ కాలానికి 26.3 శాతం తగ్గిపోయి 558 కోట్లకు పరిమితమైంది. దీని స్థూల ఎన్‌పిఎ మార్చ్ 2013లో 20.99 శాతం ఉండగా, మార్చ్ 2014కి 3.15 శాతానికి పెరిగింది. అయితే ఎస్‌బిఐ ఈ కాలంలో తన ఎన్‌పిఎలను 7 వేల కోట్ల మేర తగ్గించగలిగింది. అయినా దాని ఎన్‌పిఎలు తక్కువేమి కాదు. మొత్తంగా ఈ 2014 ఆర్థిక సంవత్సరంలో 40 బ్యాంకులకు గాను ఎస్‌బిఐ మినహా మిగిలిన 39 బ్యాంకుల ఆర్థిక ఫలితాలు 9.4 శాతం నుండి 9.1 శాతంకు పడిపోయాయి.

2013-2014 ఆర్థిక సంవత్సరంలోని మొదటి 9 నెలల కాలంలో 42 బ్యాంకులు 5.02 లక్షల కోట్ల రూపాయల రుణాలు ఇవ్వగా ఆ తొమ్మిది నెలల కాలానికి వాటి స్థూల నిరర్థక ఆస్తులు 67379 కోట్ల రూపాయలని తేల్చారు. అంటే ఈ 9 నెలల కాలంలో మంజూరు చేసిన ప్రతి వంద పైసలు (ఒక రూపాయి) రుణంలో 13 పైసలు చెడ్డవిగా

మారి మొండి బకాయి కింద జమైనవి. ఇదే కాలంలో యునైటెడ్ బ్యాంకు 9268 కోట్ల రూపాయలు రుణాలుగా మంజూరు చేస్తే అందులో 5518.18 కోట్లు మొండి బకాయిలుగా ఆ బ్యాంకు గుర్తించింది. అంటే ఈ బ్యాంకు ఇచ్చిన ప్రతి వంద పైసలు (రూపాయి) రుణంలో 60 పైసలు మొండి బకాయిగా మారింది. ఇది మరింత ఆందోళన కలిగించే విషయం.

ప్రభుత్వరంగ బ్యాంకులలో మొండి బకాయిలు పెరిగిపోవడానికి గల కారణాలు పరిశీలిస్తే, రుణ గ్రహీతలుగా ఉన్న కార్పొరేట్ వర్గాలు, మంది సొమ్మును కొల్లగొట్టడంలో పోటీపడి ఆ మొత్తాన్ని సొంత ఆస్తిగా మార్చుకొని తిరిగి అదే బ్యాంకులపై పెత్తనం చేస్తున్నారు. బ్యాంకు కార్యకలాపాలను నియంత్రిస్తున్నారు. మరోవైపు వివిధ బ్యాంకుల యాజమాన్యాలు రుణాల మంజూరుకి ఉన్న నిబంధనలన్నింటినీ తుంగలో తొక్కి ప్రలోభాలకు గురై తమదికాని ప్రజా ధనాన్ని పందేరం చేయడంలో పోటీపడుతున్న వైనం ఒక్కొక్కటిగా బైటపడుతున్నాయి. ఛీఫ్ మేనేజింగ్ డైరెక్టర్ల, మిగిలిన డైరెక్టర్ల నియామకంలో రాజకీయ నాయకుల జోక్యం ఇటీవల కాలంలో చాలా పెరిగిపోయింది. ఇలా నియమించబడ్డ వాళ్లు బ్యాంకుల సాధారణ నియమాలను కూడా పాటించడం లేదు. కింగ్‌ఫిషర్ ఎయిర్‌లైన్స్ నష్టాలలో ఉన్నట్లు, కనీసం సిబ్బంది జీతాలు కూడా సక్రమంగా ఇవ్వలేని స్థితిలో ఉన్నట్లు తెలుస్తున్నా, జీతాలు చెల్లించాలని, సిబ్బంది తొలగింపును ఆపి వేయాలని ఉద్యోగులు ఆందోళన చేస్తున్నా అవేమి పట్టనట్లు ఎస్‌బిఐతో పాటు మొత్తం 17 బ్యాంకులు ఆ సంస్థకు రుణాలు ఇవ్వడానికి కింగ్‌ఫిషర్ కార్యాలయం ముందు క్యూ కట్టడం దేనిని తెలియజేస్తుంది. విజయ్‌మాల్యాను విల్‌ఫుల్ డిఫాల్టర్‌గా ప్రకటించిన తర్వాత అకులు పట్టుకోవడం ఎవరిని నమ్మించడానికి? తను పొందిన 7000 కోట్ల రూపాయల రుణంలో సగానికిపైగా కింగ్‌ఫిషర్ నష్టాల్లో ఉన్నట్లు తెలిసిన తర్వాత ఈ బ్యాంకులు రుణాలుగా ఇచ్చాయంటే ఏ ప్రలోభాలకు, ఒత్తిడిలకు గురైనట్లు? విజయ్‌మాల్యా బ్యాంకులను మోసం చేసినట్లు కాదు, బ్యాంకులు ప్రజలను మోసం చేసినట్లు.

ఇంతకంటే ఘనమైనది భూషణ్ స్టీల్స్ వ్యవహారం. భూషణ్ స్టీల్స్, ప్రకాశ్ ఇండస్ట్రీస్‌ల రుణ పరిమితి పెంచేందుకు, వాటికి చెందిన సుమారు 100 కోట్ల పైబడిన బకాయిలను మొండి బకాయి పద్దులుగా పరిగణించకుండా తొక్కిపట్టడానికిగాను సిండికేట్ బ్యాంకు ఛీఫ్ మేనేజింగ్ డైరెక్టర్ (సిఎండి) సుధీర్ జైన్ 50 లక్షల రూపాయలు లంచం తీసుకున్న ఆరోపణలపై జైన్‌ను సిబిఐ అరెస్ట్ చేసింది. ఈ కేసు విచారణలో భాగంగా భూషణ్ స్టీల్స్ వైస్ చైర్మన్, మేనేజింగ్ డైరెక్టర్ సింఘాల్‌ను, ఈ మొత్తం వ్యవహారంలో దళారీగా వ్యవహరించిన ఒక చార్టర్డ్ అకౌంటెంట్ అరెస్ట్‌తో అసలు విషయం బయటపడింది. భూషణ్ స్టీల్స్‌కి ఎస్‌బిఐతో పాటు 51 బ్యాంకులు మొత్తం 40 వేలకోట్ల మేర రుణం ఇచ్చినట్లు తేలింది. ఇందులో ఎస్‌బిఐ వాటా 6 వేలకోట్లు. ఈ కంపెనీ ప్రస్తుతం తీవ్ర ఆర్థిక సంక్షోభంలో ఉంది. అయినప్పటికీ మొన్న ఏప్రిల్‌లో కొన్ని బ్యాంకులు 6.9 వేలకోట్లు రుణం ఇవ్వడమైంది. ఆ 40 వేలకోట్ల సొమ్ము సక్రమంగా వినియోగించబడిందా లేదా దారి మళ్లిందా అనే విషయాన్ని తేల్చడానికి ఫోరెన్సిక్ ఆడిట్ చేయించాలని అప్పులిచ్చిన బ్యాంకుల కన్సార్టియం నిర్ణయించింది. సంక్షోభంలో ఉన్న భూషణ్ స్టీల్స్ మూసి వేయకుండా కొనసాగించేందుకుగాను అప్పులిచ్చిన బ్యాంకులు నిర్వాహణా బాధ్యతను తీసుకున్నాయి. ఇది నిధులు మళ్లించడం ద్వారా ఏర్పడిన సంక్షోభం. ఇది నివారించలేనిది. కాబట్టి ఈ రుణాలన్ని అంటే 40 వేలకోట్ల మొండి బకాయిగా ప్రకటించాల్సిందే. ఇప్పటికే దేశీయ బ్యాంకింగ్ రంగం ఎన్‌పిఎల దెబ్బకు అల్లాడి పోతుంటే తాజాగా భూషణ్ స్టీల్స్‌కు ఇచ్చిన రుణాలు కూడా ఎన్‌పిఎల జాబితాలో చేరితే పలు బ్యాంకులు సంక్షోభంలో పడక తప్పదు.

ఈ మొత్తం వ్యవహారంలో దళారీగా వ్యవహరించిన చార్టర్డ్ అకౌంటెంట్ పవన్ బన్సాల్, ఆయనకు చెందిన ఆర్థిక సేవల కంపెనీ ఆలిస్ట్ ఫిన్ సర్వ్ సిఫార్సుల మేరకు యూకో, కెనరా, మహారాష్ట్ర బ్యాంకులు వివిధ కంపెనీలకు అడ్డగోలుగా దాదాపు 6500 కోట్ల రూపాయల రుణాలు మంజూరు చేసినట్లు సిబిఐ వర్గాలు అనుమానిస్తున్నాయి. ఇవన్నీ కూడా నేడు మొండి బకాయిలుగా మారుతున్నాయి. అలనే విన్‌సమ్ గ్రూప్ 15 ప్రభుత్వ రంగ బ్యాంకులతో కూడిన కన్సార్టియం నుంచి 6500 కోట్ల రుణాలు సమీకరించింది. ఇంత మొత్తానికిగాను ఈ గ్రూప్ బ్యాంకులలో తాకట్టుగా పెట్టిన కొల్లాటరల్ విలువ కేవలం 250 కోట్ల రూపాయల విలువ కలిగినది మాత్రమే. ఈ గ్రూప్ తీసుకున్న రుణంలో కొంత భాగాన్ని విదేశాలకు, మరికొంత మొత్తాన్ని ఇతర వ్యాపారాలకు మళ్లించినట్లు తెలుస్తుంది. ఇలా పరిశీలించినప్పుడు ప్రతి ఎగవేతదారుని బాగోతం ఇంతకు భిన్నంగా ఏమీ ఉండదు పేర్లు, మొత్తాలు మారడం తప్ప. వీటన్నింటిలో సిఎండి స్థాయి వ్యక్తుల నుంచి మిగిలిప డైరెక్టర్స్ వరకు రుణాల మంజూరు ఉన్న నిబంధనలకు పూర్తిగా నీళ్లొదిలి, అడ్డమైన గడ్డికి ఆశపడి, ఆయా కంపెనీలలో రహస్య భాగస్వాములుగా కొనసాగుతున్నారు. సుదీర్ జైన్ ఫోన్ కాల్స్‌ను, డీల్‌కు సంబంధించిన డాక్యుమెంట్లను విశ్లేషించిన సిబిఐ, ఈ తరహా వ్యవహారం చాలా కాలంగా కొనసాగుతుందని, కేవలం సిండికేట్ బ్యాంకే కాక ఇతర బ్యాంకుల్లో సైతం ఈ దందాలు జరుగుతున్నాయని గుర్తించింది.

పారిశ్రామిక వేత్తలకు వేలకు వేలకోట్లు రుణాలుగా ముట్టజెప్పి వాటి వసూళ్ల విషయంలో పిల్లి మొగ్గలు చేస్తున్న బ్యాంకులు రైతులకు రుణాలు ఇవ్వడంలోనూ, తిరిగి వాటిని రాబట్టుకోవడంలోనూ వ్యవహరించే తీరు ఎంత కఠినంగా ఉంటుందో అనుభవించిన వారికి మాత్రమే తెలుస్తుంది. రైతులు వ్యవసాయం చేసింది నిజం. కాలం కలిసిరాకపోవడం, గిట్టుబాటు ధర లేకపోవడం నిజం. విత్తన వ్యాపారుల, పురుగు మందుల, ఎరువు వ్యాపారుల మోసాలకు గురి కావడం నిజం. ఫలితంగా రుణాల చెల్లింపుకు వాయిదా కోరుతున్నారు తప్ప బ్యాంకులను మోసం చేయాలని, ఎగ్గొట్టాలని ఏ రైతు భావించడు. ఎందుకంటే ప్రతి రూపాయి విలువ తనకు తెలుసు కాబట్టి. కాని బడా పారిశ్రామికవేత్తలు రుణాలు తీసుకుని కనీసం వ్యాపారం ప్రారంభించకుండానే వాటిని దారి మళ్లిస్తున్న విషయం తెలిసిందే. ఎగ్గొట్టే వారికి నుత్తా సత్కారాలు, వాయిదా కోరే వారికి అవమానాలు తప్పడం లేదు. రైతులు తమకు తాముగా రుణమాఫీని అడగలేదు. ఓట్లకోసం రాజకీయ పార్టీలు చేసిన హామీ తప్ప. ఆ హామీపై ఆంధ్ర, తెలంగాణ ప్రభుత్వాలు నేడు మాట్లాడిన మాట మళ్లీ మాట్లాడకుండా, ఆడిన అబద్ధం మళ్లీ ఆడకుండా ఎన్నికల హామీని అటకెక్కించాలని తీవ్రంగా ప్రయత్నిస్తున్నాయి. రిజర్వు బ్యాంకు, ఇతర బ్యాంకులు ఏదో అపచారం జరిగిపోతున్నట్లు, ఆర్థిక వ్యవస్థ తలకిందులవుతుందని, మళ్లీ కోలుకోవడం కష్టమని చెపుతున్నాయి. అదే అలవాటుగా మారి భవిష్యత్తులో రుణాలు తిరిగి చెల్లించరని వేదాలు వల్లిస్తున్నాయి. ఇంతకీ రెండు రాష్ట్రాల మీద రైతు, డ్వాక్రా మహిళల రుణాల మాఫీకి అవసరమయ్యే మొత్తం దాదాపు 80 వేల కోట్లు మాత్రమే.

# ఆర్.ఎస్. చౌహాన్ సంస్మరణ



**కా**ర్మిక నాయకులు ఆర్.ఎస్. చౌహాన్, టెలికాం వర్కర్స్ యూనియన్ బ్రాంచి కార్యదర్శిగా, రీజినల్ కార్యదర్శిగా, సర్కిల్ యూనియన్ సహాయ కార్యదర్శిగా, ఆలిండియా అసిస్టెంట్ జనరల్ సెక్రటరీగా వివిధ హోదాలలో పనిచేస్తూ, దేశంలోని ప్రధాన నగరాలలో, రాష్ట్రంలోని పలు పట్టణాలలో పర్యటించి టెలికాం ఉద్యోగుల సమస్యల పరిష్కారాలకై అహర్నిశలు కృషి చేశారు. 2014 నవంబర్ 11న అకస్మాత్తుగా గుండె పని చేయక చనిపోయారు.

1964లో డిపార్ట్‌మెంట్‌లో చేరినప్పటి నుండి తన తోటి కార్మికుల హక్కులకై బ్యూరోక్రటిక్ ఆఫీసర్లతో పోరాడి సస్పెండ్ అయ్యారు. క్షమాపణ చెప్పడానికి నిరాకరించి, ఆలస్యమైనా సరే యూనియన్ కృషి ద్వారా తిరిగి నియమింపబడ్డారు. అహర్నిశలు కార్మికుల పక్షాన నిలిచి పనిచేశారు.

రాయలసీమలో పెద్ద నగరమైన కర్నూలులో పెన్షనర్స్ అసోసియేషన్ లేకపోవడం వలన తోటి మిత్రులతో చర్చించి, మొదటిసారి పెన్షనర్స్ అసోసియేషన్ స్థాపించి దానికి అధ్యక్షులుగా ఆరోగ్యం సరిగా లేకపోయినా పని చేశారు. దోపిడి పెట్టుబడిదారీ వ్యవస్థను నిర్మూలిస్తే తప్ప నూటికి 90 శాతంగా ఉన్న ప్రజల అర్ధ బానిస విధానం పోదనే వారు. సోషలిజం ఒక విప్లవం ద్వారా సాధ్యమనే వారు. చివరగా 2014 నవంబర్ 1న జరిగిన పెన్షనర్ సమావేశంలో తన శరీరంలో ఆఖరి రక్తంబొట్టు ఉన్నంత వరకు విప్లవానికే సహాయం చేస్తూ అంకితమవుతున్నారు. వీ

**వీక్షణంలో అచ్చయిన ఆర్.ఎస్. చౌహాన్ వ్యాసాలు**

1. వాటాల మార్కెట్టులో బిఎస్ఎన్ఎల్ (జనవరి 2011)
2. శ్రీకృష్ణ కమిటీ నివేదిక – పూర్వాపరాలు (ఫిబ్రవరి 2011)
3. ప్రత్యేక రాయలసీమ రాష్ట్ర ఆవశ్యకత (నవంబర్ 2012)

పారిశ్రామిక వేత్తలు తీసుకున్న రుణాలు సకాలంలో అసలుగాని, వడ్డీగానీ చెల్లించక ఏళ్లకు ఏళ్లు గడిపి చివరికి రాజకీయ మద్దతుతో ఆ రుణాలు మాఫీ చేయించుకుంటున్నవీ, కావాలని ఎగ్గొడుతున్నవీ లెక్కవేస్తే ఏటేట ఎన్ని వేల కోట్ల రూపాయల ప్రజాధనం దోచుకోబడుతుందో అర్థమవుతుంది. గత 13 ఏళ్లలలో బ్యాంకులు 20.04 లక్షల కోట్లు మాఫీ చేయడం దీనికి సాక్ష్యంగా నిలుస్తుంది. వారికి ప్రభుత్వం ఇచ్చే రాయితీలు అంచనాకు దొరకవు. వీటితో పోల్చినప్పుడు రైతు రుణమాఫీకి అవసరమయ్యే 80 కోట్లు పెద్దమొత్తమే కాదు. చిత్తశుద్ధి, ప్రపంచ బ్యాంకుని ఎదిరించగల ధైర్యం ఉండాలంతే.

మొండి బకాయిలను నివారించి బ్యాంకులను ప్రజలకు జవాబు దారీగా నిలబెట్టాల్సిన ప్రభుత్వం ఆ సవాళ్లను అధిగమించే పేరుతో జబ్బు ఒకటైతే వైద్యం మరొకటి చేయాలని తలస్తుంది. చిత్రం ఏమిటంటే ఈ మొండిబకాయి దారుల వివరాలు చెప్పమంటే ప్రభుత్వం చెప్పదు. కార్పొరేట్‌లకు రుణాలు మంజూరు చేయడంలో గానీ, వాటి మొండి బకాయిలను వసూళ్లలో నిర్లక్ష్యం చేయడం గానీ, వాయిదా వేయడం గానీ కార్పొరేట్ యజమాన్యాలతో, సంస్థలతో రాజకీయ నాయకులకు ఉన్న రాజకీయ లేదా భాగస్వామ్య సంబంధాలను బట్టి ఉంటాయి. అంతే కాకుండా బ్యాంకుల చైర్మన్ అండ్ మేనేజింగ్ డైరెక్టర్స్‌కూ కార్పొరేట్ సంస్థలలో వాటాల రూపంలో, లంచాల రూపంలో సంబంధాలు ఉంటున్నాయి. (మాజీ కేంద్ర ఆర్థికమంత్రి చిదంబరం కుటుంబ కంపెనీ రుణాల చెల్లింపును చూసినా, సిండికేట్ బ్యాంకు సిఎండి లంచాల వ్యవహారం చూసినా ఇలాంటి పరస్పర సంబంధాలను వెల్లడిస్తున్నాయి.) కార్పొరేట్ యజమాన్యాలకూ, రాజకీయ నాయకులకూ, బ్యాంకు అధిపతులకూ ఉన్న త్రిముఖ పరస్పర రుణసంబంధాల వలనే మొండి బకాయి పేర ప్రజల పొదుపు సొమ్ముపై పెత్తనం చేయడం, కొల్లగొట్టడం చేస్తున్నారు. అందువల్లనే రిజర్వ్ బ్యాంకుపై, దాని విధాన నిర్ణయాలపై బ్యాంకు గవర్నింగ్ చాడీ కంటే, కేంద్ర ప్రభుత్వానిదే (కేంద్రస్థాయి కార్పొరేట్–రాజకీయ నాయకులదే) పెత్తనం. అందుకే పేర్లను ప్రకటించడం లేదు. జాతీయ భద్రతకు ప్రమాదం అని చెప్పి తప్పించుకుంటుంది. ఆ రకంగా వారిని కాపాడుతుంది.

ప్రభుత్వం, రిజర్వ్ బ్యాంకు అధికారికంగా మొండి బకాయిదార్ల పేర్లను ప్రకటించాలని చాలా కాలంగా బ్యాంకుల ఉద్యోగ, అధికారుల సంఘాలు డిమాండ్ చేస్తున్నాయి. అయితే అందుకు భిన్నంగా గ్లోబల్ ప్రభుత్వం కాంపిటేషన్ పేరుతో బ్యాంకులను విలీనం చేయడానికి, ప్రైవేటీకరించడానికి పూనుకుంటుంది. 'సరిపెట్టే పెట్టుబడులు' పేరుతో బాసిల్–3 నిబంధనలను బ్యాంకులపై బలవంతంగా రుద్ది అంతర్జాతీయ ద్రవ్య మార్కెట్ దిగ్గజాలైన లెమెన్ బ్రదర్స్, మోర్గాన్ లాంటి అమెరికాన్ బ్యాంకుకు భారతీయ ద్రవ్య మార్కెట్‌ను అప్పగించాలనే ఒత్తిడి సామ్రాజ్యవాదుల నుండి ఎక్కువగా ఉంది. భారతదేశంలో ఉన్న ద్రవ్య విధానాలు, ప్రభుత్వరంగ బ్యాంకుల విధానాలు వాటికి అడ్డంకిగా ఉన్నందున వాటిని సవరించే పేరుతో బాసెల్ – 3ని తీసుకురావడం జరిగింది. ఆ మేరకు దాని అమలుకు అంతర్జాతీయ ఒప్పందం జరిగింది. ఇది ముమ్మాటికీ ప్రైవేటీకరణను వేగవంతం చేయడమే. ఏ స్ఫూర్తితోనైతే 1969లో బ్యాంకులు జాతీయకరణ చేశారో ఆ స్ఫూర్తిని మంట గలుపుతున్నట్లే. ఇది ప్రజా వ్యతిరేక చర్య.

అమెరికాలో సబ్‌ప్రైమ్ సంక్షోభం వచ్చి అంతర్జాతీయ ద్రవ్య మార్కెట్ సంక్షోభానికి గురైనప్పుడు భారతదేశ ద్రవ్య మార్కెట్‌పై దాని ప్రభావం తక్కువగానే ఉండింది. అందుకు దోహదపడిన అంశాలను విశ్లేషిస్తూ మనదేశ బ్యాంకింగ్ పునాదులు గట్టివని, ఇక్కడ అనుసరిస్తున్న విధానాలు అన్ని దేశాలకు అనుసరనీయమైనవని నాటి ప్రధాని, ఆర్థికమంత్రి గొప్పగా ప్రకటించడం మరిచిపోలేదు. మరి అంతలోనే ఆ విధానాలను సవరించాలని అందుకు ప్రైవేటీకరణ మార్గమని చెప్పడం, బాసెల్–3 నే మనకు శరణ్యం అని ప్రకటించడం ప్రజలను మోసగించడమే. అందుకే ప్రజలు అప్రమత్తం కావాలి. ఇప్పటికే బ్యాంకు ఉద్యోగులు, అధికారులు ప్రారంభించిన ఆందోళనకు పూర్తి మద్దతు ప్రకటించాలి. ప్రభుత్వరంగ బ్యాంకులను కాపాడుకుని ప్రజలకు సేవ చేసే విధంగా వాటిని మలుచుకోవలసిన అవసరం నేడు మనందరిపైనా ఉంది. వీ

*(రచయిత వాణిజ్యశాస్త్ర అధ్యాపకులు)*

# భావ ప్రకటనా స్వేచ్ఛకు సంకెళ్లా?

*గత ప్రభుత్వాల వలెనే టిఆర్ఎస్ ప్రభుత్వం కూడా ప్రజా సంఘాలపై, ఉద్యమకారులపై నిర్బంధాన్ని అమలు చేస్తూ, పెట్టుబడిదారీ వర్గాలకు కొమ్ముకాస్తోందంటూ చివరి వ్యాసం రాశారు* **ఆర్.ఎస్. చౌహాన్**

'ఏకీభవించని వారి గొంతు నొక్కే సిద్ధాంతమే ఫాసిజం' అని తెలంగాణ ప్రముఖ కవి కాళోజీ మాటలు తెలంగాణ ప్రజా ఉద్యమాల అనుభవాల్లోంచి ఉద్భవించినవి. తెలంగాణ సాయుధ పోరాట కాలం నుండి ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర సాధన వరకు ప్రజలు చేసిన పోరాటాలు, ఉద్యమాలు, ప్రాణత్యాగాలు చరిత్రలో చెరిగిపోని నిజాలు!

గత ఆరు దశాబ్దాలు కొనసాగిన రాష్ట్ర సాధన ఉద్యమాల్లో, పోరాటాల్లో తెలంగాణకు చెందిన సకల జనుల భాగస్వామ్యం ఉన్నది. వందలమంది ప్రజల ప్రాణత్యాగాలు ఉన్నాయి. తెలంగాణలోని సంయుక్త జెఎసిల ప్రముఖ పాత్ర ఉన్నది. కావున ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర సాధన ఫలితం ఏ ఒక్క రాజకీయ పార్టీకి పరిమితం కాదు. స్వతం కూడా కాదు. ఆ ఫలితం ఘనత సంపూర్ణంగా తెలంగాణ ప్రజలకే దక్కుతుంది.

నూతనంగా ఏర్పడిన తెలంగాణ రాష్ట్రంలో 2014 సార్వత్రిక ఎన్నికలు జరిగాయి. ఎన్నికల్లో పాల్గొన్న ప్రతి రాజకీయ పార్టీ, అధికారం కోసం చేసిన బూటకపు వాగ్దానాలతో పాటు తెలంగాణ రాష్ట్ర సాధన తమ పార్టీ కృషి వల్లనే సాధ్యమైందని తెలంగాణ ప్రజలను తప్పు దారిని పట్టించే విధంగా ప్రచారం చేసుకున్నాయి.

వాస్తవానికి గత దశాబ్ద కాలంలో ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర సాధనే తన ఏకైక ఎజెండాగా టిఆర్ఎస్ పార్టీ ఏర్పడింది. తెలంగాణ ప్రజలతో మమేకమై ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర సాధన ఉద్యమాల్లో పాల్గొంది. అందుకు తెలంగాణ ప్రజలు టిఆర్ఎస్ పార్టీని అత్యధిక మెజారిటీతో గెలిపించుకున్నారు. నవ తెలంగాణ నిర్మాణం మీద కోటి ఆకాంక్షలతో టిఆర్ఎస్ పార్టీకి అధికార పీఠాన్ని అప్పగించారు.

కానీ బాధకరమైన విషయమేమంటే ఉద్యమ పార్టీ నుండి అధికార పార్టీగా మారిన టిఆర్ఎస్ పార్టీ గత ప్రభుత్వాలు అనుసరించిన పాలన విధానాలను యథాతథంగా అమలు చేస్తోంది. పెట్టుబడిదారీ వర్గాలకు అనుకూలంగా రాజకీయార్థిక విధానాలను రూపొందిస్తున్నది. ప్రపంచీకరణ, సరళీకరణ, ప్రైవేటీకరణలకు అనుకూలంగా దేశ, విదేశ సామ్రాజ్యవాద పెట్టుబడిదారీ వర్గాలకు అనేక ప్రోత్సహకాలతో ఎర్ర తివాచీలు పరుస్తున్నది.

ఈ సందర్భంలో తెలంగాణలో ప్రవేశిస్తున్న పెట్టుబడి – ప్రధాన పారిశ్రామిక, వ్యాపార, సేవాసంస్థలు తమ పెట్టుబడులతో; 1) తెలంగాణ వనరులను కొల్లగొట్టుకొని బయటికి తీసుకొని పోవడమే తప్ప తెలంగాణ సమాజానికి ఉపయోగపడగలవా? 2) తెలంగాణ నిరుద్యోగాన్ని రూపుమాపగలవా? 3) బానిసత్వం నుండి విముక్తి కోరుకునే మనస్తత్వం గల తెలంగాణ ప్రజలను మరొకసారి పెట్టుబడిదారీ వర్గాల బానిసత్వం పరిధిలోకి టిఆర్ఎస్ ప్రభుత్వం నెట్టివేస్తున్నదా? అనే సందేహాలను విశ్లేషకులు వ్యక్తం చేస్తున్నారు.

ఉదాహరణకు రాజ్యాంగం ఇచ్చిన భావ ప్రకటన స్వేచ్ఛ హక్కును ఏ విధంగా టిఆర్ఎస్ ప్రభుత్వం హరించినదో గమనించిన, మొదటిది రెండు వార్తా ఛానళ్ల ప్రసారాలను తెలంగాణ రాష్ట్రంలో నిలిపివేయడం. ఇక రెండవది 2014 సెప్టెంబర్ 21న సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో, అది కూడా నాలుగు గోడల మధ్య నిర్వహించ తలపెట్టిన 'రాజకీయ ప్రత్యామ్నాయ వేదిక' సభను అడ్డుకోవడం.

అలాగే రెండు వార్తా ఛానళ్ల ప్రసారాలను ఎంఎస్ఒలు నిలిపి వేశారని, ఈ విషయంలో ప్రభుత్వానికి ఎలాంటి సంబంధం లేదనీ, 'రాజకీయ ప్రత్యామ్నాయ వేదిక' సభను మాత్రం కేంద్ర ప్రభుత్వ ఆదేశాల మేరకు అడ్డుకోవాల్సి వచ్చిందని ఒక సమర్థన.

2014 సెప్టెంబర్ 21న అసలు ఏం జరిగింది? తెలంగాణ ప్రభుత్వం 'రాజకీయ ప్రత్యామ్నాయ వేదిక' సభను అణచివేత చర్యలతో అడ్డుకున్నది. వందలాది ప్రజా సంఘాల కార్యకర్తలను సెప్టెంబర్ 20 తేదీ అర్ధరాత్రి నుంచే అరెస్టు చేసి, గృహ నిర్బంధం చేసింది. రాజధానికి పోయే మార్గాలలోని ప్రయాణ సాధనాలను ఏకంగా రద్దు చేసింది. వందలాది మందిని అరెస్టులు చేసింది. సభా కేంద్రం చుట్టూ ముళ్ల కంచెలు వేసింది. హైదరాబాద్ నడిబొడ్డున పోలీస్ క్యాంపు ఏర్పాటు చేసింది.

పెట్టుబడిదారీ వ్యవస్థకు ప్రత్యామ్నాయాలు లేవని పాలక పక్షాలు చాటుకుంటున్న తరుణంలో ఈ వేదికకు అంకురార్పణ జరిగింది. ఆవిర్భవించిన ఈ వేదిక సభను సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో నిర్వహించి, పెట్టుబడిదారీ వ్యవస్థకు ప్రత్యామ్నాయాలు ఉన్నాయనే విషయాన్ని ప్రజలకు వివరించాలనుకున్నది. ఈ పరిణామాన్ని పాలక పక్షాలు జీర్ణించుకోలేక పోయాయి. అందులో భాగంగా రాజకీయ ప్రత్యామ్నాయ వేదిక సభను అడ్డుకున్నాయి.

అయిననూ రాజకీయ ప్రత్యామ్నాయ వేదిక నిర్వహించ తలపెట్టిన సభకు జరిగిన నష్టం ఏమీలేదు. ఈ అణచివేత చర్య ప్రజాస్వామ్య అభిమానుల్లో స్ఫూర్తిని నింపింది. వార్తా ఛానళ్ల ప్రసారాల పుణ్యమా అని ప్రజల్లో ఆలోచనను రేకెత్తించింది. రాబోయే కాలంలో రాజకీయ ప్రత్యామ్నాయ వ్యవస్థ వస్తున్నదనే సంకేతాలనిచ్చింది. నమ్మకాన్ని కలిగించింది. రాబోయే రేపటి అరుణోదయం కోసం ప్రజలే ఎదురు చూసేలా చేసింది.

*(రచయిత ట్రేడ్ యూనియన్ నాయకులు)* వీ

# విద్యలో సమానత్వానికి దేశవ్యాప్త ఉద్యమం

*అఖిల భారత విద్యా హక్కు వేదిక దేశవ్యాప్తంగా నిర్వహిస్తున్న శిక్షా సంఘర్ష్ యాత్ర నివేదిక*

గత రెండున్నర దశాబ్దాలుగా విద్యారంగంలో కేంద్ర – రాష్ట్ర ప్రభుత్వాలు అనుసరిస్తూ వచ్చిన అనుచిత విధానాల ఫలితంగా ప్రభుత్వ విద్యారంగం మనుగడ కోసం ఇవాళ బడుగు బలహీన వర్గాలు పోరాటం చేయవలసి వస్తున్నది. 1980 దశకం నుండి మన విద్యారంగంపై అంతర్జాతీయ ద్రవ్య పెట్టుబడి ప్రభావం, విద్యలో మతతత్వం, విద్యా ప్రైవేటీకరణ, వ్యాపారీకరణ, కార్పొరేటీకరణ దుష్పరిణామాలను ప్రతిఘటించడానికి ఒక బలమైన ప్రజా ఉద్యమాన్ని నిర్మించాల్సిన ఆవశ్యకతను ఈ నేపథ్యంలోనే 'అఖిల భారత విద్యా హక్కు వేదిక' జాతీయ కార్యవర్గ సమావేశం గుర్తించింది. అందుకుగాను ప్రజల వద్దకు వెళ్ళాలని భావించిన కార్యవర్గం నవంబర్ 2 నుంచి డిసెంబర్ 3 వరకు దేశవ్యాప్తంగా 'శిక్షా సంఘర్ష్ యాత్ర'ను చేపట్టింది. ఈ యాత్ర ప్రారంభ, ముగింపు తేదీలను ఎంపిక చేసుకోవడానికి చారిత్రక ప్రాధాన్యత ఉంది. 2000 నవంబర్ 2న సైనిక బలగాల ప్రత్యేక అధికారాల చట్టాన్ని రద్దు చేయాలని ఇరోం షర్మిలచాన్ నిరాహార దీక్ష చేపట్టి 14 సంవత్సరాలు నిండిన సందర్భంలో ఒక ప్రతీకగా ఈ యాత్ర నవంబర్ 2న ప్రారంభమైంది. అలాగే 30 సంవత్సరాల క్రితం భోపాల్‌లో యూనియన్ కార్బైడ్ ఫ్యాక్టరీ నుండి డిసెంబర్ 2 అర్ధరాత్రి వెలువడిన విషవాయువు వేలాది మందిని పొట్టన పెట్టుకుంది. లక్షలాది మందిని అంగ వికలతకు గురి చేసింది. బాధితులు నష్టపరిహారం కోరుతూ 30 సంవత్సరాలుగా పోరాడుతున్నారు. దీన్ని పురస్కరించుకొని యాత్ర ముగింపు ఆ పోరాట సంఘీభావంగా డిసెంబర్ 4న భోపాల్‌లో భారీ ర్యాలీ, బహిరంగ సభతో ముగుస్తుంది.

ఈ యాత్ర దేశంలోని ఐదు విభిన్న (తూర్పు, పశ్చిమ, ఉత్తర, దక్షిణ, ఈశాన్య భారత్) ప్రాంతాల నుండి ప్రారంభమవుతుంది. యాత్ర ముగింపు సందర్భంగా డిసెంబర్ 4న భోపాల్‌లో భారీ ర్యాలీ, బహిరంగ సభ జరుగుతుంది. భారత రాజ్యాంగ పీఠిక స్ఫూర్తికి అనుగుణంగా ప్రజాస్వామిక, లౌకిక, సామ్యవాద లక్ష్యాలు సాకారం కావడానికి, సమన్యాయం, సామాజిక న్యాయం ప్రజలందరికి అందాలంటే కెజి నుండి పిజి వరకు పూర్తిగా ప్రభుత్వనిధులతో నడిచే 'కామన్ స్కూల్' విధానాన్ని సాధించుకోవడానికి ఒక దీర్ఘకాలిక ప్రజా పోరాటాన్ని నిర్మించడానికి విద్యాభిమానులను, ప్రజాస్వామిక వాదులను, ప్రజల పక్షాన పోరాటాలు చేస్తున్న ప్రజాసంఘాలను, సామాజిక ఉద్యమకారు లను కోరింది. ప్రజల్లో చైతన్యం కలిగించడానికి, రాజ్యాంగ స్ఫూర్తికి అనుగుణంగా విద్యా వ్యవస్థను పునర్నిర్మించుకోగలమనే విశ్వాసాన్ని కలిగించడానికి, అంతిమంగా విద్యా పరిరక్షణ పోరాట ఉద్యమ నిర్మాణానికి ఒక స్ఫూర్తిని కల్పించడానికి ఈ యాత్ర దోహదపడుతుందని 'అఖిల భారత విద్యా హక్కు వేదిక' ఆశావాహ దృక్పథంతో ఉంది.

విద్యావ్యవస్థలో విప్లవాత్మకమైన, క్రమబద్ధమైన మార్పులు తేవడమనే దీర్ఘకాలిక లక్ష్యాన్ని ప్రజలకు అర్థం చేయించాలి. కార్పొరేట్ పెట్టుబడి లాభాల బారినుండి, దురాశ నుండి, అజమాయిషీ నుండి విద్యా వ్యవస్థను విముక్తం చేయడానికి దేశవ్యాప్త ఉద్యమాన్ని నిర్మించడం తప్ప మరొక ప్రత్యామ్నాయం లేదని ఒక సమగ్రమైన రాజకీయ చర్చను చేయడం ద్వారా సమాజంలో కదలికను తేవడానికి ఈ ఉద్యమాన్ని నిర్మించాల్సి ఉందని వేదిక భావిస్తున్నది. ఎస్ఎస్ఎ, ఆర్ఎంఎస్ఎ, రూసా వంటి పథకాలు, విద్యాహక్కు చట్టం (2009) వంటి చట్టాలు, ప్రభుత్వ ప్రైవేట్ భాగస్వామ్య విధానం ద్వారా ప్రభుత్వ నిధులను ప్రైవేట్ సంస్థలకు ఇవ్వడాన్ని నిరోధించాలి. విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులను, విదేశీ విశ్వవిద్యాలయాలను అనుమతించడం ద్వారా, విద్యారంగంలోకి రావాలనుకుంటున్న అంతర్జాతీయ పెట్టుబడికి ఏకగవాక్ష అనుమతులను సులభంగా ఇవ్వడం కొరకు శక్తివంతమైన ఉన్నత విద్యాకమిషన్‌ను ఏర్పాటు చేయడం ద్వారా ప్రపంచవాణిజ్య సంస్థ ఎజెండాను అమలు చేయడం వంటి చర్యలను అడ్డుకోవాలి. ఇప్పుడు కులీన వాదంతో, వివక్షతో, వెలివేత ధోరణులతో కూడుకున్న విద్యారంగంలో ఆ లక్షణాలు మరింత ఎక్కువగా వస్తాయని, విద్య ప్రయోజనాన్ని, జ్ఞాన స్వభావాన్ని అవి పక్కదారి పట్టిస్తాయని ప్రజలకు వివరించాలి. విద్యారంగంలో సాధించవలసిన విప్లవాత్మకమైన మార్పును తేవడం కొరకు వివిధ సామాజిక బృందాలను – గ్రామీణ ప్రజలు, పట్టణాల మురికి వాడల్లో నివసించే ప్రజలు, పారిశ్రామిక కార్మికులు, పాఠశాలల, కళాశాలల, విశ్వవిద్యాలయాల అధ్యాపకులు, విద్యార్థులు మొదలైన వారినందరిని ఈ ఉద్యమం వైపు ఆకర్షించాలన్నది విద్యా హక్కు వేదిక లక్ష్యంగా ప్రకటించుకుంది.

మన రాష్ట్రంలో 1989లో జస్టిస్ చిన్నపరెడ్డి అధ్యక్షులుగా, ప్రొ. హరగోపాల్ ప్రధాన కార్యదర్శిగా, విద్యాభిమానులు, ప్రగతిశీల శక్తులు, ఉపాధ్యాయులు, విద్యార్థి సంఘాలతో కలిసి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో 'విద్యా పరిరక్షణ కమిటీ' ఏర్పడింది. గత రెండున్నర దశాబ్దాలుగా ప్రజలవైపు నిలబడి విద్యాపరిరక్షణ కమిటీ విద్యారంగానికి సంబంధించిన ఎన్నో డిమాండ్లను ప్రభుత్వం ముందు ఉంచింది. ఆ డిమాండ్లు నెరవేరడానికి ఎన్నో పోరాటాలు చేసింది. ఉన్నత విద్యలో సామాజిక శాస్త్రాలను తొలగించాలని అప్పటి ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు తలపెట్టినపుడు దానికి వ్యతిరేకంగా విద్యాపరిరక్షణ కమిటీ గళమెత్తింది. సామాజిక శాస్త్రాలను నిలబెట్టింది. పాఠశాలలను మూసివేయవద్దని, ప్రతి తరగతికి ఒకగది, ఒక ఉపాధ్యాయుడు ఉండాలని మధ్యాహ్న భోజనాన్ని మెరుగుపరచాలని, బాలబాలికల ఆరోగ్యం మెరుగుపర్చడ దానికి ఉదయం, సాయంత్రం అల్పాహారం, పాలు, పండ్లు వంటివి ఇవ్వాలని విద్యాపరిరక్షణ కమిటీ డిమాండ్ చేస్తూ వచ్చింది. విద్యాపరిరక్షణ కమిటీ చొరవతో జూన్ 2009లో హైద్రాబాద్ ఉస్మానియా యూనివర్శిటీలో అఖిల భారత విద్యాహక్కువేదిక ఏర్పడింది. ఈ వేదికలో ఇపుడు 18 రాష్ట్రాలకు చెందిన సుమారు 60 సంఘాలు ఉన్నాయి. ఈ వేదికలో దేశంలోని పలు విశ్వవిదాలయాలకు చెందిన ప్రొఫెసర్లు సభ్యులుగా ఉన్నారు. విద్యాపరిరక్షణ కమిటీ ఈ వేదికలో సభ్యసంఘంగా ఉంది. ఈ వేదిక, విద్యాపరిరక్షణ కమిటీ విద్యారంగంలో అసమానతలు నివారించి అందరికి విద్య, సమాన విద్య, ప్రమాణాలతో కూడిన విద్యను 1966లో డా. కొఠారి కమీషన్ సూచించినట్లు ఇరుగుపొరుగు పాఠశాల వ్యవస్థను ఏర్పరచి ప్రభుత్వ యాజమాన్యంలో ప్రభుత్వ నిధులతో అందించాలని కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలను డిమాండ్ చేస్తున్నది.

అఖిల భారత విద్యా హక్కు వేదిక దృష్టిలో "విద్య అంటే చారిత్రకంగా

ఒక సామాజిక సాంస్కృతిక ప్రక్రియ. సమాజం యొక్క విశాలమైన ఉమ్మడి ప్రయోజనం కొరకు బాలబాలికల్లోనూ, యువతీయువకుల్లోనూ, సృజనాత్మకమైన, మానవీయమైన శక్తులను విద్య మేల్కొలుపుతుంది. సమాజాన్ని యథాతథస్థితిలో ఉంచడం కొరకు కాకుండా, విద్య సమాజాన్ని పునర్నిర్మించే పాత్రనూ, సమాజాన్ని మార్పు చెందించే పాత్రనూ నిర్వహిస్తుంది. స్వేచ్ఛ, సమానత్వం, న్యాయం, మానవ ఔదార్యం, బహుళత్వం, సాంఘిక సామరస్యం, సార్వజనీనమైన శాంతి కొరకు ప్రజల్లో ఉన్న నాగరికమైన ఆకాంక్షలను నెరవేర్చడానికి విద్య నిర్వహించే పాత్ర దోహద పడుతుందని దృఢంగా విశ్వసిస్తుంది'. అయితే, గత మూడు దశాబ్దాలుగా అంతర్జాతీయ పెట్టుబడి అవసరాలకు అనుగుణంగా మన దేశ విద్యను సరుకుగా మార్చే ప్రక్రియను వేగవంతం చేసే ఉత్సుకతలో మన పాలకులు ఉన్నారు. విద్యను సరుకుగా మార్చడం వర్తమాన భారతదేశ లక్షణాలలో ఒకటిగా ఉంది. విద్యా వ్యవస్థ నుంచి బయటి కొచ్చిన విద్యావంతుని శ్రమశక్తి సరుకుగా మారడమే కాకుండా విద్యావ్యవస్థే సరుకుగా మారింది. మరో విధంగా చెప్పాలంటే, ఒక సరుకు (నేర్చుకున్న విద్య) అనే సాధనం ద్వారా మరో సరుకును (చదువుకున్నవారి శ్రమ శక్తి) ఉత్పత్తి చేసే ప్రక్రియగా విద్యారంగం తయారైంది. ఇది ఇప్పటికే అత్యంత ఆందోళనకర స్థాయిలో జరుగుతోంది. ఒకవైపు కూలిన కేంద్రీయ విశ్వవిద్యాలయాలు, మరోవైపు అధ్యాపకవర్గం, భవనాలు, నిధుల లేమితో కునారిల్లుతున్న ప్రాంతీయ విశ్వవిద్యాలయాలు. వీటికి తోడు ప్రైవేట్ విశ్వవిద్యాలయాలు, విదేశీ విశ్వవిద్యాలయాలు ఉండనే ఉన్నాయి. వీటి మధ్య ఎక్కడా పోలికే లేదు.

ఈ సందర్భంలో మనకు విద్య గురించి రెండు భావనలు కనిపిస్తున్నాయి. ఒకటి, సమాజం తాను నిధులు సమకూర్చిన ఒక కార్యకలాపంగా విద్యను చూడడం. ఈ భావన ప్రకారం విద్యను ఆర్జించే వారి కృషి వల్ల జ్ఞానాభివృద్ధి జరిగి సమాజంలోని లోటుపాట్లను సవరించుకునే వీలుంటుంది. ఈ రకమైన విద్య వలన విద్యార్థుల్లో సామాజిక సున్నితత్వం పెరిగి వారి నుంచి ఆంటోనియో గ్రామ్‌స్కీ చెప్పినట్లు ప్రజల హితం కోరే 'సజీవ మేధావులు' ఆవిర్భవించే అవకాశం ఉంటుంది. ఇది సమాజం ప్రగతిపథం వైపు పయనించడానికి, ప్రజల స్వేచ్ఛకూ అవసరం. రెండవ భావన ప్రకారం విద్య అంటే ఒక ప్యాకేజ్‌గా మార్కెట్‌లో కొనేదీ, అమ్మేదీ. కొనగలిగే తాహతు ఉన్న కొందరు వ్యక్తులు వారి సంపాదనా సామర్థ్యాన్ని పెంచుకోవడం కోసం విద్యను కొంటారు. మనదేశంలో మొదటి భావన నుంచి రెండవ భావనకు పరిణామం చెందే ప్రక్రియ వేగంగా కొనసాగుతోంది. మొదటి భావన నుంచి, రెండవ భావనకు పరిణామం చెందడం మనదేశ ప్రజలకు చేటు తెస్తున్నది. 'ప్రజల పక్షాన నిలిచే సజీవ మేధావులు' లేని పరిస్థితిలో పౌరసమాజం రాజీపడి స్వేచ్ఛారహిత స్థితిని మౌనంగా భరించేందుకు సిద్ధపడుతుంది. ఆ విధంగా, అంతర్జాతీయ ద్రవ్య పెట్టుబడిచే ప్రజల స్వేచ్ఛారహిత స్థితిని మరింత దిగజార్చే మరో క్షేత్రంగా విద్యారంగం మారడం భవిష్యత్ సమాజానికి ప్రమాదకరం.

దేశంలో ఇవ్వాళ విద్యారంగం ప్రైవేటీకరణ కోరల్లో చిక్కుకొని ఉంది. ఉన్నత విద్యారంగంలో ముఖ్యంగా ఇంజనీరింగ్, ఎంబిఎ, ఎంసిఎ, ఫార్మసి, మెడిసిన్ విద్యల్లో ప్రైవేట్ యాజమాన్యాల ఆధిపత్యమే కొనసాగుతుంది. ఉన్నత విద్యారంగంలోకి ఇప్పటికే ప్రవేశించిన వ్యాపారీకరణ చాలదని, భారత ప్రభుత్వం ప్రపంచ వాణిజ్య సంస్థ ఆధ్వర్యంలో జరుగుతున్న దోహారౌండ్ చర్చల్లో గ్యాట్స్ ఒప్పందంలో విద్యావ్యాపారాన్ని చేర్చడం కొరకు సమ్మతిని, సంసిద్ధతను తెలిపి ఉన్నత విద్యను అంతర్జాతీయ విపణిలో పెట్టింది. అందుకు కావలసిన చట్టాలను చేయడం కొరకు పార్లమెంట్‌లో 9 బిల్లులను ప్రవేశపెట్టింది. ఒకటి, రెండు బిల్లులు ఇప్పటికే చట్టాలైనాయి. బహుళజాతి కార్పొరేట్ పెట్టుబడులకు మనదేశంలోని సహజ వనరులన్నీ అప్పగిస్తున్నట్లుగానే, మన మానవ వనరులను, మన మేధో సంపదను కూడ కార్పొరేట్ పెట్టుబడులకు సేవ చేయడానికి, లాభాలు దండుకోవడానికి అప్పగిస్తున్నది, అందువల్లనే కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు విద్యారంగంలో ఈ మార్పులను తలపెట్టాయి. అనూహ్యమైన మెజారిటీతో బిజెపి అధిపత్యంలో ఎన్‌డిఎ ప్రభుత్వం కేంద్రంలో అధికారంలోకి రావడంతో ఇప్పటివరకు రాజకీయ సామాజిక రంగాల్లో ఉన్న కాషాయీకరణ ప్రభావం విద్యారంగంలో మరింత తీవ్రతరం కానున్నది.

కామన్ స్కూల్ విద్యా వ్యవస్థ కొరకు జరిగే పోరాటంలో మూడు అంచెలు ఉంటాయి. మొదటి అంచెలో పాఠశాలలేని చోట పాఠశాలను స్థాపించడం, ఖాళీ ఉపాధ్యాయ పోస్టులను నింపడం వంటి డిమాండ్లు ఉంటాయి. రెండవ అంచెలో కాంట్రాక్టు పద్ధతి మీద ఉపాధ్యాయులను నియమించడం మీద, ఉపాధ్యాయులకు విద్యేతర కార్యక్రమాలను అప్పగించడం మీద, బాలకార్మిక విధానం కొనసాగడం మీద డిమాండ్లు ఉంటాయి. మూడవ అంచె కెజి నుండి పిజి వరకు ఉచితంగా విద్యను అందించడం కొరకు పూర్తిగా ప్రభుత్వ నిధులతో నడిచే కామన్ విద్యా వ్యవస్థను సాధించడం వంటి డిమాండ్లు ఉంటాయి. ఈ మూడు అంచెలకు సంబంధించిన డిమాండ్లను ఏకకాలంలో చేపట్టి, శిక్షా సంఘర్ష్ యాత్ర కొనసాగే సమయంలో జిల్లా స్థాయిలో, రాష్ట్ర స్థాయిలో, ముగింపుకు వచ్చిన సమయంలో జాతీయ స్థాయిలో అధికారులకు, రాష్ట్ర ప్రభుత్వాలకు మెమోరాండంలను సమర్పిస్తుంది. ఈ మెమోరాండంల సమర్పణతో యాత్ర ముగుస్తుంది. కాని విద్యారంగ ఉద్యమం మాత్రం ఆగిపోదు. కామన్ స్కూల్ విద్యావ్యవస్థను సాధించేంతవరకు అది కొనసాగుతూనే ఉంటుంది.

తెలంగాణలో 'విద్యా పోరాట యాత్ర' నవంబర్ 2న హైద్రాబాద్ చాదర్ ఘాట్‌లోని భాగ్య మెమోరియల్ స్కూల్ వద్ద అఖిల భారత విద్యాహక్కు వేదిక అధ్యక్ష వర్గ సభ్యులు ఆనంద్ తెల్‌తుంబ్డె (ఖరగ్‌పూర్ ఐఐటి ఆచార్యుడు) భారీ ర్యాలీని ప్రారంభించారు. మధ్యాహ్నం రెండు గంటలకు నిజాం కళాశాల గ్రౌండ్‌లో జరిగిన బహిరంగ సభలో ఆనంద్ తెల్ తుంబ్డె 'విద్యారంగంలో కార్పొరేటీకరణ పెరిగిపోవడంతో విలువలు నాశనమవుతున్నాయన్నారు. బిజెపి అధికారంలోకి వచ్చాక పాఠ్యాంశాల్లో హిందుత్వ భావజాల వ్యాప్తికి కంకణం కట్టుకుందని వ్యాఖ్యానించారు. సమాన విద్య కొరకు, లౌకిక విద్య కొరకు తాము పోరాడుతుంటే మోడీ ప్రభుత్వం కాషాయీకరణను వేగవంతం చేస్తుందన్నారు.

విద్యావేత్త చుక్కా రామయ్య మాట్లాడుతూ విద్యారంగంపై బహుళ జాతి సంస్థలు దాడిచేస్తున్నాయని, ప్రాథమిక విద్య ప్రైవేట్ జమాన్యాల చేజిక్కితే సమానత దూరమవుతుందని హెచ్చరించారు. ఉద్యమాన్ని అన్ని రంగాల్లోకి విస్తరింపజేయాలని పిలుపునిచ్చారు. సీపీఐ జాతీయ కార్యవర్గ సభ్యుడు కె. నారాయణ మాట్లాడుతూ కార్పొరేటుశక్తులు విద్యారంగాన్ని శాసిస్తున్నాయని దుయ్యబట్టారు. కార్పొరేట్ విద్యకు పునాది వేసిన నారాయణ విద్యాసంస్థల అధినేతను ఏపీ సీఎం చంద్రబాబు మంత్రివర్గంలోకి తీసుకొని కార్పొరేట్ వ్యవస్థకు వత్తాసు పలుకుతున్నారని ఎద్దేవా చేశారు. సీపీఎం రాష్ట్ర కార్యవర్గ సభ్యుడు, ఎమ్మెల్యే సున్నం రాజయ్య మాట్లాడుతూ విద్యార్థులు లేరనే సాకుతో సర్కారు పాఠశాలలను మూసేస్తున్నారని విమర్శించారు. విరసం సభ్యుడు వరవరరావు మాట్లాడుతూ కెజి నుంచి పిజి వరకు విద్యావిధానం అమలులో ప్రైవేట్ పాఠశాలలకు చోటిస్తామని తెరాస ఎంపి కవిత హామీ ఇవ్వడం ఎలా సమంజసమని ప్రశ్నించారు. నైజాం ప్రభుత్వం హయాంలోనే ప్రభుత్వ రంగంలో విద్యా వైద్య రంగాలు కొనసాగాయని, ఆ తర్వాత వచ్చిన పాలకులే ఈ విధానాన్ని తుంగలో తొక్కారన్నారు. సభలో పాల్గొన్న పలు పార్టీల నాయకులు, ప్రజా సంఘాల నాయకులు సమాన విద్యావిధానం కోసం పోరాటం మొదలైందన్నారు. కాలానుగుణంగా నేడు శాస్త్రీయ విద్య కావాలని డిమాండ్ చేశారు.

*(రచయిత ఉపాధ్యాయ నాయకులు, రాజనీతిశాస్త్ర విద్యార్థి)* వీ

# సామ్రాజ్యవాద ఉచ్చులో మీడియా

***ప్రింట్, ఎలక్ట్రానిక్ మీడియాలో పెట్టుబడిదారీ విధానం చొచ్చుకు వస్తున్న తరుణంలో పత్రికల మీద, మొత్తంగా మీడియా మీద దాని ప్రభావం దుర్మార్గంగా ఉందని అంటున్నారు టంకశాల అశోక్***

ఒక ప్రముఖ తెలుగు దిన పత్రిక ఇటీవల ఇరాక్‌పై ప్రత్యేక కథనం ఒకటి ప్రచురించింది. అందుకు సందర్భం 'ఇస్లామిక్ స్టేట్' దళాలు కొంత కాలంగా సాగిస్తున్న దాడులు. ఆ దళాలు ముఖ్యంగా ఇరాక్‌లో పలు ప్రాంతాలను ఆక్రమించుకుంటున్నాయి. సిరియా, జోర్డాన్‌లు కూడా ఈ స్థితిని ఎదుర్కొంటున్నాయి. ఈ పరిస్థితులలో అమెరికా, దాని మిత్ర దేశాలు ఆ దళాలపై యుద్ధం ప్రకటించాయి. ఈ మిత్ర కూటమి సేనలు ఇరాక్ నుంచి గత సంవత్సర కాలంలో అధికభాగం ఉపసంహరించు కున్నాయి. ఆ విధంగా ఉపసంహరించుకోవడం వల్లనే 'ఇస్లామిక్ స్టేట్' దళాలు విజృంభిస్తున్నాయని, ఆ ఉపసంహరణ పొరపాటని, ఇరాక్‌లో అమెరికా సేనలు ఇంకా కొనసాగి ఉండవలసిందన్నది సదరు తెలుగు దినపత్రికవారు చేసిన సూచన. ఆ కథనం వారు ఏదో పాశ్చాత్య పత్రిక నుంచో, ఏజెన్సీ నుంచో తీసుకుని అనువదించింది కాదు. వారి ప్రత్యేక విభాగం వారు స్వయంగా తయారు చేసింది. భారతదేశంలోని ఇంగ్లీష్ పత్రికలను వదిలివేస్తే, భాషా పత్రికలు కూడా సామ్రాజ్యవాదపు ఉచ్చు లోకి ఎట్లా వెళుతున్నాయనేందుకు ఇది ఒక తాజా ఉదాహరణ మాత్రమే.

'ఇస్లామిక్ స్టేట్' దృక్పథాన్ని గాని, ఆ దళాల కార్యకలాపాలను గాని సమర్థిస్తున్నామా, వ్యతిరేకిస్తున్నామా అన్నది కాదు ఇందులోని సమస్య. ఎవరైనా వ్యతిరేకించ దలిస్తే అందుకు తగిన కారణాలు ఉన్నాయి కూడా. వ్యతిరేకించే వారిలో కొందరు అందులోని మత కోణాన్ని, తిరోగామి లక్షణాలను ఎత్తి చూపుతున్నారు. సున్నీలు, షియాలు, కుర్దులు ఒకటై సామ్రాజ్యవాదంపై పోరాడాలనే జాతీయవాదం ఆదర్శప్రాయమని మరికొందరంటున్నారు. ఇటువంటి సూచనల మంచి చెడులు ఏవైనప్పటికీ మొత్తానికి ఇవి అమెరికన్ సామ్రాజ్యవాద జోక్యాన్ని వ్యతిరేకించి అక్కడి సమాజాలు తమ పరిష్కారాలను తాము అంతర్గతంగా కనుగొనాలని చెపుతున్నాయి. దీనిని జాతీయ దృక్పథం, ప్రజాస్వామిక దృక్పథం, తృతీయ ప్రపంచ దేశాల దృక్పథం వగైరా పేర్లతో పిలవవచ్చు. ప్రపంచ దేశాలపై పాశ్చాత్య పెట్టుబడిదారులు, వలసవాదులు, సామ్రాజ్యవాదుల ఆధిపత్యానికి వ్యతిరేకంగా ఉద్యమాలు సాగిన వందల సంవత్సరాల కాలంలో ఈ దృక్పథాలు పెంపొందాయి. వలసల అనంతరం కూడా అలీనోద్యమం నుంచి ఇప్పటి 'బ్రిక్స్' వరకు బలంగానో, బలహీనంగానో ఇవే దృక్పథాలు వేర్వేరు రూపాలలో కొనసాగుతున్నాయి.

ఇటువంటి భావనలు ప్రజల మనసులలో ప్రపంచ వ్యాప్తంగా ఇంకా బలంగా ఉన్నందు వల్లనే అమెరికన్ కూటమి ఇరాక్ తదితర దేశాలలో జరిపిన దుర్మార్గపు యుద్ధం పట్ల తీవ్రమైన వ్యతిరేకతలు వ్యక్తమయ్యాయి. ఆయా దేశాల పాలకులు తమ స్వార్థం కోసమో, భయానికో మిన్నకున్నా ప్రజలు మాత్రం మౌనం వహించలేదు. ఇటువంటి వందల ఏళ్ల సామ్రాజ్యవాద వ్యతిరేక చరిత్రకు, ప్రస్తుతంలోనూ అందుకు వారసత్వంగా కొనసాగుతున్న దృక్పథాలకు పైన పేర్కొన్న తెలుగు దిన పత్రిక కథనం విరుద్ధమైనది.

నిజానికి అది స్వయంగా పత్రికలు మొదటి నుంచి తీసుకుంటున్న దృక్పథానికి కూడా విరుద్ధమైనదే. తెలుగు పత్రికలు తృతీయ ప్రపంచపు దృక్పథంతోనే వార్తలు, వ్యాసాలు, సంపాదకీయ వ్యాఖ్యలను ప్రచురిస్తూ వచ్చే సంప్రదాయాన్ని అనుసరించాయి. అందుకు తేడా కనిపిస్తున్నది ఇటీవలి కాలంలోనే. పైన పేర్కొన్న 'ఇస్లామిక్ స్టేట్' కథనాన్ని ఒక సందర్భంగా తీసుకుని ఈ వ్యాసం రాస్తున్నప్పటికీ, సమస్య ఇందుకు పరిమితమైంది కాదని గుర్తించాలి. ఈ ధోరణి నెమ్మది నెమ్మదిగా తెలుగు పత్రికలలోకి ప్రవేశిస్తున్నది. ప్రధాన స్రవంతి పత్రికలన్నీ అదే పని చేస్తున్నాయి. కొన్ని సంవత్సరాల క్రితమే మొదలైన ఈ ధోరణి క్రమంగా విస్తరిస్తున్నది. అందువల్లనే ఈ వ్యాసం రాయడం తప్ప కేవలం ఒక పత్రికలో, ఒక అంశంపై, ఒకసారి, ఒక కథనం అవాంచనీయమైన రీతిలో వెలువడినందుకు కాదు. పరిస్థితి అదే గనుక అయితే దానిని విస్మరించి ఊరుకోవచ్చు.

ఇదే కోవలోకి వచ్చే వెనుకటి ఉదాహరణ ఒక దానిని చూద్దాం. పాలస్తీనా ప్రజల పోరాటంతో ఇండియా సహా తృతీయ ప్రపంచ దేశాలన్నింటా మొదటి నుంచి గొప్ప సంఘీభావం ఉంది. అది ఈ దేశాలన్నింటి పత్రికలలో ప్రతిఫలించేది. కాని వారిని 'యోధులు', 'మిలిటెంట్లు' అని సంబోధించే పదాలు నెమ్మదిగా అదృశ్యమవుతూ 'టెర్రరిస్టు'లనే పరిభాష రావడం మొదలైంది. ఈ విధంగా ఇంకా ఉదాహరణలు చెప్పుకోవచ్చు గాని అక్కరలేదు. కావలసింది ఇట్లా ఎందుకు జరుగుతున్నదో అర్థం చేసుకోవడం. ఈ కొత్త ధోరణిని ఎట్లా అరికట్టగలమో ఆలోచించడం.

ముందుగా కారణాలను చూస్తే అవి ఈ విధంగా కనిపిస్తున్నాయి.

1) వార్తలను భారతీయ పత్రికలకు చేరవేసే ఏజెన్సీలలో యుఎన్ఐ పూర్తిగా బలహీనపడింది. పిటిఐ స్వభావం మారుతున్నది. పాలకులకు తృతీయ ప్రపంచ దృక్పథం నశిస్తున్నందున యుఎన్ఐకి నిధులు సమకూర్చకుండా గాలికి వదిలివేశారు. పిటిఐకి విదేశీ వార్తా సంస్థలపై ఆధారపడడం ఎక్కువైంది. కనుక పాశ్చాత్యుల పదజాలాన్ని, దృక్పథాలను ఎడిటింగ్ ఏమీ లేకుండా యథాతథంగా పత్రికలకు సరఫరా చేస్తారు. ఇది చాలదన్నట్లు సంస్థల్లోని సంపాదకులకు, సీనియర్లకు వెనుకటి

దృక్పథాలు లేవు. కొత్తవారికి అసలు ఈ విషయాలు తెలియవు, చెప్పేవారు లేరు. ఈ ఏజెన్సీల్లో పాశ్చాత్య ఏజెన్సీల పలుకుబడి తగినంత వచ్చింది. ఇండియన్ ఏజెన్సీలలో పెట్టుబడి భాగస్వామ్యం గల పెద్ద పత్రికల యాజమాన్యాలకు తృతీయ ప్రపంచ దృక్పథానికి బదులు పాశ్చాత్య దృక్పథాలతో మమేకత పెరుగుతున్నది. అందులో స్వప్రయోజనాలు అనేకం ఉన్నాయి.

2) దేశంలోని ఇంగ్లిష్ పత్రికలు, పెద్ద భాషా పత్రికలలో కూడా వార్తా సంస్థల పద్ధతిలో మార్పులు వస్తున్నాయి. వాటిలోకి ఇపుడు పెట్టుబడులు కూడా బయటివి పెరుగుతున్నాయి. దాని వెనువెంట పాశ్చాత్యుల నియంత్రణలు వస్తున్నాయి. యజమానులకు లాభాలు, ఇతర ప్రయోజనాలు మినహా అసలు భారత సమాజపు సంక్షేమమే పట్టించుకోనక్కరలేనిది అవుతున్నందున తృతీయ ప్రపంచ దృక్పథమన్నది హాస్యాస్పదంగా మారింది. అటువంటి దృక్పథం లోగడ తీసుకున్న తృతీయ ప్రపంచ నాయకులు దానిని క్రమంగా మార్చుకుంటుండ వచ్చుగాక. కాని ప్రజలకు ఆ దృక్పథం ఉన్న స్థితిలో మీడియా దానిని ప్రతిఫలించాలి. అట్లా కానపుడు మీడియా రంగపు ధర్మాన్ని ఉల్లంఘించి నట్లే. ఇంగ్లిష్ పత్రికలలోని అగ్రశేణి జర్నలిస్టులు కూడా ఇదే పద్ధతిలో మారుతున్నారు. వారికి, పాశ్చాత్యులకు దృక్పథ సామ్యాలు పెరుగుతున్నాయి.

3) భారతీయులలో కెరీరిస్టు చదువులు పైస్థాయి వరకు చదివిన వారు, పెద్ద ఉద్యోగులు, విదేశాలతో సంపర్కం పెరిగినవారు, కుటుంబ సంపదలు పెరుగుతున్నవారు, ఆ స్థాయి కలలలో విహరించేవారు, బాగా పట్టణీకరణ చెందినవారు, తమ సామాజిక – ఆర్థిక మూలాలను మరిచిపోతున్నవారి సంఖ్య గణనీయంగానే ఉంది. వీరికి తృతీయ ప్రపంచ దృక్పథంతో అసలు నిమిత్తం లేదు. పాశ్చాత్య దృక్పథంతో ప్రయోజనాలు కనిపించి దానితో అనుబంధం ఏర్పడు తున్నది. దీనంతటి ప్రభావం మీడియాపై ఉంటున్నది. ఆ ప్రకారం రాయకపోతే వారు కొనరన్నది ఒక వాదన.

4) ఇంగ్లిష్ పత్రికల మాట సరాసరి కాగా, భారతీయ భాషా పత్రికలలోనూ జర్నలిస్టులలో మార్పు కనిపిస్తున్నది. ఎడిటర్లకు దృక్పథం మారలేదు గాని శ్రద్ధ, సమయం తగ్గుతున్నాయి. తర్వాత స్థానాలలోని సీనియర్లకు మూడూ లేకుండా పోతున్నాయి. దృక్పథం పోవడమంటే పరిజ్ఞానం, వివేచన సైతం పోవడమన్నమాట. సీనియర్లకు ఇవన్నీ పోవడమంటే వృత్తి పరంగా ఇక మిగిలేదేమీ ఉండదు. యాంత్రికంగా ఉద్యోగం చేసి బతకడం తప్ప. ఇక జూనియర్ల మాట చెప్పనక్కరలేదు. సీనియర్లు, జూనియర్లలో ఇందుకు మినహాయింపులు లేరని కాదు. కాని ఆ మినహాయింపుల సంఖ్య తగ్గుతున్నది. శాతం మరింత తగ్గుతున్నది. ఈ రెండింటి మధ్య తేడాలో గమనించదగ్గ విశేషం ఒకటున్నది. ఇటువంటి దృక్పథాలు గలవారు సీనియర్లలో ఒరిజినల్‌గా తగినంత మంది ఉండి, వారు ఇప్పటికీ కొనసాగుతున్నప్పటికీ, తమలో శ్రద్ధ పోతున్నది. నిలుపుకుంటున్నవారు కొందరే. కనుక, తలలను లెక్కవేస్తే వారి సంఖ్య తగినంత కనిపించినా, నికర సంఖ్య తగ్గుతున్నది. ఆ విధంగా శాతం మరింత తగ్గుతున్నది. ఇక ఎప్పటికప్పుడు కొత్త జర్నలిస్టులు వచ్చి చేరుతున్నందున కూడా ఈ శాతం పడిపోతున్నది.

ఇక కొందరైతే, ఇంగ్లిష్ పత్రికల జర్నలిస్టుల తరహా దృక్పథాలను ఉద్దేశ పూర్వకంగా తీసుకుంటున్నారు. అందుకు వేర్వేరు కారణాలున్నాయి.

5) తెలుగునాట వామపక్ష ఉద్యమాలు, పార్టీల కార్యకలాపాలకన్న అస్తిత్వ ఉద్యమాల కార్యకలాపాలు కొన్నేళ్లుగా మించిపోవడం, లేదా సరిసమానం కావడం కూడా ఇందుకొక కారణం. వామపక్షాలు, అటువంటి ఉద్యమాలు జోరుగా సాగినప్పుడు వాటి స్థానిక దృక్పథాలతో పాటు జాతీయ, అంతర్జాతీయ అవగాహనలు, దృక్పథాల ప్రభావం విద్యార్థులపై, యువకులపై గణనీయంగా ఉండేది. జర్నలిస్టులు వచ్చేది వారి నుంచే గనుక ఆ ప్రభావం వృత్తి కార్యకలాపాలపైనా ఉండేది. ఆ దృక్పథాల ప్రభావం అప్పటికే పత్రికా రంగంలో కలవారి పైనా పడేది. ఇప్పుడది పోతున్నది.

అస్తిత్వ ఉద్యమాలు వాటికవిగా తమ పరిధిలో ఆయా వర్గాల కోసం చేస్తున్న మంచి ఉన్నది. కాని వాటి దృక్పథ పరిధి సీమితం కావడం వల్ల, తమ ప్రభావ పరిధిలోకి వచ్చే విద్యార్థులు, యువకులు, జర్నలిస్టులకు జాతీయ, అంతర్జాతీయ దృక్పథాలు వామపక్ష ఉద్యమాలను పోలిన విధంగా ఉండడం లేదు. అంతర్జాతీయ దృక్పథాలైతే దాదాపు శూన్యమవు తున్నాయి. అటువంటి స్థితిలో వారు జర్నలిస్టులైనప్పుడు అస్తిత్వ స్పృహలను చూపుతున్నారు గాని విశాలమైన జాతీయ, అంతర్జాతీయ స్పృహలను చూపడం లేదు. దానితో, వారికి అస్తిత్వానికి, అది కూడా తమ వర్గ అస్తిత్వానికి భంగం కలిగించేది అభ్యంతరకరం అవుతుంది. కాని పాలస్తీనా యోధులు, శ్రీలంక తమిళ జాతీయ వాదులు, ఇంకా అటువంటి వారిని పాశ్చాత్య వార్తా సంస్థలు, పత్రికలూ, ఢిల్లీ ఇంగ్లిష్ పత్రికలు, మేగజైన్లు, ఇంగ్లిష్ ఛానళ్లు 'టెర్రరిస్టు' లంటాయా మరొకటా అనే దానిపై దృష్టి ఉండదు. ఇరాక్‌లో అమెరికన్ సైన్యం పోవాలా, ఉండాలా, 'ఇస్లామిక్ స్టేట్' అనే దాని మంచి చెడులేమిటి అనేది లెక్కకు రాదు. చాలా మంది ఇంగ్లిష్‌లో ఏదివస్తే అదే నిర్విచక్షణా రాస్తారు. ఏదిలేని సాధారణ జర్నలిస్టులు, వామపక్ష ఉద్యమ ప్రభావాలు గలవారు, అస్తిత్వ ఉద్యమాల ప్రభావం ఉన్నవారనే పద్ధతిలో జర్నలిస్టులను స్థూలంగా వర్గీకరించుకుంటే మనం ఆశించేది చివరి రెండు వర్గాల నుంచి. వారి ప్రభావంతో మొదటి వర్గం వారు కూడా తగు దృక్పథాలను అలవరచుకోవాలి. కాని ఇవన్నీ జరగడం లేదు.

మొత్తం మీద వర్ధమాన దేశాల మీడియాకు సంబంధించి సామ్రాజ్య వాదులు, పెట్టుబడిదారీ మల్టీనేషనల్స్ వ్యూహం విజయవంతంగా అమలవుతున్నది. వారి పెట్టుబడులు, జోక్యం, ప్రభావాలు పెరిగేకొద్దీ, వర్ధమాన దేశాల జర్నలిస్టులు, మీడియా రంగపు బలహీనతలు ఎక్కువయ్యేకొద్దీ ఇది మరింత విజయవంతమవుతుంది. ఇది వారికి ఉపయోగపడేది పాలస్తీనియన్లను టెర్రరిస్టులని రాయించడం, ఇరాక్‌లో అమెరికా పాత్రను ఆహ్వానించడం వరకేనా? ఎంతమాత్రం కాదు. ఇంకా చాలా ఉంటాయి. అన్నింటికన్న ముఖ్యం సామ్రాజ్య వాదాన్ని, పెట్టుబడిదారీని, సైనిక జోక్యాలను, వారి సంస్కృతిని, ఆర్థిక సంస్కరణ లను, దోపిడీని, వారి దేశీయ భాగస్వాములను బలపరచడం, లేదా కనీసం కళ్లు మూసుకోవడం. అది అసలు వ్యాధి. మొదట పేర్కొన్న తెలుగు పత్రిక కథనం ఆ వ్యాధికి ఒక చిహ్నం మాత్రమే.

*(రచయిత సీనియర్ జర్నలిస్టు)*

# మిశ్రమ ప్రణాళికా సంఘం

*బిజెపి అధికారంలోకి రాగానే ప్రణాళికా సంఘాన్ని రద్దు చేసిన నేపథ్యంలో సంఘం పనితీరు, రద్దు ఆవశ్యకత, దాని స్థానంలో ఏర్పాటు చేసే నూతన వ్యవస్థ ఎలా ఉండాలో వివరిస్తున్నారు* **పి.ఎస్.వి. ప్రసాద్‌బాబు**

ప్రణాళిక సంఘాన్ని రద్దు చేసి దాని స్థానంలో మరింత మెరుగైన వ్యవస్థను ఏర్పాటు చేస్తామని 68వ స్వాతంత్ర్య దినోత్సవ ప్రసంగంలో ప్రధాన మంత్రి నరేంద్రమోడీ ఎర్రకోట నుండి సంచలన ప్రకటన చేశారు. ఈ నేపథ్యంలో ప్రణాళిక సంఘం ఏర్పాటు తీరు, పనితీరు, రద్దు ఆవశ్యకత, దాని స్థానంలో ఏర్పాటు చేసే నూతన వ్యవస్థ ఎలా ఉండాలో వివరించే వ్యాసమిది.

సోవియట్ యూనియన్ అనుసరిస్తున్న ప్రణాళికా విధానాన్ని చూసి దానికి ముగ్ధుడైన తొలి ప్రధాని జవహార్‌లాల్ నెహ్రూ 1950 మార్చ్ 15న కేబినెట్ తీర్మానంతో ప్రణాళికా సంఘాన్ని ఏర్పాటు చేశారు. అది మొదలు మనం పదకొండు పంచవర్ష ప్రణాళికలు పూర్తి చేసుకున్నాం. ప్రస్తుతం 12వ ప్రణాళిక అమలులో ఉంది.

### స్వాతంత్ర్యానికి పూర్వం ప్రణాళికల కోసం జరిగిన కృషి

భారతదేశం బ్రిటిష్ వారి వలస పాలనలో ఉన్నప్పుడు మన ఆర్థిక వ్యవస్థలో ప్రణాళికాబద్ధమైన కృషి జరగలేదు. అయితే కొందరు ప్రముఖులు మనదేశం సత్వర సర్వతోముఖాభివృద్ధిని సాధించాలంటే ప్రణాళికల ఆవశ్యకతను గుర్తించి, అమలు పరచవలసిన ప్రణాళికల స్వరూపం గురించి తమ ఆలోచనలను, అభిప్రాయాలను తెలిపారు.

1934లో మోక్షగుండం విశ్వేశ్వరయ్య తన 'ప్రణాళికాబద్ధమైన ఆర్థిక వ్యవస్థ – భారతదేశం' (ప్లాన్డ్ ఎకానమి ఫర్ ఇండియా) అనే పుస్తకంలో భారతదేశం పది సంవత్సరాల కాల నిడినిలో ఆర్థికాభివృద్ధిని సాధించడానికి అనువైన ప్రణాళికను రూపొందించారు.

1938లో భారత జాతీయ కాంగ్రెస్ 'పండిట్ జవహార్‌లాల్ నెహ్రూ అధ్యక్షతన' జాతీయ ప్రణాళికా కమిటీ (నేషనల్ ప్లానింగ్ కమిటీ) ని నియమించింది. అయితే రెండవ ప్రపంచయుద్ధంతో అనుకోని అవాంతరాలు ఏర్పడడంతో ఈ కమిటీ తన నివేదికను సమర్పించడంలో తీవ్ర జాప్యం జరిగి చివరకు 1948లో నివేదికను సమర్పించింది.

1943లో ముంబాయి నగరానికి చెందిన ఎనిమిది మంది పారిశ్రామిక వేత్తలు (పురుషోత్తందాస్ ఠాకూర్‌దాస్, జెఆర్‌డి. టాటా, జిడి. బిర్లా, లాల శ్రీరామ్, కస్తూర్‌బాయ్ లాల్‌బాయ్, ఎ.డి. ష్రాఫ్, ఆర్దేషి దలాల్, జాన్ మతాయ్) 'భారతదేశ ఆర్థికాభివృద్ధి కొరకు ప్రణాళిక' (ఎ ప్లాన్ ఫర్ ఎకనామిక్స్ డెవలాప్‌మెంట్ ఆఫ్ ఇండియా) ను రూపొందించారు. దీనినే 'బాంబే ప్రణాళిక' అంటారు. ఈ ప్రణాళిక 10,000 కోట్ల రూపాయలు వ్యయం చేయడం ద్వారా ప్రజల ప్రస్తుత తలసరి ఆదాయాన్ని రెట్టింపు చేయాలని లక్ష్యంగా పెట్టుకుంది. ఈ లక్ష్యాన్ని 15 సంవత్సరాలలో సాధించవలసి ఉంటుంది. పారిశ్రామిక వేత్తలచే రూపొందించబడిన ఈ ప్రణాళిక మౌలిక పరిశ్రమలకు అధిక ప్రాధాన్యత ఇచ్చింది.

1944లో గాంధీ సిద్ధాంతాలను దృష్టిలో పెట్టుకుని ఎం.ఎన్. అగర్వాల్ 'గాంధేయ ప్రణాళిక' రూపొందించారు. ఈ ప్రణాళికలో 3,500 కోట్ల రూపాయలను వ్యయం చేయవలసి ఉంటుంది. ఈ ప్రణాళికలో వ్యవసాయానికి, చిన్న తరహా పరిశ్రమలకు అధిక ప్రాధాన్యత ఇచ్చారు. గ్రామీణ స్వయం సమృద్ధి, వికేంద్రీకరణ ఈ ప్రణాళిక ముఖ్య లక్షణాలు.

1945లో భారత కార్మిక సమాఖ్యకు చెందిన ఎం.ఎన్. రామ్ 'ప్రజా ప్రణాళిక' అనే పేరుతో ఒక ప్రణాళికను రూపొందించారు. పది సంవత్సరాల కాల పరిమితి కలిగిన ఈ ప్రణాళికా కాలంలో 15,000 కోట్ల రూపాయల వ్యయం చేస్తారు. ఈ ప్రణాళికలో వ్యవసాయానికి, వినియోగ వస్తువుల పరిశ్రమలకి అధిక ప్రాధాన్యత ఇచ్చారు. అయితే ఇవి ఏవి అమలు కాలేదు.

### ప్రణాళికా సంఘం

స్వాతంత్ర్యానంతరం కేంద్ర కేబినెట్ తీర్మానం ద్వారా 1950 మార్చ్ 15న ప్రణాళికా సంఘాన్ని ఏర్పాటు చేశారు. ఇది రాజ్యాంగేతర, శాసనేతర సంస్థ. ప్రణాళికా సంఘానికి చైర్మన్‌గా ప్రధానమంత్రి వ్యవహరిస్తారు. ప్రణాళికా సంఘంలో క్రియాశీలకంగా పనిచేసే ఒక ఉపాధ్యక్షుడు, సభ్యులు ఉంటారు.

ప్రణాళికా సంఘానికి పలువురు ప్రముఖులు ఉపాధ్యక్షులుగా పని చేశారు. తొలి ఉపాధ్యక్షులుగా గుల్జారీలాల్ నందా బాధ్యతలు చేపట్టగా, ఆ తర్వాత ఆ పదవిని వి.టి. కృష్ణమాచారి, సి. సుబ్రమణ్యం, పి.ఎన్.హస్కర్, మన్మోహన్‌సింగ్, ప్రణబ్‌ముఖర్జీ, కె.సి. పంత్, జశ్వంత్ సింగ్, మధు దండావతే, మోహన్ ధరియా, ఆర్.కె. హెగ్డే, చివరిగా మాంటెక్ సింగ్ అహ్లు వాలియా పనిచేశారు.

ప్రణాళికా సంఘం దేశంలోని మానవ, భౌతిక, మూలధన వనరులను అంచనా వేయడం, ప్రణాళికలను రూపొందించడం, ఎప్పటికప్పుడు అభివృద్ధిని సమీక్షించడం దీని ముఖ్య నిధి.

### ప్రణాళికల సాధారణ లక్ష్యాలు

అభివృద్ధి చెందుతున్న దేశాలు త్వరిత గతిన ఆర్థికాభివృద్ధిని సాధించడానికి ప్రణాళికలు అవసరం. ప్రణాళికలు సాధారణంగా ఈ కింది లక్ష్యాలను కలిగి ఉంటాయి. 1) జాతీయాధాయంలో సాలుసరీ వృద్ధిని సాధించడం. 2) తద్వార దేశ ప్రజల తలసరి ఆధాయం, జీవన

ప్రమాణాలను పెంచడం. 3) త్వరితగతిన పారిశ్రామికాభివృద్ధికి కృషి. 4) ప్రత్యేకించి ఆహార ధాన్యాల ఉత్పత్తిలో స్వయం సంవృద్ధికి కృషి. 5) ప్రాంతీయ అసమానతలు తొలగించడం. 6) ఆధాయ సంపదల్లో వ్యత్యాసాలను తగ్గించడం ద్వారా పేదరికాన్ని నిర్మూలించడం. 7) ఉద్యోగావకాశాలు అధికం చేయడం. 8) ధరలు స్థిరకరణ ద్వారా సుస్థిర ఆర్థిక వృద్ధిని సాధించడం.

**పంచవర్ష ప్రణాళికలు – సమీక్ష**

1950లో ప్రణాళికా సంఘం ఏర్పాటు చేసిన తర్వాత 1951 నుండి పంచవర్ష ప్రణాళికలను అమలు పరచడం ద్వారా భారతదేశంలో ఆర్థికాభివృద్ధిని సాధించాలని తీవ్రమైన కృషి ప్రారంభమైంది. భారత ప్రభుత్వం 1951 నుండి 2012 వరకు 11 పంచవర్ష ప్రణాళికలను అమలు పూర్తి చేసింది. మూడవ ప్రణాళిక (1961-66) ముగిసిన వెంటనే నాలుగవ పంచవర్ష ప్రణాళిక ప్రారంభం కాలేదు. 1965లో భారత్, పాక్‌ల మధ్య యుద్ధం, 1966 లో జూన్‌లో భారత ప్రభుత్వం రూపాయి విలువ తగ్గించడం వంటి కారణాల వల్ల ప్రణాళికా వనరులను, ప్రాధాన్య క్రమాలను, పునఃపరిశీలించవలసిన అవసరం ఏర్పడింది. దీంతో ప్రభుత్వం 1966 -69ల మధ్య కాలంలో మూడు వార్షిక ప్రణాళికలను అమలు చేసింది. ఈ మూడు సంవత్సరాల కాలాన్ని కొందరు ప్రణాళికా క్రమంలో ఏర్పడిన విరామాన్ని 'ప్లాన్ హాలిడే'గా భావించారు. మళ్లీ 1990-92ల మధ్య కూడా వార్షిక ప్రణాళికలు అమలయ్యాయి.

వివిధ ప్రణాళికల్లోని లక్ష్యాలు, వృద్ధిరేటు లక్ష్యం, వాస్తవిక వృద్ధిరేటు ఈ కింది విధంగా ఉన్నాయి.

| ప్రణాళిక | ప్రణాళికా కాలం | లక్ష్యాలు | వృద్ధిరేటు లక్ష్యం | వాస్తవిక వృద్ధిరేటు |
|---|---|---|---|---|
| 1 | 1951-56 | వ్యవసాయం | 2.1 | 3.6 |
| 2 | 1956-61 | భారీ పరిశ్రమల | 4.5 | 4.2 |
| 3 | 1961-66 | ఆహార ధాన్యాల | 5.6 | 2.8 |
| 4 | 1969-74 | సుస్థిర వృద్ధి | 5.7 | 3.3 |
| 5 | 1974-79 | పేదరిక నిర్మూ | 4.4 | 4.7 |
| 6 | 1980-85 | లాభదాయక | 5.2 | 5.7 |
| 7 | 1985-90 | ఆహారం ఉత్పత్తి | 5.0 | 5.8 |
| 8 | 1992-97 | మానవ వనరు | 5.6 | 5.8 |
| 9 | 1997-02 | సమానత్వం | 6.5 | 5.5 |
| 10 | 2002-07 | సమానత్వం | 8.1 | 7.8 |
| 11 | 2007-12 | సత్వర వృద్ధి | 8.1 | 7.9 |
| 12 | 2012-17 | సత్వర సుస్థిరా | 8.0 | - |

ప్రస్తుతం 12వ పంచవర్ష ప్రణాళిక నడుస్తోంది. ఈ నేపథ్యంలో దేశాభివృద్ధికి ఒక ప్రణాళిక అవసరమే కాని అందుకు ప్రణాళిక సంఘం పనికి రాదన్న భావన వినిపించడానికి గల కారణాలు.

1) 1990లో ఆర్థిక సంస్కరణలు ప్రారంభమైన నాటి నుండి ప్రణాళికా సంఘం ప్రాముఖ్యత తగ్గిపోవడం ఆరంభమైంది.
2) సంస్కరణల నేపథ్యంలో ప్రైవేట్‌రంగానికి పెద్దపీట వేయడంతో, లైసెన్స్‌రాజ్ శకం అంతరించడంతో ప్రణాళికా సంఘం పెద్దగా అధికారాలు లేకుండా ఒక సలహా సంఘంగా మారింది.
3) మరోవైపు ప్రణాళికా సంఘంపై పలు రాష్ట్రాల ముఖ్యమంత్రుల నిరసన కూడా పెరుగుతూ వచ్చింది.
4) రాష్ట్రాల ప్రణాళికలను ఆమోదింపచేయడం కోసం ఏటా ఢిల్లీ వచ్చి ప్రణాళికా సంఘం ఆమోదం తీసుకోవాల్సిన అవసరం ఏముందని ముఖ్యమంత్రులు ప్రశ్నించుట ప్రారంభించడం.
5) ప్రణాళికా సంఘం ఉపాధ్యక్షుడి విచక్షణతో ముడిపడిన కొద్దిపాటి నిధుల విషయంలో కూడా రాష్ట్రాలు అసంతృప్తి వ్యక్తం చేయడం ప్రారంభించాయి.
6) పేదరికం స్థాయిని నిర్ణయించే విషయంలో దేశవ్యాప్త దుమారం (అవాస్తవిక అంచనాలు).
7) నిర్దిష్ట ఫార్ముల ప్రకారం రాష్ట్రాలకు నిధుల కేటాయింపు రాజ్యాంగ బద్ధంగా ఆర్థిక సంఘానికి (అధికరణం 280) ఉన్నా ప్రణాళికా సంఘం ఈ విషయంలో చొరబడడం.
8) స్వాతంత్ర్యం వచ్చి 67 సంవత్సరాలు కావడంతో రాష్ట్రాలు పరిపాలనా అనుభవం కలిగి ఉండడం, వేర్వేరు రాష్ట్రాల అవసరాలు వేర్వేరుగా ఉండడం దానిని ప్రణాళికా సంఘం గుర్తించకపోవడం.

ఈ పరిణామాల క్రమంలో ఈ ప్రణాళికా సంఘాన్ని పూర్తిగా రద్దు చేయాలని ప్రధాని మోడీ నిర్ణయించారు. ప్రణాళికా సంఘాన్ని రద్దు చేయాలన్న ప్రధాని నిర్ణయాన్ని చాలా మంది సమర్థిస్తున్నారు. ఇది చాలా మంచి నిర్ణయం అని ప్రణాళికా సంఘం మాజీ సభ్యుడు 'బిమల్‌జలాన్' వాఖ్యానించారు. దేశ భవిష్యత్తును, దీర్ఘకాలిక అవసరాలను దృష్టిలో ఉంచుకొని పురోభివృద్ధి కోసం అత్యున్నతమైన ఆలోచనలతో వినూత్నంగా ఆలోచించగలిగే నూతన వ్యవస్థకు నాంది పలకాల్సిన తరుణం ఇది.

ప్రపంచీకరణ అనంతర కాలంలో దిగుమతులు తగ్గించుకోవడం కంటే ఎగుమతులను పెంచుకోవాల్సిన అవసరం మరింతగా పెరుగుతుంది. ప్రభుత్వ, ప్రైవేట్ భాగస్వామ్యాలు లేకుండా ఆధునిక కాలంలో దేశాభివృద్ధిని ఊహించడం కష్టం.

ఈ నేపథ్యంలో ఇటువంటి కొత్త మార్పులను అర్థం చేసుకుని, దేశ ఆర్థిక రంగానికి దిశా నిర్దేశం చేయాలంటే అందుకుగాను ప్రభుత్వం తరపున ఆర్థిక వేత్తలతోపాటు ముఖ్యంగా ప్రైవేట్ ఆర్థిక దిగ్గజాలతో కూడిన 'మిశ్రమ ప్రణాళికా సంఘం' లాంటి నూతన వ్యవస్థను ప్రణాళికా సంఘం స్థానంలో ఏర్పాటు చేయాలి. దీనిలో అభివృద్ధి రథానికి రాష్ట్రాలు ఇరుసులుగా భావించే మోడీ నూతన వ్యవస్థలో రాష్ట్ర ముఖ్యమంత్రులకు సముచిత స్థానం కల్పిస్తే బాగుంటుంది. దాంతో కేంద్రానికి, రాష్ట్రాలకు మధ్య దూరం తగ్గుతుంది. కేంద్ర ప్రభుత్వ పథకాలు రాష్ట్రాలలో అమలు పరచడం సులభమవుతుంది. ఈ నూతన వ్యవస్థకు అత్యంత పారదర్శకంగా పని చేసే పరిస్థితులు కల్పించాల్సి ఉంది. అప్పుడే ప్రధాని తలపెట్టిన 'డిజిటల్ ఇండియా', 'మేడిన్ ఇండియా', 'జన్‌దన్ యోజన' లాంటి పథకాలు ప్రతి పేదవాని చెంతకు చేరుతాయి. భారత్ బాగుపడుతుంది.

*(రచయిత ఉపాధ్యాయులు)* వీ

# భారతదేశానికి చరిత్ర లేదా?

*భారత చరిత్ర గురించి మార్క్స్, భారతదేశంలో సామాజిక విప్లవం జరగకపోవడం గురించి అంబేద్కర్ లేవనెత్తిన సందేహాలను చర్చించాలంటున్నారు* **డా. పట్టా వెంకటేశ్వర్లు**

మార్క్స్‌కు ఈ సందేహం 1853 కాలంలో 'ది బ్రిటిష్ రూల్ ఇండియా' అనే గ్రంథం రాస్తున్నప్పుడు వచ్చింది. ఆయన దృష్టిలో చరిత్ర అంటే వర్గపోరాటాల చరిత్రే. ఈ వర్గపోరాటాల ఫలితంగా సమాజం ఒక దశ నుండి మరొక సామాజిక దశకు పరిణామం చెందుతుంది. ఈ విధంగా ఐరోపా సమాజంలో ఆదిమ సమాజం నుండి బానిస సమాజం తర్వాత ఫ్యూడల్, పెట్టుబడిదారీ వ్యవస్థలు ఏర్పడ్డాయి. ఇది ఉత్పత్తి శక్తుల మధ్య ఘర్షణ, ఉత్పత్తి సంబంధాలలో సంక్షోభం ఆధారంగా జరిగింది. అయితే ఇంత స్పష్టమైన మార్పులు ఆయనకు మనదేశ చరిత్రలో కనబడకపోయేసరికి ఇలాంటి సందేహం వచ్చింది. డా.అంబేద్కర్ కూడా 1932లో తన 'కుల నిర్మూలన' గ్రంథంలో 'ప్రపంచంలో అన్ని దేశాల్లో సామాజిక విప్లవాలు జరిగినై, కాని భారత దేశంలో ఎందుకు జరగలేదన్నది నన్ను వేధించే ప్రశ్నగా ఉందని' అంటాడు. కాబట్టి ఈ తాత్వికులిద్దరు లేవనెత్తిన సందేహాలపై చర్చ జరగాల్సి ఉంది.

ఏ సమాజంలోనైనా ఉత్పత్తి శక్తుల అభివృద్ధి అనేది సామాజిక అవసరాలు, ఆనాడున్న సైన్స్ స్థాయిని బట్టి జరుగుతుంది. ఈ ఉత్పత్తి శక్తుల అభివృద్ధే సామాజిక మార్పులను నిర్దేశిస్తాయి. అటువంటప్పుడు మనదేశంలో ఉత్పత్తిశక్తులు అభివృద్ధి చెందకుండా అడ్డుకున్న శక్తులేమిటి? ఉత్పత్తి పంపిణీలో తీవ్ర అసమానతలున్నప్పటికీ ఉత్పత్తి సంబంధాల్లో సంక్షోభం ఎందుకు నెలకొనలేదు? ఒకవేల సంక్షోభం ఉన్నప్పటికీ సాంఘిక విప్లవాలకు ఎందుకు దారితీయలేదు అనేది మార్పును కోరే శక్తులను నేటికి కూడా వేదిస్తున్న ప్రశ్నే.

మనదేశంలో క్రీ.పూ. ఆర్యుల దండయాత్ర కంటె ముందే విలసిల్లిన సింధూ నాగరికత గొప్ప నగర జీవనాన్ని కలిగి ఉన్నట్లు చరిత్రకారులు చెపుతారు. ఈ రకమైన జీవనస్థాయి శ్రమ విభజన, మిగులు ఉత్పత్తి లేకుండా సాధ్యం కాదు. ఇటువంటి పురోగాభివృద్ధి చరిత్ర గలిగిన సింధూ సమాజాన్ని సంచార వాసులైన ఆర్యులు ధ్వంసం చేయడం, వారి ప్రయోజనాలకనుగుణంగా వర్ణవ్యవస్థ ఏర్పాటు చేయడంతో ఈ దేశ చరిత్ర ప్రతిఘాతుక శక్తుల చేతుల్లోకి వెళ్లింది. ఈ బ్రాహ్మణీయ వర్ణవ్యవస్థను భౌతిక తీవ్రవాదులైన చార్వాకులు ప్రశ్నించడంతో వారినీ, వారి భావజాలాన్ని ధ్వంసం చేశారు. ఆ తర్వాత బ్రాహ్మనిజానికి వ్యతిరేకంగా జైనా, బౌద్ధ ఉద్యమాలు ముందుకు వచ్చినాయి. ఈ కాలంలోనే ఏర్పడిన మగధ సామ్రాజ్యం ఉన్నంత వరకు ఆర్థిక, సామాజికరంగంలో గొప్ప మార్పులు జరిగాయి. వ్యాపార రంగం అభివృద్ధి చెందింది. గ్రీకు తదితర విదేశాలతో వర్తక, వాణిజ్య, వివాహ సంబంధాలు కూడా పెరిగాయి. విద్యాపరంగా గొప్ప మార్పులకు పునాది కూడా వేయబడింది. ప్రపంచ ప్రసిద్ధి గాంచిన నలంద, తక్షశీల విశ్వవిద్యాలయాలు ఈ కాలంలోనే విలసిల్లాయి. తిరిగి పుష్యమిత్ర శుంగుని ప్రతిఘాత విప్లవం, తర్వాత గుప్తుల కాలంలో ఆర్థిక వ్యవస్థ దిగజారడం, కుల తారతమ్యాలు, రాజకీయ ఫ్యూడలిజం ప్రవేశించడంతో భౌతికవాద ఆలోచనలు వెనక్కి నెట్టబడ్డాయి. ఈ విధంగా తిరిగి మార్మికవాదానిదే పైచేయి అయింది.

అయితే ఐరోపాలో అంధయుగం తర్వాత 16వ శతాబ్దం నుండి సాంస్కృతిక పునర్జీవన ఉద్యమాల రాకతో అక్కడ గొప్పగొప్ప శాస్త్రీయ ఆవిష్కరణలు జరుగుతుంటే, మనదేశం మాత్రం శంకరాచార్యుని 'మాయవాద' మనే ఊబిలో చిక్కి సామాజిక మార్పులు లేని సమాజంగా ఘనీభవించింది. మార్క్స్ అన్నట్లు 'భారతీయ సామాజిక వ్యవస్థ మానవుడి బుద్ధిని అత్యంత సంకుచితమైన పరిధిలో బందీగా, మూఢ నమ్మకాల చేతిలో పనిముట్టుగా, సాంప్రదాయ భావాలకు బానిసగా మార్చివేసిందనీ, ఇక్కడి శ్రమ విభజన, దాని మీద ఆధారపడ్డ కులవ్యవస్థ భారతీయుల శక్తికి, అభివృద్ధికి ప్రతిబంధకాలుగా మారిందని, స్వయంగా అభివృద్ధి చెందుతున్న సామాజిక రాజ్యాన్ని మార్పు లేని ప్రకృతి సూత్రంగా మార్చివేశాయనీ' అంటాడు. అంటే రాజవంశాలు నిరంతరంగా మారుతున్నప్పటికీ, సమాజంలోని ప్రాథమిక ఆర్థిక సూత్రాల నిర్మాణంలో మాత్రం ఎలాంటి మార్పులు రాలేదు. అందువల్ల సామాజిక విప్లవాలు ఉనికిలోకి రాకుండా పోయాయనే నిర్ణయానికి మార్క్స్ వస్తాడు.

కాని బౌద్ధ ఉద్యమ పరిణామాన్ని సామాజిక విప్లవంగానే చెప్పవచ్చు. ఇందుకు మనం ఎంగిల్స్ 'ది పెజంట్‌వార్ ఇన్ జర్మనీ' అనే గ్రంథంలోని సూత్రీకరణను పరిశీలిస్తే ఇది అర్థమవుతుంది. '16వ శతాబ్దంలో జరిగిన మత యుద్ధాల్లో తప్పకుండా భౌతికమైన వర్గ ప్రయోజనాలు ఉన్నాయి. అది మతం తెరవెనుక దాచివేయబడిన విషయాన్ని ఆనాటి సామాజిక పరిస్థితులు చాలా తేటతెల్లంగా వివరిస్తాయంటాడు. అంటే మత దుస్తులతో వర్గపోరాటాలు జరిగాయన్నమాట. కాబట్టి భారతదేశంలో కూడా వర్ణ వ్యవస్థ ప్రాబల్యానికి వ్యతిరేకంగా వచ్చిన బౌద్ధ తిరుగుబాటు బాహాటమైన వేదిక మతదోపిడి వ్యతిరేక పోరాటమే. అయితే ఈ సామాజిక విప్లవం బౌద్ధంతోనే ఆగిపోయింది. ఇంతకు ముందే చెప్పినట్లు పుష్యమిత్ర శుంగుని ప్రతిఘాత విప్లవంతో చతుర్వర్ణ వ్యవస్థ కులాలుగా ఘనీభవించింది. ఈ కాలంలోనే కులధర్మాన్ని రక్షించి, కీర్తించేందుకు మనుస్మృతి, రామాయణ, మహాభారత కథలు రాయబడ్డాయి. భగవద్గీత ద్వారా శ్రీ కృష్ణునిచే వర్ణ ధర్మాలు, ధర్మబద్ధమని కూడా చెప్పిస్తారు. కాబట్టి చాతుర్వర్ణ వ్యవస్థ కేవలం సామాజిక, ఆర్థిక రూపం మాత్రమే కాదూ, లోతుగా విశ్లేషిస్తే నాలుగు వర్ణాలు, నాలుగు వర్గాలుగా విభజించ బడడమనేది సామాజిక దోపిడి శ్రమ విభజనే. ఇది ఉత్పత్తి, పంపకం, వినియోగాలకు సంబంధించిన వ్యవస్థే. కానీ కాలం గడచినకొద్ది వర్ణ వ్యవస్థ వంశపారంపర్యంగా వృత్తులు, పెళ్లిళ్లకు సరిహద్దుగా

# ప్రపంచీకరణలో భారతీయ వ్యవసాయరంగం

*ప్రపంచీకరణలో భాగంగా వ్యవసాయానికి కావలసిన విత్తనాలు, ఎరువులు, పనిముట్లు కార్పొరేట్ కంపెనీల చేతిలోకి వెళ్లడంతో నేడు వ్యవసాయం రైతుల పాలిట శాపంగా మారిందని అంటున్నారు* **పోలం సైదులు**

**భా**రతదేశం గ్రామాల్లోనే నివసిస్తోందన్నారు మహాత్మగాంధీ. దేశ ప్రథమ ప్రధాని పండిత్ జవహర్‌లాల్ నెహ్రూ దేశంలో వ్యవసాయానికి అధిక ప్రాధాన్యతనిస్తూ 'ఏదైనా ఆగవచ్చు కానీ, వ్యవసాయం మాత్రం ఆగకూడదన్నారు'. అమెరికా మొదటి అధ్యక్షుడు జార్జి వాషింగ్టన్ 'ప్రపంచ చక్రవర్తిగా ఉండే కన్నా, వ్యవసాయ క్షేత్రంలో ఉండడానికే ఇష్టపడతా నన్నాడు'. అంతర్జాతీయ స్థాయిలో వాతావరణానికి సంబంధించిన చర్చల్లో మనదేశం మొదటి నుండీ వ్యవసాయానికి సంబంధించిన అంశం సానుకూల మార్పులు తెచ్చే దిశగా ఉండాలి తప్పితే, దానిని నిరుత్సాహపరిచే దిశగా సాగకూడదని తమ వైఖరిని స్పష్టం చేస్తుంది. ఇవన్నీ కూడ వ్యవసాయానికి గల ప్రాధాన్యతను తెలుపుతున్నాయి. నేడు వివిధ రాష్ట్రాలలో, దేశంలో అధికారాన్ని చేజిక్కుంచుకోవాలంటే వివిధ పార్టీలు తమ ఎలక్షన్ మ్యానిఫెస్టోలో రైతుల సంక్షేమం, వ్యవసాయాభివృద్ధికి సంబంధించిన అంశాలకు అధిక ప్రాధాన్యత నివ్వడం జరుగుతుంది. అంటే అధికారాన్ని నిర్ణయించే స్థాయిని ఏర్పర్చుకున్న వ్యవసాయ రంగం అధికారుల నిర్లక్ష్యం వలన ప్రతిసారీ మోసపోతుందని చెప్పక తప్పదు.

గతం నుండి నేటి వరకు వ్యవసాయ రంగంలో పెనుమార్పులు సంభవించాయనడంలో అతిశయోక్తి లేదు. జాతి మనుగడకు ముఖ్య అవసరమైన కూడు, గూడు, గుడ్డ అమర్చే బృహత్ కార్యక్రమం విజయవంతం కావాలంటే తప్పని సరిగా వ్యవసాయ రంగం (పశుపోషణ, మత్స్య పరిశ్రమ, ఉద్యాన పంటలు, సామాజిక అటవీ సంరక్షణ) పురోగమించాలి. కానీ నేడు వ్యవసాయ రంగం పరిస్థితి ఏవిధంగా తయారైందో, తయారవుతుందో తెలియనిది కాదు. వ్యవసాయ ఉత్పత్తులకు గిట్టుబాటు ధరలు లభించక రైతులు రుణగ్రస్తులవుతున్నారు. కుటుంబాలను పోషించలేక రైతులు పట్టణాలకు వలసపోవడం, మరి కొంత మంది ఒత్తిడికి లోనై ఆత్మహత్యలు చేసుకున్న సందర్భాలు అనేకం.

మేలైన సాగు పద్ధతుల గురించి తెలియ చెప్పేవారు లేక, ఆధునిక వ్యవసాయ విధానాల పట్ల అవగాహన లోపించి, సేద్యం కలిసిరాక అప్పుల భారం తీర్చేందుకు పొలాలను అమ్ముకుంటున్న రైతుల సంఖ్య క్రమంగా పెరుగుతుంది.

**ప్రపంచీకరణకు ముందు వ్యవసాయం**

రైతులు వ్యవసాయం చేయడానికి ముఖ్యంగా మానవ శ్రమపైనే

రూపొందింది. అంతేకాక మత హక్కులు, బాధ్యతలు కూడా కులాన్ని బట్టి మారిపోయాయి. శారీరక శ్రమ చేయకపోవడం బ్రాహ్మణుడి హక్కు. శారీరక శ్రమ మాత్రమే చేయడం శూద్రుడి బాధ్యతనే కఠినమైన చట్టాలను మనుస్మృతి అమల్లోకి తెచ్చింది. అందుకనే డా. అంబేడ్కర్ 'హిందూమతం ఒక మతం కాదనీ, అది నిధినిక్షేపాల శిక్షాస్మృతి' అని పేర్కొంటాడు.

ఈ విధంగా హిందూ కుల జీవన విధానం ఉత్పత్తి ఫలాలను అందరికీ అందకుండా అడ్డుగా ఒక దడిని నిర్మించింది. అందుకే ఆయన 'దడికట్టుకున్న వర్గమే కులం' అనే నిర్వచనాన్ని ఇస్తాడు. కుల స్వభావం విచ్ఛిన్నం. అంటే శ్రామికవర్గం ఐక్యం కాకుండా వేల కులాలుగా చీల్చుడం. ఇదే దీని బలం. అందుకే కులం శ్రమ విభజనే కాదూ శ్రామిక విభజన అని కూడా అంటాడు. ఈ పరిణామం కుల వ్యవస్థ ప్రాథమిక వర్గ లక్షణాన్ని మరింత జటిలం చేసింది. ఈ విధంగా కుల వ్యవస్థ సామాజిక, భౌతిక, సాంస్కృతిక జీవితాన్ని స్తంభింపజేసింది. అంటే ఈ వ్యవస్థల ఉన్న అంతర్గత సాంప్రదాయకత్వం కారణంగా అన్ని రకాల శ్రామిక కులాల వారు ఉపయోగించే ఉత్పత్తి సాధనాలను ఎదగకుండ చేసింది. వారికి విద్యను, దానివల్ల ఒనగూరే జ్ఞానాన్ని, జ్ఞానం వల్ల లభించే ఉన్నత అవకాశాలు అందకుండా చూసింది. అలాగే రాజకీయ పీడన, అధికార దాస్యం, పరమమూర్ఖమైన మతకర్మకాండ, అజ్ఞానం మూర్తిభవించిన సంకుచితత్వం. అసహ్యకరమైన కులద్వేషం మొదలగు అంశాలు సైన్స్‌ను ఇతర బౌద్ధిక కార్యకలాపాలను బలహీన పరిచింది. ఈ విధంగా మూఢనమ్మకాల పెత్తనం, అభివృద్ధి నిరోధక భావాలు పెరిగిపోయాయి.

కానీ బ్రిటిష్ వారి రాకతో యూరప్ పారిశ్రామిక విజ్ఞానంతో పాటు వారి ఉత్పత్తి సంబంధాలు మనదేశంలోకి దిగుమతి కావడం ప్రారంభించాయి. ఈ విధంగా పాత కుల ఫ్యూడల్ సంబంధాలపైనే పెట్టుబడిదారీ ఉత్పత్తి సంబంధాలు రుద్దబడ్డాయి. దీన్ని విశ్లేషిస్తూ మార్క్స్ 'హిందుస్థాన్‌లో జరిగిన అన్ని పౌర యుద్ధాలు, దండయాత్రలు, కరువుకాటకాలు స్వయంపోషక గ్రామీణ వ్యవస్థను మార్చలేక పోయాయి, కానీ బ్రిటిష్ వారు ప్రవేశపెట్టిన ఆవిరి ఇంజన్, స్వేచ్ఛ వ్యాపార విధానం పాత వ్యవస్థని ధ్వంసం చేస్తున్నాయంటాడు. ఒక్క మాటలో చెప్పాలంటే అధునిక సమాజానికి కావాల్సిన పునాదులు ఇక్కడి నుండి ప్రారంభ మయ్యాయని చెప్పవచ్చు. ఆ తర్వాత స్వాతంత్ర్య అనంతరం అమల్లోకి వచ్చిన టాటా, బిర్లా అభివృద్ధి నమూనా కూడా కుల పెట్టుబడిదారీ వ్యవస్థను స్థిరీకరించింది. ఈ విధంగా గతం నుండి నేటి వరకు అర్థిక, సామాజిక, రాజకీయ రంగాలన్ని అగ్రకుల ఏకస్వామ్యాలుగానే ఉంచ బడుతున్నాయి. కాబట్టి ఈ రంగాలను బహుజనస్వామికీరించడమనే లక్ష్యంగా రాజకీయ కార్యక్రమం చేపట్టాల్సి ఉంది. అప్పుడే నూతన చరిత్రను నిర్మించుకొనే అవకాశం కలుగుతుంది.

*(రచయిత అర్థశాస్త్ర ఉపన్యాసకుడు)*

ఆధారపడేవారు. పశు, జంతు సంపదపై ఎక్కువ మక్కువ చూపించేవారు. పొలాలను చదునుచేయడానికి ఎద్దులు, గేదలతో అరకలు కట్టి చదును చేయడం, పొలాలు సారవంతమవ్వడానికి ఎక్కువగా సహజ ఎరువులు (జంతువుల పేడ) వాడేవారు.

పంట పొలాలలో విత్తనాలను వేయడానికి స్వంతంగా తయారు చేసుకొని రుతువులపై, వర్షాలపై ఆధారపడి వ్యవసాయం చేసేవారు. అనేక రకాల ఆహార పంటలు (వరి, గోధుమ, జొన్న, సజ్జ, వేరుశనగ, మొక్కజొన్న, శనగ, రాగులు, తైదలు, ఉలువలు, కందులు బెబ్బర్లు) లాంటి పంటలు పండించేవారు. ఇలాంటి పంటలను ఎలాంటి కృత్రిమ రసాయనాలు వాడకుండానే పండించడం మూలంగా ఎంతో పౌష్టికరంగా ఉండేది. దిగుబడి తక్కువగా వచ్చినప్పటికిని ఎంతో పుష్టికరమైన పంటలను పండించడం మూలంగా ఎక్కువకాలం జీవించడానికి దోహదపడ్డాయని చెప్పవచ్చు.

రైతులు ఇళ్లలో అన్నిరకాల తిండిగింజలు భద్రపరుచుకునేవారు. ఇంటి ముందర ఆవులు, ఎద్దులు, గేదెలు, మేకలు, కోళ్లతో కిటకిటలాడుతూ వ్యవసాయ కుటుంబానికి ప్రతీకగా ఉండేవి. కుటుంబంలో ప్రతి ఒక్కరు కష్టపడి పనిచేసే తత్వాన్ని కలిగి ఉండడం మూలంగా అందరు శారీరకంగా ఎలాంటి రోగాల బారినపడకుండా ఉండేవారు.

### ప్రపంచీకరణ నేపథ్యంలో వ్యవసాయం

నేడు ప్రపంచం పరిణామక్రమంలో ఎంతో పురోగాభివృద్ధి సాధించిందనడంలో అతిశయోక్తి లేదు. మానవ జాతి శాస్త్ర, సాంకేతిక రంగాలలో సాధించిన విప్లవాత్మకమైన మార్పులు చూస్తుంటే కళా! నిజమా అని తేల్చుకోలేని పరిస్థితులలో ఉన్నాం.

ప్రపంచీకరణ నేపథ్యంలో వ్యవసాయం చేసే విధానమే పూర్తిగా మారిపోయిందని చెప్పవచ్చు. నేడు రైతులు వ్యవసాయం చేయడానికి పూర్తిగా యంత్రాలపైనే ఆధారపడవలసి వస్తుంది. రోజు రోజుకు పశు, జంతు సంపద క్రమంగా తగ్గి, క్షీణ దశకు చేరుతుందని చెప్పవచ్చు.

ప్రస్తుతం దేశ వ్యవసాయాన్ని శాసించేది కృత్రిమ ఎరువులు, పురుగు మందులు, జన్యుమార్పిడి విత్తనాలతో పాటు రకరకాల సంకర విత్తనాలు లేకుంటే వ్యవసాయమే చేయలేమనే స్థితికి చేరి పోయామనడంలో ఆశ్చర్యం లేదు.

నేడు దేశంలో వ్యవసాయం కూడా కార్పొరేట్ చేతుల్లోకి వెళ్లి, విత్తనాల తయారీ, వివిధ రసాయనిక ఎరువులు, క్రిమి సంహారక మందుల తయారీల నిమిత్తంగా ఎన్నో బహుళజాతి కంపెనీలు వెలిశాయి. వ్యవసాయ భూమి చదును కోసం ఎన్నో రకాల యంత్రాలు వెలసి, వ్యవసాయ కూలీల వలసలకు దారితీసి, వారి ఆర్థిక పరిస్థితిని దెబ్బతీస్తున్నాయనడంలో అనుమానం లేదు. వ్యవసాయంలో భాగంగా బహుళజాతి కంపెనీలు వెలిశాక, వ్యవసాయమంతా కార్పొరేట్ చేతిలోకి వెళ్లి, దేశంలో ఆహార పంటల కంటే కూడా వాణిజ్య పంటలకే అధిక ప్రాధాన్యతనిస్తూ, రైతులకు వివిధ సంకర విత్తనాలను, రకరకాలైన క్రిమి సంహారక రసాయనాలు సరఫరా చేస్తూ వ్యవసాయ నేలను కలుషితం చేయడమే కాకుండా ఆహారపంటల కలుషితానికి దారి తీస్తున్నాయి.

అతివృష్టి, అనావృష్టి వలన రైతులు అధిక పెట్టుబడితో చేస్తున్న వ్యవసాయం దెబ్బతినడంతో ఎంతోమంది రైతులు ఆత్మహత్యల పాలు అవుతున్నారు.

కొన్ని బహుళజాతి కంపెనీలు రైతుల ముంగిట నిలిసి, వారికి పెట్టుబడి, కావాల్సిన పంట విత్తనాలను, ఎరువులను సరఫరా చేసి పంటలను (కూరగాయలు, పండ్లు) కొనుగోలు చేసి చల్లని గదులతో కూడిన పెద్ద పెద్ద భవంతులు కలిగిన షాపులలో అమ్ముతూ లాభాల ముంగిట్లో నడుస్తున్నాయి. కానీ వాటిని పండించే రైతులు మాత్రం వారి భూమిలోనే వ్యవసాయ కూలీలుగా మారుతున్నారు. అలాగే నేడు దేశంలో వివిధ కూరగాయల, పండ్ల ధరలు పెరిగి, కొనుగోలు దారుల పాలిట శాపంగా తయారవుతున్నాయి. ఈ తథంగమంతా చూస్తుంటే వ్యవసాయమంతా బహుళజాతి కంపెనీల చేతుల్లోకి వెళ్లి ఇది ఒక పెద్ద వ్యాపారసంస్థగా తయారై పేద, మధ్యతరగతి రైతుల పాలిట మరణశంఖంగా తయారవుతుందేమోనన్న భయం కలుగక మానదు.

ప్రపంచీకరణ నేపథ్యంలో మనదేశంలో కేంద్ర హోం శాఖ పరిధిలోని జాతీయ నేరాల నమోదు సంస్థ (ఎన్‌సిఆర్‌బి) 1995 నుంచి ఆత్మహత్యల వివరాలను నమోదుచేస్తోంది. 1995-2013 మధ్య కాలంలో మనదేశంలో 2,96,466 మంది రైతులు ఆత్మహత్యలు చేసుకోవడం జరిగింది. కేవలం 2013లో 11,772 మంది రైతులు ఆత్మహత్యలు చేసుకున్నారంటే పరిణామ క్రమంలో మనం ఏ స్థాయిలో ఉన్నామో అర్థమవుతుంది. ముఖ్యంగా కర్ణాటకలో కాఫీ రైతులు, కేరళలోని వైనాడ్ జిల్లాలో వెనిల్లా రైతులు, తెలంగాణ, విదర్భాల్లో పత్తి రైతులు ఎక్కువగా ఆత్మహత్యలకు పాల్పడుతుండగా, దేశంలో 68 శాతం ఆత్మహత్యలు మహారాష్ట్ర, ఆంధ్రప్రదేశ్, తెలంగాణ, కర్ణాటక, మధ్యప్రదేశ్, చత్తీస్‌గడ్ రాష్ట్రాలలో నమోదు అయ్యాయి.

ఏ దేశంలోనైనా, ప్రజల్ని బతికించడానికే రైతులు పంటలు పండిస్తారు. అలాంటి రైతులు స్వయంగా ప్రాణాలు తీసుకునే పరిస్థితి వచ్చిందంటే, మన వ్యవసాయ విధానంలోనే ఎక్కడో లోపం ఉందని డాక్టర్ ఎం.ఎస్. స్వామినాథన్ ఎప్పుడో చెప్పారు. ఆ లోపాలను సరి చేయాల్సిన బాధ్యత కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలపైననే ఉన్నది.

మనదేశంలో 1991లో ప్రారంభమైన నూతన ఆర్థిక విధానాలు, ఆర్థిక సంస్కరణలు, సరళీకరణ వ్యవసాయ రంగాన్ని తీవ్రంగా ప్రభావితం చేశాయి. వాటి ఫలితంగా వ్యవసాయేతర రంగాలలో వృద్ధి సాధించిన, వ్యవసాయ రంగంలో మాత్రం వృద్ధి జరగడం లేదు. 1995లో ప్రపంచ వాణిజ్య సంస్థ రంగంలోకి వచ్చిన నేపథ్యంలో భారత వ్యవసాయరంగం, అంతర్జాతీయ మార్కెట్ల వాణిజ్యంతో అనుసంధానమైంది. స్వేచ్ఛా వాణిజ్యం పేరుతో పరిమాణాత్మక ఆంక్షలు, నియంత్రణలు పూర్తిగా తొలిగించి వ్యవసాయ ఆహార ఉత్పత్తుల ఎగుమతులను సరళతరం చేశాయి. అభివృద్ధి చెందిన దేశాలు వ్యవసాయానికి అనేక ప్రోత్సాహకాలు, సబ్సిడీలు కల్పిస్తూ, మద్దతునిస్తూ తమ రైతుల ప్రయోజనాలను పరి రక్షిస్తున్నాయి. కానీ మనదేశంలో వాటికి విరుద్ధమని చెప్పక తప్పదు.

### అప్పుల్లో అన్నదాత

వ్యవసాయ ఉత్పత్తులకు గిట్టుబాటు ధర లభించక దేశంలో 48.5 శాతం రైతులు రుణగ్రస్తులయ్యారు. అప్పులు ఎక్కువై పట్టణాలకు వలసలు పెరగడం వల్ల 1951-2001 మధ్యకాలంలో గ్రామీణ జనాభా 10

శాతం తగ్గింది, రైతులు 15 శాతం తగ్గారు, వ్యవసాయ కూలీలు 17 శాతం తగ్గారు. జాతీయ స్థూల ఆధాయంలో వ్యవసాయ, అనుబంధ వృత్తుల వాటా దేశంలో స్వాతంత్ర్యం వచ్చేనాటికి 51 శాతం ఉంటే ఇప్పుడది 13.4 శాతానికి పడిపోయింది. 5వ పంచవర్ష ప్రణాళికలో వ్యవసాయ రంగానికి కేంద్ర బడ్జెట్‌లో 16 శాతం దాకా ఖర్చు చేయగా, 11వ పంచవర్ష ప్రణాళికలో 5 శాతంతో సరిపెట్టారు. పంటలకు ఉత్పాదక ఖర్చులైనా దక్కని విధంగా మద్దతు ధరలు ప్రకటించడంలో ప్రభుత్వాల నైపుణ్యం రైతుల పాలిట శాపంగా తయారైంది.

ప్రధానంగా రైతులు రుణగ్రస్తులు కావడానికి గల కారణాలు నిస్సారమైన భూములు, నాసిరకం విత్తనాలు, అతివృష్టి, అనావృష్టి, అధిక పెట్టుబడులు చివరికి ఉత్పాదనకు గిట్టుబాటు ధర ఉండకపోవడంతో అన్నదాతలు అప్పులపాలవుతున్నారు.

**శాస్త్రీయతతో వ్యవసాయం**

వ్యవసాయ శాస్త్రవేత్తలను ఆర్థికంగా బలపరుస్తూ, ప్రోత్సహిస్తూ నిరంతరం ఎప్పటికప్పుడు కొత్త ఆవిష్కరణలకు గురిచేయాలి. తక్కువ పెట్టుబడితో ఎక్కువ ఉత్పాదన రావాలన్న, వివిధ నేలలను పరీక్షించి వాటిలో ఎలాంటి పంటలు పండించాలో తెలుసుకోవాలన్నా, పంటలకొచ్చే తెగుళ్లను అరికట్టే విధానాలను తెలుసుకోవాలన్నా, వ్యవసాయ శాస్త్రవేత్తల సహకారం అమోఘం.

రెండు దశాబ్దాల క్రితం 1986లో వ్యవసాయ శాస్త్రవేత్త ప్రొఫెసర్ మమోలవల్లి వెంకట రమణారెడ్డి 'సాంబ మసూరి' లేదా బిపిటి 5204 వరి వంగడం సృష్టించారు. తర్వాత ఎన్ని వందల కొత్తరకాలు వచ్చినా వీటికి సాటిరాలేదు. ఈ బియ్యం దేశవ్యాప్తంగా వినియోగదారులకు ప్రీతికరమైనది, రైతుకు దిగుబడినిచ్చేవి. సగటున ఒక ఎకరాకు 40 బస్తాల దిగుబడినిచ్చే విత్తంగా ఆ విత్తనాన్ని సృష్టించాడంటే రైతుకు ఎంతో మేలు కదా! అలాంటి శాస్త్రవేత్తలను నిరంతరం ప్రోత్సహిస్తూ, వారికి అధిక ప్రాధాన్యతనిస్తూ ఇలాంటి కొత్త ఆవిష్కరణలను ఆహ్వానించాలి.

వ్యవసాయానికి సంబంధించిన యూనివర్సిటీలకు అధిక ప్రాధాన్యతనిస్తూ, ఉత్తమ వ్యవసాయ పరిశోధకులను తయారు చేసి దేశ వ్యాప్తంగా వ్యవసాయదారులకు సలహాలిచ్చుటకు, సమస్యల పరిష్కారాలకు మార్గాలు చూపే విధంగా వ్యవస్థను రూపొందించాలి. వ్యవసాయ రైతుల భూములను పరీక్షించి, వాటిలో పండే పంటలను తెలియజేయుటకు, నిస్సారవంతమైన భూములను సారవంతంగా మార్చుటకు తగిన సూచనలిచ్చుటకు, అధిక దిగుబడినిచ్చే నాణ్యతమైన విత్తనాలను అందించుటకు, ముఖ్యంగా ఆహార పంటలకు అధిక ప్రాధాన్యతనిచ్చే విధంగా, వ్యవసాయ రైతులను ఆర్థికంగా బలపర్చేటటువంటి కార్యక్రమాలను నిర్వర్తించాల్సిన అవసరం కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలపైన ఉన్నది.

**రైతుకు చేయూత**

'కూటికోసం–కోటి విద్యలన్నారు' పెద్దలు. ఆ కూడును సృష్టించే వారు లేకుండా పోతే మానవ సమాజమే అతలాకుతలం కావాల్సిందే. కాబట్టి ప్రభుత్వాలు వ్యవసాయాభివృద్ధికై అనేక కార్య క్రమాలను చేపట్టి, వాటికి చేయూతనందించి, ఆర్థిక భరోసాను కల్పించాల్సిన అవసరం ఉన్నది.

1) కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు అధిక వ్యవసాయ ఉత్పత్తులు సాధించేందుకు తోడ్పడే శాస్త్రీయ ఆధునిక విధానాలను రైతులకు అందించాలి.

2) వ్యవసాయ రంగంలో ప్రభుత్వ పెట్టుబడులు బాగా పెంచాలి. ముఖ్యంగా వ్యవసాయ విద్య, పరిశోధన, విస్తరణలపై ప్రభుత్వ వ్యయాన్ని పెంచాలి.

3) స్థూల దేశీయోత్పత్తి (జిడిపి) లో వ్యవసాయంపై ఖర్చును 0.60 శాతం నుంచి 4 శాతానికి పెంచాలి. (చైనా ప్రతి సంవత్సరం 5 శాతం ఖర్చు చేస్తుంది)

4) స్తబ్ధతను తొలగించే పరిశోధనకు అధిక ప్రాధాన్యతనిస్తే, జీవ సాంకేతిక పరిజ్ఞానాన్ని సమర్థవంతంగా ఉపయోగించుకొని చీడపీడలు, అతివృష్టి, అనావృష్టి వంటి ప్రతికూల పరిస్థితులను తట్టుకునే రకాలను రూపొందించాలి.

5) సన్నకారు, పేదల భూముల్లో రైతుల బయోమాస్‌ను పెంచడానికి చర్యలు తీసుకోవాలి.

6) వర్షపు నీటి సేకరణ (అడ్డు కట్టలు, కాంటూరు గట్లు) ద్వారా భూగర్భ జల పునఃపూరణకు ప్రాధాన్యతనివ్వాలి.

7) వ్యవసాయ ఉత్పత్తుల మద్దతు ధర నిర్ణయించేటప్పుడు సాగు వ్యయానికి 50 శాతం కలిపి నిర్ణయించాలన్న ఎం.ఎస్. స్వామినాథన్ కమిటీ సిఫార్సులు అమలు చేయాలి.

8) రైతులకు సహకార సంస్థల ద్వారా నిర్వహించే వ్యవసాయ డిపోలు, మార్కెట్లు ఏర్పాటు చేసి, అవి రైతుల అవసరాలు తీర్చి, ఉత్పత్తుల అమ్మకం నిర్వహించాలి.

9) రైతులకు నాణ్యమైన విత్తనాలను ప్రభుత్వమే అందించాలి.

10) విత్తనాల సరఫరా, ధాన్యం కొనుగోలు చేసే దళారీ వ్యవస్థను అంతం చేయాలి.

11) వ్యవసాయంతో పాటు పశుపోషణ, కోళ్ల పెంపకం, మత్స పరిశ్రమ, ఉద్యాన, పండ్లతోటలు, కూరగాయలు, నర్సరీ, ఔషధ, సుగంధ మొక్కల పెంపకాన్ని ప్రోత్సహించాలి.

12) ప్రతి ఏటా రైతు సదస్సులు, చైతన్య యాత్రలు చేపట్టి సలహాలు, సూచనలు ఇవ్వాలి.

13) రైతులకు పంటల నిమిత్తం బ్యాంకుల నుండి సబ్సిడితో రుణాలందించి వ్యవసాయ యంత్రాలకు సబ్సిడినిచ్చి వారిని కొనుగోలుకు ప్రోత్సహించాలి.

14) కార్పొరేట్ వ్యవసాయాన్ని తీవ్రంగా వ్యతిరేకించాలి.

15) రైతులను అన్ని విధాలుగా రక్షించి, కాపాడుకోవడానికి ప్రయత్నం చేయాలి.

పల్లెలు దేశానికి పట్టుకొమ్మలు. అలాంటి పల్లెలల్లో నివసించే రైతన్నలు సమస్యల పాలిట సతమతమవుతుంటే వారిని కాపాడుకోవాల్సిన అవసరం ప్రభుత్వాలపైననే ఉన్నది. దేశంలో ఏ రంగానికి ప్రాముఖ్యతనిచ్చిన వ్యవసాయ రంగాన్ని నిర్లక్ష్యం చేయకుండా దానికి అధిక ప్రాధాన్యతనివ్వాల్సిన అవసరం ఉన్నది.

*(రచయిత కాకతీయ యూనివర్సిటీ పరిశోధక విద్యార్థి)* వీ

# సరిహద్దు ప్రజలతో భారత్-పాక్ ప్రభుత్వాలు

***ఇరు దేశాల పాలక వర్గాలు జమ్మూ - కశ్మీర్ సమస్యను పరిష్కరించకుండా తమ స్వార్థ రాజకీయ ప్రయోజనాల కోసం సరిహద్దులో ఉన్న ప్రజల ప్రాణాలతో చెలగాటం ఆడుతున్నాయని అంటున్నారు ఎం.కె. కుమార్***

గత నెల సెప్టెంబర్ నుంచి పాకిస్థాన్–భారత్ సరిహద్దులలో ఉద్రిక్త పరిస్థితులు నెలకొన్నాయి. కాల్పుల విరమణ ఒప్పందాన్ని పరస్పరం ఉల్లంఘిస్తున్నట్లు ఇరుదేశాల పత్రికలు పతాక శీర్షికలో ప్రకటించాయి. కాల్పుల విరమణను గతంలో ఉల్లంఘించినప్పటికీ, నెలల తరబడి కాల్పులు జరుపుకోవడం ఇటీవల కాలంలో ఇదే తొలిసారిగా భావించ వచ్చు. కశ్మీర్ వెంబడి సుమారు 40 సరిహద్దు భద్రతా స్థావరాలపైనా, 30కి పైగా జనావాస ప్రాంతాలపైన పాక్ సైన్యం కాల్పులు జరిపినట్టు, దరిమిలా 9 మంది చనిపోయినట్టు భారత ప్రభుత్వం ప్రకటించింది. అంతర్జాతీయ సరిహద్దుకు నాలుగు కిలోమీటర్ల దూరం వరకు చొచ్చు కొచ్చిన పాక్ సైన్యం కాల్పులు జరిపినట్టు పత్రికలు వార్తలు రాశాయి. పాక్ కవ్వింపు చర్యలు సరిహద్దు ప్రాంత గ్రామాలలోని ప్రజలను భయ భ్రాంతులకు గురిచేస్తున్నట్టు ఆర్మీ ప్రకటించింది. తదనుగుణంగా సరిహద్దు గ్రామాలలోని ప్రజలను ఖాళీచేయిస్తున్నట్టు భారత సైన్యం పేర్కొంది.

పాక్ ప్రధాని నవాజ్‌షరీఫ్‌ను తన ప్రమాణ స్వీకారోత్సవానికి ఆహ్వానించిన మోడీ, ఇటీవల కాలం నుంచి పాక్‌పై తీవ్రమైన విమర్శలను తాజాగా ఎక్కుపెడుతున్నారు. ఇరుదేశాల మధ్య స్నేహపూరిత వాతావరణం ఏర్పడుతుందని భావిస్తున్న తరుణంలో ఏకంగా ఇరుదేశాల సైన్యం కాల్పులకు సిద్ధపడుతుండడం ఒకింత ఆశ్చర్యానికి గురిచేస్తోంది. పాక్‌లో రాజకీయ సంక్షోభం ముదిరిన దరిమిలా, ఇమ్రాన్‌ఖాన్, ఖాద్రీలు ఇరువురు నవాజ్‌ను గద్దె దింపాలని పెద్దఎత్తున ప్రజలతో కలసి నిరసన కార్యక్రమాలను చేపడుతున్నారు. ఈ క్రమంలో పాక్ పగ్గాలు నవాజ్ షరీఫ్ నుంచి పాక్ సైన్యం చేతిలోకి వచ్చినట్టు పుకార్లు వస్తున్నాయి. దశాబ్దాలుగా ఇరుదేశాలు సరిహద్దు ప్రాంతాలలో కవ్వింపు చర్యలకు పాల్పడిన ప్రతి సందర్భంలోను, ఆయా దేశాలలో ఏదో ఒక స్థాయిలో పాలకవర్గం గడ్డు పరిస్థితిని ఎదుర్కొంటుండేది. అధికారంలో ఉన్న రాజకీయ పార్టీలు తమ స్వలాభం కోసం, రాజకీయ లబ్ధి కోసం యుద్ధానికి తెరదీసిన సందర్భాలను ప్రజలు మర్చిపోలేదు. దేశంలోని రెండు రాష్ట్రాలలో ఎన్నికలు సమీపిస్తున్న తరుణంలో మోడీ గొంతు పాక్‌పై కఠినంగా స్పందిచడాన్ని బట్టి, రాజకీయ లబ్ధి కోసం బిజెపి ప్రయత్నిస్తున్నట్టు స్పష్టంగా అర్థమవుతోంది. పాక్‌పై ప్రణాళికా బద్ధంగా భారత ప్రజల్లో తీవ్ర వ్యతిరేకతను క్రమంగా పెంచడంలో రాజకీయ పార్టీలు విజయం సాధించాయి. ఎన్నికల సందర్భంలోనూ, రాజకీయ అనిశ్చితి పరిస్థితుల్లోనూ పాక్‌పై మాటల తూటాలను పేల్చి, సరిహద్దుల్లో యుద్ధ వాతావరణాన్ని కృత్రిమంగా కల్పించడం ద్వారా భారత పాలకవర్గాలు లబ్ధి పొందుతున్నాయి. ఈ క్రమంలోనే భారత ప్రభుత్వం ఫ్లాగ్ మీటింగ్‌ను కోరకుండా ఉండాలని సరిహద్దు భద్రతా దళాలను ఆదేశించాయి. కాల్పుల విరమణను పాక్ తక్షణం పాటించాలని లేనిపక్షంలో భారత్‌లోని ప్రతి యువకుడు పాకిస్థాన్‌కు తగిన జవాబు చెపుతాడని సాక్షాత్తూ కేంద్ర హోంమంత్రి రాజ్‌నాథ్‌సింగ్ మహారాష్ట్ర ఎన్నికల ప్రచారంలో ఉద్రేకపూరిత వాఖ్యలు చేశారు. కాంగ్రెస్ తరహా మెతక వైఖరిని తాము అవలంభించమని, మోడీ స్థాయి ప్రతిస్పందనను పాక్ చవిచూడాల్సి వస్తుందని హెచ్చరించారు. మోడీ గద్దెనెక్కిన తదనంతరం సుమారు 120 సార్లు రెండు దేశాలు పరస్పర కాల్పులు జరుపుకున్నట్టు కేంద్ర ప్రభుత్వం తెలియజేసింది. సెప్టెంబర్ నెలలో జరిగిన ఐరాస సదస్సులోను మోడీ, మధ్యవర్తి ప్రమేయం లేకుండానే పాక్‌తో సానుకూల వాతావరణాన్ని ఏర్పర్చుకుంటామని ప్రకటించి పాక్ పాలకులను ఆశ్చర్యంలో ముంచాడు. పాక్ ప్రధాని అంతకు ముందే భారత్‌కు శాశ్వత సభ్యత్వాన్ని ఐరాసలో ఇవ్వకూడదని ప్రతిపాదన చేసి ఉన్నాడు. పాక్‌లో ప్రజాస్వామ్య యుతమైన ప్రభుత్వాలు గద్దెనెక్కుతున్నప్పటికీ, విదేశీ వ్యవహారాల విషయంలో సైన్యం ఆధిపత్యం ఎక్కువుగా ఉంటుందనేది తెలిసిన విషయమే. నవాజ్ స్నేహహస్తాన్ని చాచినా సైన్యం పడనీయకుండా, తమ ఆధిత్యాన్ని కాపాడుకునే ప్రయత్నం చేస్తూనే ఉంటుంది.

పాక్ మీడియా సైతం భారత్ సైన్యం దురాక్రమణ వల్ల సరిహద్దు గ్రామాల్లోని పాక్ ప్రజలు వలసలు చేపడుతున్నట్టు వార్తలు ప్రసారం చేసింది. భారత్ సైన్యం ఏకపక్ష కాల్పుల వల్ల పాక్ ప్రజలు 9 మంది చనిపోయినట్టు, 15 మంది గాయపడ్డట్టు కథనాలను ప్రసారం చేసింది. వలసపాలనను ఐక్యంగా ఎదిరించిన ఇరుదేశాలు, స్వాతంత్ర్యం సంపాదించి 67 సంవత్సరాలు దాటినా వైషమ్యాలను, వైరుధ్యాలను పరిష్కరించుకోవడంలో  విఫలం అవుతున్నాయి. మొదటి, రెండవ ప్రపంచ యుద్ధ సమయంలో శత్రుశిబిరాల్లో ఉండి లక్షల మంది ప్రజలను చంపుకున్న దేశాలు వాణిజ్యపరంగా ఎంతో మైత్రిని, ఐక్య ప్రగతిని సాధిస్తున్న తరుణంలో, దాయాది దేశాలైన భారత్ – పాక్‌లు పరస్పరం కాలు దువ్వుకోవడం ఇరు దేశాల అభివృద్ధికి శ్రేయస్కరం కాదు. ఇరుదేశాల్లోను పెట్టుబడిదారులు బిలియన్ల డాలర్లను పెట్టుబడిపెట్టి లాభాలను గడిస్తుంటే, ప్రజలు మాత్రం సంబంధం లేకపోయినప్పటికీ పరస్పర విద్వేషాలను పెంచుకుంటున్నారు.

భారత్‌లో మాదిరే పాక్‌లోను ప్రభుత్వం, మీడియా భారత్ కాల్పుల విరమణ ఒప్పందాన్ని ఉల్లఘించినట్టు, ప్రతిగా పాక్ సైన్యం ధీటుగా జవాబిస్తున్నట్టు ప్రకటిస్తున్నాయి. పాక్‌లోను ప్రజలు భారత్ సైన్యం కాల్పులకు మరణించారు. పాక్‌లోని డాన్, అబ్జర్వర్, డెయిలీ పత్రికలు భారత్ సైన్యం కాల్పుల వల్ల పాక్ కుటుంబాలు ఈద్ పండగను సైతం జరుపుకోలేక పోయినట్టు వ్యాఖ్యానించాయి. శరణార్థుల శిబిరాల్లో భారత

ప్రజలు 18 వేలమంది తలదాచుకుంటుండగా, పాక్ ప్రజలు 20 వేల మంది సేదతీరుతున్నట్టు వార్తలు వస్తున్నాయి. అధీనరేఖ వెంబడి 2003 వరకు ఇరుపక్షాలు ప్రతిరోజు కాల్పులతో మునిగి తేలుతుండేవి. సైన్యం, పౌరులు ఇరుదేశాల్లో మరణిస్తుండడంతో కాల్పుల విరమణ ఒప్పందాన్ని చేసుకున్నారు. అంతర్జాతీయ సరిహద్దులను పాక్ అంగీకరించడం లేదు. వర్కింగ్ బౌండరీగానే పాక్ దాన్ని గుర్తిస్తోంది. కాల్పుల విరమణకు తూట్లుపడిన సందర్భంలో కొన్ని రక్షణ ప్రక్రియలను ఇరుదేశాలు ఏర్పర్చుకున్నాయి. హాట్‌లైన్ ఏర్పాటు, కమాండర్ల మధ్య సమావేశాలు, ఫ్లాగ్ సమావేశం తదితరవి ఆ కోవలోకే వస్తాయి.

నవాజ్ ప్రస్తుతం ఏమీ చేయలేని స్థితిలో ఉన్నాడు. కాబట్టి, మోడీనే చర్చలకు పిలుపునివ్వాల్సిన అవసరం ఉంది. కార్పొరేట్ల మద్దతుతో గద్దెనెక్కిన మోడీ వారి ప్రయోజనాలను కాపాడాల్సిన బృహత్తరమైన కార్యక్రమాన్ని భుజాన వెసుకున్నారు. అందులో భాగంగానే అన్ని రంగాలలోను 49 శాతం పైగా ఎఫ్‌డిఐలను ఆహ్వానించారు. రక్షణ రంగంలోకి మరింత పెట్టుబడులు ఆహ్వానించాలంటే ఉన్న ఆయుధాలను ఖర్చు చేయాల్సిన అవసరం ఉంది. ఆ క్రమంలోనే మందుగుండు సామగ్రిని, క్షిపణులను, రాకెట్లను పెద్దఎత్తున పాక్‌పై యుద్ధం ముసుగులో ఖర్చు చేస్తున్నట్టు వార్తలు వస్తున్నాయి. అవినీతి, అధిక ధరలు, ద్రవ్యోల్బణం, అసమానత, దారిద్ర్యంతో నీరుగారుతున్న పాక్ ప్రజానీకం ప్రభుత్వంపై వ్యతిరేకతతో ఉన్నారు. వారి దృష్టిని మరల్చడానికి, నవాజ్, సైన్యంతో కలసి భారత్‌పై కాల్పులకు తెగపడినట్టు వస్తున్న వార్తలు భారత్ మీడియాలో హల్‌చల్ చేస్తున్నాయి.

లైన్ ఆఫ్ కంట్రోల్ (ఎల్‌ఒసి) భారత్‌లోని జమ్ము - కశ్మీర్‌ను, పాక్‌లోని ఆజాద్ కశ్మీర్‌ను వేరు చేస్తోంది. ఉత్తరం వైపున్న వాఘారేఖ పంజాబ్ రాష్ట్రాన్ని, పాక్ పంజాబ్ ప్రావిన్సును వేరుచేస్తోంది. దక్షిణాన జీరో పాయింట్ లైను ఉంది. 1947 నాటి కృత్రిమ రాడ్‌క్లిఫ్‌లైను ప్రాతిపదికన ప్రస్తుత అధీనరేఖ గీయబడిందని పాక్ భావిస్తోంది. 1947 నుండి భౌగోళిక సరిహద్దుపరంగా ఇరుదేశాలు చాలాసార్లు యుద్ధాలు చేసుకున్నాయి. 2,900 కి.మీ. సరిహద్దు వెంబడి ఇరు దేశాల మధ్య విభేదాలున్నాయి. రాడ్‌క్లిఫ్‌లైను 1947 ఆగస్టు 17న విభజన సందర్భంగా ముద్రించబడింది. దీన్నే సర్ సిరిల్ రాడ్‌క్లిఫ్‌లైనుగా గుర్తిస్తారు. బోర్డర్ కమిషన్‌కు చైర్మన్‌గా వ్యవహరించిన ఇతను 1,75,000 స్క్వేర్ మైల్స్‌ను 88 మిలియన్ ప్రజలను విభజనకు గురిచేశాడు. భారత్‌లోని 40 శాతం భూభాగం స్వాతంత్ర్యానికి మునుపే ప్రిన్స్‌లీ స్టేట్స్‌గా వ్యవహరించబడేవి. వీరు బ్రిటిష్ అధీనంలో ఉండేవారు కాదు. భారత్ - పాక్‌లకు స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత, ఈ ప్రాంతంలోని ప్రజలు తమకిష్టమొచ్చిన దేశంలో చేరిపోయారు. కొంతమంది ఎటు చేరకుండా ఉండిపోయారు. బలవంతంగా ఇరు దేశాలు గీసుకున్న కృత్రిమ భౌగోళిక సరిహద్దులో భాగంగా సుమారు 14 మిలియన్ ప్రజలు తమ భూభాగాలను, స్వంత ఇండ్లను కోల్పోవాల్సి వచ్చింది.

ఈ క్రమంలో 98 శాతం ముస్లిమేతరులున్న చిట్టిగాంగ్ హిల్‌ట్రాక్స్ పాక్ భూభాగంగా గుర్తించబడ్డాయి. బెంగాల్‌లోని ముర్షీబాద్, మాల్డా ప్రాంతాలు పాక్‌కు ఇవ్వబడ్డాయి. 91.8 శాతం ముస్లింలు ఉన్న బెలూచిస్థాన్, 72.7 శాతం ముస్లింలున్న సింధ్, బెంగాల్‌లోని ఈశాన్య ప్రాంతం (54.4 శాతం ముస్లింలు), పంజాబ్‌లోని వాయువ్య ప్రాంతం (55.7 శాతం ముస్లింలు) విభజన సందర్భంగా, పాక్‌లో చేర్చబడ్డాయి. 97 శాతం బుద్ధిస్టులున్న చిట్టిగాంగ్ ప్రాంతం పాక్‌లో ఉండడం ఇష్టం లేకపోవడంతో అక్కడి ప్రజలు తాము భారత్‌తో ఉంటామని విజ్ఞప్తి చేశారు. ఇదే తరహాలో బెంగాల్‌లోని గుర్దాస్పూర్, మాల్డా, కుల్నా, ముర్షిదాబాద్ ప్రాంత ప్రజలు తాము భారత్‌లో ఉండే దానికే ఎక్కువ ఇష్టపడుతున్నట్టు ప్రకటించారు.

పాకిస్థాన్ - భారత్ మధ్య ఉన్న నియంత్రణ రేఖను ఆసియా బెర్లిన్ గోడగా పరిగణిస్తారు, జమ్ము కశ్మీర్ గూండా పోయే ఈ రేఖకు ఇప్పటి వరకు చట్టబద్ధత లేదు. ఈ రేఖ వెంబడి కాల్పుల విరమణను సిమ్లా ఒప్పందంలో భాగంగా 1972 జూలై 7న నుండి ఇరు దేశాలు పాటిస్తున్నాయి. భారత్‌లో ఉన్న భూభాగాన్ని జమ్ము - కశ్మీర్‌గా, పాక్‌లో ఉన్న భూభాగాన్ని గిల్జిత్ బల్తిస్థాన్, అజాద్ జమ్ము - కశ్మీర్‌గా పరిగణిస్తున్నారు. నియంత్రణరేఖ వెంబడి భారత్ సైనికులు పాతిపెట్టిన మందుపాతరల వల్ల సాధారణ ప్రజలు ఎంతో మంది తమ ప్రాణాలను కోల్పోయారు. వందలాది మంది వికలాంగులుగా మారిపోయి, ఇప్పటికీ భారత ప్రభుత్వంతో నష్టపరిహారం కోసం పోరాడుతున్నారు.

కశ్మీర్‌ను నియంత్రణ రేఖ (ఎల్‌ఒసి) రెండు భాగాలుగా విభజిస్తుంది. దీనికి కశ్మీర్‌లోయ నుండే ఒకే మార్గం ఉంది. జెహ్లుమ్ లోయవైపు దారి పూర్తిగా మూసివేయడంతో ఈ పరిస్థితి వచ్చింది. 2008లో కశ్మీర్‌లోని హిందూ అతివాదులు శ్రీనగర్ - జమ్మూ జాతీయ రహదారిని మూసివేశారు. కశ్మీర్ లోయకు వెళ్లే ఈ దారి మూసివేయడంతో కశ్మీరంతా తీవ్ర ఉద్రిక్తతలు చోటు చేసుకున్నాయి. దీనికి ప్రతిగా షేక్ అబ్దుల్‌అజీజ్, 2 లక్షల మంది నిరసనకారులతో నియంత్రణరేఖను ముజాఫర్‌బాద్ వైపు దాటడానికి ప్రయత్నించాడు. నిరసనకారులపై భారత్ సైన్యం కాల్పులు జరపడంతో 15 మంది మరణించడమే గాకుండా వందలమంది గాయపడ్డారు. నియంత్రణ రేఖను వెంటనే రద్దు చేయాలని కశ్మీర్‌కు స్వయంప్రతిపత్తి ఇవ్వాలనే డిమాండ్ ఈ నేపథ్యంలో బలం పుంజుకుంది.

1933 పాకిస్థాన్ డిక్లరేషన్ ప్రకారం జమ్ము - కశ్మీర్‌ను ఈశాన్య రాష్ట్రాలుగానే పరిగణిస్తూ, వాటిని పాకిస్థాన్‌లో అంతర్భాగంగానే చూడాలని ప్రకటించింది. ఇప్పటికీ ముస్లిం మెజారిటీ జమ్ము - కశ్మీర్‌లో ఎక్కువుగా ఉంది. కాబట్టి, భారత్‌లోని కశ్మీర్ భూభాగం కూడా తమదేనని పాక్ అంతర్జాతీయ వేదికలలో చెప్పుకుంటోంది. జమ్ము-కశ్మీర్ మహారాజు హరిసింగ్, గవర్నర్ జనరల్ లార్డ్ మౌంట్ భారత్ చేసిన సహాయానికి ప్రతిఫలంగా జమ్ము - కశ్మీర్‌ను భారత్‌లో కలపడానికి అంగీకరించాడని, అందువల్ల పాక్‌లోని ఆజాద్ కశ్మీర్‌తో సహా, జమ్మూకశ్మీర్ మొత్తం భారత్‌దేనని, భారత్ ప్రకటిస్తోంది. ఆ ప్రకారం 550 కి.మీ నియంత్రణ రేఖ వెంబడి ఫెన్సింగ్ వేసింది. 1972 నియంత్రణరేఖ ననుసరించి, వివాదాస్పద సరిహద్దు వెంబడి 740 కి.మీ పొడవునా ఫెన్సింగ్ వేసింది. దీన్ని పాకిస్థాన్ తీవ్రంగా వ్యతిరేకించింది. జమ్మూకశ్మీర్ సరిహద్దు ఫెన్సింగ్‌ను 2014 సెప్టెంబర్ 30 నాటికి భారత్ పూర్తి చేసింది. ఫెన్సింగ్ వల్ల 80 శాతం మిలిటెంట్ల చొరుబాట్లను భారత్ అడ్డుకున్నట్లు ఆర్మీ ప్రకటించింది. ఇది అమెరికా తీర్మానానికి విరుద్ధమని, పాక్ సమ్మతి లేకనే, వివాదాస్పద సరిహద్దులో భారత్ ఫెన్సింగ్ వేసుకోవడం అంతర్జాతీయ న్యాయ సూత్రాలకు వ్యతిరేకమని పాక్ ఆందోళన వ్యక్తం చేస్తోంది.

సరిహద్దు వెంబడి నియంత్రణ రేఖకు సంబంధించి రెండు దేశాలు పరస్పరం ఒక అంగీకారానికి ఇప్పటి వరకు రాలేకపోయాయి. ఐరాసతో పాటు అమెరికా, ఐరోపా దేశాలు పలుసార్లు మధ్యవర్తిత్వాన్ని నెరపడానికి

# శ్రీలంకలో ఎల్‌టిటిఇ

***పౌరహక్కుల నేత* కె.జి. కన్నబిరాన్ *ఇంగ్లిష్‌లో రాసిన ఈ వ్యాసాన్ని మరొక పౌరహక్కుల నేత బి. చంద్రశేఖర్ తెలుగు చేశారు. ఇంతకాలం అముద్రితంగా ఉండిపోయిన ఈ వ్యాసాన్ని వారి స్మృతిలో ప్రచురిస్తున్నాం.***

'శ్రీలంకలో తమిళుల ఊచకోత యుద్ధంలో ప్రభాకరన్‌ను నిస్సంతుగా సంహరించడం పూర్తికాగానే రాజపక్షే శ్రీలంక నేలను ముద్దాడాడు. ఇప్పుడిక సింహళుల షరతులకు లోబడి తమిళులు బానిసల్లా బతకాలి. లేదా చావాలి. తమిళ తిరుగుబాటుకు భవిష్యత్ తలుపులు తెరిచే ఉంచింది. ప్రభాకరన్ చంపబడ్డాడు. కాని శ్రీలంక తమిళ సమస్య అతనితో పాటు మరణించింది అని అనుకోవడం పిచ్చితనం. సమస్య పరిష్కారాన్ని హింసాపూరితంగా వాయిదా వేశారు అంతే'.

శ్రీలంక హింసాత్మక పరిణామాలు, ఎల్‌టిటిఇ దుర్గతి, ప్రభాకరన్ మరణం ఇవన్నీ చూస్తుంటే హనా ఆరెంట్ విప్లవం గురించి రాసిన విషయాలు గుర్తుకొస్తున్నాయి. 'సామాజిక సమస్యలను రాజకీయ సాధనాలతో పరిష్కరించే ప్రతి యత్నం బీభత్సానికి దారి తీస్తుంది. అదే బీభత్సం విప్లవాలను దుర్గతి పాలు చేస్తుంది. గత విప్లవాల చరిత్ర ఎలాంటి సందేహానికి తావు లేకుండా దీన్ని నిరూపించింది. అయినప్పటికీ దారిద్ర్యం తాండవించే చోట విప్లవం ప్రారంభమైతే ఈ ప్రాణాంతక తప్పిదం చేయకుండా ఉండడం దాదాపు అసాధ్యమనే విషయాన్ని కాదనలేం'. హనా ఆరెంట్ అనుభవ వాద అంచనా హింసాత్మక విప్లవ పర్యవసానాలను సరిగ్గా ప్రతిపాదించింది.

మైనారిటీ ప్రజల హక్కుల కోసం, వారి గుర్తింపు కోసం జరిగే ఉద్యమం ఎలా ఎందుకు పతనమవుతుంది? సామాజిక సమస్యలపై ఉద్యమించేందుకు ప్రజలను పురికొల్పే బలమైన కారణాలు ఏమిటి? విప్లవం దానికదే వస్తుందా లేక ఒక తిరుగుబాటు విప్లవంగా పరిపక్వమయ్యేందుకు సుదీర్ఘకాలం పడుతుందా?

మనకు మైనారిటీ సమస్య వచ్చి పాకిస్థాన్ ఏర్పాటుకు దారితీసి రక్తపాతం సృష్టించినట్టుగానే అన్ని మైనారిటీ సమస్యల్లాగానే శ్రీలంక తమిళుల సమస్య కూడా వలస పాలన అనంతరమే ప్రారంభమైంది. శ్రీలంక కూడా మనలాగే గతంలో బ్రిటిష్ వలస. అధికార మార్పిడి జరిగే సమయానికి సింహళ జాతి మైనారిటీ ప్రజలతో పాటుగా అనేక రకాల మైనారిటీ ప్రజలు ఉన్నారు. లంక తమిళులు తేయాకు తోటల్లో పనిచేసే భారత సంతతి తమిళులు, తూర్పు భాగంలో నివసించే ముస్లింలు. ఆంగ్లో – సింహళీయులు (బర్ఘర్‌లు) ఉన్నారు. ఫలితంగా 1930ల నాటికే సింహళ సమాఖ్య ఏర్పడాలనే భావన నెలకొంది. కానీ, దాన్ని ఎవరూ అంతగా పట్టించుకోలేదు. పొన్నాంబళం నేతృత్వంలోని తమిళ కాంగ్రెస్ తమిళులకు సింహళీయులతో సమాన ప్రాతినిధ్యం కోసం పార్లమెంట్‌లో పోరాడింది. తమిళ మైనారిటీలు 30 శాతంగా ఉన్నప్పటికీ మెజారిటీ జాతితో సమానంగా ప్రాతినిధ్యం కోసం, సాధికారతకోసం పోరాడారు.

దురాక్రమణ అనంతరం బ్రిటిష్‌వారు శ్రీలంకపై ఇతర వలసల్లో చేసిన విధంగానే పరిపాలనా సమగ్రతను రుద్దారు. మెరుగైన విధంగా దోపిడికి పాల్పడేందుకై వారు తమ వలస ఏలుబడిలో ఉన్న వేర్వేరు ప్రజలను ఏకం చేశారు. పరిపాలనా పరంగా ప్రజలంతా సమానులే. అలా చూడబడిన ప్రజలు తమ జాతి, భాష విభేదాలను పక్కనబెట్టి బ్రిటన్ దోపిడికి వ్యతిరేకంగా పోరాడారు. విభిన్న జాతులున్న ఆ దేశాన్ని వలసవాదులు వదిలేసే నాటికి తమను తాము ఒక జాతిగా భావించుకోవడాన్ని కొనసాగించడం లాభదాయకమని ప్రజలు భావించారు. అందరూ కలసి సామరస్యంగా జీవించేందుకు అవసరమైన సూత్రాలను రూపొందించుకుందామనే ఆలోచనే లేదు. తర్వాతి కాలంలో సమాన హోదాతో వివిధ జాతుల ప్రజలు కలిసి జీవించడం సమస్యగా మారింది. అప్పటి వరకు ఉమ్మడి శత్రువైన అప్రతిహత విదేశీ దోపిడికీ వ్యతిరేకంగా పోరాడుతున్నప్పుడు ఈ సమస్య ఊహకందలేదు. వలస పాలనలో ఉన్న ప్రజలంతా పాలితులుగా పాలకుల దృష్టిలో సమానులే. రాజ్యాంగ అర్థంలో కాదు. కానీ, సమస్యలు తర్వాత తీవ్రంగా బయట పడ్డాయి.

స్వాతంత్ర్యానంతర శ్రీలంకలో సింహళ పాలక వర్గాల వివక్షకు తమిళులు, ఇతర మైనారిటీలు గురయ్యారు. 1948లో వచ్చిన పౌర చట్టం, తర్వాత వచ్చిన పార్లమెంటరీ ఎన్నికల (సవరణ) చట్టం జనాభాలో పది శాతంగా ఉన్న తేయాకు తోటల్లో పనిచేసే తమిళ కార్మికులకు పౌరసత్వాన్ని, వోటు హక్కును రద్దు చేశాయి. ఫలితంగా తమిళ పార్టీల శక్తి హరించింది. వాటికి పరిపాలనలో పాత్ర కుంచించుకు పోయింది. దాన్ని పరిశీలిస్తే లూయీ బోనపార్టీ 18వ బ్రూమేర్ మరోసారి కొన్ని సవరణలతో ప్రదర్శితమైందని తెలుస్తుంది. ఈ క్రమానికి వామపక్షాలు సైతం ఇచ్ఛా పూర్వక భాగస్తులే. భారతదేశం నుంచి రప్పించబడిన శ్రామికులను ఎంతోకాలంగా సింహళంలోని తేయాకు తోటల్లో పని

ముందుకు వచ్చినప్పటికీ సఫలం కాలేదు. ఇరుదేశాలు తమ భూభాగాన్ని పొరుగు దేశాన్ని ఆక్రమించిందని, తిరిగి ఆ భూభాగం తమకివ్వాలని దశాబ్దాలుగా సరిహద్దు వెంబడి కవ్వింపు చర్యలకు దిగుతూ, పరస్పరం కాల్పులు జరుపుకుంటున్నాయి. ఈ నేపథ్యంలో సరిహద్దు ప్రాంతాల్లోని ప్రజలు తమ ప్రాణాలను కోల్పోవడమేగాక, నిత్యం భయాందోళనలతో

గడుపుతున్నారు. ఇరుదేశ పాలక వర్గాలు సున్నితమైన ఈ అంశాన్ని తమ స్వార్థ రాజకీయ ప్రయోజనాల కోసం వాడుకుంటూ, సామరస్యమైన పరిష్కారం కోసం చిత్తశుద్ధితో ప్రయత్నించకపోవడంతో కాలంతో పాటు సమస్య జటిలమవుతోంది.

*(రచయిత పౌరహక్కుల కార్యకర్త)* వీ

చేస్తున్నప్పటికీ విదేశీ మారక ద్రవ్యానికి ప్రధాన వనరు అయినప్పటికీ సింహళ పౌరులకు మాత్రమే వోటు హక్కును పరిమితం చేశారు. తమిళులకు ఈ విధంగా వోటుహక్కు నిరాకరించడంపై న్యాయస్థానాల్లో నడిచిన వ్యాజ్యాల్లో సింహళ ప్రభుత్వమే విజేత. ఈ సమస్యను భారత, సింహళ ప్రభుత్వాలు రాజకీయం చేశాయి. అంతిమంగా, సిరిమావో, ఇందిరాగాంధీల మధ్య ఒక అవగాహన కుదిరింది. ఫలితంగా నాలుగు శాతం మందిని శ్రీలంకలో ఉండనిచ్చి మిగిలిన భారత తమిళ కార్మికులను మన దేశానికి పంపేశారు. తర్వాత కూడా శ్రీలంక మైనారిటీ తమిళుల సమస్య అపరిష్కృతమే. సమస్యలను సొమ్ము చేసుకునే లేదా నాచ్చే రాజకీయ నేతలే శ్రీలంక తమిళ రాజకీయాలకు హింసపై నమ్మకం కలిగేందుకు కారకులు. యాభై శాతం సీట్ల కోసం డిమాండ్ చేస్తున్న శ్రీలంక తమిళ పార్టీలు తమిళులకు వోటుహక్కు నిరాకరణతో పది శాతం వోట్లను కోల్పోయాయి. మరింతగా కుంచించుకుపోయిన మైనారిటీ తమిళుల సమాన స్థాయి కోసం, సమాన అవకాశాల కోసం తమిళ సంస్కృతి, అస్తిత్వాల పరిరక్షణ కోసం సరికొత్తగా పోరాటం ప్రారంభించాల్సి వచ్చింది. పార్లమెంటరీ రాజకీయ సౌఖ్యంలో ఓలలాడే నేతలు తమిళ మైనారిటీ సమస్యను పట్టించుకోలేదు. తక్షణ సమస్యలను వాయిదా వేసే తీర్మానాల్లో పార్లమెంటరీ రాజకీయ ప్రక్రియకు నమ్మకం ఉంటుంది. మైనారిటీ తమిళుల సమస్య ఈలం సమస్యగా, హుందాగా జీవించే హక్కుకు సంబంధించిన సమస్యగా మారడంలో అన్ని జాతీయ పార్లమెంటరీ పార్టీలకూ, వామపక్ష కూటములకూ పాత్ర ఉంది. సమస్యను దాటవేయడం దాడుల పరంపరకు విధ్వంసానికి దారి తీస్తుంది. పలుమార్లు ప్రజా నిరసన వ్యక్తమై క్రమంగా హింసాత్మకంగా మారింది. దాన్ని నివారించేందుకు సాధారణ దండనా శాసనాలు చాలవనుకున్నారు. బ్రిటిష్ వారిని అనుకరిస్తూ 1974లో టెర్రరిస్టు చట్టం తెచ్చారు. రెండేళ్ల తర్వాత దాన్ని రద్దు చేశారు. మళ్లీ 1978లో తిరిగి అదే చట్టాన్ని తెచ్చారు. ఈ దుశ్శాసనాల దౌర్జన్యం శాంతియుత పరిష్కారానికి ఉన్న అవకాశాలను మృగ్యం చేశాయి. మైనారిటీలుగా గుర్తింపు నిరాకరణ, సమాన స్థాయి తిరస్కృతి సాయుధ సంఘర్షణకు దారి తీసింది. ఆ తర్వాత దైనిక జీవితం రక్త పాతమయం భరించశక్యం కాని అణచివేత. వివక్ష రాజ్యమేలాయి. ఈలం ఒకటే తమిళులకు శరణ్యంగా మారింది.

ప్రభాకరన్ సాయుధ తిరుగుబాటును ఎంచుకున్నప్పుడు ఆ నిర్ణయం ప్రాణాంతకమని అందరూ అనుకున్నదే. హింసామార్గం చేపట్టక ముందు తమిళులపై అత్యాచారాలనూ, హింసనూ ప్రజలు ఖండించేవారు. ఎల్‌టిటిఇ హింసామార్గం వల్ల పరిస్థితి మారింది. చట్ట వ్యతిరేక నిర్బంధాల పెచ్చు పెరిగినప్పటికీ బాధితులకు సహాయం చేయడానికి ఎవరూ ముందుకు రాని స్థితి నెలకొన్నది. ఏర్పాటువాదులు ప్రభుత్వ ఆస్తులు లక్ష్యంగా దాడులు చేస్తారు. పౌర ప్రజానీకానికి వ్యతిరేకంగా హింసను ప్రయోగిస్తారు. విధ్వంసం, రక్తసిక్త మృతదేహాలు, బాంబు విస్ఫోటనానికి మాంసపు ముద్దలుగా ఎగిసి పడ్డ దేహ భాగాలు మీడియా ద్వారా ప్రదర్శితమవుతాయి. ఏర్పాటువాదుల హింస మాత్రమే హింసగా ప్రకటితమవుతుంది. ప్రభుత్వ సాయుధ బలగాల హింస హింసగా గుర్తించబడదు. ఒకరిది అధికార హింస. మరొకరిది అధికారం కోసం హింస. నడమంత్రపు విశ్లేషణల్లో మృత్యువు. విధ్వంసం మాత్రమే ప్రకటితమవుతాయి. అలా ఎల్‌టిటిఇ పట్ల వ్యతిరేకతను ప్రపంచంలో పాదుకొల్పారు.

సాయుధ పోరాటం సుదీర్ఘ కాలం కొనసాగితే, ఉద్యమంలో ఎదుగుదల లేకపోతే అంతర్గత విభేదాలు పొడుసూపుతాయి. ఉద్యమ లక్ష్యం పట్ల సానుభూతి ఉండే నాయకులు హింసను ఉపయోగించే తీరు పట్ల విభేదాలు వ్యక్తం చేసే వ్యక్తుల చిత్తశుద్ధిపై సందేహాలు వ్యక్తమవుతాయి. ఈ కారణాల వల్లే తూర్పు శ్రీలంకలో ఉన్న ముస్లింల మద్దతును, సింహళ గ్రామీణుల మద్దతును తమిళ ఉద్యమం కోల్పోయింది. తమిళుల సంకుచిత దురహంకారం సింహళ గ్రామాలపై దాడులు చేయించింది. సింహళముల ఎదురు దాడులకు అది కారణమైంది. ఉదారవాద సింహళ ప్రజాభిప్రాయం కూడా తమిళ ఉద్యమానికి దూరంగా జరిగింది. తమిళులపై శ్రీలంక ప్రభుత్వ హింసను సింహళీయులు అర్థం చేసుకోని పరిస్థితి ఏర్పడింది.

'బ్రోకెన్ పాల్మైరా' పేరిట జాఫ్నా విశ్వవిద్యాలయానికి చెందిన ఐదుగురు ఆచార్యులు ఈ క్రూరజాతి ఘర్షణ రక్తసిక్త చరిత్రను అధ్యయనం చేశారు. హింసామార్గం పర్యవసానాలను తమ నివేదికలో ఎత్తి చూపారు. హింసవల్ల సత్యంలో వికృతమవుతున్నాయనీ, హేతుబద్ధ చర్చ అసాధ్యం అయిందనీ పేర్కొన్నారు. తమిళుల పోరాటం పట్ల సానుభూతిపరులైన ఈ మేధావులు తమిళ విముక్తి పోరాటం తీరుపట్ల కొన్ని విభేదాలతో దాని నుంచి దూరం అయ్యారు. 'హింసతో ఉన్న సమస్య దాని స్వభావంలోనే ఉంది. అనివార్యంగా మరింత హింసాత్మ కంగా పురోగమించడమే దాని స్వభావం. అదే అసలు సమస్య. తనను ప్రయోగించిన వారిని హింస క్రూరులుగా మారుస్తుంది. అభిప్రాయ భేదాల పట్ల కొట్టొచ్చినట్టు కన్పించే అసహనాన్ని పెంపొందిస్తుంది. నమ్మిన వారి పట్ల అపారమైన మూఢ విశ్వాసాన్ని రేకెత్తిస్తుంది. నాయకత్వం పట్ల గుడ్డి విధేయతను నెలకొల్పుతుంది. నాయకత్వం తప్పుచేయదన్న నమ్మకాన్ని కలిగిస్తుంది. ఇతరుల బాధల పట్ల, జీవితంపట్ల నిర్లక్ష్యాన్ని పాదుకొల్పుతుంది' అని రాశారు. పోరాటంలో పాల్గొంటున్న ఇరు పక్షాల వాళ్లూ, వాళ్ల దళాధిపతులూ, అప్రజాస్వామిక ప్రభుత్వ ప్రతినిధులూ అధికార దుర్వినియోగానికి పాల్పడిన వాళ్లే లేదా దాన్ని సమర్థించే వాళ్లే' అని నివేదికలో ఆరోపించారు. కొత్త దాడులకు సమాయత్తమయ్యేందుకు అవసరమైన విరామం కోసమే శాంతి చర్చలను వాడుకున్నారని కూడా నివేదిక పేర్కొంది.

నిజాయితీతో కూడిన అభిప్రాయ భేదం మరణానికి దారి తీయ రాదు. 'బ్రోకెన్ పాల్మైరా' రచయితలో ఒకరైన రాజన్‌థిరనగా 1989 సెప్టెంబర్ 21న కాల్చి చంపబడ్డాడు. హింస గురించిన సందేహాలను నిజాయితీగా ప్రకటించిన పాపానికి ఆయనను మృత్యువు కాటేసింది. ప్రభుత్వంతో కుమ్మక్కయ్యారనో, ఇన్‌ఫార్మెంట్లనో, ఉద్యమానికి విధేయులుగా లేరనో ఆరోపించి ప్రజలను చంపారు. రాజన్‌థిరనగా కూడా అలాంటి మృతుల్లో ఒకడు.

ప్రపంచాన్ని కేవలం వ్యాఖ్యానించడం కాదు మార్చాలని చెప్పాడు మార్క్స్. అధికారంలో ఉన్నవారు దాన్ని తేలికగా వదులుకోరు. సామాజిక చట్టాన్ని మార్చనివ్వరు. న్యాయబద్ధమైన సమాజాన్ని నిర్మించనివ్వరు. ఇదంతా హింసా పూర్వకంగానే సిద్ధించగలదు. అసమాన, అన్యాయ సమాజాలు ఉన్నంత వరకూ విప్లవోద్యమాలు ఉంటాయి.

తమిళ ప్రజలు ఆధారపడిన సంస్థగా ఎల్‌టిటిఇ రూపొందే నాటికి కమ్యూనిస్టు ప్రయోగం విఫలమైంది. సమాజ పునర్నిర్మాణ సాధనంగా సాయుధ తిరుగుబాటు సందేహాస్పదమైంది. ఎల్‌టిటిఇ హింస ఎలాంటి పురోగతి సాధించలేకపోయింది. ఐక్యరాజ్యసమితి ఈ విషయంలో

ఎలాంటి జోక్యం చేసుకోలేదు. అంతర్జాతీయ ప్రక్రియను ప్రారంభించలేదు. పౌర అంతర్యుద్ధానికి కారణాలను అన్వేషించి పరిష్కరించే యత్నం చేయలేదు. ఎల్‌టిటిఇ నే శాంతి చర్చలకు చొరవ తీసుకుంది. దాని ప్రతినిధి 'ఆంటోనీ బాలసింగం చొరవతో ఆ ప్రక్రియ ఒక దశాబ్ది కాలం కొనసాగింది. కానీ, పరిష్కారం దిశగా ఏ పురోగతి సాధించలేక పోయింది.

శాంతి ప్రక్రియ, అంతకు ముందు కాల్పుల విరమణ కోసం చేసిన ప్రయత్నాలు కూడా మారణకాండ కొనసాగింపుకు, ఇరు పక్షాలకూ వీలు కల్పించాయి. తమిళులు మానవ బాంబులుగా మార్చబడ్డారు. ఆ ఘటనలు ఉద్యమానికి సానుభూతిని తగ్గించాయి. వివాదానికి సంబంధంలేని ప్రజలు పెద్దసంఖ్యలో ఈ జాతి హనన యుద్ధంలో చంపబడ్డారు. ఎక్కువగా చంపబడింది తమిళులే. ఎందరో యోధులను ఉద్యమం కోల్పోయింది. తగినంత మంది మనుషులులేక పిల్లలను సైతం తమిళ ఉద్యమం ఉపయోగిస్తున్నదని పుకార్లు వచ్చాయి. ఎల్‌టిటిఇ హింసకు ప్రజల్లో చెడ్డ పేరు వచ్చింది. ఎంత ప్రభావితంగా ప్రభాకరన్ తమిళ ఈలం కోసం పోరాడినప్పటికీ హింసే ఒక లక్ష్యంగా మారినప్పుడు సింహళ సైన్యంతో పోలిస్తే ఆయనకున్నది పిడికెడు మంది తమిళ యోధులే. వారే తీవ్ర యుద్ధంలో ఏళ్ల పాటు శ్రమించాల్సి వచ్చింది.

సమస్య పరిష్కారానికి తాను ఎంచుకున్న పద్ధతే సరైనదని విజేత ఢంకా బజాయిస్తాడు. భవిష్యత్ తరాలకు తమిళుల వివాదాన్ని వాయిదా వేయగలగడమే తన విజయానికున్న పరిమితి అని విజేతకు కూడా కచ్చితంగా తెలుసు. తమిళ హక్కులకు ఏమాత్రం ఆస్కారం లేని కాఠిన్యాన్ని అధ్యక్షుడు రాజపక్షే ప్రదర్శించాలి. లేదా ఆయన పదవి భ్రష్టుడవుతాడు. రెండవ ప్రపంచ యుద్ధంతో సహా చరిత్ర చెప్పిన పాఠాలకు విరుద్ధంగా సింహళీయులు మొండి తనం ప్రదర్శిస్తున్నారు. శ్రీలంక రాజ్యాంగం ప్రకారం అది బౌద్ధరాజ్యం. ప్రపంచానికి సమానత్వ భావనను, అహింసను అందించిన మహా తాత్వికుడు బుద్ధుడు. బీభత్సయువ కళింగ యుద్ధం అనంతరం అశోకుడు బౌద్ధ మతాన్ని స్వీకరించాడు. బౌద్ధ మాటావలచకుడై కూడా రాజపక్షే యుద్ధ బీభత్సాన్ని సృష్టించాడు. ఎంత తేడా! రెండు వేల సంవత్సరాల అనంతరం మనకు తెలిసిన బౌద్ధ రాజ్యం బుద్ధుడి బోధనలను విస్మరించింది. మూడు దశాబ్దాలుగా తమిళులపై మారణకాండను కొనసాగిస్తున్నది. కొన్నేళ్ల క్రితం నేను కొలంబో వెళ్లినప్పుడు ఒక బౌద్ధ సన్యాసిని ఇదే విషయం అడిగాను. అతని జవాబు నన్నాశ్చర్యపరిచింది. 'బౌద్ధులు అహింస పాటించాల్సింది సాటి బౌద్ధుల పట్ల తప్ప బౌద్ధేతరుల పట్ల కాదు' అన్నాడతను. ఒకసారి మతాన్ని రాజకీయ ఎజెండాతో జోడిస్తే దానిలో ఉన్న మానవతా సారం ఎలా నీరు గారుతుందో ఆయన చెప్పక చెప్పాడు.

తీవ్రమైన యూదు వ్యతిరేకత మీద హిట్లర్ రాజకీయాలు అధారపడ్డాయి. ప్రపంచ ప్రజలపై యూదులు కుట్ర చేస్తున్నారని దుష్ప్రచారం చేశాడు. అంతిమ పరిష్కారాన్ని రూపొందించాడు. యూదుల ఊచకోతకు వ్యతిరేకంగా రెండవ ప్రపంచ యుద్ధం జరిగింది. ఆ రోజుల్లో పది లక్షల మందికి పైగా యూదులను ఆస్విజ్‌గౌస్ ఛేంబర్‌లో ఒక పద్ధతి ప్రకారం సంహరించారు. అలాంటిది సింహళ దేశంలో పునరావృతమై ప్రభాకరన్ మరణంతో ముగిసింది. ఈ బీభత్స రాజ్యనేతలు విజయ గర్వంతో నేలను ముద్దాడారు.

రెండవ ప్రపంచ యుద్ధానంతరం హిట్లర్, ముసోలినీ ఫాసిస్టు రాజ్య పాలనను దృష్టిలో పెట్టుకునే ఆ తర్వాత రాయబడిన భారత, సింహళ రాజ్యాంగాల్లో సమానత్వం కోసం సవివరమైన పథకాన్ని చేర్చారు. బహుళ సమాజాలకు పరిపాలనా సూత్రాలను రూపొందించారు. సింహళం కూడా రెండవ ప్రపంచ యుద్ధానంతరం విముక్తమైన వలసదేశం. దానికీ ఆధునిక రాజ్యాంగం ఉంది. తనను తాను సోషలిస్టు రాజ్యమని చెప్పుకుంది. కానీ, పరిస్థితి పూర్తి భిన్నంగా అమలు అవుతోంది. దాన్ని నిరసించిన ప్రజాగొంతుకను నొక్కేస్తున్నారు. తిరుగుబాట్లను హింసాయుతంగా అణచివేస్తున్నారు.

రెండవ ప్రపంచ యుద్ధానంతరం ఐరాస ప్రపంచ దేశాలకు ఒక ఆభరణాన్ని అందించింది. అదే అంతర్జాతీయ మానవహక్కుల ప్రకటన. దాని పీఠికలో ఇలా ఉంది. 'నిరంకుశత్వానికి, పీడనకి వ్యతిరేకంగా మనుషులు చివరి యత్నంగా హింసకు పూనుకొనకుండా ఉండేందుకోసం, తిరుగుబాటు చేయాలనే ఒత్తిడికి లోనుకాకుండా ఉండేందుకై చట్టబద్ధ పాలన ద్వారా మానవ హక్కులను కాపాడడం తప్పని సరి' తర్వాత ప్రపంచ వ్యాప్తంగా పలు మానవతావాద చట్టాలు అవతరించాయి. 1948లో జాతి హననానికి వ్యతిరేక ఒడంబడిక జరిగింది. జాతి హననాన్ని నేరంగా నిర్వచించింది. యూదుల ఊచకోతకు ఇతర జాతుల సంహారణకు వ్యతిరేక యత్నంగా అప్పట్లో ఈ ఒడంబడిక రూపొందింది. జాతి సంహరణను నివారించే చర్యలు, నేరానికి శిక్షలు ఇందులో పొందుపరచబడ్డాయి. తమిళుల సంహరణ, వారిపై దాడులు జాతి హనన నేరాలే. సిక్కులను, ముస్లింలను, క్రైస్తవులను, దళితులను, ఆదివాసులను చంపడం సైతం జాతి హనన నేరాలే. ఏ జాతి, మత, భాషా మైనారిటీలపై లేదా కులం వారిపై దాడి చేసి చంపడం జాతి హననం. మానవజాతిపై చేస్తున్న నేరంగా కూడా దాన్ని అతర్జాతీయ శిక్షాస్మృతి గుర్తించింది. శిక్ష ప్రకటించింది.

తమిళులపై శ్రీలంక సైన్యం దాడులకు పాల్పడి జాతి సంహరణ యుద్ధం చేస్తున్నదని ఆరోపిస్తూ ఐక్యరాజ్యసమితి భద్రతా మండలిలో పియుసిఎల్ సంస్థ తరపున పిటిషన్ దాఖలు చేశాం. ఐరాస మానవ హక్కుల కౌన్సిల్‌కు అర్జీ పెట్టుకొమ్మని చెప్పారు. సభ్య దేశాల దౌత్యవేత్తలు ఆ మానవ హక్కుల కౌన్సిల్‌లో సభ్యులు. ఒక దేశ కసాయి తనం న్యాయమైనదనీ, కీర్తించగలిగినదనీ ఆ కసాయి వాళ్లు నిర్ణయిస్తారు. స్విట్జర్లాండ్ మరికొన్ని దేశాలతో కలిసి ప్రవేశపెట్టిన తీర్మానాన్ని చర్చించేందుకు ఇటీవల సమావేశమైంది. తమిళ జాతి సంహరణకు ఒడిగట్టిన శ్రీలంక రాజ్యాన్ని ప్రాసిక్యూట్ చేయాలని ప్రతిపాదించిన ఆ తీర్మానం వీగిపోయింది. 26 దేశాలు వ్యతిరేకంగా 17 అనుకూలంగా వోటు వేశాయి. మనదేశం వ్యతిరేక వోటుకు పాల్పడింది. మరో తీర్మానంలో ఎల్‌టిటిఇ ని తుడిచిపెట్టి విజయం సాధించినందుకు, ప్రభాకరన్ సంతతిని సైతం మిగలకుండా చేసినందుకు సింహళ రాజ్యాన్ని అభినందించారు. హిట్లర్‌ను బుజ్జగించి పశ్చిమం వైపు కాకుండా తూర్పు వైపుకు యుద్ధాన్ని మళ్లించిన దుర్మార్గమైన, మ్యూనిచ్ ఒడంబడిక మరోసారి ప్రదర్శితమై నట్టుగా ఉంది. నిరంకుశ, అహేయక రాజ్యాలను, ఉద్వేగాలను బుజ్జగిస్తే ఏమవుతుందో ఎంత భయంకర పర్యావసా నాలుంటాయో చరిత్ర చెప్పినప్పటికీ మానవ హక్కుల కౌన్సిల్ శ్రీలంకలో జాతి సంహరణకు అభినందనలు తెలుపడం ప్రమాదానికి సంకేతం. ఘోరమైన మానవహక్కుల ఉల్లంఘనకు నిస్సిగ్గుగా మద్దతు తెలపడం. ఇలాంటివే చరిత్రలో మళ్లీ మళ్లీ హింసకు ఉత్ప్రేరకాలుగా పని చేస్తాయన్నది చరిత్ర చెప్పిన సత్యం. వీ

# అడవుల ప్రైవేటీకరణ - సహజ వనరుల దోపిడి

***ప్రపంచ బ్యాంక్ ఆదేశాల ప్రకారమే పాలకవర్గాలు అడవులను ప్రైవేటీకరిస్తూ, వాటిపై ఆదివాసులకు ఉన్న అధికారాలను కాలరాస్తూ, అడవి నుంచి వారిని గెంటివేస్తూ, వారి ఉనికిని దెబ్బతీస్తున్నాయని అంటున్నారు* పోతరాజు కట్టయ్య**

కేంద్ర ప్రభుత్వం సంస్కరణల పేరుతో ప్రారంభించిన నూతన ఆర్థిక, పారిశ్రామిక విధానాలు సామ్రాజ్యవాదుల, బహుళ జాతి సంస్థల దోపిడికి గేట్లు బార్లా తెరిచింది. ప్రపంచ బ్యాంకు, అంతర్జాతీయ ద్రవ్యసంస్థల ఆదేశాలకు లోబడి, దేశీయ ఆర్థిక విధానాలను ప్రపంచీకరణలో భాగం చేశారు. సరళీకరణ, ప్రైవేటీకరణ, ప్రపంచీకరణ పేరుతో ఈ విధానాలు అమలు జరుగుతున్నాయి. దేశ ఆర్థిక వ్యవస్థను, సామ్రాజ్యవాద రథచక్రాలకు బంధించబడింది. చివరికి కేంద్ర కేబినెట్‌లో కూడా చర్చించకుండా, పార్లమెంటల్‌లో చర్చించకుండా దేశ విద్రోహకరమైన 'గాట్' ఒప్పందంపై సంతకం చేసింది. ఇది 1995 జనవరి ఒకటి నుండి ప్రపంచ వాణిజ్య సంస్థగా అమలులోనికి వచ్చింది. సూటిగా చెప్పాలంటే, సామ్రాజ్యవాద దేశాలకు దేశాన్ని తాకట్టు పెట్టడమే కాక, అంతర్జాతీయ విపణిలో అమ్మకానికి పెట్టి పాలకవర్గాలు గులాములుగా వ్యవహరిస్తున్నాయి.

ప్రపంచీకరణలో భాగంగా అడవులతో సహా సహజ వనరులన్నింటినీ ప్రైవేటీకరించుటకు పాలకవర్గాలు పూనుకుంటున్నాయి. ఇందుకు మెట్టుమెట్టుగా ఒక పథకం ప్రకారం పని చేస్తున్నాయి. అడవులను ప్రైవేటీకరించే దానిలో భాగంగానే ప్రపంచ బ్యాంకు మార్గ దర్శకత్వంలో రాష్ట్రంలో సాముదాయక అటవీ యజమాన్య పథకం చేపట్టిన్నారు. అడవులను ప్రైవేటీకరించే దిశలో ఇది ఒక పెద్ద ముందడుగు.

ఆంధ్రప్రదేశ్‌లో అడవులను ప్రైవేటీకరించే విధానాలు 2000 సంవత్సరం నుండే ప్రారంభమయ్యాయి. 2000 సెప్టెంబర్ 22న విడుదల చేసిన ప్రభుత్వ ఉత్తర్వు నెం. 112 ద్వారా రాష్ట్ర ప్రభుత్వం దీనికి నాంది పలికింది. 1994 నుండి అమలు జరుగుతున్న ఉమ్మడి అటవి యజమాన్యం పథకం కింద 6616 వన సంరక్షణ సమితుల ఆధ్వర్యంలో ఉన్న 42 లక్షల ఎకరాల అడవులను కార్పొరేట్ రంగం కిందికి తెచ్చుటకు పూనుకుంది. వన సంరక్షణ సమితులలో భాగస్వాములు అగుటకు 'ఐటిసి భద్రాచలం రిలయెన్స్ (ప్యారీ) మురుగప్ప పరిశ్రమలు 'ఆసక్తి'ని చూపుతున్నాయని పేర్కొన్నది. దీనికగునుణంగా అవసరమైన మార్గదర్శక సూత్రాలకు కూడా పై ఉత్తర్వులో పొందుపరించింది. వీటి ప్రకారం భాగస్వాములందరి ప్రయోజనాల రక్షణకు వన సంరక్షణ సమితి సభ్యుల, భాగస్వామ్య పరిశ్రమల, రాష్ట్ర ప్రభుత్వ మధ్య త్రైపాక్షిక ఒప్పందం జరగాలి. దీనిని అనుసరించి, వన సంరక్షణ సమితికి అవసరమైన ఆర్థిక, సాంకేతిక సహాయాన్ని భాగస్వామ్య పరిశ్రమలు అందించాలి. ఒప్పందం ప్రకారం అటవి ఉత్పత్తులను అమ్మే బాధ్యతను పరిశ్రమలు స్వీకరిస్తాయి. కొన్ని వందల కోట్లు ఖర్చుపెట్టి, అడవులను పెంచిన తరువాత వాటిని ప్రైవేట్ పారిశ్రామిక వేత్తలకు ధారదత్తం చేయుటకు రాష్ట్ర ప్రభుత్వం పూనుకుంది. అడవులను అమ్ముకొని, కోట్ల లాభాలు గడించే స్వేచ్ఛను పరిశ్రమ అధిపతులకు కల్పించింది. పేరుకు వన సంరక్షణ సమితులు ఉంటాయి. పెట్టుబడి పెట్టడం, మార్కెట్ చేసే స్వేచ్ఛ, పారిశ్రామిక వేత్తలకు కల్పించడం ద్వారా వాస్తవ అధికారం వీరి చేతులోనే కేంద్రీకృత మవుతుంది. మరోవైపున గనులు, పరిశ్రమల అభివృద్ధి పేరిట బహుళ సంస్థలకు, దేశంలోని కార్పొరేట్ రంగానికి పెద్దఎత్తున భూములు దఖలు చేయటకు ప్రభుత్వం పూనుకుంటున్నది. విశాఖపట్నం ఏజెన్సీలోని చింతపల్లి వద్ద బాక్సైట్ గనులను పెట్టుబడి దారులకు అప్పగించుటకు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు తీవ్రంగా ప్రయత్నిస్తున్నాయి. ఏజెన్సీ ఏరియాల్లో మైనింగ్ కార్యక్రమాలు విస్తృతం చేయటకు ఐటిడిఎ, జిసిసి, మైనింగ్ కార్పొరేషన్‌లు ప్రైవేట్ వారితో సంయుక్త భాగస్వామ్యాలు కుదుర్చుకొనుటకు రాష్ట్ర ప్రభుత్వం నిర్ణయించిందని 2000 నాటి మాజీ ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు ప్రకటించారు. రాష్ట్రంలో ప్రభుత్వరంగ సంస్థలన్నింటిని ప్రైవేటీకరించుటకు నిర్ణయించి వీటకి నిధుల కేటాయింపును ఆపు చేసింది. ఇటువంటి పరిస్థితులలో ప్రైవేట్ యజమాన్యంతో కలిసి మైనింగ్ కార్యక్రమాలు చేపట్టడమంటే వాస్తవంగా ఆచరణలో గనులను ప్రైవేట్ యజమాన్యానికి అప్పగించడమే.

అడవులు ఇప్పటి వరకు ప్రభుత్వ యజమాన్యం కింద ఉన్నాయి. అటవి శాఖాధికారుల ద్వారా వీటి పర్యవేక్షణ జరుగుతోంది. ప్రైవేటీకరణలో భాగంగా సాముదాయక అటవి యజమాన్య పథకం కింద విఎస్ఎస్ కమిటీల నుండి ప్రభుత్వ అధికారులను తొలగించింది. ఉద్యోగుల పాత్ర కూడా మారింది. పని చేసే వాళ్ల నుండి తోడ్పడేదిగా ఉద్యోగుల పాత్ర ఉంటుంది అని మదింపు పత్రం (4) పేర్కొంది. అడవుల యజమాన్యాలకు సంబంధించి కమిటీలకు అన్ని అధికారులు కల్పించింది. అడవులలో దొంగతనంగా కట్టెలు కొట్టుట, అగ్నిప్రమాదం , పెద్ద ఎత్తున పశువులను మేపడం, ఆక్రమణలు జరగకుండా చూసే బాధ్యతలను వన సంరక్షణ సమితులు తీసుకొనుట ద్వారా సమర్థ వంతంగా అడవుల సంరక్షణను పెంపొందించాలి అని కమిటీల బాధ్యతల గురించి మదింపు పత్రం (3)(బి) పేర్కొన్నది. అటవి భూముల్లో, ఆక్రమణలో ఉన్న భూమిలో పంటలు వేయకుండా చూసే బాధ్యత కూడా కమిటీలకే అప్పగించింది. ఈ పథకం వల్ల బాధిత కుటుంబం ఆ ప్రాంతంలో (వారి భూమిలో) విత్తనాలు వేయకుండా ఆపుతూ వనసంరక్షణ సమితులు ఆ వ్యక్తికి నోటీసులు ఇవ్వాలి. ఆ నోటీసులో పథకం అమలులో పంటకు ఎటువంటి నష్టం జరిగినా వారే బాధ్యులని

నిర్దిష్టంగా పేర్కొనాలి అని పునరావాస కార్యచరణ ప్రణాళిక (11.2) లో వివరించిన భూస్మాసురుని హస్తంలో ఆదివాసుల చేతే ఆదివాసులను భూముల నుండి గెంటి వేయించుటకు పూను కుంది. ఒక వైపున కలపపై వచ్చే ఆదాయం పూర్తిగా వన సంరక్షణ సమితి కమిటీలకు చెందే హక్కు చట్టబద్ధంగా కల్పిస్తున్నామని చెపుతూనే (అప్పు, ఒప్పందం 1ఎ.2) కాలక్రమంలో అంతిమ ఫలసాయంలో కొంత వాటాను ప్రభుత్వం పొందుతుందని మదింపు (2) పేర్కొన్నది. ఎంత వాటా చెందుతుందనేది స్పష్టం చేయకుండా ప్రజలను మోసగించడానికి ప్రభుత్వం పూనుకుంటున్నది. అంతేగాక వచ్చిన ఆదాయం మొత్తం ప్రజలకు చెందదు. ప్రధాన భాగం తిరిగి అడవులను పెంచడానికే పోతుంది. కొంతభాగం ప్రభుత్వానికి పోతుంది. మిగిలిన కొద్దిభాగం ప్రధానంగా కూలీ డబ్బులు మాత్రమే ప్రజలకు దక్కుతాయి. తొందరగా ఆదాయం చేకూరే విధంగా పండ్లు, ఫైబర్ వన మూలికలు కూడా పెంచుటకు ప్రాధాన్యం ఇవ్వాలనీ ఈ పథకం స్థిరంగా కొనసాగుటకు తోడ్పడుతుందని పేర్కొన్నారు.

ఈ విధంగా అటవి యజమాన్య బాధ్యతలు, అడవులను సంరక్షించే బాధ్యతలు, పెట్టుబడి పెట్టి అడవులను పెంచే బాధ్యతల నుండి ప్రభుత్వం తప్పుకుని, విఎస్ఎస్ కమిటీలపైనే నెడుతోంది. తరువాత విఎస్ఎస్‌లను పారిశ్రామికవేత్తలకు, బహుళజాతి సంస్థలకు ధారాదత్తం చేయుటకు ప్రభుత్వం సంసిద్ధం చేస్తున్నది. ప్రస్తుత పథకం పూర్తి అయిన తరువాత ఈ ఐదు సంవత్సరాలలో అడవిపై పెట్టుబడికి అవసరమైన నిధులు అడవి నుండి ఆదాయం ద్వారా ఎలాగో రావు. అప్పుడు అనివార్యంగా పెట్టుబడి ప్రభుత్వం పెట్టదు. కనుక ప్రైవేట్ పెట్టుబడిదారులపై ఆధారపడవలసి వస్తుంది. ఆ విధంగా అడవులను ప్రైవేటీకరించి, సామ్రాజ్యవాదులకూ, బహుళజాతి సంస్థలకూ, కార్పొరేట్ రంగాలకూ ధారదత్తం చేయడమే ప్రభుత్వ లక్ష్యం.

ఆదివాసులను నిరాశ్రయులుగా చేసేందుకు పాలకవర్గాలు కుట్రలు పన్నుతున్నాయి. వీరిని దారిద్యం నుండి విముక్తి చేయడం అని అటవి రక్షణ పథకాలలో ఒక ముఖ్య లక్ష్యంగా ప్రకటిస్తున్నారు. కాని వాస్తవాలు అందుకు పూర్తి భిన్నంగా ఉన్నాయి. వీరికి జీవనాధారంగా ఉన్న భూముల నుండి పారద్రోలే కార్యక్రమం పథకం ప్రకారం పాలక వర్గాలు చేపట్టి, అంచెలంచెలుగా కొనసాగిస్తున్నారు. దీనిలో భాగంగానే వలస ఆదివాసుల ఇళ్లు తగులబెట్టడం, ప్రాజెక్టుల పేరుతో నిరాశ్రయులను చేయడం, సింగరేణి ఓపెన్‌కాస్టులు, మైనింగ్ కార్యక్రమాలు మొదలగునవి ఏజెన్సీ ఏరియాలలో కొనసాగుతున్నాయి. ప్రత్యామ్నాయ జీవనోపాధి చూపించకుండానే ఆదివాసుల భూములను స్వాధీనం చేసుకొన్నారు. జెఎస్ఎం పథకం ద్వారా 118152 ఎకరాల భూమి స్వాధీనం చేసుకున్నట్లుగా ప్రభుత్వ లెక్కలు తెలియ చేస్తున్నాయి. సాముదాయక అటవి యజమాన్య పథకం ద్వారా రాష్ట్రంలో 692130 ఎకరాల భూమిని ఆదివాసుల, ఇతర పేదల నుండి స్వాధీనం చేసుకోనుటకు ప్రభుత్వం రంగాన్ని సిద్ధం చేసింది.

అటవి భూముల ఆక్రమణలు ఉత్తర తెలంగాణ జిల్లాలైన ఆదిలాబాద్, ఖమ్మం, కోస్తా జిల్లాలైన విశాఖ, శ్రీకాకుళం, విజయ నగరంలలో ఎక్కువగా ఉన్నట్లు ప్రభుత్వం పేర్కొంటున్నది. ఆక్రమణ దారులలో అత్యధిక భాగం రెండు సామాజిక తరగతులు ఆదివాసులు ఇతర కులాలుగా ఉన్నాయి. మొత్తం ఆక్రమణదారులలో 80 శాతం పైగా ఆదివాసులు ఉన్నారని ప్రభుత్వ లెక్కలు చెపుతున్నాయి. నిజానికి ఆదివాసులు ఆక్రమణదారులా? లేక ప్రభుత్వమే వారి భూమిని బలవంతంగా ఆక్రమించుకొంటున్నదా? పాలకవర్గాల నిజాయితీకి తెలువవలసి ఉంది. పునరావాస కార్యాచరణ ప్రణాళిక ప్రకారం ఆక్రమణదారులైన ఆదివాసులను, ఇతర కులాలను బలవంతంగా గెంటివేయమని, భూములకు ప్రత్యామ్నాయంగా సమానంగా ఆదాయం వచ్చే సదుపాయం కల్పిస్తామని చెపుతూనే, మరోవైపున కొన్ని కుటుంబాలు నిరాశ్రయులు కావచ్చని, దుష్ఫలితాలు ఉంటాయని సన్నాయి నొక్కులు నొక్కుతోంది. ప్రజలకు విఎస్ఎస్‌లో పనులు కల్పిస్తామని, ఆదాయంలో వాటా కూడా పొందవచ్చునని, ఈ విధంగా సముదాయం అభివృద్ధి అయి, దారిద్ర్యం నిర్మూలన జరుగుతుందని చెప్పుతోంది. ఇలాంటి పథకాలతో ఆదివాసి ప్రజలను మోసం చేసుతోంది. అదే భూములు సాగు చేసుకుంటే ప్రతి సంవత్సరం పని లభిస్తుంది. ఉత్పత్తి జరుగుతూ ఆదాయం లభిస్తుంది. ముఖ్యంగా ఆహార భద్రత కూడా ఉంటుంది. ఆ విధంగా ఆదిదాసులను భూముల నుండి వెళ్లగొట్టి, దారిద్ర్యాన్ని నిర్మూలించ దలచున్నది. వాస్తవంగా ఇదే దారిద్ర్యాన్ని నిర్మూలించడమే కాక దరిద్రులుగా తయారు చేయుట అసలు ఉద్దేశం. ఆదివాసుల ఉద్ధరణ పేరుతో ఆదివాసులను ఉరితీయుటకు ప్రభుత్వం పూనుకున్నది.

అడవిపై ఆదివాసులకు హక్కు ఉందని అనుకుంటాం. కాని బ్రిటిష్ వారు తీసుకు వచ్చిన చట్టాల ద్వారా అడవి రాజ్యం ఆస్తిగా మారి పోయింది. ఆదివాసులు పరాయివారై పోయారు. పరాయీకరణ చెందారు. అడవిపై రాజ్యం అజమాయిషీ పెరిగింది. ఆదివాసులు అనాథలైపోయారు. అడవి సంవదను తాకితే నేరమైపోయింది. ఇదంతా అడవిని సంరక్షించే పేరుతో సాగుతోంది. సంరక్షణ ముసుగులో అడవి పాలక వర్గాల దోపిడికి గురైంది. ఈ దోపిడిని వ్యతిరేకించిన ఆదివాసులపై నిర్బంధం అమలైంది. బ్రిటిష్ వారికి వ్యతిరేకంగా జరిగిన ఉద్యమంలో ఆదివాసుల పోరాటాలు ప్రముఖమైన పాత్రను పోషించాయి. బ్రిటిష్ వలస విధానానికి, కాంగ్రెస్ ఇతర రాజకీయ పక్షాలు పోరాడితే, ఆదివాసులు సామ్రాజ్యవాదానికి, స్థానిక దోపిడి వర్గాలకు వ్యతిరేకంగా పోరాడారు. మనదేశ అభివృద్ధి నమూనాలో లేదా చట్టాలలో ఆదివాసుల అభివృద్ధికి చోటులేదు. అభివృద్ధిలో వారిని ఇముడ్చుకునే దానికంటే గెంటి వేయడమే ప్రధానంగా కనపడుతుంది.

ఫారెస్టు చట్టం, మైనింగ్ చట్టం, పారిశ్రామిక అభివృద్ధి చట్టం వాటిని నిశితంగా పరిశీలిస్తే ఈ మాటలు తేనె పూసిన కత్తిలాంటివని ఇప్పుడు అర్థమవుతున్నది.

ఆదివాసులు పూర్తిగా వనరులను, తమ జీవితాలను కోల్పోతున్న తరుణంలో వనరులను పొందడానికి స్వయంపాలన తప్ప వేరొక మార్గం లేదు. ఆదివాసి ప్రాంతాల్లోని వనరులన్నీ మావే. వాటిపై మాకే అధికారం ఉండాలన్న ఆదివాసుల ఆకాంక్ష స్వయంపాలన డిమాండ్ రూపంలో వ్యక్తమవుతోంది. ఆ డిమాండ్‌ను గౌరవించి నీరు, భూమి, అడవిపై ఆదివాసులకు సంపూర్ణ అధికారాన్ని కల్పిస్తేనే వీరి జీవితాలకు సార్థకత లభిస్తుంది.

*(రచయిత అర్థశాస్త్ర పరిశోధక విద్యార్థి, ఉస్మానియా యూనివర్సిటీ)* వీ

# కొత్త ఆలోచనలు ప్రేరేపించిన సదస్సు

ప్రొ. ఆర్.ఎస్. రావు స్మారకోపన్యాసం, స్మారక సదస్సు 2014 కార్యక్రమాలు ఆర్.ఎస్. రావు స్ఫూర్తికి తగినట్టుగా ఉత్తేజకరంగా, ఆలోచనాత్మకంగా జరిగాయి. రాజకీయార్థశాస్త్రవేత్త, మార్క్సిస్టు మేధావి, ప్రజా ఉద్యమాల మిత్రుడు ఆర్.ఎస్. రావు సంస్మరణలో గత మూడు సంవత్సరాలుగా ప్రతి సంవత్సరం ఈ స్మారకోపన్యాస, స్మారకసదస్సు కార్యక్రమాలు జరుగుతున్నాయి. నాలుగు దశాబ్దాల పాటు భారత ప్రజా ఉద్యమాల గురించి మార్క్సిస్టు దృక్పథంతో ఆలోచించి, విశ్లేషించి, ప్రచారం చేసిన ఆర్.ఎస్. రావు 2011 జూన్ 17న అమరులైన తర్వాత ఆయన ఆలోచనలను, స్ఫూర్తిని కొనసాగించాలనే ఉద్దేశంతో, ఆయన ఆలోచించిన అంశాల మీద మరింత పరిశోధన, అన్వేషణ, చర్చ సాగించి ముందుకు తీసుకుపోవాలనే ఉద్దేశంతో ఈ కార్యక్రమాలు ఏర్పాటయ్యాయి. 2012లో మొదటి ఆర్.ఎస్. రావు స్మారకోపన్యాసం 'కూడలిలో ఉన్నత విద్య – ప్రత్యామ్నాయాల అన్వేషణ' అనే అంశంపై ప్రొ. వి.ఎస్. ప్రసాద్ చేశారు. 'సామాజిక చలనాన్ని ఎలా అర్థం చేసుకోవాలి' అనే అంశంపై జరిగిన సదస్సులో విభిన్న అంశాలపై పరిశోధకులు ఎనిమిది పత్రాలు సమర్పించారు. 2013లో 'సాహిత్యంలో సామాజిక చలనపు ప్రతిఫలనం' అనే అంశం మీద వరవరరావు స్మారకోపన్యాసం చేయగా, అదే అంశంపై జరిగిన సదస్సులో పదకొండు పత్రాలపై చర్చ జరిగింది.

ఈ స్మారకోపన్యాస, సదస్సుల పరంపరలో భాగంగా, ఈ సంవత్సరం ఆర్.ఎస్. రావు స్మారకోపన్యాసం నవంబర్ 8 సాయంత్రం హైదరాబాద్‌లోని సుందరయ్య విజ్ఞాన కేంద్రం – దొడ్డి కొమరయ్య హాలులో జరిగింది. 'విద్యా వ్యవస్థ విధ్వంసం – సంక్షోభ సూచనలు' అనే అంశం మీద ప్రొ. జి. హరగోపాల్ స్మారకోపన్యాసం చేశారు. విద్యావ్యవస్థలో ప్రతి ఒక్కరూ గుర్తించగలుగుతున్న సంక్షోభం నిజానికి సామాజిక సంక్షోభానికి ఒక సూచన అని, ఈ విషయంలో ఒక అర్ధభూస్వామ్య, అర్ధవలస సమాజంలోని విద్యారంగం గురించి ఆర్.ఎస్. రావు చేసిన విశ్లేషణ సహాయంతో ప్రస్తుత పరిస్థితిని సమగ్రంగా అర్థం చేసుకోవచ్చునని హరగోపాల్ అన్నారు. ఢిల్లీ విశ్వవిద్యాలయంలో జరిగిన పరిణామాల నేపథ్యంలో దేశంలో ఉన్నత విద్య ఎదుర్కొంటున్న సమస్యలను వివరించారు. దేశవ్యాప్తంగా విద్యారంగంలో వలసవాద వ్యతిరేక జాతీయోద్యమ విలువలు కూడ అంతరించిపోతున్నాయని, అందువల్ల కార్పొరేటీకరణ, కాషాయీకరణ అనే రెండు పెద్ద ప్రమాదాలు విద్యారంగాన్ని పట్టి పీడిస్తున్నాయని ఆయన అన్నారు. తాము ఉన్న సమాజం నుంచి దూరమైన పాలకవర్గాలు అని నోమ్ ఛామ్‌స్కీ చేసిన వర్ణనకు సరిగ్గా సరిపోయే పాలకవర్గాలు సమాజం మొత్తాన్నీ సంక్షోభంలో ముంచుతున్నట్టే విద్యారంగాన్ని కూడ సంక్షోభంలో ముంచుతున్నాయని ఆయన అన్నారు. సమాజంలో పునాది కోసం మతోన్మాద కాషాయీకరణ, మిగిలిన అన్ని విషయాలలో సామ్రాజ్యవాద ఊడిగంతో కార్పొరేటీకరణ ఆర్.ఎస్. రావు సూత్రీకరణకు నిదర్శనంగా ఉన్నాయన్నారు.

మర్నాడు నవంబర్ 9 ఆదివారం హైదరాబాద్ కేంద్రీయ విశ్వవిద్యాలయంలో జరిగిన సదస్సులో ప్రొ. డి నరసింహా రెడ్డి అధ్యక్షతన మొదటి సమావేశంలో ఆర్ విజయ్ 'వ్యవసాయ నిర్మాణాలు – కౌలు సంబంధాలు: పశ్చిమ గోదావరి జిల్లాలో రెండు గ్రామాల పరిశోధన' అనే పత్రం ప్రవేశపెట్టారు. పశ్చిమ గోదావరి జిల్లాలో మెంతిపూడి, కొత్తపల్లి అనే రెండు గ్రామాలను మొదట 2003–04లో, తర్వాత 2014లో అధ్యయనం చేసి రూపొందించిన ఈ పత్రం వ్యవసాయ రంగంలో పాత నిర్మాణాల స్థానంలో వస్తున్న కొత్త నిర్మాణాలు మౌలికంగా భిన్నమైనవి కావనీ, పాత దోపిడీ, ఆధిపత్య రూపాలను కొత్త పద్ధతులలో కొనసాగిస్తున్నాయనీ చూపడానికి ప్రయత్నించింది. గ్రామంలో నివాసం ఉండని, వ్యవసాయంతో సంబంధం లేని కుటుంబాల చేతికి ఎక్కువ భూమి చేరుతున్నదని, ఆ అనుపస్థిత భూస్వాములకు గాని, గ్రామంలో సమస్యాత్మకంగా మారిన వ్యవసాయానికి గాని అవసరమైన అన్ని సేవలు అందించేందుకు ఒక గ్రామంలో కమిషన్ ఏజెంటు అనే కొత్త మధ్య దళారీ నిర్మాణం తలెత్తిందని, మరొక గ్రామంలో కుల, కుటుంబ సంబంధాలను బలోపేతం చేయడం ద్వారా వ్యవసాయం సాగుతున్నదని, మొత్తం మీద కౌలు పద్ధతి పెరిగిపోయిందని, ఒక గ్రామం నుంచి వలసలు వ్యవసాయేతర రంగంలోకి సాగుతుండగా, మరొక గ్రామం నుంచి విదేశాలకు సాగుతున్నాయని ఈ పత్రం క్షేత్రస్థాయి పరిశీలనలను వివరించింది.

వ్యవసాయరంగంలో మార్పులను, మొత్తంగా సమాజంలో, వ్యవస్థలలో మార్పులను సైద్ధాంతిక దృష్టిలో పరిశీలిస్తూ ముదునూరు భారతి ప్రవేశపెట్టిన పత్రం 'వ్యవస్థలు – అభివృద్ధి – మిగులు మనుషులు' అసలు సామాజిక పరివర్తనను ఎలా అర్థం చేసుకోవాలో, భారత సామాజిక పరివర్తనకు ప్రత్యేక లక్షణాలేమిటో, ఆ ప్రత్యేక లక్షణాల వల్ల ఏర్పడిన స్థితి ఏమిటో వివరించింది. మన సమాజంలో మార్పులు తెచ్చే సాధనం పెట్టుబడి అనే నమ్మకంతో పాలకవర్గాలు పెట్టుబడిని ప్రవేశపెట్టడానికీ పెంచడానికీ ప్రయత్నిస్తున్నప్పుడు ఎటువంటి మార్పులు ఎందుకు వస్తున్నాయి, వాటి పర్యసానమేమిటి అని పరిశీలించడమే ఈ పత్రం లక్ష్యం. పెట్టుబడి అనేదాన్ని ఏకశిలా సదృశంగా చూడగూడదని, అది చరిత్రలో కనీసం మూడు గుర్తించదగిన రూపాలలో, దశలలో ఉన్నదని ఈ పత్రం వాదించింది. మొదటి దశలో మానవశ్రమను, రెండో దశలో యంత్రాన్ని, సాంకేతిక పరిజ్ఞానాన్ని వాడుకుంటూ, అభివృద్ధి చేస్తూ సాగిన పెట్టుబడి, మూడో దశకు వచ్చేసరికి కేవలం సరుకుల ఉత్పత్తి మీద, సరుకుల మిశ్రమాన్ని మార్చి ప్రవేశపెట్టడం మీద ఆధారపడుతున్నదని ఈ పత్రం వాదించింది. భారతదేశంలోకి పెట్టుబడి ఈ మూడోదశలో ప్రవేశించినందువల్ల కేవలం కొత్త సరుకులు వస్తాయి గాని అటు మానవశ్రమ, ఇటు యంత్ర, సాంకేతిక సామర్థ్యాల అభివృద్ధి ప్రధానం కాదు. ఈ దశలో విలువలను మార్చడమే జరుగుతుంది. అందువల్ల ఇక్కడ పెట్టుబడి ప్రవేశానికి అనివార్యమైన పర్యవసానంగా పెద్ద ఎత్తున మిగులు మనుషుల ఉత్పత్తి జరుగుతుంది. నిర్వాసితుల రూపంలోనూ ఇతరంగానూ తయారయ్యే ఈ మిగులు మనుషుల ఉద్యమాలు పెట్టుబడి విస్తరణకు ఆటంకాలు కల్పిస్తాయి. ఆ మిగులు మనుషులు లంగరుగా మారి సమాజపరివర్తన నౌక ప్రయాణాన్ని అడ్డుకుంటారు. ఈ స్థితిలో భారత సమాజపు మరొక ప్రత్యేకత ఇక్కడ మూడు ఉపవ్యవస్థలు సహజీవనం చేస్తూ ఉండడం. ఈ సంక్షోభం నుంచి బయటపడడానికి పెట్టుబడి కేంద్ర మార్గానికి అవకాశం లేదు. శ్రమ కేంద్ర మార్గం మాత్రమే శ్రామికులను తనలో లీనం చేసుకుని అభివృద్ధి చేయగలుతుంది.

తథాగత్ సేన్‌గుప్తా, జి విజయ్ ప్రవేశపెట్టిన 'తూర్పు భారతంలో గ్రామీణ నిస్సహాయత: ప్రచ్ఛన్న అంతరాల నిర్మాణాలు, వ్యవస్థ విధ్వంసం – ఒరిస్సా, తెలంగాణ ఇటుక బట్టీ కార్మికుల గొలుసు వలసల వ్యవస్థ' అనే పత్రం హైదరాబాదు పరిసరాలలో ఇటుక బట్టీలలో పనిచేయడానికి వలస వచ్చిన ఒరియా కార్మికుల దగ్గర ప్రారంభించి రెండు రాష్ట్రాల ప్రజల నిస్సహాయ వలసల గురించీ, అందుకు కారణమైన గ్రామీణ సంక్షోభం గురించీ చర్చించింది. తూర్పు రాష్ట్రాల నుంచి ఈ వలసలకు మూలమైన గ్రామీణ సంక్షోభానికి కారణం ప్రభుత్వాలు, ప్రచార సాధనాలు చెపుతున్నట్టుగా ప్రకృతి వైపరీత్యం కాదు, ప్రజల బాధ్యతారహితమైన, విచ్చలవిడి ఖర్చులు కావు,

అదనపు ఆదాయాన్ని సంపాదించాలనే కోరిక కాదు, ముందస్తు డబ్బు రాబట్టుకుని పారిపోవాలనే ఆలోచన కాదు. అమలవుతున్న అభివృద్ధి నమూనా వల్ల అప్పులు పెరిగిపోతుండడం వల్ల అంతకంతకూ ఎక్కువ కుటుంబాలు వలస వెళ్లక తప్పని నిస్సహాయ స్థితికి చేరుకుంటున్నాయి. ఈ నిస్సహాయ వలస స్థితివల్ల ఆ వలస కార్మికులు నిరంతర ప్రచ్ఛన్న నిర్బంధ పూరిత అదుపు సంబంధాలలో ఉండవలసి వస్తుంది. ఒకరకంగా చెప్పాలంటే అది కట్టు బానిసత్వంలా ఉంటుంది. అంటే నిస్సహాయతా, కట్టుబానిసత్వమూ కూడ వ్యవస్థ వల్లనే నిరంతరం పునరుత్పత్తి అవుతున్నాయి. ఇవి వ్యవస్థలో అంతర్భాగం గనుకనే పాలక యంత్రాంగాలన్నీ వీటి పట్ల నిర్లిప్తంగా ఉంటున్నాయి. ఈ స్థితిలో కూడ వలస కార్మికులు సంఘటితం కావడానికీ, ప్రతిఘటించడానికీ ప్రయత్నాలు చేస్తుండడమే ఆశాసూచిక. అయితే ఎంతో కొంత భూమి ఉన్న కుటుంబాలు ఈ నిస్సహాయ స్థితి నుంచి, వలస వెళ్లడం నుంచి తప్పించుకోవడానికి అవకాశం ఉంది.

డా. ఆర్ కవితా రావు అధ్యక్షతన జరిగిన రెండో సమావేశంలో 'వ్యవస్థాత్మక ఏర్పాట్లు – వ్యవసాయ సామర్థ్యం: రాష్ట్రాల వారీ విశ్లేషణ' అనే పత్రంలో చిత్రసేన్ భుయె క్షేత్ర స్థాయి పరిశోధన వైపు నుంచి కాకుండా, లభ్యమవుతున్న అధికారిక సమాచారం, ముఖ్యంగా జాతీయ నమూనా సర్వే సంస్థ (ఎన్ఎస్ఎస్ఒ) ప్రచురించిన గణాంకాల ఆధారంగా వ్యవసాయం ఎక్కువ ఉత్పాదకంగా ఉండడంలో, ఉండకపోవడంలో వ్యవస్థాత్మక ఏర్పాట్లు ఎటువంటి పాత్ర నిర్వహిస్తాయో విశ్లేషించడానికి ప్రయత్నించారు. భూమి, శ్రమ, పరపతి సౌకర్యాల కోసం ఎటువంటి సంస్థాగత ఏర్పాట్లు ఉన్నాయో, వాటికీ వ్యవసాయాభివృద్ధికీ ఎటువంటి సంబంధం ఉందో 14 రాష్ట్రాల ఉదాహరణల నుంచి ఈ పత్రం వివరించింది. భూమి, పశుగణం, రుణభారం, పెట్టుబడులు వంటి అంశాలపై ఎన్ ఎస్ ఎస్ ఒ మూడు దఫాల గణాంకాలతో, సంస్థాగత నిర్మాణాలకూ వ్యవసాయాభివృద్ధికీ సమతుల్య సంబంధం లేదని ఈ పత్రం రుజువు చేసింది. సంస్థాగత నిర్మాణాలనూ, వ్యవసాయాభివృద్ధినీ ప్రాతిపదికలుగా తీసుకున్నప్పుడు మొత్తం మీద రెండు రకాల రాష్ట్రాలు ఉన్నట్టు కనబడుతుందనీ, అయితే అనేక రాష్ట్రాలు ఒక రకం నుంచి మరొక రకానికి మారడం కూడ కనబడుతుందనీ, రాష్ట్రాల మధ్య ఇలా రెండు రకాల వైవిధ్యాన్ని భూమి సంబంధమైన నిర్మాణాల ఏర్పాట్లు బలోపేతం చేస్తున్నాయనీ ఈ పత్రం చూపింది.

ఆ తర్వాత క్షేత్ర పరిశోధన ఆధారంగా తయారయిన మరొక పత్రం 'వ్యవసాయ వైవిధ్యీకరణ – చిన్నరైతులపై దాని ప్రభావం: కర్నాటకలో ద్రాక్ష సాగులోకి విస్తరణపై పరిశోధన' మురళి డి ఎ ప్రవేశపెట్టారు. జాతీయ ఉద్యానవన పంటల కార్యక్రమం కింద కర్నాటకలో రైతాంగాన్ని కొత్త పంటల వైపు, వైవిధ్యీకరణ వైపు ఆకర్షించడానికి జరిగిన ప్రయత్నం అంతిమంగా ఏ ఫలితాలకు దారితీసిందో ఈ పత్రం వివరించింది. తిండిగింజల పంటల సాగులో ఉన్న రైతులకు పరపతి సౌకర్యాలు, సబ్సిడీలు కల్పించి, ఎక్కువ లాభాల ఆశచూపి ద్రాక్ష సాగు వైపు మళ్లించారు. కాని ఈ కొత్త పంటల ఉత్పత్తిలో, మార్కెటింగ్ లో అనిశ్చితి ఎక్కువగా ఉండగా, ఆ అనిశ్చితి నుంచి రక్షించే బాధ్యతను మాత్రం పాలక సంస్థలు తీసుకోలేదు. ఒకప్పుడు ఇటువంటి పంటల వైవిధ్యీకరణకు ప్రభుత్వమూ, పరిశ్రమా చేసినంత దోహదం కూడ ప్రస్తుత సందర్భంలో దొరకలేదు. మార్కెటింగ్ అవకాశాలు కొరవడడం, క్రమబద్ధమైన ఏర్పాట్లు లేకపోవడం కలిసి ధరలోను, మార్కెట్ లోను ద్రాక్ష రైతులకు అనిశ్చితి పెరిగింది. లాభాపేక్ష గల మధ్య దళారీలే రైతులకు అవసరమైన సమాచారం అందించడం, ఉత్పత్తికి మార్కెట్ కల్పించి పెట్టడం చేశారు. రైతులకూ దళారీలకూ మధ్య సంబంధం ఎంతమాత్రం క్రమబద్ధత లేని నోటిమాట సంబంధంగా ఉండిపోయింది. అలా రైతులు సరైన ధర దొరకక, చెప్పిన ధర కూడ అందక ఇబ్బంది పడవలసి వచ్చింది. మళ్లీ మళ్లీ దళారీల ద్వారా వెళ్లే రైతులకు మాత్రమే కొంత మెరుగైన ప్రతిఫలం దొరికేది. చిన్న సన్నకారు రైతులకు అలా ఒకే దళారీ ద్వారా మళ్లీ మళ్లీ వెళ్లే అవకాశం తక్కువ గనుక ద్రాక్ష పంటకు మళ్లిన చిన్న, సన్నకారు రైతులు మరింత ఎక్కువ నష్టపోయారు. ఇలా గ్రామీణ స్థాయిలో తగిన, అవసరమైన నిర్మాణాలు రూపొందకపోవడం వల్ల హెచ్చు విలువగల పంటలకు మళ్లాలని రైతులకు ఇస్తున్న పిలుపుకు తగిన స్పందన రావడం లేదు. ఈ పరిశోధనా క్షేత్రంలో కొందరు రైతులు ద్రాక్ష నుంచి మళ్లీ ఆహారపంటల వైపు తిరిగివచ్చారు.

మరొక క్షేత్ర పరిశోధనానుభవం నుంచి వచ్చిన పత్రం వై రామచంద్రం ప్రవేశపెట్టిన 'ఒక గ్రామంలో రెండు తరాల మార్పులు'. కరీంనగర్ జిల్లా కోహెడ మండల తంగళ్లపల్లి గ్రామంలో రెండు తరాల అనుభవంలో ప్రజలు గమనించిన మార్పులను ప్రజల నుంచే తెలుసుకొని జాబితా ఇవ్వడానికి ఈ పత్రం ప్రయత్నించింది. గ్రామ చరిత్ర, గ్రామంలో భూసంబంధాలు, కులాలు, భూసంబంధాల్లో మార్పులు, శ్రమ సంబంధాల్లో మార్పులు, ఆధిపత్య సంబంధాల్లో మార్పులు, కౌలు పద్ధతి, గ్రామంలో ఏర్పడుతున్న మిగులు, విద్యావకాశాలు, రవాణా రంగంలో మార్పులు, సాంస్కృతిక మార్పులు, కులవృత్తుల్లో వచ్చిన మార్పులు, భూమి తగాదాలు, వలసలు, అప్పులు, ఇప్పటికీ కొనసాగుతున్న కట్టుబాట్లు, ఆధిపత్యం వంటి అనేక సూక్ష్మ, స్థూల స్థాయి వివరాలతో ఈ పత్రం విశ్లేషణకు అవసరమైన సంపన్నమైన సమాచారాన్ని అందించింది.

చివరిగా, 'వ్యవసాయ రంగంలో మార్పులు – రూపమూ సారమూ' అనే పత్రాన్ని ఎన్ వేణుగోపాల్ ప్రవేశపెట్టారు. గ్రామీణ, వ్యవసాయ రంగాల్లో ఎన్నో మార్పులు వచ్చాయనీ, వస్తున్నాయనీ, ఈ మార్పులను అర్థం చేసుకోవడంలో రెండు రకాల వైఖరులున్నాయనీ ఈ పత్రం వివరించింది. ఈ మార్పులు ప్రగతిశీలమైనవనీ, వీటివల్ల సమాజ పరివర్తనా క్రమం ముందుకు నడుస్తున్నదనీ కొందరు భావిస్తుండగా, ఈ మార్పులు నిజమైన మార్పులు కావనీ, ఈ రూపపరమైన మార్పుల వెనుక సారాన్ని పరిశీలిస్తే అవి సామాజిక పరిణామం ప్రతిష్టంభనలో ఉందని చెప్పడానికి చిహ్నాలనీ మరికొందరు భావిస్తున్నారు అంటూ ఈ పత్రం రెండో దృక్పథం నుంచి మార్పుల సారాన్ని విశ్లేషించడానికి ప్రయత్నించింది. భూస్వాములు తగ్గిపోవడం, జీతగాళ్లు దాదాపు కనుమరుగైపోవడం, చేతివృత్తుల పతనం, వ్యవసాయ యాంత్రీకరణ, గ్రామీణ మార్కెట్, వ్యవసాయ సంక్షోభం వంటి గ్రామీణ, వ్యవసాయ రంగంలోని మార్పులను ఒక్కొక్కటిగా వివరిస్తూ, వాటి సారం భిన్నమైనదని చెప్పడానికి ఈ పత్రం ప్రయత్నించింది. అయితే వ్యవసాయ, గ్రామీణ రంగాలలోని మార్పులను సమగ్రంగా అర్థం చేసుకోవాలంటే ఈ అంశాలు మాత్రమే సరిపోవనీ, ఉత్పత్తి శక్తుల అభివృద్ధి, వలసలు, సామ్రాజ్యవాద దశలో స్వతంత్ర పెట్టుబడిదారీ అభివృద్ధికి అవకాశం లేకపోవడం, బూర్జువా ప్రజాస్వామిక విప్లవం జరగకుండానే పార్లమెంటరీ ప్రజాస్వామ్యం రావడం, బూర్జువా ప్రజాస్వామిక ఫలితాలైన వ్యక్తి వికాసం, పత్రికాస్వేచ్ఛ, పౌరసమాజం సక్రమంగా ఏర్పడకపోవడం, రాజ్యాధికారం అనుభవిస్తున్న వర్గాలు, సామాజిక సంబంధాలు మారడం వంటి అనేక సంబంధిత అంశాలతో కలగలిపి చూడాలనీ ఈ పత్రం వాదించింది. 'గ్రామీణ, వ్యవసాయ రంగాలలో కంటికి కనబడే మార్పులు ఎన్నో జరుగుతున్నప్పటికీ, వాటికి నిర్దిష్టమైన దిశ లేకపోవడం సమాజ ప్రతిష్టంభనకు ఒక చిహ్నం. అర్ధవలస, అర్ధభూస్వామ్య అనే సూత్రీకరణ ఆ ప్రతిష్టంభనను సూచించేదే' అంటూ ఈ మార్పులన్నీ కూడ ఆ సూత్రీకరణను బలోపేతం చేసేవేనని ఈ పత్రం వాదించింది.

స్మారకోపన్యాసం సభలోను, సదస్సులోను అరవై మందికి పైగా శ్రోతలు పాల్గొన్నారు. సదస్సులో కనీసం ఇరవై మంది చర్చలో పాల్గొన్నారు. స్మారకోపన్యాసం, సదస్సులో చర్చకు వచ్చిన అన్ని పత్రాలూ మన సమాజ చలనం ఎదుర్కొంటున్న ప్రతిష్టంభనకు ఉన్న అనేక వ్యక్తీకరణలను ప్రకటించాయి. సమాజం మారక తప్పని స్థితికి వచ్చి ఉన్నదని, సామాజిక పరివర్తన సాధించవలసిన శక్తులు బలోపేతమైతే, అనేక రంగాలలో పరివర్తన సాధించగలిగిన స్థితి నెలకొని ఉన్నదని రుజువు చేశాయి. వీ

## తెలంగాణ బడ్జెట్ సమావేశాలు

తెలంగాణ రాష్ట్ర మొదటి బడ్జెట్ సమావేశాలు నవంబర్ 5 నుంచి ప్రారంభమయ్యాయి. ఆర్థిక మంత్రి ఈటెల రాజేందర్ రాష్ట్ర మొత్తం బడ్జెట్ రు. 1,00,637.96 కోట్లు ప్రవేశపెట్టారు. ఇందులో ప్రణాళిక బడ్జెట్ రు. 48,648.47 కోట్లు, ప్రణాళికేతర బడ్జెట్ రు. 51,989.49 కోట్లు కేటాయించారు.

## ప్రముఖ రచయిత్రి విశాలాక్షి మృతి

ప్రముఖ రచయిత్రి ద్వివేదుల విశాలాక్షి (85) నవంబర్ 7న అనారోగ్యంతో విశాఖపట్నంలో చనిపోయారు. ఆమె 1929 ఆగస్టు 15న విజయనగరంలో జన్మించింది. వైకుంఠపాళి, మారిన విలువలు, గ్రహణం విడిచింది వంటి నవలలూ, ఆమె కోరిక, ద్వివేదుల విశాలాక్షి వంటి కథలూ, కవితలూ, రేడియో నాటకాలూ రాశారు.

## సాహితీవేత్త యెండ్లూరి చిన్నయ్య మృతి

ప్రముఖ కవి, సాహితీవేత్త, దళిత ఉద్యమకారులు యెండ్లూరి చిన్నయ్య (82) నవంబర్ 7న అనారోగ్యంతో హైదరాబాద్‌లోని ఆయన స్వగృహంలో చనిపోయారు. ఆయన 1933 మే 2న నెల్లూరు జిల్లా, నరుకూరు గ్రామంలో జన్మించారు. ఆయన ఆంధ్ర రిపబ్లికన్, పీపుల్స్ హెరాల్డ్, ప్రజాబంధు పత్రికలకు సంపాదకులుగా పని చేశారు. అనేక దళిత ఉద్యమాలను నడిపారు. అంబేద్కర్ జీవిత చరిత్రను తెలుగులోకి అనువదించారు.

## సుజనా చౌదరి రు. 317 కోట్లు ఎగవేత

కేంద్రమంత్రిగా నవంబర్ 9న ప్రమాణ స్వీకారం చేసిన తెలుగుదేశం పార్టీ ఎంపి సుజనా చౌదరికి చెందిన 'సుజనా టవర్స్ లిమిటెడ్' సంస్థ సెంట్రల్ బ్యాంక్ ఆఫ్ ఇండియా బ్యాంకుకు రు. 317 కోట్లు ఎగ్గొట్టారని నవంబర్ 10న కాంగ్రెస్ అధికార ప్రతినిధి అజయ్ మాకెన్ తెలిపారు. గతంలో సెంట్రల్ బ్యాంక్ ఆఫ్ ఇండియా ఉద్యోగుల సమాఖ్య, సెంట్రల్ బ్యాంక్ ఉద్యోగుల సంఘం మే, అక్టోబర్ నెలల్లో విడుదల చేసిన ప్రకటనలో మంత్రి పేరు ఉంది. మొత్తం రు. 4984 కోట్లను ఎగ్గొట్టిన మొదటి 20 మంది పారిశ్రామికవేత్తల్లో సుజనా చౌదరి 20వ స్థానంలో ఉన్నారు.

## అనర్హులుగా జూనియర్ డాక్టర్లు

సెప్టెంబర్ 29 నుంచి నవంబర్ 12 వరకు (మొత్తం 45 రోజులు) సమ్మె చేసిన 3500 మంది జూనియర్ డాక్టర్లపై నవంబర్ 12న తెలంగాణ ప్రభుత్వం 2015 మార్చ్‌లో జరిగే పరీక్షలకు అనర్హులుగా ప్రకటించింది. పరిమితికి మించి కళాశాలకు హాజరు కాకపోవడమే అనర్హతకు కారణమని ప్రభుత్వ వైద్య విద్యా సంచాలకులు (డిఎంఇ) డా. పుట్ట శ్రీనివాస్ తెలిపారు.

## రాజధాని భూ సమీకరణపై రైతుల విముఖత

ఆంధ్రప్రదేశ్ రాజధాని భూ సమీకరణ కోసం గుంటూరు జిల్లా, తుళ్లూరు మండలం, రాయపూడి గ్రామంలో నవంబర్ 15న రాజధాని సబ్ కమిటీ ఆధ్వర్యంలో జరిగిన ప్రజాభిప్రాయ సేకరణలో ఇరువర్గాల రైతులు భిన్నాభిప్రాయాలు తెలియజేశారు. మెజారిటీ రైతులు భూ సమీకరణను వ్యతిరేకించారు. మైనారిటీ రైతులు భూమిని ఇస్తామన్నారు. ఇస్తామన్న రైతులు గ్రామాన్ని కదిలించకుండా చట్టబద్ధం చేయాలని, భూములను కోల్పోయిన వారికి రు. 5 లక్షల మూలధనం చెల్లించాలని, ఎకరానికి 1300 గజాల నివాస, 300 గజాల వాణిజ్య భూమి ఇవ్వాలని, వ్యవసాయ, బంగారు రుణాలను మాఫీ చేయాలని, విద్యుత్ బిల్లుల బకాయిలన్నింటిని రద్దు చేయాలని, పశువుల మేతకు ప్రత్యేకంగా సర్కారు భూమిని కేటాయించాలని ప్రభుత్వాన్ని డిమాండ్ చేశారు.

## తెలంగాణ చిహ్నాలు

తెలంగాణ రాష్ట్ర అధికారిక చిహ్నాలను ముఖ్యమంత్రి కె. చంద్రశేఖర రావు నవంబర్ 17న ప్రకటించారు. రాష్ట్ర పుష్పంగా బతుకమ్మ పండుగలో వాడే తంగెడు పువ్వు, జంతువుగా జింక, పక్షిగా పాలపిట్ట, వృక్షంగా జమ్మిచెట్టును ఎంపిక చేశారు. తెలంగాణ రాష్ట్ర సంస్కృతి, సంప్రదాయాలు, నైతిక విలువలకు అద్దం పట్టేలా వీటిని ఎంపిక చేశామని తెలిపారు.

## వాన్‌పిక్, లేపాక్షి భూ కేటాయింపులు రద్దు

వైఎస్ రాజశేఖరరెడ్డి హయాంలో వాన్‌పిక్, లేపాక్షి, కినెటా సంస్థలకు కేటాయించిన భూములను రద్దు చేసి, తిరిగి వెనుకకు తీసుకోవాలని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి, రాష్ట్ర మంత్రి వర్గ ఉపసంఘం నవంబర్ 19న సిఫారసులు జారీ చేసింది. ఈ మూడు సంస్థలకు మొత్తం 27 వేల ఎకరాల భూమిని కేటాయించగా, ఈ సంస్థలు ఎపిఐఐసితో చేసుకున్న ఒప్పందాలను ఉల్లంఘించడం వలన భూములను రద్దు చేస్తున్నట్లు మంత్రి వర్గ ఉపసంఘం తెలిపింది.

## గనుల లీజులు రద్దు

ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లో వివిధ గనుల కంపెనీలకు కేటాయించిన 85 గనుల లీజులను నవంబర్ 19న రద్దు చేస్తూ ఆంధ్రప్రదేశ్ పరిశ్రమల శాఖ ముఖ్య కార్యదర్శి జె.ఎ.ఎస్. ప్రసాద్ ఉత్తర్వులు జారీ చేశారు. గనుల కేటాయింపులో, తవ్వకాలలో అనేక అక్రమాలు జరగడం వల్లనే వీటిని రద్దు చేస్తునట్లు తెలిపారు.

## 22 మంది రైతులపై కేసులు నమోదు

మెదక్ జిల్లా, తొగుట మండలం, పెద్దమాసాన్‌పల్లి గ్రామంలో నవంబర్ 19న హెటిరో పార్మసీ కంపెనీ నిర్వహించిన ప్రజాభిప్రాయ సేకరణ సభను అడ్డుకుని, విధ్వంసానికి పాల్పడ్డారంటూ 22 మంది రైతులపై కేసులు నమోదు అయ్యాయి. వీరంతా ఒక సంఘంగా ఏర్పడి హత్యాయత్నం చేశారని, ఆస్తినష్టం కలిగించారని హెటిరో ఉద్యోగి దొమ్మాట రమణారెడ్డి ఫిర్యాదు మేరకు పోలీసులు కేసు నమోదు చేశారు.

## జూనియర్ డాక్టర్ల సమ్మె

గ్రామీణ ప్రాంతాల్లో తప్పని సరిగా ఏడాది పాటు వైద్య సేవలు చేయాలనే నిబంధన (జి.ఒ. 107) ను తొలిగించాలని జూనియర్ డాక్టర్లు ఐదునెలల నుంచి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాన్ని డిమాండ్ చేస్తున్నారు. ప్రభుత్వం నుంచి ఎలాంటి స్పందన రాకపోవడంతో నవంబర్ 22 నుంచి సమ్మె చేస్తూ, రాష్ట్ర వ్యాప్తంగా ఉన్న అన్ని ప్రభుత్వ ఆసుపత్రులలో అత్యవసర సేవలు తప్ప మిగతా అన్ని సేవలన్నీ నిలిపి వేశారు.

## హుద్‌హుద్ నష్టం రు. 21,908 కోట్లు

అక్టోబర్‌లో వచ్చిన హుద్‌హుద్ తుఫాన్ వల్ల రు. 21,908 కోట్ల నష్టం జరిగిందని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, కేంద్ర ప్రభుత్వ అధికారుల బృందానికి నవంబర్ 25న తెలిపింది. ఇందులో వ్యవసాయానికి రు. 947 కోట్లు, ఉద్యానవన పంటలకు రు. 1339 కోట్ల నష్టం జరిగిందని, ఈ తుఫాన్ వల్ల నాలుగు జిల్లాల్లోని 138 మండలాలలో, 7285 గ్రామాలలో నష్టం జరిగిందని, రెండు లక్షల ఇండ్లు కూలిపోయాయని, 61 మంది చనిపోయారని నివేదికలో తెలిపింది. వీ

## మహారాష్ట్ర సిఎంగా ఫడ్నవీస్

మహారాష్ట్ర ముఖ్యమంత్రిగా దేవేంద్ర గంగాధర్‌రావ్ ఫడ్నవీస్ ఎన్నికయ్యారు. ముంబైలోని వాంఖడే స్టేడియంలో అక్టోబర్ 31న ఫడ్నవీస్‌తో ముఖ్యమంత్రిగా గవర్నర్ సి.హెచ్. విద్యాసాగర్ రావు ప్రమాణ స్వీకారం చేయించారు. ఆయనతో పాటు 9 మంది మంత్రులు కూడా ప్రమాణ స్వీకారం చేశారు. బిజెపి ఎన్‌సిపి మద్ధతుతో ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసింది.

## సిక్కుల హంతకుల్ని శిక్షించాల్సిందే

1984 అక్టోబర్ 31న ఇందిరా గాంధీ హత్య జరిగిన రో సిక్కులపై జరిపిన ఊచకోత కేసులన్నింటిని మళ్లీ మొదటి నుంచి నిష్పాక్షికంగా, సమగ్రంగా దర్యాప్తు జరిపించి దోషులను కఠినంగా శిక్షించాలని అమ్నెస్టీ ఇంటర్‌నేషనల్ (ఎఐఐ) నవంబర్ 1న కేంద్ర ప్రభుత్వానికి విజ్ఞప్తి చేసింది. ఈ అల్లర్లలో 3,325 మంది సిక్కులు మరణించగా, ఎంతో మంది మహిళలు అత్యాచారానికి గురయ్యారు. గడిచిన 30 ఏళ్లలో ఈ అల్లర్లకు సంబంధించిన ఒక్క కేసులోనూ నిందితులకు శిక్షపడకపోగా, ఎన్నో కేసులను సాక్ష్యాధారాలు లేవని మూసివేశారు. సాక్ష్యాధారాలు లేవని ప్రభుత్వం తన బాధ్యత నుంచి తప్పించుకోజాలదని ఎఐఐ ప్రోగ్రామ్ డైరెక్టర్ శైలేష్‌రాయ్ విలేఖరులకు తెలిపారు.

## శ్రీనగర్‌లో ఇద్దరు వ్యక్తుల కాల్చివేత

శ్రీనగర్‌లో బుద్‌గావ్ జిల్లాలోని చత్తర్‌గావ్ చెక్‌పోస్టు నుండి నవంబర్ 3న వెలుతున్న కారు ఆపలేదని దానిపై సైన్యం కాల్పులు జరపగా ఇందులోని ఇద్దరు వ్యక్తులు మరణించారు. మరో ఇద్దరు తీవ్రంగా గాయపడి చికిత్స పొందుతున్నారు. ఘటన జరిగిన తరువాత పోలీసులు ఎఫ్ఐఆర్ నమోదు చేసుకుంటూ, కారులో ఉన్నవారు 20 ఏళ్లలోపు వారేనని, వారివద్ద ఆయుధాలు ఏమిలేవన్నారు. తరువాత సైన్యం ఒక ప్రకటన చేస్తూ ఈ సంఘటనలో తీవ్రవాదులు జరిపిన కాల్పుల్లో తమ సైనికులు ఇద్దరు చనిపోయారని, మరో ఇద్దరు గాయపడ్డారని ప్రకటించింది. తరువాతా ప్రకటనను ఉపసంహరించుకుంది

## ప్రాణం తీసిన ఆపరేషన్లు

ఛత్తీస్‌గడ్‌లోని బిలాస్‌పూర్ జిల్లాలో కుటుంబ నియంత్రణ ఆపరేషన్ వికటించి 14 మంది మహిళలు మృతి చెందారు. మరో 60 మంది వివిధ ఆసుపత్రుల్లో చికిత్స పొందుతున్నారు. బిలాస్‌పూర్ పట్టణ శివారులోని పెండారి గ్రామంలో ఉన్న 'నేమిచంద్ జైన్ క్యాన్సర్ అండ్ రీసెర్చ్ సెంటర్'లో నవంబర్ 9న డా. ఆర్.కె. గుప్తా 83 మంది మహిళలకు ఐదు గంటల్లో కుటుంబ నియంత్రణ ఆపరేషన్‌లు చేసి ఆదే రోజు డిశ్చార్జి చేశారు. ఈ మరణాలకు బాధ్యులుగా గుర్తించిన వైద్యాధికారులను రాష్ట్ర ప్రభుత్వం సస్పెండ్ చేసింది. ఈ ఘటలనై 10 రోజుల్లో పూర్తి నివేదిక ఇవ్వాలని ఛత్తీస్‌గడ్ హైకోర్టు రాష్ట్ర ప్రభుత్వాన్ని ఆదేశించింది.

## బ్యాంకు ఉద్యోగుల సమ్మె

దేశవ్యాప్తంగా వివిధ బ్యాంకులలో పనిచేస్తున్న ఉద్యోగులకు తక్షణమే వేతన సవరణ అమలు చేయాలని డిమాండ్ చేస్తూ యునైటెడ్ ఫోరం ఆఫ్ బ్యాంక్ యూనియన్ (యుఎఫ్‌బియు) ఆధ్వర్యంలో నవంబర్ 12న సమ్మె చేశారు. ఈ సమ్మెలో తొమ్మిది బ్యాంకు యూనియన్లకు చెందిన సిబ్బంది, అధికారులు పాల్గొనడంతో బ్యాంకుల కార్యకలాపాలు పూర్తిగా నిలిచి పోయాయి. దేశ వ్యాప్తంగా 27 ప్రభుత్వరంగ బ్యాంకులకు చెందిన 50 వేల శాఖలు మూతపడ్డాయి. దీంతో సుమారు రు. 20 లక్షల కోట్లకు పైగా లావాదేవీలు నిలిచిపోయాయి. ఐదు సంవత్సరాలకు ఒకసారి చేపట్టే వేతన సవరణ విషయంలో ఇండియన్ బ్యాంక్స్ అసోషియేషన్ (ఐబిఎ) మొండి వైఖరిని ప్రదర్శిస్తుందని యుఎఫ్‌బియు కన్వీనర్ ఎం.వి. మురళీ ఆరోపించారు.

## నక్సలైట్ల అణచివేతే ప్రధాన ఎజెండా

దేశంలో నక్సల్ నిరోధించడమే తమ ప్రభుత్వ ప్రధాన ఎజెండా అనీ, వారిని నిరోధించడానికి అవసరమైన అన్ని చర్యలను ప్రభుత్వం తీసుకుంటుందనీ హోం మంత్రి రాజ్‌నాథ్‌సింగ్ తెలిపారు. నక్సల్స్‌ను అణచివేయడానికి కేంద్ర ప్రభుత్వం రూపొందించనున్న విధానంపై సలహాలు, సూచనలు తెలుసుకునేందుకు శరద్‌పవార్, జోతిరాదిత్య సిందియా, కెసి త్యాగి, ముకుల్ రాయ్ సహా తదితర లోక్‌సభ, రాజ్యసభ ఎంపిలు నవంబర్ 12న ఢిల్లీలో సమావేశమయ్యారు. తాము నాలుగు రకాల వ్యూహాలు అనుసరిస్తామనీ, భద్రతాపరమైన విషయాల్లో జోక్యం, అభివృద్ధి, గిరిజన హక్కులు కాపాడడం, ప్రజలకు అవగాహన కల్పించడం ఉన్నాయని అన్నారు.

## సిబిఐ డైరెక్టర్ తొలగింపు

2జి స్పెక్ట్రమ్ కుంభకోణంపై దర్యాప్తు బృందం పర్యవేక్షక బాధ్యత నుంచి తప్పుకోవాలని సిబిఐ డైరెక్టర్ రంజిత్ సిన్హాను సుప్రీంకోర్టు నవంబర్ 20న ఆదేశించింది. ఈ కుంభకోణంలోని నిందితులను సిన్హా తన ఇంటి వద్ద కలుసుకోవడంతో పాటు దర్యాప్తు ప్రక్రియలో జోక్యం చేసుకుంటున్నారని ఆరోపిస్తూ సెంటర్ ఫర్ పబ్లిక్ ఇంటరెస్ట్ లిటిగేషన్ (సిపిఐఎల్) అనే స్వచ్ఛంద సంస్థ సుప్రీం కోర్టులో పిటిషన్ దాఖలు చేసింది. నవంబర్ 20న ప్రధాన న్యాయమూర్తి జస్టిస్ హెచ్‌ఎల్ దత్తు నేతృత్వంలోని బెంచ్ సిన్హాపై వచ్చిన ఆరోపణల్లో విశ్వసనీయత, ఆమోదయోగ్యత కనిపిస్తోందని వ్యాఖ్యానించింది.

## గోవా సిఎంగా ఫర్సేకర్

గోవాకు 22వ ముఖ్యమంత్రిగా లక్ష్మీకాంత్ ఫర్సేకర్ ఎన్నికయ్యారు. ఫర్సేకర్‌ను ముఖ్యమంత్రిగా గవర్నర్ మృదులా సిన్హా ప్రమాణ స్వీకారం చేయించారు. ఆయనతో పాటు తొమ్మిది మంది మంత్రులు కూడ ప్రమాణ స్వీకారం చేశారు. బిజెపి అధికారంలోకి వచ్చాక వివిధ రాష్ట్రాలలో ఆర్ఎస్ఎస్‌తో సన్నిహిత సంబంధాలు కలిగి ఉన్నవారు ముఖ్యమంత్రులుగా నియమించబడుతున్నారు.

## జార్ఖండ్, కశ్మీర్‌లలో తొలివిడత ఎన్నికలు

జార్ఖండ్, జమ్మూకశ్మీర్ అసెంబ్లీ ఎన్నికల తొలి దశ నవంబర్ 25న జరిగింది. కశ్మీర్‌లో తొలి దశ పోలింగ్ జరిగిన 15 స్థానాల్లో గతంలో లేని విధంగా 71.23 శాతం పోలింగ్ నమోదైంది. జార్ఖండ్‌లో 62 శాతం పోలింగ్ నమోదైంది. జార్ఖండ్‌లోని మొత్తం 81 అసెంబ్లీ స్థానాలకుగాను 13 స్థానాలకు, జమ్మూకశ్మీర్‌లో 87 స్థానాలకుగాను 15 స్థానాలకు పోలింగ్ జరిగింది.

## బ్యాంకులను లూటీ చేస్తున్న కార్పొరేట్లు

బ్యాంకుల నుంచి కార్పొరేట్ సంస్థలు, బడా వ్యాపారులు భారీ మొత్తాలలో అప్పు తీసుకొని ఎగవేతలకు పాల్పడుతున్న కారణంగా బ్యాంకుల ఆర్థిక పరిస్థితి దెబ్బతింటోందని రిజర్వ్ బ్యాంక్ గవర్నర్ రఘురాం రాజన్ అన్నారు. వీరు రిస్క్‌లేని పెట్టుబడిదారీ విధానాలు అనుసరిస్తూ బ్యాంకింగ్ రంగం అందిస్తున్న సదుపాయాలను ఎలాంటి జంకు లేకుండా అనుభవిస్తున్నారని అన్నారు. దీని వల్ల నిజాయితీగా అప్పు తీర్చేవారు, పన్ను చెల్లింపుదారులు మూల్యం చెల్లించాల్సి వస్తొందన్నారు. ఆయన గుజరాత్‌లోని ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ రూరల్ మేనేజ్‌మెంట్‌లో నవంబర్ 25న వర్గీస్ కురియన్ స్మారక ఉపన్యాసం ఇస్తూ ఈ వ్యాఖ్యాలు చేశారు.

## రైతు ఆత్మహత్యలపై స్పందించిన ఎన్ఎచ్ఆర్‌సి

తెలంగాణలో నిత్యం జరుగుతున్న రైతుల ఆత్మహత్యలపై జాతీయ మానవ హక్కుల సంఘం (ఎన్‌హెచ్‌ఆర్‌సి) స్పంధించింది. రైతు ఆత్మహత్యలపై రెండు వారాల్లో నివేదిక సమర్పించాల్సిందిగా నవంబర్ 25న తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి రాజీవ్ శర్మకు నోటీసులు జారీచేసింది. పొలాల్లో మృదంగంపై మీడియాలో వచ్చిన ఒక కథనంపై ఎన్‌హెచ్‌ఆర్‌సి స్పందించి సుమోటోగా ఈ అంశాన్ని స్వీకరించింది.

## ప్రెస్ కౌన్సిల్ చైర్మన్‌గా జస్టిస్ సికె ప్రసాద్

సుప్రీంకోర్టు మాజీ న్యాయమూర్తి సి.కె. ప్రసాద్ ప్రెస్ కౌన్సిల్ ఆఫ్ ఇండియా చైర్మన్‌గా నియమితులయ్యారు. రాజ్యసభ చైర్మన్ హామీద్ అన్సారీ అధ్యక్షతన గల కమిటీ ఈ నిర్ణయం తీసుకున్నట్లు కేంద్ర సమాచార శాఖ నవంబర్ 26న తెలిపింది. ప్రస్తుత చైర్మన్ కట్జూ స్థానంలో జస్టిస్ ప్రసాద్ బాధ్యతలు స్వీకరించనున్నారు. వీ

## యూనియన్ కార్బైడ్ ఆండర్సన్ మృతి

భోపాల్‌లో ముప్పై ఏళ్ల క్రితం విషవాయువు లీక్ దుర్ఘటనకు కారణమైన యూనియన్ కార్బైడ్ (యుసి) సంస్థ అధిపతి వారెన్ ఆండర్సన్ మరణించారు. ఆయన అమెరికాలో సెప్టెంబర్ 29నే మరణించినప్పటికీ ఆయన కుటుంబ సభ్యులు బహిర్గతం చేయలేదనీ, ప్రభుత్వ రికార్డుల ద్వారా ఆండర్సన్ మరణ వార్తను ధ్రువీకరించుకున్నామనీ న్యూయార్క్ టైమ్స్ ప్రచురించింది. 92 ఏళ్ల ఆండర్సన్ సెప్టెంబర్ 29న ఫ్లొరిడాలోని వెరో బీచ్‌లోని ఒక నర్సింగ్ హోమ్‌లో చికిత్స పొందుతూ చనిపోయాడు. 1984 డిసెంబర్ 2న అర్ధరాత్రి భోపాల్‌లోని యూనియన్ కార్బైడ్ ప్లాంట్‌లో విడుదలైన మిథైల్ ఐసో సైనైడ్ వాయువు మూలంగా దాదాపు ఐదు వేల మందికి పైగా మరణించారు. లక్షలాది మందికి పైగా భయంకరమైన వ్యాధులకు గురయ్యారు. ఆ సమయంలో యుసి చైర్మన్‌గా ఉన్న ఆండర్సన్ దుర్ఘటన జరిగిన నాలుగు రోజుల తర్వాత భోపాల్‌కు వెళ్లి అరెస్టయ్యారు. ఆ వెంటనే బెయిల్ పొంది దేశం విడిచి పారిపోయి మళ్లీ తిరిగి రాలేదు.

## లాహోర్‌లో ఆత్మాహుతి దాడి

పాకిస్తాన్‌లోని లాహోర్‌లో వాఘా సరిహద్దు వద్ద నవంబర్ 2న సాయంత్రం జరిగిన ఆత్మాహుతి దాడిలో 55 మంది చనిపోయారు. మృతుల్లో చిన్నారులతో పాటు పదకొండు మంది మహిళలు, ముగ్గురు భద్రతా సిబ్బంది ఉన్నారు. రెండు వందల మంది తీవ్రంగా గాయపడ్డారు. భారత – పాకిస్తాన్ సరహద్దు వద్ద నవంబర్ 2న పతాక అవనతం పూర్తయిన కొద్దిసేపటికే శక్తిమంతమైన పేలుడు సంభవించింది. పరేడ్ ఏరియా నుంచి సందర్శకులు తిరిగి వెళుతుండగా ఎగ్జిట్ గేట్ వద్దకు వచ్చిన ఇరవై ఏళ్ల వ్యక్తి తనను తాను పేల్చుకున్నాడని భద్రతాబలగాలు తెలిపాయి. పాకిస్తాన్‌లోని లాహోర్ – భారతదేశంలోని అమృత్‌సర్‌కు మధ్య సరిహద్దు దాటడానికి ఉన్న ఏకైక రోడ్డు మార్గం వాఘా సరిహద్దే. ప్రతిరోజు సాయంత్రం పతాక అవనత కార్యక్రమం నిర్వహించిన తర్వాత ఇరు దేశాలు సైనిక కవాతు నిర్వహించిన తర్వాత సరిహద్దును మూసేస్తారు. ఈ కవాతును తిలకించడానికి ప్రతిరోజూ వేలాది మంది సందర్శకులు తరలి వస్తుంటారు.

## ట్రైవ్యాలీ నిందితురాలికి 16 ఏళ్ల జైలు

అమెరికాలోని ట్రైవ్యాలీ యూనివర్సిటీ (టివియు)లో విద్యార్థులను మోసగించిన నేరానికి గాను ఆ యూనివర్సిటీ వ్యవస్థాపకురాలు సుసాన్ గ్జియావో పింగ్‌సుకు పదహారు ఏళ్ల జైలు శిక్ష విధించినట్లు అమెరికా న్యాయశాఖ ప్రకటించింది. విదేశీ విద్యార్థులకు అమెరికాలో చదువుకునే అవకాశం కల్పించే సదుద్దేశంతో ఏర్పాటు చేసిన ఇమ్మిగ్రేషన్ ప్రక్రియను తన అక్రమార్జనకు మోసపూరితంగా ఉపయోగించుకుని అనేకమంది విద్యార్థులను మోసగించింది. ఇమ్మిగ్రేషన్ అక్రమాలు, వీసా మోసం, నగదు అక్రమ రవాణా సహా మొత్తం 31 నేరాలకు గానూ ఆమెకు శిక్షపడింది. సుసాన్‌కు చెందిన 56 లక్షల డాలర్ల మేరకు ఆస్తుల జప్తు, తొమ్మిది లక్షల డాలర్ల జరిమానాను సుసాన్‌కు డిస్ట్రిక్ట్ కోర్ట్ న్యాయమూర్తి జాన్ ఎస్ టైగార్ విధించారు.

## ఒబామాకు గడ్డుకాలం

అమెరికా అధ్యక్షుడు బరాక్ ఒబామాకు మధ్యంతర ఎన్నికల ఫలితాలు కోలుకోలేని దెబ్బతీశాయి. పార్లమెంట్ ఉభయ సభలకు జరిగిన మధ్యంతర ఎన్నికలలో అధికారిక డెమోక్రాటిక్ పార్టీ ఆధిపత్యం పడిపోయింది. ప్రతినిధుల సభలోని మొత్తం 435 స్థానాలకు జరిగిన ఎన్నికలలో రిపబ్లికన్లు 235 సీట్లు సాధించారు. డెమోక్రాట్లు కేవలం 157 స్థానాలు గెలుచుకున్నారు. సెనెట్‌లోని 100 సీట్లు ఉండగా అందులో రిపబ్లికన్లు 52 సీట్లు, డెమోక్రాట్లు 43 సీట్లు గెలుచుకున్నారు.

## నైజీరియాలో మారణహోమం

నైజీరియా ఈశాన్యంలోని యోబె రాష్ట్రం, పోటిస్కమ్ పట్టణంలో ఓ ప్రభుత్వ ఉన్నత పాఠశాలలో నవంబర్ 10న జరిగిన మానవబాంబు దాడిలో 78 మంది విద్యార్థులు చనిపోయారు. మరో వంద మందికి పైగా గాయపడ్డారు. ఉదయం తరగతులు ప్రారంభం కావడానికి ముందు ప్రార్థన కోసం రెండు వేల మంది విద్యార్థులు ఒకే చోట చేరిన సమయంలో ఆత్మాహుతి దాడికి పాల్పడడంతో ఎక్కువ మంది విద్యార్థులు చనిపోయారు.

## అమెరికాలో భారీ మంచు తుఫాన్

అమెరికాలో భారీ మంచు తుఫాన్ సంభవించింది. ఈ నవంబర్ 18న మొత్తం 50 రాష్ట్రాల్లో ఉష్ణోగ్రత సున్నా డిగ్రీల సెల్సియస్‌కు పడిపోయింది. ఎడతెరిపి లేకుండా మంచు కురుస్తుండడం, వర్షాలు పడుతుండడంతో రోడ్డు రవాణా వ్యవస్థ పాడైపోయింది. పెద్ద సంఖ్యలో కార్లు, ఇతర వాహనాలు రోడ్లపై చిక్కుకుపోయాయి. న్యూయార్క్, బోస్టన్ సహా అనేక నగరాల్లో మంచు తుఫాన్ బీభత్సం సృష్టించింది. ఈ తుఫాన్‌లో ఎనిమిది మంది మృతి చెందగా, లక్షలాది మంది ఇబ్బంది పడ్డారు.

## తమిళ జాలర్ల ఉరిశిక్ష రద్దు

మాదకద్రవ్యాల అక్రమ రవాణా కేసులో శ్రీలంకలోని కొలంబో ప్రత్యేక కోర్టు విధించిన ఉరిశిక్షను శ్రీలంక అధ్యక్షుడు మహీంద రాజపక్స రద్దుచేసి క్షమాభిక్ష ప్రసాదించారు. దీంతో వీరందరిని నవంబర్ 19న శ్రీలంక ప్రభుత్వం విడుదల చేసింది. వారిని తదుపరి చర్యల కోసం జైలు అధికారులు శ్రీలంకలోని భారత హైకమిషన్ అధికారులకు అప్పగించారు. రామనాథపురం జిల్లా రామేశ్వరానికి చెందిన జాలర్లు ఎమర్సన్, పి. అగస్టస్, ఆర్. విల్సన్, కె. ప్రసాద్, జె. లంగ్లెట్ మాదక ద్రవ్యాల అక్రమ రవాణాకు పాల్పడ్డారనే అభియోగంపై 2011లో శ్రీలంక అరెస్ట్ చేసింది. నిందితులకు ఉరిశిక్ష విధిస్తున్నట్లు ఈ ఏడాది అక్టోబర్ 30న కొలంబో హైకోర్ట తీర్పు చెప్పింది. ఇందుకు తమిళనాడులో తీవ్రస్థాయిలో నిరసనలు వెల్లువెత్తాయి. భారత ప్రభుత్వం జోక్యం చేసుకొని ఉరిశిక్షలు రద్దు అయ్యేలా శ్రీలంకపై ఒత్తిడి తెచ్చాయి.

## అప్ఘనిస్తాన్‌లో ఆత్మాహుతి దాడి

అప్ఘనిస్తాన్‌లోని పక్తికా ప్రావిన్స్‌లోని యాహ్యా ఖైల్ జిల్లాలో నవంబర్ 23న ఒక వాలీబాల్ మ్యాచ్ పై ఆత్మాహుతి దాడి జరిగింది. మ్యాచ్ చూసేందుకు పెద్ద సంఖ్యలో ప్రజలు తరలి వచ్చిన సమయంలో ఈ దాడి జరగడంతో సుమారు యాభై మందికి పైగా మరణించారు. మరో అరవై మంది తీవ్రంగా గాయపడ్డారు. మోటార్ సైకిల్‌పై వాలీబాల్ గ్రౌండ్‌లోకి వచ్చిన ఉగ్రవాది తనను తాను పేల్చుకున్నాడు. తాలిబన్ల నుంచి ఎదురవుతున్న సవాళ్లను ఎదుర్కోవడంలో అప్ఘన్ నేషనల్ ఆర్మీ, పోలీసులు ఇబ్బందులు ఎదుర్కొంటున్న నేపథ్యంలో 12,500 నాటో బృందాలు వచ్చే ఏడాది కూడా దేశంలో కొనసాగేందుకు అప్ఘనిస్తాన్ పార్లమెంట్ ఆమోదించిన రోజే ఈ దాడి జరిగింది.

## ఫెర్గూసన్‌లో ఉద్రిక్తత

నిరాయుధుడైన పద్దెనిమిది సంవత్సరాల నల్లజాతి యువకుడు మైకేల్ బ్రౌన్‌ను కాల్చిచంపిన శ్వేతజాతి పోలీసు డారెన్ విల్సన్‌పై అభియోగాలు మోపేందుకు గ్రాండ్ జ్యూరీ నిరాకరించింది. ఆగస్ట్ 9న ఫెర్గూసన్‌లో బ్రౌన్‌ను డారెన్ విల్సన్ కాల్చి చంపాడు. హంతకుడిపై మీద హత్యానేరం నమోదు చేయనవసరం లేదని నవంబర్ 24న గ్రాండ్ జ్యూరీలోని తొమ్మిది మంది శ్వేత జాతీయులు ఓటు వేశారు. జ్యూరీలో ఉన్న పన్నెండు మందిలో తొమ్మిది మంది శ్వేతజాతీయులే.

## మరణశిక్షలపై మారటోరియం

ప్రపంచ వ్యాప్తంగా మరణశిక్షల అమలుపై ఐక్యరాజ్యసమితి మారటోరియం విధించింది. ఈ మేరకు నవంబర్ 25న ఐరాస జనరల్ అసెంబ్లీలో ఓటింగ్ జరగ్గా మెజారిటీ దేశాలు అనుకూలంగా ఓటు వేశాయి. భారత దేశం మరో 35 దేశాలతో కలిసి ఈ తీర్మానానికి వ్యతిరేకంగా ఓటు వేసింది. తీర్మానం ప్రకారం 18 ఏళ్లలోపు వయసు వారు, గర్భిణులు, మానసిక వైకల్యం ఉన్నవారికి మరణశిక్ష విధించరాదు. తీర్మానానికి అనుకూలంగా 114 ఓట్లు రాగా, వ్యతిరేకంగా 36 ఓట్లు వచ్చాయి. మరో 34 దేశాలు ఓటింగ్‌కు దూరంగా ఉన్నాయి. వీ

# వీక్షణం 2014 సూచిక

**జనవరి 2014** — సంచిక : **150**



**ఫిబ్రవరి 2014** — సంచిక : **151**



**మార్చ్ 2014** — సంచిక : **152**



**ఏప్రిల్ 2014** — సంచిక : **153**

# సంస్థాగతం

**మే 2014** **సంచిక : 154**

పాఠకుల వీక్షణం
ఈ బవిరి గడ్డపు హిట్లర్‌ను అడ్డుకుందాం! (సంపాదకీయం)
చుండూరు నరహంతలు నిర్దోషులట!;
కాగితపు పులి గొప్పలను బైటపెట్టిన విమాన ప్రమాదం (సంపాదకీయ వ్యాఖ్యలు)
కొత్త పుస్తకాలు / సి.డి.లు
ఈనేల – ఎ. మల్లేశ్
చుండూరు దళితుల్ని చంపిందెవరు? – దుడ్డు ప్రభాకర్
మౌలిక సమస్యల ఊసెత్తని ఎన్నికల ఎజెండాలు – బి. రామకృష్ణ
మానిఫెస్టోల్లో వ్యవసాయ రంగానికి అన్యాయం – ఎస్. ఆశాలత
గెలుపే ధ్యేయంగా పొత్తులు, వలసులు – ఎ. నర్సింహారెడ్డి
నోటా వల్ల ఒరిగేదేమిటి? – షేక్ కరిముల్లా
నోటా ఆవశ్యకత – ఎం. కె. కుమార్
విలువల్లేని విమర్శల వెల్లువ – వై రామచంద్రం
లెఫ్ట్ ఎందుకు బలహీన పడుతోంది? – టంకశాల అశోక్
భారతీయ వోటర్ పశ్చాత్తాపం – బ్రజ్ రంజన్ మణి
నరేంద్ర మోడీ నిజస్వరూపం – బి.ఎస్. రాజు
పారిశ్రామిక అభివృద్ధి – పంట భూముల విధ్వంసం – పి.వి. రమణ
కొత్త రాష్ట్రంలో రాయలసీమ భవిష్యత్తు – ఎం. భాస్కర్
దేశం మనది, రక్షణ అమెరికాది – వి. హనుమంతరావు
పులిని చూసి... (వివిహెచ్ కాలమ్)
క్రాంతికారీ జనతన సర్కార్ – వరవరరావు
మన కాలానికి కావలసిన అంబేద్కర్ – ఆనంద్ తెల్ తుంబ్డె
కుల సమస్య – మార్క్సిస్టు అవగాహన – ఒక నోట్ – 2 – రవి
రిలయన్స్ గ్యాస్ బందిపోటు వివరాలు – ఎన్. వేణుగోపాల్
బాల్కో వ్యతిరేక పోరాట విజయగాథ – నటాషా
పతనావస్థలో ప్రజారోగ్యం – డా. నళిని
అఫ్ఘనిస్తాన్, ఇరాక్ ప్రతిఘటన పోరాటాలు – నర్సింహ
పరిశోధనా గ్రంథాలు, అధ్యయన పత్రాలపై ఆంక్షలెందుకు? – ఎ. రాజేంద్రబాబు
ఇరుగు–పొరుగు – వై. రామచంద్రం
భూగోళం – పి. వీరబ్రహ్మచారి
అసహజ మరణాలు – వై. రామచంద్రం, ఎ. మల్లేశ్

**జూన్ 2014** **సంచిక : 155**

పాఠకుల వీక్షణం
దేశానికి ఏం కానుంది? (సంపాదకీయం)
రెండు తెలుగు రాష్ట్రాల ప్రజా సమస్యలు; మార్క్స్, ఎంగెల్స్‌ల రచనలు ఎవరి ఆస్తి? (సంపాదకీయ వ్యాఖ్యలు)
కొత్త పుస్తకాలు / సి.డి.లు
ఈనేల – ఎ. మల్లేశ్
ఎన్నికలు ముగిసాయి – హామీలు మిగిలాయి – ఎ. నర్సింహారెడ్డి
సీమాంధ్ర ధనికులకు బలైన కాంగ్రెస్ – టంకశాల అశోక్
ఎన్నికలు ఏం చెబుతున్నాయి? – బి.రామకృష్ణ
ఎన్నికల ఫలితాలు – విశ్లేషణ – బి.ఎస్. రాజు
మోడీజీ, గ్రామాల నుంచి పాలించండి! – వి. హనుమంతరావు
తెలుసుకోదగిన విషయాలు (వివిహెచ్ కాలమ్)
మోడీ విజయం అభివృద్ధిదా, విద్వేషానిదా? – రామ్ పునియానీ
కుహనా ప్రజాస్వామ్యానికి స్వాగతం – ఇర్ఫాన్ అహ్మద్
సెల్‌ఫోన్‌లపై కాంగో ప్రజల నెత్తురు – నర్సింహ
సాయిబాబా నిర్బంధం – భవిష్యత్తు సూచనలు – వి. కదలి
ఉన్నత విద్యాసంస్థల్లో నిరంకుశత్వం – రాజవరం పార్థసారథి
విమానాశ్రయాల్లో ఉద్యోగినుల స్థితిగతులు – కవిని
ఆదివాసులను అన్ని విధాలుగా ఆదుకోవాలి – డా. ఇమ్మానేని సత్యసుందరం
విశాఖ మన్యంలో గ్రీన్‌హంట్ దాడులు – కొర్ర జ్యోతి
మైనింగ్ మాఫియాపై చింతలూరు దళితుల పోరాటం – హేమా వెంకట్రావ్
కార్పొరేట్ల మేలుకే రుణ మాఫీ – ముప్పాళ్ళ భార్గవశ్రీ
పదో తరగతి పరీక్షలు–ఎ(డి) గ్రేడ్ ఫలితాలు – కె. ప్రభాకర్
విద్యా వ్యవస్థకు చికిత్స చేసేదెన్నడు? – రావుల రాజేశం
జన్యుమార్పిడి పంటలు జనం కోసం కాదు – ఎం. నాగమణి
కోస్తా తీరం కల్లోల సాగరం – ఇక్బాల్ ఎంజి
పోలీసు వ్యవస్థ–కోర్టులు–జైళ్లు – చిమ్మె జాన్ బర్నబాస్
ఈ శతాబ్దపు రైఫిల్ (సంస్మరణ) – విశ్వం
జనతన సర్కార్లల్లో ప్రజా వైద్యం – నటాషా
కుల సమస్య – మార్క్సిస్టు అవగాహన – ఒక నోట్ – 3 – రవి
ప్రపంచీకరణలో గ్రామీణ వృత్తులు – సైదులు పోలం, డా. కె. ఐలయ్య
ఇరుగు–పొరుగు – వై. రామచంద్రం
భూగోళం – పి. వీరబ్రహ్మచారి
అసహజ మరణాలు – వై. రామచంద్రం, ఎ. మల్లేశ్

**జూలై 2014** **సంచిక : 156**

పాఠకుల వీక్షణం
కొత్త రాష్ట్ర ప్రభుత్వాల పాత పద్ధతులు (సంపాదకీయం)
హిందూత్వ అసహనం, కార్పొరేట్ దౌర్జన్యం;
ఈ యుద్ధంలోనైనా ఇరాక్ ప్రజలు గెలుస్తారా? (సంపాదకీయ వ్యాఖ్యలు)
వర్తమాన చరిత్ర – రాజకీయార్థిక దృష్టి
కొత్త పుస్తకాలు / సి.డి.లు
ఈనేల – ఎ. మల్లేశ్
బదాయున్ అత్యాచారాల నేపథ్యం – బి. రామకృష్ణ
సుపరిపాలనా? 'స్వ' పరిపాలనా? – వి. హనుమంతరావు
తెలుసుకోదగిన విషయాలు (వివిహెచ్ కాలమ్)
రుణమాఫీ – వ్యవసాయ సంక్షోభం – ఎస్. ఆశాలత
పోలవరం ఆదివాసులకు విద్రోహ దినం – వరవరరావు
చుండూరు హత్యలపై న్యాయస్థానపు అన్యాయం – ఎడ్ల పోచయ్య
పెయిడ్ న్యూస్‌తో వాస్తవాలు మాయం – పి. సూర్యం
తప్పైన మజ్లిస్ అంచనాలు – టంకశాల అశోక్
భారత రాజకీయ మాయాజూదం – బి.ఎస్. రాజు
ఎన్నికలలో ఓడిందెవరు? గెలిచిందెవరు? – షేక్ కరిముల్లా
పరిహాసం పాలైన 'ప్రజాస్వామ్యం' ? – అరుణ్
తెలంగాణ ఉద్యమ విజయ వైఫల్యాలు – శ్రీధర్ దేశ్‌పాండే
రక్షణ రంగంలో విదేశీ పెట్టుబడులు – భాస్కర్ ఏంపెల్లి
అధికరణం 370 పూర్వాపరాలు – ఎ. నర్సింహారెడ్డి
ఇరాక్‌లో జాతీయ యుద్ధం – పి. ప్రసాదు
బ్రెజిల్ ప్రపంచ కప్ నిరసనలు – ఎం.కె. కుమార్
ముందున్నది అనూహ్య మార్పుల కాలం – నర్సింహ
ప్రాథమిక విద్యలో దళితులపై వివక్ష – ఎం. గంగాధర్
ఆదివాసుల హక్కును హరిస్తున్న ప్రభుత్వాలు – ఎం. నాగమణి
'స్వతంత్ర భారతం'లో వలస బతుకులు – నటాషా
సంస్మరణ – ఎన్నటికీ తీరని రుణం – మాదిరాజు రాంబాబు
21వ శతాబ్దంలో ప్రజాస్వామ్యం– సామ్యవాదం – ప్రతాప్
ఇరుగు–పొరుగు – వై. రామచంద్రం
భూగోళం – పి. వీరబ్రహ్మచారి
అసహజ మరణాలు – వై. రామచంద్రం, ఎ. మల్లేశ్

**ఆగస్టు 2014** **సంచిక : 157**

పాఠకుల వీక్షణం
అన్ని రంగాల్లోనూ స్పష్టమవుతున్న మోడీ రంగు (సంపాదకీయం)
నవ తెలంగాణ నిర్మాణ దిశ ఇదేనా?; అవే విధానాలు కొనసాగిస్తున్న చంద్రబాబు;
వినండి గాజా విధ్వంస శోకం (సంపాదకీయ వ్యాఖ్యలు)
కొత్త పుస్తకాలు / సి.డి.లు
వర్తమాన చరిత్ర – రాజకీయార్థిక దృష్టి
గ్యాస్ ప్రమాదం – రైల్వే గేటు విషాదం – సి. రాజశేఖర్
యుపిఎ మూడవ ప్రభుత్వమే మోడీ ప్రభుత్వం – వి. హనుమంతరావు
కార్పొరేట్ అనుకూల బడ్జెట్ – ఎ. నర్సింహారెడ్డి
పాశ్చాత్య దేశాల కపటత్వం – సుసాన్ అబుల్ హవా
అబద్దాల పుట్ట మీడియా – నర్సింహ
హైదరాబాద్‌పై గవర్నర్ గిరీ – బి. రామకృష్ణ
తెలంగాణ ప్రభుత్వ విధానాల దిశ ఎటు? – ఎన్. వేణుగోపాల్
ప్రత్యేక తెలంగాణలో ప్రజాతంత్ర విద్య – బి. రఘుపతి
ప్రభుత్వ కళాశాలల్లో అడ్మిషన్లు నిల్ – రావుల రాజేశం
న్యాయమూర్తుల నియామకాలపై మోడీ ప్రభావం – చిమ్మె జాన్ బర్నబస్
రైతుల్ని దగా చేస్తున్న రుణమాఫీ పథకం – ముప్పాళ్ల భార్గవశ్రీ
ఆంధ్ర చంద్రుడు మారలేదంటున్న ప్రజలు – భూసారం శివన్న
మూర్ఖత్వమే పాండిత్యంగా కనబడే వేళ – సుభాష్ గాతాడే
తెలుగు మీడియాలో అంధ దశ – టంకశాల అశోక్
ఎవరెస్టంత భావ కాలుష్యం! – రంగనాయకమ్మ
పోటీని ఏర్పర్చడం ఎలా? – ఎన్.వి.ఎస్. నాగభూషణ్
మావోయిస్టు ఆత్మహత్య రాజ్యం చేసిన హత్య – తుంపాల శ్రీరామమూర్తి
క్రికెట్ ఓ విష జ్వరం – జె.ఆర్. నాగభూషణం
ప్రాథమిక విద్యలో దళితులపై వివక్ష – ఎం. గంగాధర్
పోరాటాలే తెలంగాణ నవ నిర్మాణానికి నాంది – గద్దం వెంకటరాజం
సైద్ధాంతిక చర్చ – గతితర్కం – ఒక వివరణ – వై.వి. రమణారావు
చర్చ – కుల సమస్య–అంబేద్కరిజం–మరికొన్ని కోణాలు – కె. రమేష్
పుస్తక సమీక్ష – మహిళలపై దాడులను ఖండించిన 'అగ్నిశిఖ' – గోమతి
ఈనేల – ఎ. మల్లేశ్
ఇరుగు–పొరుగు – వై. రామచంద్రం
భూగోళం – సి. రాజశేఖర్
అసహజ మరణాలు – వై. రామచంద్రం, ఎ. మల్లేశ్

**సెప్టెంబర్ 2014** **సంచిక : 158**



**అక్టోబర్ 2014** **సంచిక : 159**



**నవంబర్ 2014** **సంచిక : 160**



**డిసెంబర్ 2014** **సంచిక : 161**

# అసహజ మరణాల సూచి

సంకలనం : వై.రామచంద్రం, ఎస్. వెంకటేష్

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ అసహజ మరణాలకు లెక్కలేనన్ని ఆర్థిక, సామాజిక, రాజకీయ కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్థాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషులకోసం ఇంకాస్త బాధ్యతగానూ, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

**(అక్టోబర్ 1 నుండి అక్టోబర్ 31, 2014 వరకు తెలంగాణలోని 7 జిల్లాలు (941), ఆంధ్రప్రదేశ్‌లోని 5 జిల్లాలలో (375) అసహజ మరణాల పాలైన వారి సంఖ్య 1316)**

| జిల్లా | ఆకలి | ఆత్మహత్యలు | | | | చికిత్స అందక, అనారోగ్యం | | | గుర్తు తెలియని | | హత్యలు | | ప్రమాదాలు | | | | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు | | | | | | | | | పనిచేసే స్థలంలో | కరెంట్ | రహదారి | ఇతరాలు | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| | | | | స్త్రీ | పు. | స్త్రీ | పు. | పి. | స్త్రీ | పు. | స్త్రీ | పు. | | | | | | | | | |
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) | (11) | (12) | (13) | (14) | (15) | (16) | (17) | (18) | (19) | (20) | (21) | (22) |
| ఆదిలాబాద్ | 1 | 8 | - | 13 | 23 | 20 | 19 | 8 | 2 | 2 | 2 | 3 | 1 | 2 | 28 | 33 | - | - | - | 3 | - |
| మెదక్ | 4 | 36 | 6 | 11 | 9 | 11 | 9 | 4 | 2 | 4 | 1 | 4 | 12 | 16 | 32 | 14 | - | - | - | 4 | 2 |
| కరీంనగర్ | - | 3 | - | - | - | 8 | - | - | - | 4 | 2 | 3 | 2 | 1 | 42 | - | - | - | - | - | - |
| ఖమ్మం | - | 2 | - | 9 | 13 | 14 | 14 | 3 | - | 3 | 2 | - | - | 6 | 11 | 16 | - | - | - | - | - |
| మహబూబ్‌నగర్ | - | 4 | 25 | - | 27 | 8 | 3 | 6 | - | - | 16 | 23 | 22 | 9 | 43 | 7 | - | - | - | - | 3 |
| రంగారెడ్డి | 2 | 11 | - | 20 | 17 | 8 | 13 | 2 | 3 | 17 | 2 | 4 | 5 | 8 | 38 | 21 | - | - | - | - | - |
| నల్గొండ | | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | | | | | |
| నిజామాబాద్ | - | - | - | 12 | 21 | 2 | 1 | - | 3 | 4 | 7 | 1 | 1 | 3 | 18 | 22 | - | - | - | - | - |
| వరంగల్ | | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | | | | | |
| **తెలంగాణ** | **7** | **64** | **31** | **65** | **110** | **71** | **59** | **23** | **10** | **34** | **32** | **38** | **33** | **45** | **194** | **113** | **-** | **-** | **-** | **7** | **5** |
| అనంతపురం | - | 1 | 2 | 4 | 6 | 5 | 4 | 3 | 1 | 1 | 2 | 1 | 5 | 3 | 3 | 3 | - | - | - | - | - |
| చిత్తూరు | - | - | - | 7 | 8 | - | - | - | - | - | 2 | 3 | 7 | - | 27 | - | - | - | - | - | 1 |
| కడప | - | - | 5 | 9 | 4 | 1 | 1 | 2 | - | - | 13 | 15 | - | 1 | - | 1 | - | - | - | - | 4 |
| కర్నూలు | | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | | | | | |
| ప్రకాశం | - | 1 | 1 | 16 | 4 | 1 | 3 | 2 | 1 | 1 | 4 | 2 | 20 | 2 | 22 | 24 | - | - | 1 | - | 9 |
| శ్రీకాకుళం | | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | | | | | |
| విశాఖపట్నం | - | - | - | 2 | 4 | - | 5 | - | - | 7 | - | 1 | 2 | 1 | 17 | 21 | - | - | - | 10 | 36 |
| **ఆంధ్రప్రదేశ్** | **-** | **2** | **8** | **38** | **26** | **7** | **13** | **7** | **2** | **9** | **21** | **22** | **34** | **7** | **69** | **49** | **-** | **-** | **1** | **10** | **50** |

VEEKSHANAM Telugu Monthly Journal of Political Economy and Society - 161 - December 2014 ● **ISSN 2231-6892**
● RNI Regn.No.APTEL/2003/11482 ● Published on 27/11/2014 ● Postal Regn. No. L II/RNP/HD/1100/2014-16
Date of Posting : 29th, 30th

## ‘వీక్షణం’ను ఆదుకుందాం
## ‘వీక్షణం’ నాలుగు కాలాల పాటు నిలిచేందుకు చేయూతనిద్దాం

తెలుగులో ఎకనమిక్ అండ్ పొలిటికల్ వీక్లీ వంటి పత్రిక ఉండాలనే ఆలోచనతో, సీనియర్ పాత్రికేయులు వి. హనుమంతరావు సంపాదకులుగా 2003లో ప్రారంభమై, 2005 నుంచి ఎన్. వేణుగోపాల్ సంపాదకత్వంలో నడుస్తున్న రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక ‘వీక్షణం’ తెలుగు సమాజానికి అవసరమైన చర్చావేదికగా పనిచేస్తున్నదని, మనందరితో పాటు వేలాదిమంది పాఠకుల ఆదరాభిమానాలు చూరగొన్నదని మనకు తెలుసు. పన్నెండు సంవత్సరాలుగా నిరంతరాయంగా నడుస్తున్న ఈ పత్రిక ఆర్థిక పరిస్థితి ఇప్పటికీ దినదిన గండంగానే ఉంటున్నది. ఎప్పుడు ఆగిపోతుందో తెలియదని దాదాపు ప్రతినెలా పత్రికలో అచ్చవుతున్న ఆందోళనాకరమైన ప్రకటన, ఈ పత్రికను నిలబెట్టడానికి తోడ్పడమనే అభ్యర్థనలు మా ఈ బహిరంగ ప్రకటనకు కారణం. ఇంతకాలంగా నిర్వాహకులు కష్టనష్టాలు భరిస్తూ సాగించిన కృషికి ఇప్పుడు మన సహకారం అవసరమని చెప్పడానికే ఈ ప్రకటన.

‘వీక్షణం’ ఈ పన్నెండు సంవత్సరాలలో మూడువేలకు పైగా వ్యాసాలను ప్రచురించి ప్రాంతీయ, దేశీయ, అంతర్జాతీయ అంశాలెన్నిటి పైననో తెలుగు సమాజానికి అత్యవసరమైన సమాచారాన్నీ, వివరణలనూ, విశ్లేషణలనూ అందించింది. సంపాదకుడి అభిప్రాయాలే వైనప్పటికీ, తెలుగు సమాజంలో ఉన్న ప్రగతిశీల భావాలకూ, ధోరణులకూ అన్నిటికీ ప్రజాస్వామిక స్ఫూర్తితో వేదిక కల్పించింది. ప్రతిష్ఠాత్మకమైన ఐఎస్ఎస్ఎన్ గుర్తింపు సంపాదించి పరిశోధక విద్యార్థులకు, విశ్వవిద్యాలయ అధ్యాపకులకు అవకాశాలు కల్పించింది. ప్రతి సంవత్సరం రచయితల సమావేశాలు, సంభాషణలు ఏర్పాటు చేసి తెలుగు సమాజంలో సామాజిక శాస్త్ర రచనను ప్రోత్సహించింది. వ్యాసరచనా అధ్యయన తరగతులు నిర్వహించి వ్యాసప్రక్రియ ప్రమాణాలు పెంచడానికి తన వంతు కృషి చేసింది. పత్రికలో లబ్ధప్రతిష్ఠుల రచనలు ప్రచురించడంతో పాటు, విషయమే ప్రధానంగా ఐదారు వందలమంది కొత్త వ్యాసకర్తలకు అవకాశం కల్పించింది. ‘ఒక దళారీ పశ్చాత్తాపం’ వంటి విస్తృత ప్రచారం పొందిన పుస్తకంతో సహా దాదాపు డజను పుస్తకాలు ప్రచురించింది.

తెలుగు సమాజానికీ, మేధో ప్రపంచానికీ, రాజకీయార్థిక, సామాజిక విశ్లేషణకూ ఇంత దోహదం చేసిన ‘వీక్షణం’ ఆర్థిక ఇబ్బందుల్లో ఉన్నప్పుడు, ఆ దీపం కొడిగట్టిపోకుండా కాపాడడం సమాజం బాధ్యత. ఇతోధిక పాఠకులను తయారు చేయడం, విరివిగా చందాలు చేర్పించడం, వ్యాపార ప్రకటనలు సేకరించిపెట్టడం, విరాళాలు అందించడం మన కనీస కర్తవ్యం. ‘వీక్షణం’ శ్రేయోభిలాషి, చరిత్రకారులు వకుళాభరణం రామకృష్ణ ‘వీక్షణం’ రచయితల సమావేశాల్లో సూచించినట్టుగా ఆర్థిక ఇబ్బందుల నుంచి సుస్థిరమైన పద్ధతిలో గట్టెక్కాలంటే ‘వీక్షణం’కు ఒక మూలనిధి కూడ ఏర్పాటు చేయవలసి ఉంది. మనంతట మనం మన శక్తి మేరకు గాని, విరాళాలు ఇవ్వగలిగిన మిత్రుల ద్వారా గాని ఈ మూలనిధి విరాళాలు సేకరించి మనందరికీ, మొత్తంగా సమాజానికీ అవసరమైన ‘వీక్షణం’ రాజకీయార్థిక, సామాజిక మాసపత్రికను కాపాడుకుందాం. ఈ చైతన్యజ్వాల ఆరిపోకుండా మన రెండు చేతులూ అడ్డుపెట్టి వెలుగు నిరంతరం ప్రసరించనిద్దాం.



Edited, printed, published and owned by N. Venugopal Rao, Printed at Deccan Press for Charitha Impressions, Azamabad, Hyderabad - 500 020 and Published at 3-6-394, Mythri Residency, Street No. 3, Himayatnagar, Hyderabad 500 029. Editor : N. Venugopal Rao